తెలుగు

# అథర్వవేదసంహిత

## మంత్ర పద పాఠ సహితం

అనువాదం :

కళాప్రపూర్ణ విద్వాన్ విశ్వం, డి. లిట్.

## నాల్గవ సంపుటం

(ఎనిమిది, తొమ్మిది, పది కాండలు)






ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

TELUGU

ATHARVA VEDA SAMHITA

By

Kalāprapūrna VIDWĀN VISWAM, D. LITT

T. T. D. Religious Series No. 338

Copies - 2,000.

Price :

Cover : Sri BAPU




Published by :

Sri CH. VENKATAPATI RAJU, I. A. S.,

Executive Officer,

T. T. Devasthanams,

Tirupati.

Printed at :

Tirumala Tirupati Devasthanams Press

Tirupati-517 507

# మంగళ దేవ మాట

సి హెచ్. వేంకటపతిరాజు, ఐ. ఎ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

భారతీయుల సభ్యతకు, సంస్కృతికి, సంయమనానికి పట్టిన అద్దాలే పరమప్రమాణాలైన వేదాలు. అవి వైదిక సంస్కృతంలో ఉండటం వల్ల ఈనాటి వారికి వైదికసంస్కృతి అందుబాటులో లేకుండా పోయింది. ఆ వాఙ్మయాన్ని తేటతెలుగులో తెలుగువారికి అందించే తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రయత్నంలో ఒక భాగమే అథర్వ వేదానికి తెలుగు అనువాదం.

ఇప్పటికి మూడు సంపుటాలను ముచ్చటగా మీ ముందుంచగలిగి నాము. ఇది నాల్గవ సంపుటం. ఇందులో అథర్వవేదంలోని ఎనిమిది, తొమ్మిది, పది కాండలున్నాయి. దీనిని కీ. శే. విద్వాన్ విశ్వంగారు అనువాదం చేశారు. వారు చివరిలో అనువాదం చేసిన అయిదవ సంపుటం కూడా ముద్రణలో నున్నది.

ఈ సంపుటానికి ప్రశస్తమైన "ప్రస్తావన" ను వ్రాసిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యులవారికి (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి.టి.డి.) మా అభినందనల నందిస్తున్నాము. వెనుకటి సంపుటాల్లాగానే దీన్ని కూడా తెలుగువారు ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

తిరుపతి
23-6-89 సి హెచ్. వేంకటపతిరాజు, ఐ. ఎ, ఎస్.

# ప్రస్తావన

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య,
సంస్కృత విభాగం,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

ప్రాచీన భారతీయులకు అధ్యాత్మికదృష్టి తప్ప లౌకిక జీవన విధానాన్ని తీర్చిదిద్దుకొనే శ్రద్ధ అసలే లేదనే వాదం అపవాదమని అథర్వవేదం చక్కగా నిరూపిస్తున్నది. అథర్వవేదానికి "అథర్వాంగిరసః" అని ప్రసిద్ధి ఉండేదని తెలుస్తున్నది (10.7.20). "అథర్వులు, అంగిరసులు" అనే రెండు వంశాలను ఈ పదం తెలియజేస్తున్నది.

యజ్ఞనిర్వహణలో పాల్గొనే ఋత్విక్కులలో బ్రహ్మకు అద్వితీయమైన స్థానం ఉన్నది. అసలు యజ్ఞప్రక్రియకు అతడే మూలభూతుడు[1]. ఋగాది వేదత్రయిని అధ్యయనం చేసి అథర్వవేదంలో కూడా నిష్ణాతుడైనవాడే బ్రహ్మస్థానానికి అర్హుడవుతాడు. ఈ అంశాన్ని ఐతరేయ బ్రాహ్మణం స్పష్టంగా తెలియజేసింది[2]. అలాంటి బ్రహ్మకు సంబంధించినది అథర్వవేదం.

అథర్వవేదం అధ్యాత్మికోపదేశాలతో పాటు అధిభౌతిక-అధిదైవికాంశాలను గూడ వివరిస్తున్నది. తెనుగులో చక్కని అనువాదం ఉంటే ప్రజాసామాన్యం ఇందులోని విశేషాలను గ్రహించగలుగుతుందనే ఆశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ ప్రణాళికను

---

1. 'అగ్నిర్జాతో అథర్వణా' ఋ. సం. 10. 21. 5.
'త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత' అందులోనే 6. 16. 13.

2. 'యదృచైవ హౌత్రం క్రియతే. యజుషాధ్వర్యవం, సామ్నోద్గీథం, వ్యారబ్ధా త్రయీ విద్యా భవత్యథ కేవ బ్రహ్మత్వం క్రియతే ? ఇతి. త్రయ్యా విద్యయా ఇతి బ్రూయాత్'. ఐ. బ్రా. 5. 5. 8. 1.

చేపట్టింది. కీ. శే. విద్వాన్ విశ్వంగారు అథర్వసంహితకు కొంతవఱకు తెనుగు అనువాదం చేశారు. వారి అనువాదంతో ఇప్పటికి మూడు సంపుటాలు ప్రచురింపబడినాయి. ఇది నాలుగో సంపుటం. ఇందులో ఎనిమిది, తొమ్మిది, పది కాండలు విశ్వంగారి అనువాదంతో ముద్రించబడినాయి. ఈ మూడు కాండల్లోని విశేషాలను సంగ్రహంగా ఇక్కడ తెలుసుకొందాం.

## ఎనిమిదవ కాండ.

ఎనిమిదవ కాండలో 259 మంత్రాలున్నాయి. ఇవి పది సూక్తాలుగా, అయిదు అనువాకాలుగా విభజింపబడినాయి.

### దేవతలు :

ఈ కాండలోని మంత్రాలలో ఎందఱో దేవతలు ప్రస్తావించబడినారు. వారిలో ముఖ్యులు: ఆయువు, ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు, సోముడు, మరుత్తులు, బృహస్పతి, వనస్పతి, విరాట్, ద్యావాపృథువులు.

### ఆయుష్యం పెరగాలంటే :

లోకంలో ప్రతివాడు పూర్ణాయుర్దాయాన్ని పొందాలనుకుంటాడు. బ్రతికున్నంతవఱకు ఆరోగ్యంగా బ్రతకాలని కూడా అభిలషిస్తాడు. అలాంటి ఆయుష్కాముడు ఈ క్రింది మంత్రంతో తన శరీరాన్ని అభిమంత్రించుకోవాలని అథర్వవేదంలో ఎనిమిదవ కాండ, మొదటి అనువాకం, రెండవ సూక్తంలో ఇలా ఉపదేశించబడింది–

మంత్రము :

ఆరభస్వేమా మమృతస్య శ్నుష్టి
మచ్ఛిద్యమానా జరదష్టి రస్తు తే ।
అసుం త ఆయుః పునరా భరామి
రజ స్తమో మోప గా మా ప్రమేష్ఠాః ॥ 8. 2. 1.

**అనువాదం :**

ఓ అయుష్కాముడా! మేము చేస్తున్న
ఈ అమరత్వ ప్రస్తుతిని ఉపక్రమించు.
వృద్ధాప్య పర్యంతం అవిచ్ఛిన్నంగా
నీకు ఆహారం లభించు గాక!
నీ ప్రాణమును మృత్యువునుంచి అపహరిస్తున్నాను.
అది లోగొన్న నీ ఆయుస్సును కూడా
అపహరించి తిరిగి నీకిస్తున్నాను.
నీవు రజోగుణాన్ని ఆశ్రయించకు.
అలాగే హితాహిత నిరోధక ప్రతిరోధకమైన
తమోగుణాన్ని ఆశ్రయించకు.
హింసకు పాత్రుడవు కాకుండువు గాక!

## శత్రువులను భయపెట్టాలంటే....

శత్రువులకు మనోవ్యాకులాన్ని కలిగించి భయభ్రాంతులను చేయడానికి అథర్వవేదం ఎనిమిదవ కాండలో, నాలుగో అనువాకంలో గల సేనాకర్మ సూక్తాన్ని ఉపదేశిస్తున్నది. శత్రువునుద్దేశించి ఈ మంత్రాన్ని పఠిస్తూ రావి సమిధలతో హోమంచేస్తే శత్రువులు భయంతో విభ్రాంతులై నశిస్తారు. ఈ మంత్రం మూలం, అనువాదం క్రింద ఇవ్వబడింది. గమనించండి :

**మంత్రము :**

పూతిరజ్జు రుపధ్మానీ పూతిం సేనాం కృణోత్వమూమ్ ।
ధూమమగ్నిం పరాదృశ్యాఽమిత్రా
హృత్స్వా దధతాం భయమ్ ॥ 8. 8. 2.

**అనువాదం :**

శిలమైపోయిన దుర్గంధ పూరిత రజ్జువు
ఈ సేనను దుర్గంధ కూపంగా చేయు గాక!

ధూమమును, అగ్నిని దూరంనుంచే చూచి
శత్రుహృదయాలలో భయభ్రాంతి
ఉత్పన్నమగు గాక!

## తొమ్మిదవ కాండ

అథర్వవేదంలోని తొమ్మిదవకాండలో 801 మంత్రాలున్నాయి. ఇవి పది సూక్తాలుగా, అయిదు అనువాకాలుగా విభజింపబడినాయి.

**దేవతలు :**

ఈ కాండలోని మంత్రాలలో ఎందఱో దేవతలు ప్రస్తుతించబడినారు. అందులో వీరు ముఖ్యులు : మధు, అశ్వినులు, కాముడు, ఋషభుడు, అతిథి, విద్య, ఆదిత్యుడు, విరాట్.

**అతిథికంటె ముందు భుజించరాదు!**

ఆతిథ్యం ఇవ్వడంలో ఎంతో ఆత్మసంతృప్తి ఉంది. ఆతిథ్యంలోని అనేక విశేషాలను అథర్వవేదం (9-6. ) ఎంతో అందంగా అభివర్ణిస్తుంది.

మంత్రం :

ఇష్టం చ వా ఏష పూర్తం చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 9, 6 (3) 1.

**అనువాదం :**

అతిథి కంటె పూర్వం భుజించేవాడు
తన ఇళ్ళ ఇష్టాన్ని, పూర్తిని భుజించినవాడవుతాడు.

మంత్రం :

పయశ్చ వా ఏష రసం చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 9. 6. (3). 2.

**అనువాదం:**

అతిథి కంటె ముందు భుజించినవాడు
తన ఇంటి రసాన్ని, క్షీరాన్ని భుజించినవాడవుతాడు.

**మంత్రం:**

**ఊర్జాం చ వా ఏష స్ఫాతిం చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 9. 6 (3). 3.**

**అనువాదం:**

అతిథి కంటె ముందు భుజించినవాడు
తన ఇంటి ఊర్జస్సును, స్ఫూర్తిని భుజించినవాడవుతాడు.

**మంత్రం:**

**ప్రజాం చ వా ఏష పశూంశ్చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 9. 6 (3). 4.**

**అనువాదం:**

అతిథి కంటె ముందు భుజించినవాడు
తన ఇంటి సంతానాన్ని, పశువులను భుజించినవాడవుతాడు.

**మంత్రము:**

**కీర్తిం చ వా ఏష యశశ్చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 9. 6 (3). 5.**

**అనువాదం:**

అతిథి కంటె ముందు భుజించినవాడు
తన ఇంటి కీర్తిని, యశస్సును భుజించినవాడవుతాడు.

**మంత్రము:**

**శ్రియం చ వా ఏష సంవిదం చ గృహాణా
మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి 9. 6 (3). 6.**

**అనువాదం:**

అతిథి కంటె ముందు భుజించినవాడు
తన ఇంటి సంపదను, సంజ్ఞానాన్ని భుజించినవాడవుతాడు.

మంత్రము :

ఏష వా అతిథిర్యచ్ఛ్రోత్రియ
స్తస్మాత్ పూర్వో నాశ్నీయాత్ ॥ 9. 6 (3). 7.

అనువాదం :

ఈ అతిథి శ్రోత్రియుడు.
అందువల్ల అతని కంటె ముందు భోజనం చేయడం తగదు.

మంత్రము :

అశితావత్యతిథావశ్నీయాద్ యజ్ఞస్య
సాత్మత్వాయ యజ్ఞస్యావిచ్ఛేదాయ తద్ వ్రతమ్
9. 6 (3). 8

అనువాదం :

అతిథి భుజించిన తరువాత గృహస్థు భుజించాలి.
యజ్ఞసంగతికై, యజ్ఞం అవిచ్ఛేదంగా సాగుటకై
అది వ్రతంగా పాటించాలి.

ఇలా అతిథిని సత్కరించకుండా, అతనికి భోజనం పెట్టకుండా ముందే భోజనం చేసిన గృహస్థుకు కలిగే అనర్థాలన్నింటిని వివరించి, అతడిని సత్కరించిన వానికి కలిగే శ్రేయస్సును గూడా అథర్వవేదం విస్తరంగా వివరిస్తున్నది. ఒక ఉదాహరణ—

మంత్రము :

నిధనం భూత్యాః ప్రజాయాః
పశూనాం భవతి య ఏవం వేద ॥ 9. 6 (5). 3.

అనువాదం :

అందువల్ల అతను సంపద, సంతానం, పశువులకు
ఆశ్రయస్థానం అవుతాడు.

అతిథిసేవావ్రతం చాలా గొప్పది. అయితే విచ్చేసిన అతిథి అర్హతగలవాడైనప్పుడు దాని గొప్పదనం పెరుగుతుంది. కాని అతడు అధముడైనట్లైతే ఫలితం కూడా అంతమాత్రంగానే ఉంటుంది.

అందువల్లనే మనవాళ్ళు పాత్రనెఱిగి దానం చేయమని హెచ్చరిస్తున్నారు.

## పదవకాండ :

అథర్వవేదంలోని పదవకాండలో 351 మంత్రాలున్నాయి. అవి పది సూక్తాలలో అయిదు అనువాకాలుగా విభజింపబడినాయి.

## దేవతలు :

ఈ కాండలో ఎందఱో దేవతలు అభివర్ణింపబడినారు. వారిలో ముఖ్యులు: పురుషుడు, వరణమణి, వనస్పతి, ఆపః, ఫాలమణి, స్కంబుడు, శతౌదన, వశ.

## ఇది దేవుడిచ్చిన శరీరం :

అథర్వవేదం పదవకాండలో, రెండోసూక్తంలో "మనకు ఈ శరీరం ఎలా వచ్చింది?" అనే అంశాన్ని ప్రస్తావించి ఎంతో చక్కని సమాధానాన్ని అందించింది. బహుశః ఇలాంటి విచారధార ఇతర వేదాల్లో లేదనే చెప్పాలి.

ఈ సూక్తంలో మొత్తం 33 మంత్రాలున్నాయి. అందులో 24 మంత్రాలలో "కేన" అనే శబ్దంతో మన శరీరంలోని అవయవాలు, ప్రపంచస్థితి ప్రస్తావించబడినాయి. మచ్చుకు రెండు మంత్రాలను గమనించండి—

**మంత్రము :**

కః సప్త ఖాని వి తతర్ద శీర్షణి
కర్ణావిమౌ నాసికే చక్షణీ ముఖమ్ ।
యేషామ్ పురుత్రా విజయస్య మహ్మని
చతుష్పాదో ద్విపదో యన్తి యామమ్ ॥ 10. 2. 6.

**అనువాదం :**

తలలో సప్తరంధ్రాలను తొలచిదెనవరు?
ఈ చెవులు, ముక్కులు, కనులు,

ముఖము చేసినదెవరు ?
ఏ అపారశక్తి చేత సర్వదిక్కులా ద్విపాత్తులు,
చతుష్పాత్తులు వివిధ మార్గాలలో సంచరిస్తున్నవి ?

మంత్రము :

**హన్వోర్హి జిహ్వా మదధాత్ పురూచీ**
**మధా మహీమధి శిశ్రాయ వాచమ్ ।**
**స ఆ వరీవర్తి భువనేష్వన్తరపో**
**వసానః క ఉ తచ్చికేత ॥** 10. 2. 7.

**అనువాదం :**

బహు చలనశీలమైన నాలుకను
దవడల నడుమ నిలిపినదెవరు ?
దానిపై మహాప్రభావ సంపన్నమైన
వాణిని నిలిపినదెవరు ?
సర్వకర్మధారణం చేసే భువనముల నడుమ
గుప్తమై ఉన్నదేదో దానినెవరెరుగుదురు ?

ఇలా అనేక ప్రశ్నలు వేసి చివరకు అంతర్యామి ఈ శరీరంలో ఎక్కడ ఉన్నదీ ఎంతో చమత్కారంగా సమాధానంలో ఈ వేదం వర్ణిస్తున్నది—

మంత్రము :

అష్టా చక్రా నవద్వారా
**దేవానాం పూరయోధ్యా ।**
**తస్యాం హిరణ్యయః కోశః**
**స్వర్గో జ్యోతిషావృతః** 10. 2. 31.

**అనువాదం :**

అష్టచక్రములు కలది, నవ ద్వారములు కలది
అయిన అయోధ్య ( నిర్భేద్యమైనది ) దేవతల పురం.

అందులో హిరణ్మయనిధి కలదు.

తేజఃప్రపూర్ణమైన స్వర్గం అక్కడే ఉన్నది.

**మంత్రము :**

**తస్మిన్ హిరణ్యయే కోశే**
**త్ర్యరే త్రిప్రతిష్ఠితే ।**
**తస్మిన్ యద్ యక్షమాత్మన్వత్**
**తద్ వై బ్రహ్మవిదో విదుః ॥** 10 2. 32.

**అనువాదం :**

మూడు ఆకులు కలిగి
మూడు కేంద్రములలో స్థిరమై
అందులో హిరణ్మయకోశం ఉంటుంది.
ఆ తేజస్వి అయిన కోశంలో
ఆత్మవంతుడైన యక్షుడుంటాడు.
వానినే బ్రహ్మవిదులు బ్రహ్మగా తెలుసుకుంటారు.

**మంత్రము :**

**ప్రభ్రాజమానాం హరిణీం**
**యశసా సంపరీవృతామ్ ।**
**పురం హిరణ్యయీం బ్రహ్మ**
**వివేశాపరాజితామ్ ॥** 10. 2. 33

**అనువాదం :**

ప్రకాశమానమైనది, దుఃఖపరిహారకమైనది,
యశః పరిపూర్ణమైనది, ఎన్నడూ
పరాజయమెరుగనిది అయిన ఆ పట్టణంలో
బ్రహ్మ ఆవిష్టుడై ఉన్నాడు.

ఇలా అథర్వసంహితలోని ఎనిమిది, తొమ్మిది, పది కాండలలో మానవుని లౌకిక జీవనానికి, ఆధ్యాత్మిక జీవనానికి అనేక విధాలుగా

ఉపయోగించే అంశాలు ఎన్నో కనబడుతున్నాయి. పరమపురుషార్థమైన మోక్షాన్ని పొందే ముందు ధర్మార్థకామాలనే త్రివర్గాన్ని కూడా మానవుడు అందుకోవాలనే ఆకాంక్ష ఈ వేదంలో మనకు కొట్టవచ్చినట్లు కనబడుతుంది.

ధార్మిక జీవనాన్ని గడుపుతూ ఆధ్యాత్మిక తత్త్వాన్ని అర్థం చేసుకోవడానికి ఈ సమాజం వైదికవాఙ్మయాన్ని ఉపయోగించుకొంటే ఈ ప్రయత్నం చరితార్థమౌతుంది.

ఇంతవఱకు వచ్చిన మూడు సంపుటాలలాగానే అథర్వవేదం నాలుగోసంపుటాన్ని కూడా ఆంధ్రులు ఆదరించి, ఇందులోని పరమార్థాన్ని అందుకుంటారని ఆశిస్తున్నాను.

సత్యమ్ — రఘునాథాచార్య

శ్రీ సత్యసాయినగర్
22–6–1989

# విషయసూచిక

పుట

# అనువాకం: 1

## సూక్తం - 1

ఋషి: బ్రహ్మ॥ దేవత : ఆయుస్సు॥ ఛందస్సు:- 1 పురోబృహతీ త్రిష్టుప్: 2,3.17_21 అనుష్టుప్ : 4,9,15,16 ప్రస్తారపంక్తి: 5,6,10,11 త్రిష్టుప్ 7; త్రిపాద్ విరాడ్ గాయత్రీ; 8 విరాట్ పథ్యాబృహతీ ; 12 పఞ్చపదా జగతీ ; 13 త్రిపదా భురిజ్ మహాబృహతీ: 14 ద్విపదా సామ్నీ భురిగ్ బృహతీ॥ మంత్రములు ॥ 21 ॥

వినియోగం:- ఇది అర్థసూక్తము. ఉపనయన కర్మలో ఆచార్యుడు మాణవకుని నాభిని స్పృశించి దీనిని జపించాలి. అట్లే దీనితో ఆయుష్కాముని శరీరాన్ని అభిమంత్రించాలి. అట్లే ఋషిహస్తంతో ఆయుష్కాముని శరీరాన్ని అభిమంత్రించాలి.

ఆయుష్యగణంలో దీనిని పఠించుట వలన స్వస్త్యయనాదులలో దీనికి వినియోగం. అట్లే త్రింశన్మహాశాంతి తంత్రభూతమహాశాంతిలో దీనిని జపించాలి.

హిరణ్య గర్భాఖ్య మహాదానంలో "రక్షన్తు త్వా" అనే మంత్రం నుండి చివరివరకు గల మంత్రములకు వినియోగం.

అట్లే అశ్వరథాఖ్య మహాదానంలో వీటితో యజమానుని అభిమంత్రించాలి.

మంత్రము:

అన్తకాయ మృత్యవే నమః
ప్రాణా అపానా ఇహ తే రమన్తామ్ ।
ఇహాయ మస్తు పురుషః సహాసునా
సూర్యస్య భాగే అమృతస్య లోకే ॥ 1 ॥

పదము :

అన్తకాయ । మృత్యవే । నమః । ప్రాణాః ।

అపానాః । ఇహ । తే । రమన్తామ్ ।

ఇహ । అయమ్ । అస్తు । పురుషః । సహ । అసునా ।

సూర్యస్య । భాగే । అమృతస్య । లోకే ॥ 1 ॥

అనువాదం :

సర్వప్రాణి నాశకర్త అగు మృత్యుదేవునకు నమస్కారం.
ఓ ఆయుష్కాముడా ! నీ ప్రాణాపాన వాయువులు
ఈ శరీరమునందే రమించుగాక !
ప్రాణ ప్రచ్యుతిని శంకిస్తున్న
ఈ పురుషుడు ప్రాణసహితుడై
ఈ భూలోకంలోనే ఉండు గాక !
సూర్యుని భాగమైన భూలోకంలో
అమృతస్థానంలో ఉండుగాక ॥ 1 ॥

మంత్రము :

ఉదేనం భగో అగ్రభీదుదేనం సోమో అంశుమాన్ ।

ఉదేనం మరుతో దేవా ఉదిన్ద్రాగ్నీ స్వస్తయే ॥ 2 ॥

పదము :

ఉత్ । ఏనమ్ । భగః । అగ్రభీత్ । ఉత్ । ఏనమ్ ।

సోమః । అంశుఽమాన్ ।

ఉత్ । వీనమ్ । మరుతః । దేవాః । ఉత్ ।

ఇన్ద్రాగ్నీ ఇతి । స్వస్తయే ॥ 2 ॥

**అనువాదం :**

భగదేవుడు మూర్ఛాంధకారంలో ప్రవేశిస్తున్న
పురుషుని ఉద్ధరించినాడు.
అలాగే అంశుమంతుడైన సోమదేవుడు
ఇతనిని ఉద్ధరించినాడు.
అలాగే మరుత్తులు ఇతనిని ఉద్ధరించినారు.
అలాగే ఇంద్రాగ్నులు క్షేమార్థమై వీనిని ఉద్ధరించినారు. ॥2॥

**మంత్రము :**

ఇహ తేఽసురిహ ప్రాణ ఇహాయురిహ తే మనః ।

ఉత్ త్వా నిరృత్యాః పాశేభ్యో దైవ్యా వాచా భరామసి ॥ 3 ॥

**పదము :**

ఇహ । తె । అసుః । ఇహ । ప్రాణః । ఇహ । ఆయుః । ఇహ ।
తే । మనః ।

ఉత్ । త్వా । నిఃఽఋత్యాః । పాశేభ్యః । దైవ్యా । వాచా ।
భరామసి ॥ 3 ॥

**అనువాదం :**

ఓ పురుషుడా! నీ ప్రాణం ఈ శరీరంలో ఉండుగాక!
అలాగే నీ ప్రాణవాయువు నీ యందే ఉండుగాక!

నీ ఆయుస్సుకూడా ఇక్కడే ఉండుగాక!
నీ మనస్సుకూడా ఇక్కడే ఉండుగాక!
ఓ పురుషుడా! నిన్ను పాపదేవతల పాశముల నుంచి
దేవసంబంధమైన మంత్రములతో ఉద్ధరిస్తున్నాము. ॥ 3 ॥

మంత్రము;

ఉత్ క్రామాతః పురుష మావ పత్థా
మృత్యోః షడ్వీశమవముఞ్చమానః ।
మా చ్ఛిత్థా అస్మాల్లోకాదగ్నేః సూర్యస్య సందృశః ॥ 4 ॥

పదము:

ఉత్ । క్రామ । అతః । పురుష । మా । అవ । పత్థాః ।
మృత్యోః । షడ్వీశమ్ । అవఽముఞ్చ మానః ।
మా । ఛిత్థాః । అస్మాత్ । లోకాత్ । అగ్నేః । సూర్యస్య ।
సమ్ఽదృశః ॥ 4 ॥

అనువాదం:

ఓ పురుషుడా! ఈ మృత్యుపాశ
నిచయం నుంచి ఉత్క్రమించి
అధః పతనం చెందకు.
మృత్యువునకు చెందిన పాదబంధన పాశమును విచ్ఛేదించు.
ఈ లోకం నుంచి పడిపోకుందువుగాక!
అగ్ని సూర్య చిరకాల సందర్శనార్థమై
నీవు ఇక్కడే ఉందువుగాక! ॥ 4 ॥

మంత్రము :

తుభ్యం వాతః పవతాం మాతరిశ్వా
తుభ్యం వర్షన్త్వమృతాన్యాపః ।
సూర్యస్తే తన్వేꣳ శం తపాతి
త్వాం మృత్యుర్దయతాం మా ప్ర మేష్ఠాః ॥ 5 ॥

పదము :

తుభ్యమ్ । వాతః । పవతామ్ । మాతరిశ్వా ।
తుభ్యమ్ । వర్షన్తు । అమృతాని । ఆపః ।
సూర్యః । తే । తన్వేꣳ । శమ్ । తపాతి ।
త్వామ్ । మృత్యుః । దయతామ్ । మా । ప్ర । మేష్ఠాః ॥ 5 ॥

అనువాదం :

ఓ పురుషుడా! వాయుదేవుడు (ప్రాణవాయువులు)
నీ సుఖమునకై వీచుగాక!
అలాగే జలం కూడా నిన్ను తడుపుగాక!
సూర్యుడు నీ శరీరమునకు సుఖము కలుగునట్లుగా వెలుగుగాక!
ఓ పురుషుడా! నిన్ను మృత్యుదేవుడు రక్షించుగాక!
నీవు మృతి చెందకుందువుగాక! ॥ 5 ॥

మంత్రము :

ఉద్యానం తే పురుష నావయానం
జీవాతుం తే దక్షతాతిం కృణోమి ।

ఆ హి రోహేమ మమృతం సుఖం రథ మథ
జిర్విర్విదథమా వదాసి ॥ 6 ॥

పదము :

ఉత్ఽయానమ్ । తే । పురుష । న । అవఽయానమ్ ।
జీవాతుమ్ । తే । దక్షఽతాతిమ్ । కృణోమి ।
ఆ । హి । రోహ । ఇమమ్ । అమృతమ్ । సుఽఖమ్ ।
రథమ్ । అథ । జిర్విః । విదథమ్ । ఆ । వదాసి ॥ 6 ॥

అనువాదం :

ఓ పురుషుడా! నీకు ఉద్గమనమేగాని అవాగ్గమనం లేదు.
నీకు జీవనౌషధం సిద్ధం చేస్తున్నాను.
నీకు సత్త్వంకూడా చేకూరుస్తున్నాను.
అధిరోహించు,
ఈ అమృత రథాన్ని ఆరోహించి
డసిలిపోక స్పృహ వచ్చేనని వచించు. ॥ 6 ॥

మంత్రము :

మా తే మన స్తత్ర గాన్మా తిరో భూన్మా
జీవేభ్యః ప్ర మదో మానుగాః పితౄన్ ।
విశ్వే దేవా అభి రక్షన్తు త్వేహ ॥ 7 ॥

పదము :

మా । తే । మనః । తత్ర । గాత్ । మా । తిరః । భూత్ । మా ।

జీవేభ్యః। ప్ర। మదః। మా। అను। గాః। పితౄన్।
విశ్వే। దేవాః। అభి। రక్షన్తు। త్వా। ఇహ ॥ 7 ॥

**అనువాదం:**

నీ మనస్సు అటు (మృత్యువు వైపు) పోకుండుగాక!
అంతర్హితం కాకుండు గాక!
బంధువుల యెడ అశ్రద్ధ వహించకు.
పితరులను అనుగమించకు. ఈ శరీరంలో నిన్నుంచి
విశ్వేదేవతలు అభిరక్షింతురుగాక! ॥ 7 ॥

**మంత్రము:**

మా గతానామా దీధీథా యే నయన్తి పరావతమ్।
ఆ రోహ తమసో జ్యోతిరేహ్యా తే హస్తౌ రభామహే ॥ 8 ॥

**పదము:**

మా। గతానామ్। ఆ। దీధీథాః। యే। నయన్తి। పరాఽవతమ్
ఆ। రోహ। తమసః। జ్యోతిః। ఆ। ఇహి। ఆ। తే। హస్తౌ।
రభామహే ॥ 8 ॥

**అనువాదం:**

గతించిన వారి దారిని అన్వేషించకు.
వారు నిన్నుకూడా తిరిగి రాలేని
దూరదేశానికి కొనిపోతారు.
నీవు తమః ప్రవేశం నుంచి వెలుతురులోనికి అధిరోహించు.
మేము నీకు చేయూత నిస్తాము. ॥ 8 ॥

మంత్రము :

శ్యామశ్చ త్వా మా శబలశ్చ ప్రేషితౌ

యమస్య యౌ పథిరక్షీ శ్వానౌ ।

అర్వాఙేహి మా వి దీధ్యో

మాత్ర తిష్ఠః పరాఙ్మనాః ॥ 9 ॥

పదము :

శ్యామః । చ । త్వా । మా । శబలః । చ । ప్రఽఇషితౌ ।

యమస్య । యౌ । పథిరక్షీ ఇతి పథిఽరక్షీ । శ్వానౌ ।

అర్వాఙ్ । ఆ । ఇహి । మా । వి । దీధ్యః ।

మా । అత్ర । తిష్ఠః । పరాఙ్ఽమనాః ॥ 9 ॥

అనువాదం :

ఓయీ! నిన్ను శ్యామ శునకం బాధింపకుండు గాక!
శబల శునకం కూడా బాధింపకుండుగాక!
యమునికి మార్గరక్షకములై ఏ శునకము లైతే ఉన్నవో
వానికి కనబడకుండా మాకు అభిముఖుడవై రమ్ము.
చింతించవద్దు. ఈ భూలోకంలో ఉండి
తిరిగిరాని ఆ చోటును గూర్చి ఆలోచించకుండా ఉండు.
ఇక్కడ ఉండి అక్కడెక్కడో సంగతిని
ఆలోచిస్తూ ఉండవద్దు. ॥ 9 ॥

మంత్రము :

మైతం పన్థామను గా భీమ ఏష

యేన పూర్వం నేయథ తం బ్రవీమి ।
తమ ఏతత్ పురుష మా ప్ర పత్థా
భయం పరస్తా దభయం తే అర్వాక్ ॥ 10 ॥

పదము :

మా । ఏతమ్ । పన్థామ్ । అను । గాః । భీమః । ఏషః ।
యేన । పూర్వమ్ । న । ఇయథ । తమ్ । బ్రవీమి ।
తమః । ఏతత్ । పురుష । మా । ప్ర । పత్థాః ।
భయమ్ । పరస్తాత్ । అభయమ్ । తే । అర్వాక్ ॥ 10 ॥

అనువాదం :

ఓ మృతుడా! పూర్వోక్త మార్గాన్ని అనుసరించి వెళ్ళకు.
ఈ మార్గం భయంకర మైనది.
ఈ దారిలో పూర్వం నీవు వెళ్ళలేదు.
పూర్వం నీవు వెళ్ళని ఆ మార్గాన్ని గూర్చి చెప్తున్నాను.
మరణ లక్షణమైన ఈ అంధకారాన్ని గురించి చింతించవద్దు.
నీ ముందు భయంకరమైన ప్రదేశమున్నది.
ఇటు తిరిగి వస్తే నీకు భయంలేదు. ॥ 10 ॥

మంత్రము :

రక్షన్తు త్వాఽగ్నయో యే అప్స్వ1న్తా
రక్షతు త్వా మనుష్యా3 యమిన్ధతే ।

వైశ్వానరో రక్షతు జాతవేదా దివ్యస్త్వా
మా ప్ర ధాగ్ విద్యుతా సహ ॥ 11 ॥

పదము :

రక్షన్తు । త్వా । అగ్నయః । యే । అప్ఽసు । అన్తః ।
రక్షతు । త్వా । మనుష్యాఽః । యమ్ । ఇన్ధతే ।
వైశ్వానరః । రక్షతు । జాతఽవేదాః । దివ్యః । త్వా ।
మా । ప్ర । ధాక్ । విఽద్యుతా । సహ ॥ 11 ॥

**అనువాదం :**

ఉదక మధ్యంలో నున్న అగ్నులు నిన్ను రక్షింతురు గాక!
ఆహవనీయాది రూపంతో మనుష్యులు వెలిగించే
అగ్ని కూడా నిన్ను రక్షించు గాక!
జఠరాగ్ని కూడా నిన్ను రక్షించు గాక!
జాతప్రజ్ఞుడైన అగ్నికూడా నిన్ను రక్షించు గాక!
దివ్యమైన విద్యుచ్ఛరీరంతో
నిన్ను ఆ అగ్ని దహింపకుండు గాక! ॥ 11 ॥

మంత్రము :

మా త్వా క్రవ్యాదభి మంస్తారాత్ సంకసుకాచ్చర ।
రక్షతు త్వా ద్యౌ రక్షతు పృథివీ
సూర్యశ్చ త్వా రక్షతాం చన్ద్రమాశ్చ ।
అన్తరిక్షం రక్షతు దేవహేత్యాః ॥ 12 ॥

పదము :

మా। త్వా। క్రవ్య౽అత్। అభి। మంస్త। ఆరాత్।
సమ్౽కసుకాత్। చర।
రక్షతు। త్వా। ద్యౌః। రక్షతు। పృథివీ। సూర్యః। చ। త్వా।
రక్షతామ్।
చన్ద్రమాః। చ। అన్తరిక్షమ్। రక్షతు। దేవ౽హేత్యాః ॥ 12 ॥

అనువాదం:

మాంసాశనుడైన అగ్ని నిన్ను
ఆహారం చేసుకోనకుండు గాక!
శవభక్షకమైన అగ్నినుంచి నీవును దూరంగానడు.
దివి భువి సూర్య చంద్రులు నిన్ను రక్షింతురు గాక!
అంతరిక్షం కూడా నిన్ను దేవఖడ్గం నుండి రక్షించుగాక! ॥12॥

మంత్రము :

బోధశ్చ త్వా ప్రతీబోధశ్చ రక్షతా-
మస్వప్నశ్చ త్వా౽నవద్రాణశ్చ రక్షతామ్
గోపాయం శ్చ త్వా జాగృవిశ్చ రక్షతామ్ ॥ 13 ॥

పదము :

బోధః। చ। త్వా। ప్రతి౽బోధః। చ। రక్షతామ్।
అస్వప్నః। చ। త్వా। అనవ౽ద్రాణః। చ। రక్షతామ్।
గోపాయన్। చ। త్వా। జాగృవిః। చ। రక్షతామ్ ॥ 13 ॥

**అనువాదం :**

బోధ, ప్రతిబోధ, అస్వప్న, అనవద్రాణ
రక్షత, గోపాయత, జాగరణశీల- అనబడే
దేహాశ్రయులైన ఇంద్రియాభిమాన దేవతలు
నిన్ను రక్షింతురుగాక ! ॥ 13 ॥

**మంత్రము :**

**తే త్వా రక్షన్తు తే త్వా గోపాయన్తు**

**తేభ్యో నమ స్తేభ్యః స్వాహా** ॥ 14 ॥

**పదము:**

**తే । త్వా । రక్షన్తు । తే । త్వా । గోపాయన్తు ।**

**తేభ్యః । నమః । తేభ్యః । స్వాహా** ॥ 14 ॥

**అనువాదం :**

వారందరూ నిన్ను రక్షింతురు గాక !
వారే నిన్ను సర్వత్రా రక్షింతురు గాక !
ఆ దేవతలకు నమస్కారం.
వారికి ఈ ద్రవ్యం స్వాహుత మగుగాక ! ॥ 14 ॥

**మంత్రము :**

**జీవేభ్యస్త్వా సముదే వాయురిన్ద్రో**

**ధాతా దధాతు సవితా త్రాయమాణః ।**

**మా త్వా ప్రాణో బలం హాసీదసుం**

**తేఽను హ్వాయామసి** ॥ 15 ॥

:

ౖః । త్వా । సమ్ఽఉదే । వాయుః । ఇన్ద్రః ।

। దధాతు । సవితా । త్రాయమాణః ।

త్వా । ప్రాణః । బలమ్ । హాసీత్ । అసుమ్ ।

అను । హ్వయామసి ॥ 15 ॥

దం :

జీవుల కోసమై వారి సమ్మోదార్థమై
వాయ్వాదులు మృత్యువు నుంచి నిన్ను లాగి ఇత్తురు గాక!
నిన్ను పాలించే సూర్యుడు
నీ శరీర బలాన్ని నీ నుంచి తొలగింపకుండుగాక!
నీ అసువులను అనుకూల్యమునకై ఆహ్వానిస్తున్నాను. ॥ 15 ॥

కము :

త్వా జమ్భః సంహనుర్మా తమో విదన్మా

బర్హిః ప్రమయుః కథా స్యాః ।

త్వాదిత్యా వసవో భరన్తూ-

గ్ని స్వస్తయే ॥ 16 ॥

:

। త్వా । జమ్భః । సమ్ఽహనుః । మా । తమః । విదత్ ।

। జిహ్వా । అ । బర్హిః । ప్రఽమయుః । కథా । స్యాః ।

ఉత్ । త్వా । ఆదిత్యాః । వసవః । భరన్తు । ఉత్ ।

ఇన్ద్రాగ్నీ ఇతి । స్వస్తయే ॥ 16 ॥

అనువాదం :

సంహత దంతుడైన జంభాసురుడు
నిన్ను భక్షించుటకై పట్టుకొనకుండు గాక!
అజ్ఞానం కూడా నిన్ను పట్టుకొనకుండు గాక!
రక్షః ప్రభృతుల జిహ్వ నిన్ను
పరిగ్రహింప కుండు గాక!
నీ వెలా ప్రగత హింసకుడవు కావో
అలా ఆదిత్యులు నిన్ను (మృత్యు ముఖంనుంచి)
ఉద్ధరింతురుగాక!
అష్ట వసువులు నిన్ను ఉద్ధరింతురు గాక!
ఇంద్రాగ్నులు నీ క్షేమార్థం
నిన్ను ఉద్ధరింతురు గాక! ॥ 16 ॥

మంత్రము :

ఉత్త్వా ద్యౌరుత్ పృథివ్యుత్ ప్రజాపతి రగ్రభీత్ ।

ఉత్ త్వా మృత్యోరోషధయః సోమరాజ్ఞీరపీపరన్ ॥ 17 ॥

పదము :

ఉత్ । త్వా । ద్యౌః । ఉత్ । పృథివీ । ఉత్ । ప్రజాఽపతిః ।

అగ్రభీత్ ।

ఉత్ । త్వా । మృత్యోః । ఓషధయః । సోమఽరాజ్ఞీః । అపీపరన్

॥ 17 ॥

**అనువాదం :**

అలాగే భూమి, దివి నిన్ను ఉద్ధరించు గాక!
ప్రజాపతి నిన్ను ఉద్ధరించు గాక!
సోముని రాజులైన ఓషధులు నిన్ను
మృత్యు సకాశం నుంచి కాపాడుదురు గాక! ॥ 17 ॥

**మంత్రము :**

**అయం దేవా ఇహైవా స్త్వయం మాఽముత్ర గాదితః ।**
**ఇమం సహస్రవీర్యేణ మృత్యోరుత్ పారయామసి ॥ 18 ॥**

**పదము :**

**అయమ్ । దేవాః । ఇహ । ఏవ । అస్తు । అయమ్ । మా ।**
**అముత్ర । గాత్ । ఇతః ।**
**ఇమమ్ । సహస్రఽవీర్యేణ । మృత్యోః । ఉత్ । పారయామసి**
**॥ 18 ॥**

**అనువాదం :**

ఓ ఆదిత్యాది దేవతలారా! ఈ పురుషుడు
ఈ లోకంలోనే ఉండుగాక!
ఇతడు ఇహం నుంచి పరానికి పోకుండుగాక!
అపార బలంతో ఈ పురుషుని
మృత్యు సకాశం నుంచి ఉద్ధరిస్తున్నాము. ॥ 18 ॥

**మంత్రము :**

**ఉత్ త్వా మృత్యోరపీపరం సం ధమన్తు వయోధసః ।**
**మా త్వా వ్యస్తకేశ్యో౩ మా త్వాఽఘరుదో రుదన్ ॥ 19 ॥**

పదము:

ఉత్ । త్వా । మృత్యోః । అపీపరమ్ । సమ్ । ధమన్తు ।

వయఃఽధసః ।

మా । త్వా । వ్యస్తఽకేశ్యః । మా । త్వా । అఘఽరుదః । రుదన్

॥ 19 ॥

అనువాదం :

నిన్ను మృత్యు సకాశం నుంచి రక్షించి
దేవతలు అన్నంతో, ఆయుష్యంతో నిన్ను అనుసంధానించనీ.
వెంట్రుకలు విరబోసుకుని బంధుస్త్రీలు
నీకై రోదనం చేయకుందురు గాక!
అలాగే ఇతర ఆప్తులు ఏడ్వకుందురు గాక! ॥ 19 ॥

మంత్రము :

ఆహార్షమవిదం త్వా పునరాగాః పునర్ణవః ।
సర్వాఙ్గ సర్వం తే చక్షుః సర్వమాయుశ్చ తే విదమ్ ॥ 20 ॥

పదము:

ఆ । అహార్షమ్ । అవిదమ్ । త్వా । పునః । ఆ । అగాః ।

పునఃఽనవః ।

సర్వఽఅఙ్గ । సర్వమ్ । తే । చక్షుః । సర్వమ్ । ఆయుః । చ ।

తే । అవిదమ్ ॥ 20 ॥

అనువాదం :

నిన్ను మృత్యుముఖం నుంచి లాగుకొని వచ్చినాము.
ఓ పునరుద్భూతుడా! నీవు తిరిగి వచ్చినావు.

ఓ సర్వాంగ భూషితుడవైన పురుషుడా! నీకు
సర్వమూ చక్షుర్విషయమగు గాక!
నీకు దీర్ఘాయువును సంపాదించి పెట్టినాను. ॥ 20 ॥

మంత్రము :

వ్యవాత్ తే జ్యోతిరభూదప త్వత్ తమో అక్రమీత్ ।
అప త్వన్మృత్యుం నిరృతిమప యక్ష్మం ని దధ్మసి ॥21॥

పదము :

వి । అవాత్ । తే । జ్యోతిః । అభూత్ । అప । త్వత్ । తమః ।
అక్రమీత్ ।
అప । త్వత్ । మృత్యుమ్ । నిఃఋతిమ్ । అప । యక్ష్మమ్ ।
ని । దధ్మసి ॥ 21 ॥

అనువాదం :

నీకు చీకటి తొలగి పోయినది.
జ్యోతి వెలిగినది.
నీ నుంచి సర్వాంధకారమూ అపాకృతమైనది.
నీ నుంచి మృత్యు దేవతను, నిరృతి దేవతను
విడగొట్టినాము.
బాహ్యాభ్యంతర రుగ్మతను
నీ నుంచి తొలగిస్తున్నాము. ॥ 21 ॥

ఇది మొదటి సూక్తం.

గోదానాది కర్మంలో 'శరదే త్వా' అనే మంత్రంతో వ్రీహి యవలను అభిమంత్రించి కుమారుని శిరస్సుపై చల్లాలి.

మంత్రము:

ఆ రభస్వేమా మమృతస్య శ్నుష్టి-

మచ్ఛిద్యమానా జరదష్టి రస్తు తే ।

అసుం త ఆయుః పునరా భరామి

రజ స్తమో మోప గా మా ప్ర మేష్ఠాః ॥ 1 ॥

పదము:

ఆ । రభస్వ । ఇమామ్ । అమృతస్య । శ్నుష్టిమ్ ।

అచ్ఛిద్యమానా । జరత్ఽఅష్టిః । అస్తు । తే ।

అసుమ్ । తే । ఆయుః । పునః । ఆభరామి ।

రజః । తమః । మా । ఉప । గాః । మా । ప్ర । మేష్ఠాః ॥ 1 ॥

అనువాదం:

ఓ ఆయుష్కాముడా! మేము చేస్తున్న
ఈ అమరత్వ ప్రస్తుతిని ఉపక్రమించు.
వృద్ధాప్య పర్యంతం అవిచ్ఛిన్నంగా నీకు ఆహారం లభించుగాక!
నీ ప్రాణమును మృత్యువు నుండి అపహరిస్తున్నాను.
అది లోగొన్న నీ ఆయుస్సును కూడా
అపహరించి తిరిగి నీ కిస్తున్నాము.
నీవు రజోగుణాన్ని ఆశ్రయించకు.
అలాగే హితాహిత నిరోధక ప్రతిరోధక మైన

తమోగుణాన్ని ఆశ్రయించకు.
హింసకు పాత్రుడవు కాకుందువు గాక! ॥ 1 ॥

మంత్రము :

జీవతాం జ్యోతిరభ్యేహ్యర్వాజా త్వా హరామి శతశారదాయ
అవముఞ్చన్ మృత్యుపాశానశ స్తిం
ద్రాఘీయ ఆయుః ప్రతరం తే దధామి ॥ 2 ॥

పదము :

జీవతామ్ । జ్యోతిః । అభి౨ఏహి । అర్వాఙ్ ।
ఆ । త్వా । హరామి । శత౨శారదాయ ।
అవ౨ముఞ్చన్ । మృత్యు౨పాశాన్ । అశ స్తిమ్ ।
ద్రాఘీయః । ఆయుః । ప్ర౨తరమ్ । తే । దధామి ॥ 2 ॥

అనువాదం :

నీవు జీవుల జ్ఞాన రూపివై
మాకు అభిముఖుడవై రమ్ము.
శతాయుష్కుడ వగుటకై మృత్యు సకాశం నుంచి
నేను నిన్ను కొనివస్తున్నాను.
నీ మృత్యు పాశములను వదలించి వేస్తున్నాను.
అలాగే నిందావమోచనం పొందు.
దీర్ఘాయువును నీకు ప్రదానం చేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

వాతాత్ తే ప్రాణ మవిదం సూర్యాచ్చక్షురహం తవ ।

యత్ తే మన స్త్వయి తద్ ధారయామి

సం విశ్వ్వాజ్గై ర్వద జిహ్వయాఽలపన్ ॥ 3 ॥

పదము :

వాతాత్ । తే । ప్రాణమ్ । అవిదమ్ । సూర్యాత్ । చక్షుః ।
అహమ్ । తవ ।

యత్ । తే । మనః । త్వయి । తత్ । ధారయామి ।

సమ్ । విశ్వైః । అజ్గైః । వద । జిహ్వయా । అలపన్ ॥ 3 ॥

అనువాదం :

ఓ గతానువైన పురుషుడా! నీ ప్రాణం
వాయు సకాశం నుంచి నాకు లభించినది.
నేను నీ నేత్రాలను సూర్యుని నుంచి తీసుకున్నాను.
నీ మనసును నీలోనే ఉంచుతున్నాను.
సర్వాంగ సంపూర్ణుడవై నీవు మాటలాడు. ॥ 3 ॥

మంత్రము :

ప్రాణేన త్వా ద్విపదాం చతుష్పదా-

మగ్నిమీవ జాతమభి సం ధమామి ।

నమస్తే మృత్యో చక్షుషే నమః

ప్రాణాయ తేఽకరమ్ ॥ 4 ॥

పదము :

ప్రాణేన । త్వా । ద్విऽపదామ్ । చతుఃऽపదామ్ ।

అగ్నిమ్ऽఇవ । జాతమ్ । అభి । సమ్ । ధమామి ।

నమః । తే । మృత్యో ఇతి । చక్షుషే । నమః ।

ప్రాణాయ । తే । అకరమ్ ॥ 4 ॥

అనువాదం :

ప్రాణం పోతున్న ఓ మనిషి!
ద్విపాత్తుల, చతుష్పాత్తుల ప్రాణంతో
మథనం వల్ల ఉత్పన్నమైన అగ్నివలె
తిరిగి నీతో అభినంధానం చేస్తున్నాను.
ఓ మృత్యువా! నీ చక్షువునకు నమస్కారం.
నీ ప్రాణానికి నమస్కరిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

అయం జీవతు మా మృతేమం సమీరయామసి ।

కృణోమ్యస్మై భేషజం మృత్యో మా పురుషం వధీః ॥ 5 ॥

పదము :

అయమ్ । జీవతు । మా । మృత । ఇమమ్ । సమ్ ।
ఈరయామసి ।

కృణోమి । అస్మై । భేషజమ్ । మృత్యో ఇతి । మా । పురుషమ్ ।
వధీః ॥ 5 ॥

అనువాదం :

ఈ గతాయువైన పురుషుడు
పునరుజ్జీవనం పొందుగాక !
మరణించకుండు గాక !
ఈ పురుషుని పనిచేయునట్లు ప్రయత్నిస్తున్నాను.
ఈ పురుషునకు చికిత్స చేస్తున్నాను.
ఓ మృత్యూ ! నీ వీ పురుషుని వధింపవద్దు. ॥ ౫ ॥

మంత్రము :

జీవలాం నఘారిషాం జీవన్తీ మోషధీమహమ్ ।
త్రాయమాణాం సహమానాం సహస్వతీమిహ
హువేఽస్మా అరిష్టతాతయే ॥ ౬ ॥

పదము :

జీవలామ్ । నఘఽరిషామ్ । జీవన్తీమ్ । ఓషధీమ్ । అహమ్ ।
త్రాయమాణామ్ । సహమానామ్ । సహస్వతీమ్ । ఇహ ।
హువే । అస్మై । అరిష్టఽతాతయే ॥ ౬ ॥

అనువాదం :

జీవ ప్రదాత్రి అయిన, కోప విహీన అయిన,
సజీవమైన, రక్షకమైన, రోగనిర్మూలకమైన,
బలవత్తరమైన 'పాఠ' అనే ఓషధిని
వ్యాధి నిర్మూలనేచ్ఛతో
నేను ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను,
ఈ పురుషునకు అరిష్ట నివారణార్థం ఆహ్వానిస్తున్నాను. ॥ ౬ ॥

మంత్రము :

అధి బ్రూహి మా రభథాః సృజేమం

తవైవ సన్త్సర్వహాయా ఇహాస్తు ।

భవాశర్వౌ మృడతం శర్మ యచ్ఛత-

మపసిధ్య దురితం ధత్త మాయుః ॥ 7 ॥

పదము :

అధి । బ్రూహి । మా । ఆ । రభథాః । సృజ । ఇమమ్ ।

తవ । ఏవ । సన్ । సర్వఽహాయాః । ఇహ ।

అస్తు । భవాశర్వౌ । మృడతమ్ । శర్మ । యచ్ఛతమ్ ।

అపఽసిధ్య । దుఃఽఇతమ్ । ధత్తమ్ । ఆయుః ॥ 7 ॥

అనువాదం :

ఓ మృత్యూ! నీవు ఇతనిపై
అనురాగ సూచకంగా మాటలాడు.
ఇతనిని చంపుటకు మొదలిడకు.
ఇతను నీ వాడు.
ఇతనిని ప్రాణ సహితుని చెయ్యి.
భూలోకంలో ఇతను స్వేచ్ఛగా తిరుగు గాక!
భవుడు, శర్వుడు ఇతనిని సుఖపెట్టుదురు గాక!
ఇతనికి శుభం కలిగింతురు గాక!
ఓ శివ భవులారా! పాపప్రక్షాళనం చేసి
ఇతనికి ఆయుస్సును ప్రసాదించండి. ॥ 7 ॥

మంత్రము :

అస్మై మృత్యో అధి బ్రూహీమం
దయస్వోదితోఽయమేతు ।
అరిష్టః సర్వాఙ్గః సుశ్రుజ్జరసా
శతహాయన ఆత్మనా భుజమశ్నుతామ్ ॥ 8 ॥

పదము :

అస్మై । మృత్యో ఇతి । అధి । బ్రూహి । ఇమమ్ ।
దయస్వ । ఉత్ । ఇతః । అయమ్ । ఏతు ।
అరిష్టః । సర్వ౽అఙ్గః । సు౽శ్రుత్ । జరసా ।
శత౽హాయనః । ఆత్మనా । భుజమ్ । అశ్నుతామ్ ॥ 8 ॥

అనువాదం :

ఓ మృత్యూ! ఇతనిని అనుగ్రహార్హునిగా ప్రకటించు.
ఇతనిపై దయచూపు.
ఈ మృత్యువు నుంచి ఇతను దూరమగు గాక!
అరిష్టం తొలగి సర్వాంగ ప్రపూర్ణుడై,
చక్కగా వింటూ, వార్ధక్యం వరకూ నూరేళ్ళు జీవిస్తూ,
అన్నాన్ని పెట్టుడై భోగములను అనుభవించు గాక! ॥ 8 ॥

మంత్రము :

దేవానాం హేతిః పరి త్వా వృణక్తు
పారయామి త్వా రజస ఉత్ త్వా మృత్యోరపీపరమ్ ।

ఆరాదగ్నిం క్రవ్యాదం నిరూహం
జీవాతవే తే పరిధిం దధామి ॥ 9 ॥

పదము :

దేవానామ్ । హేతిః । పరి । త్వా । వృఙక్తు । పారయామి ।
త్వా । రజసః । ఉత్ । త్వా । మృత్యోః । అపీపరమ్ ।
ఆరాత్ । అగ్నిమ్ । క్రవ్యఽఅదమ్ । నిఃఽఊహన్ ।
జీవాతవే । తే । పరిఽధిమ్ । దధామి ॥ 9 ॥

అనువాదం :

దేవతల ఆయుధం నిన్ను వదలిపెట్టుగాక !
రజస్సును తొలగించి రక్షించు గాక !
నిన్ను మృత్యు సకాశం నుంచి ఉద్ధరిస్తున్నాము.
దూరం నుంచే మాంసాశనుడైన అగ్నిని
నిర్గమింప జేస్తున్నాను.
జీవన ప్రదాత అయిన అగ్నిని ప్రతిష్ఠిస్తున్నాను. ॥ 9 ॥

మంత్రము :

యత్ తే నియానం రజసం మృత్యో అవధర్ష్యఽమ్ ।
పథ ఇమం తస్మాద్ రక్షన్తో బ్రహ్మాస్మై వర్మ కృణ్మసి ॥ 10 ॥

పదము :

యత్ । తే । నిఽయానమ్ । రజసమ్ । మృత్యో ఇతి ।
అవఽధర్ష్యఽమ్ ।

పథః । ఇమమ్ । తస్మాత్ । రక్షన్తు । బ్రహ్మ । అస్మై । వర్మ ।
కృణ్మసి ॥ 10 ॥

అనువాదం :

ఓ మృత్యూ! నీ మార్గం రక్షోమయు మైనది.
దాట రానిది. ఈ మార్గం నుంచి
ఇతనిని కాపాడుతున్న మేము
ఇతనికై శాంతిరూప తనుత్రాణాన్ని కల్పిస్తున్నాము. ॥ 10 ॥

మంత్రము :

కృణోమి తే ప్రాణాపానౌ జరాం
మృత్యుం దీర్ఘమాయుః స్వస్తి ।
వైవస్వతేన ప్రహితాన్ యమదూతాం-
శ్చరతోఽప సేధామి సర్వాన్ ॥ 11 ॥

పదము :

కృణోమి । తే । ప్రాణాపానౌ । జరామ్ ।
మృత్యుమ్ । దీర్ఘమ్ । ఆయుః । స్వస్తి ।
వైవస్వతేన । ప్రఽహితాన్ । యమఽదూతాన్ ।
చరతః । అప । సేధామి । సర్వాన్ ॥ 11 ॥

అనువాదం :

ఓ ఆయుష్కాముడా! నీ ప్రాణాపానములను
యథోచిత స్థితిలో ఉంచుతున్నాను.

జరామృత్యువులు నిన్ను అంటకుండా చేస్తున్నాను.
దీర్ఘాయుస్సును ప్రసాదిస్తున్నాను.
నీకు స్వస్తి అగు గాక!
యముడు పంపిన దూతలు
ఇక్కడ అంతటా తిరుగుతున్నారు.
వారందరినీ దూరంగా త్రోసివేస్తున్నాను. ॥ 11 ॥

మంత్రము :

ఆరాదరాతిం నిర్ఋతిం పరో
గ్రాహిం క్రవ్యాదః పిశాచాన్ ।
రక్షో యత్ సర్వం దుర్భూతం తత్
తమ ఇవాప హన్మసి ॥ 12 ॥

పదము :

ఆరాత్ । అరాతిమ్ । నిఃఽఋతిమ్ । పరః ।
గ్రాహిమ్ । క్రవ్యఽఅదః । పిశాచాన్ ।
రక్షః । యత్ । సర్వమ్ । దుఃఽభూతమ్ । తత్ ।
తమఃఽఇవ । అప । హన్మసి ॥ 12 ॥

అనువాదం :

శత్రుప్రాయ అయి పురోగ్రాహి అయిన
పాపదేవతను దూరంలో ఉండగానే వధిస్తున్నాము.
మాంసాశన పిశాచులను వధిస్తున్నాము.
అథర్వ iv 3

దుష్టరాక్షస సర్వస్వం నుంచి
తమస్సును అపహరిస్తున్నాము. ॥ 12 ॥

మంత్రము :

అగ్నేష్టే ప్రాణమ మృతా దా యుష్మతో వన్వే జాతవేదసః ।
యథా న రిష్యా అమృతః సజూ రస స్తత్
తే కృణోమి తదు తే సమృధ్యతామ్ ॥ 13 ॥

పదము :

అగ్నేః । తే । ప్రాణమ్ । అమృతాత్ । ఆయుష్మతః । వన్వే ।
జాతఽవేదసః ।
యథా । న । రిష్యాః । అమృతః । సఽజూః । అసః । తత్ ।
తే । కృణోమి । తత్ । ఉంఇతి । తే । సమ్ । ఋధ్యతామ్ ॥ 13 ॥

అనువాదం :

అమృతుడూ, ఆయుష్మంతుడూ అయిన అగ్ని సకాశంనుంచి
రక్షోఽపహృత ప్రాణుడైన ఈ పురుషుని యాచిస్తున్నాను.
జాత ప్రజ్ఞుడైన అగ్నితో నీవు
హింసపాలు కాకుండా అమరుడవై
ప్రీతి కరుడవై జీవింతువు గాక!
ఈ శాంతికర్మను నీకై చేస్తున్నాను.
అదే నీకు సమృద్ధిని కల్పించు గాక! ॥ 13 ॥

మంత్రము :

శివే తే స్తాం ద్యావాపృథివీ అసంతాపే అభిశ్రియౌ ।

శం తే సూర్య ఆ తపతు శం వాతో వాతు తే హృదే।

శివా అభి క్షరన్తు త్వాపో దివ్యాః పయస్వతీః ॥ 14 ॥

పదము:

శివే ఇతి। తే। స్తామ్। ద్యావాపృథివీ ఇతి। అసంతాపే ఇత్యసమ్ ఽతాపే। అభిఽశ్రియౌ।

శమ్। తే। సూర్యః। ఆ। తపతు। శమ్। వాతః। వాతు। తే। హృదే।

శివాః। అభి। క్షరన్తు। త్వా। ఆపః। దివ్యాః। పయస్వతీః॥14॥

అనువాదం:

ఓ కుమారా! ద్యావా పృథువులు నీకు
మంగళప్రదు లగుదురుగాక!
సంతాపం కల్గింప కుందురుగాక!
శ్రీప్రదు లగుదురు గాక!
సూర్యుడు నీ సుఖానుగుణంగా ప్రకాశించుగాక!
నీ మనసునకు నచ్చునట్లు వాయువు హాయిగా వీచు గాక!
దివ్యజలములు నీకు శివంకరములై ప్రవహించుగాక! ॥ 14 ॥

మంత్రము:

శివాస్తే సన్త్వోషధయ ఉత్

త్వాహార్ష మధరస్యా ఉత్తరాం పృథివీ మభి।

తత్ర త్వాదిత్యౌ రక్షతాం సూర్యాచన్ద్రమసావుభా ॥ 15 ॥

పదము :

శివాః । తే । సన్తు । ఓషధయః । ఉత్ । త్వా ।

అహార్షమ్ । అధరస్యాః । ఉత్తరామ్ । పృథివీమ్ । అధి ।

తత్ర । త్వా । ఆదిత్యౌ । రక్షతామ్ । సూర్యాచన్ద్రమసౌ । ఉభా ॥ 15 ॥

అనువాదం :

ఓషధులు నీకు సుఖకరములగు గాక!
పూర్వ పృథివీ సకాశం నుంచి ఉత్తర పృథివీ సకాశాని
నిన్నుద్ధరించి చేరుస్తున్నాను.
ఆ ఉత్తర పృథ్విలో నిన్ను
ఆదిత్యులు సూర్య చంద్రు లిరువురు రక్షింతురుగాక! 15 ।

మంత్రము :

యత్ తే వాసః పరిధానం యాం నీవిం కృణుషే త్వమ్ ।

శివం తే తన్వే౩ తత్ కృణ్మః సంస్పర్శే౽ద్రూక్ష్ణ మస్తు తే ॥ 16 ॥

పదము :

యత్ । తే । వాసః । పరిఽధానమ్ । యామ్ । నీవిమ్ । కృణుషే త్వమ్ ।

శివమ్ । తే । తన్వే౽ । తత్ । కృణ్మః । సమ్ఽస్పర్శే । అద్రూక్ష్ణమ్ । అస్తు । తే ॥ 16 ॥

**అనువాదం :**

ఉత్తరీయాన్ని - వస్త్రాన్ని నీకు కప్పుతున్నాను.
అధోవస్త్రాన్ని నీకు కడుతున్నాను.
ఈ రెండూ నీ శరీరానికి
హాయినిచ్చునవిగా చేస్తున్నాము.
ఆ వస్త్ర స్పర్శ నిన్ను కష్టపెట్టునది కాకుండునట్లు చేస్తున్నాను.
॥ 16 ॥

**మంత్రము :**

యత్ క్షురేణ మర్చయతా సుతేజసా
వప్తా వపసి కేశశ్మశ్రు ।
శుభం ముఖం మా న ఆయుః ప్ర మోషీః ॥ 17 ॥

**పదము :**

యత్ । క్షురేణ । మర్చయతా । సుఽతేజసా ।
వప్తా । వపసి । కేశఽశ్మశ్రు ।
శుభమ్ । ముఖమ్ । మా । నః । ఆయుః । ప్ర । మోషీః ॥ 17 ॥

**అనువాదం :**

నాపితుడవై తేజోయుక్తమైన కత్తితో
కేశములను, శ్మశ్రువులను ఓ సవితా!
వపనం చేయి. అలా చేసిన మాణవకుని ముఖాన్ని
దీప్తిమంతం చెయ్యి.
మా పుత్రుని ఆయుస్సును అపహరించకు! ॥ 17 ॥

మంత్రము :

శివౌ తే స్తాం వ్రీహియవా వబలాసా వదోమధౌ ।

ఏతౌ యక్ష్మం వి బాధేతే ఏతౌ ముఞ్చతో అంహసః ॥18॥

పదము :

శివౌ । తే । స్తామ్ । వ్రీహిఽయవౌ । అబలాసౌ । అదోమధౌ ।

ఏతౌ । యక్ష్మమ్ । వి । బాధే తే ఇతి । ఏతౌ । ముఞ్చతః ।

అంహసః ॥ 18 ॥

అనువాదం :

ఓ (అన్నం తింటున్న) బాలకుడా! ఈ వ దిన
వ్రీహి, యవలు నీకు సుఖం కల్గించుగాక!
నీ శరీరబలాన్ని వృద్ధిచెందించు గాక!
మధురములైన ఈ వ్రీహి, యవలు
శరీరగతమైన రుగ్మతను తొలగించుగాక!
ఇవే ఈ బాలకుని దురితం నుండి
విమోచనం చెందించు గాక! ॥ 18 ॥

మంత్రము :

యదశ్నాసి యత్ పిబసి ధాన్యంఽ కృష్యాః పయః ।

యదాద్యం 1 యదనాద్యం సర్వం తే అన్నమవిషం

కృణోమి ॥ 19 ॥

పదము :

యత్ । అశ్నాసి । యత్ । పిబసి । ధాన్యఽమ్ । కృష్యాః ।

పయః ।

యత్, అద్య౽మ్ । యత్ । అనాద్యమ్ । సర్వమ్ । తే ।

అన్నమ్ । అవిషమ్ । కృణోమి ॥ 19 ॥

అనువాదం:

ఓ కుమారా! నీవు ఏ అన్నాన్ని
కష్టపడి తింటున్నావో, పాలవలె సారభూతమైన
ఏ అంబలిని త్రాగుతున్నావో,
ఆ తినుటకు సరి అయిన ఆహారం
అలాగే తిన వీలులేని కటుతిక్తాది యుతమై
అసహ్యమైన ఆహారం —
— ఇలాంటి ఈ ఆహారమంతా
నిర్విషంగా, అమృతంగా చేస్తున్నాను. ॥ 19 ॥

మంత్రము:

అహ్నే చ త్వా రాత్రయే చోభాభ్యాం పరి దద్మసి ।

అరాయేభ్యో జిఘత్సుభ్య ఇమం మే పరి రక్షత ॥ 20 ॥

పదము:

అహ్నే । చ । త్వా । రాత్రయే । చ । ఉభాభ్యామ్ । పరి । దద్మసి

అరాయేభ్యః । జిఘత్సు౽భ్యః । ఇమమ్ । మే । పరి । రక్షత

॥ 20 ॥

అనువాదం:

నిన్ను అహోరాత్రులనే ఉభయదేవతలకు
రక్షార్థమై నివేదిస్తున్నాము.
నిర్ధనులు, అదనేచ్ఛవులు అయిన

రక్షఃపిశాచాదుల నుంచి ఈ బాలుని
విశ్వేదేవతలు రక్షింతురు గాక ! ॥ 20 ॥

మంత్రము:

శతం తేఽయుతం హాయనాన్ ద్వే యుగే
త్రీణి చత్వారి కృణ్మః ।
ఇన్ద్రాగ్నీ విశ్వే దేవాస్తేఽను
మన్యన్తా మహృణీయమానాః ॥ 21 ॥

పదము:

శతమ్ । తే । అయుతమ్ । హాయనాన్ । ద్వే ఇతి ।
యుగే ఇతి । త్రీణి । చత్వారి । కృణ్మః ।
ఇన్ద్రాగ్నీ ఇతి । విశ్వే । దేవాః । తే । అను ।
మన్యన్తామ్ । అహృణీయమానాః ॥ 21 ॥

అనువాదం:

(ఓ బాలకా!) నీ శత సంవత్సరాలను (ఆయుష్షును)
వేయిసంవత్సరాలుగా చేస్తున్నాము.
నీ రెండు యుగములను మూడు యుగములుగా,
నాలుగు యుగములుగా చేస్తున్నాము.
ఆ ఇంద్రాగ్నులు విశ్వేదేవతలు
అహ్వానితులై ఇందుకు అనుమతింతురుగాక ! ॥ 21 ॥

మంత్రము :

శరదే త్వా హేమన్తాయ వసన్తాయ
గ్రీష్మాయ పరి దద్మసి ।
వర్షాణి తుభ్యం స్యోనాని
యేషు వర్ధన్త ఓషధీః ॥ 22 ॥

పదము

శరదే । త్వా । హేమన్తాయ । వసన్తాయ ।
గ్రీష్మాయ । పరి । దద్మసి ।
వర్షాణి । తుభ్యమ్ । స్యోనాని ।
యేషు । వర్ధన్తే । ఓషధీః ॥ 22 ॥

అనువాదం :

(ఓ బాలకా) నిన్ను శరదృతువునకు రక్షార్థమై
పరిదానం చేస్తున్నాము.
ఆ తర్వాత హేమంతమునకు, పిదప
వసంతమునకు, తదుపరి గ్రీష్మానికి
పరిదానం చేస్తున్నాము.
నీ కీ సంవత్సరములు సుఖకరములు కాగలవు.
ఈ కాలంలో ఓషధులు అభివృద్ధి చెందగలవు. ॥ 22 ॥

మంత్రము :

మృత్యురీశే ద్విపదాం మృత్యురీశే చతుష్పదామ్ ।

తస్మాత్ త్వాం మృత్యోర్గోపతే రుద్భరామి స మా బిభేః ॥23॥

పదము:

మృత్యుః । ఈశే । ద్విఽపదామ్ । మృత్యుః । ఈశే । చతుఃఽపదామ్ ।
తస్మాత్ । త్వామ్ । మృత్యోః । గోఽపతేః । ఉత్ । భరామి । సః ।
మా । బిభేః ॥ 23 ॥

అనువాదం:

ద్విపాత్తులకు మృత్యుదేవుడు ప్రభు వవుతున్నాడు.
అలాగే చతుష్పాత్తులకు మృత్యువు ప్రభు వవుతున్నాడు.
ఆ గోపతి అయిన మృత్యు సకాశంనుంచి
నిన్ను ఉద్ధరిస్తున్నాము.
నీ వేమీ భయపడవద్దు. ॥ 23 ॥

మంత్రము:

సోఽరిష్ట న మరిష్యసి న మరిష్యసి మా బిభేః ।
న వై తత్ర మ్రియన్తే నో యన్త్యధమం తమః ॥ 24 ॥

పదము:

సః । అరిష్ట । న । మరిష్యసి । న । మరిష్యసి । మా । బిభేః ।
న । వై । తత్ర । మ్రియన్తే । నో ఇతి । యన్తి । అధమమ్ । తమః ॥ 24 ॥

అనువాదం:

మృత్యుబాధ తొలగిన నీవు మృతిచెందవు.
కనుక భయపడవద్దు.

గ. శాంతి కర్మలో నీవు ప్రాణత్యాగం చెయ్యవు.
మరణ కాలినమైన అంధ తమస్సుకూడా
నిను ప్రాపించదు. ॥ 24 ॥

మంత్రము.

సర్వో వై తత్ర జీవతి గౌరశ్వః పురుషః పశుః ।

యత్రేదం బ్రహ్మ క్రియతే పరిధి ర్జీవనాయ కమ్ ॥ 25 ॥

పదము.

సర్వః । వై । తత్ర । జీవతి । గౌః । అశ్వః । పురుషః । పశుః ।

యత్ర । ఇదమ్ । బ్రహ్మ । క్రియతే । పరిఽధిః । జీవనాయ ।
కమ్ ॥ 25 ॥

అనువాదం.

సర్వ ప్రాణులకు మహాశాంతి కర్మ
పరిధిగా ఉంటుంది. ( గౌరశ్వాదులకు, పురుషాది
ప్రాణులకు రక్షక ప్రాకారంగా ఉంటుంది. )
జీవనార్థమై సుఖకరమౌతుంది.
ఈ మహాశాంతి కర్మ ఒక పరిధిని కల్పిస్తుంది.
అలాగే జీవనానికి ఉపయోగిస్తుంది.
ఈ బ్రహ్మకర్మరూపమైన పరిధి జీవనార్థ మవుతుంది. ॥ 25 ॥

మంత్రము:

పరి త్వా పాతు సమానేభ్యోఽభిచారాత్ సబన్ధుభ్యః ।

అమమ్రిర్భవాఽమృతోఽతిజీవో

మా తే హాసిషు రసవః శరీరమ్ ॥ 26 ॥

పదము :

పరి । త్వా । పాతు । సమానేభ్యః । అభిఽచారాత్ । సబన్ధుఽభ్యః ॥

అమమ్రిః । భవ । అమృతః । అతిఽజీవః ।

మా । తే । హాసిషుః । అసవః । శరీరమ్ ॥ 26 ॥

అనువాదం :

ఓ శాంతికాముకుడైన పురుషుడా!
నీవు చేసిన శాంతికర్మ నిన్ను పరిపాలించుగాక!
సమానులు, సమాన బంధువులు చేసే
అభిచార కర్మలతో నీవు
మరణించ కుందువు గాక!
అమృతుడవైన, అతి నజీవుడవైన నీ శరీరాన్ని
ప్రాణాలు వదలిపెట్టకుందురుగాక! ॥ 26 ॥

మంత్రము :

యే మృత్యవ ఏకశతం యా నాష్ట్రా అతితార్యాః ।

ముఞ్చన్తు తస్మాత్ త్వాం దేవా అగ్నేర్వైశ్వానరా దధి ॥ 27 ॥

పదము :

యే । మృత్యవః । ఏకఽశతమ్ । యాః । నాష్ట్రాః । అతిఽతార్యాః ॥

ముఞ్చన్తు । తస్మాత్ । త్వామ్ । దేవాః । అగ్నేః । వైశ్వానరాత్ ।

అధి ॥ 27 ॥

అనువాదం :

ఆ మృత్యుఖడ్గములు నూటొక్కటి ఉన్నవి.
అవి నాశకారులు. అనుల్లంఘ్య హింసాకారిణులు.

ఆ మృత్యు రూపముల నుంచి నిన్ను ఇంద్రాదులు
విమోచనం చెందింతురు గాక!
వైశ్వానరాగ్ని నుంచి నిన్ను విమోచనం చెందింతురుగాక!
॥ 27 ॥

మంత్రము:

అగ్నేః శరీరమసి పారయిష్ణు రక్షోహాఽసి సపత్నహా।

అథో అమీవచాతనః పూతుద్రుర్నామ భేషజమ్ ॥ 28 ॥

పదము:

అగ్నేః। శరీరమ్। అసి। పారయిష్ణు। రక్షఃఽహా। అసి।
సపత్నఽహా।

అథో ఇతి। అమీవఽచాతనః। పూతుద్రుః। నామ। భేషజమ్ ॥28॥

అనువాదం:

ఓ *పూతుద్రూ! నీవు అగ్నికి
పారం చెందించే శరీర భూతమైన దానవు.
రక్షోహంత వవుతున్నావు.

---

* 'పూతద్రు' అని కూడా పాఠాంతరము. ఇది దేవదరవిశేషమని కొన్ని వైదిక నిఘంటువులలో ఉన్నది. Macdonell, Keith పండితులు సిద్ధంచేసిన 'Vedic Index of Names and Subjects' లో దేవదారు వృక్షంగా దీనిని గుర్తించినారు. The tree Acacia Catechu, or Pinus Deodora. (Moniar Williams Dictionary) 'Indian Medicinal Plants' అనే గ్రంథంలో కూడా 'దేవదారు' అనియు, Cedrus Deodora అనియు ఉన్నది.

మరిన్ని రోగ నివారక మవుతున్నావు.
ఇలాంటి రోగ నివారకమైన ఔషధమా!
మాకు అభిమత సిద్ధిని కల్పించు. ॥ 28 ॥

ఇది రెండవ సూక్తం.

ఇది మొదటి అనువాకం.

## అనువాకం – 2

### సూక్తం – 3

ఋషి: చాతనుడు ॥ దేవత: అగ్ని ॥ ఛందస్సు: 1-6, 8-11, 13-16, 18-20, 24 త్రిష్టుప్: 7,12,14,15,17,21 భురిక్ త్రిష్టుప్: 22,23 అనుష్టుప్; 25 బృహతీ గర్భా జగతీ; 26 గాయత్రి ॥ మంత్రములు: ॥ 28 ॥

వినియోగం :– ఈ అనువాకము చాతనగణము లోనిది గనుక రక్షోగ్రహపిశాచాది చికిత్సలో ఈ అనువాకంతో పలాశ ఉదుంబర కలంలో ఏదో ఒక దానిని హోమం చేయాలి లేదా వీటితోనే ధూపం వేయాలి.

అట్లే ఈ అనువాకాన్ని పిశాచాది గ్రస్తుడైన వ్యక్తిని స్పృశించి చెప్పాలి.

అదే కర్మలో ఈ అనువాకంతో, ప్రశవణ, ముసలం, ఖదిర, వర్షనములలో ఏదో ఒక సమిధను ఆధానం చేయాలి.

అదే కర్మలో విషమసంఖ్యగల ఖదిర కంటకములను గాని, లోహమయ కంటకములనుగాని, తామ్రమయ కంటకములను గాని పాతి పెట్టుటకై ఈ అనువాకంతో అభిమంత్రించాలి, లేదా వేయించిన చెక్కెరను అభిమంత్రించి శయనాదులలో చల్లాలి.

అదే కర్మలో ఈ అనువాకంతో యవసక్తువులను (పేలాలను) శాస్త్రోక్త రీతిగా హోమం చేయాలి.

అట్లే అసాధ్యగ్రహవశీకరణార్థం ఈ అనువాకంతో పిండ తూల సహితమైన ఇజ్గీదాజ్యాన్ని పలాశపర్ణ పృష్ఠభాగంలో హోమం చేయాలి.

అట్లే గృహాదులలో గ్రహపీడాదులు ఉన్నవా లేవా అనే శంక కలిగినపుడు ఈ అనువాకంతో పర్ణపేర్మాన్ని, శరమయమైన బర్హిస్సును అభిమంత్రించి ఇంటిపైన ఉంచాలి. తెల్లవారిన తర్వాత ఆర్ద్రబర్హిస్సులలో మార్పువచ్చినట్లయిన గ్రహాదులున్నవని తెలుసుకొన వలెను.

అదే కర్మలో వైశ్రవణ నమస్కారానంతరం ఈ అనువాకంతో ఉదకాన్ని అభిమంత్రించి గ్రహం పట్టిన వానిచే ఆచమింపచేయాలి, లేదా వానిపై చల్లాలి లేదా రాత్రి ఉద్యోక ద్రవ్యాన్ని అభిమంత్రించి సంమర్శించాలి.

అట్లే శాంత్యుదకాభిమంత్రణంలో ఈ అనువాకానికి గణ ప్రయుక్త వినియోగం అను సందేయము.

అట్లే వశాశమన కర్మలో పశుసంజ్ఞపనానంతరం ఈ అనువాకాన్ని జపించాలి.

అట్లే ఘృతకంబల మనే మహాభిషేకంలో అభిషేకానంతరం ఈ అనువాకాన్ని జపించాలి.

గోవులకు లోహిత దోహంతులైన అద్భుత శాంతికై 'యః పౌరుషేయేణ' అనే నాలుగు ఋక్కులతో ఆజ్యాన్ని హోమం చేయాలి.

అగ్నిలేని చోట అగ్ని కనబడుట మనే అద్భుత శాంతికై 'అగ్నీ రక్షాంసి' అనే మంత్రంతో ఆజ్యాన్ని హోమం చేయాలి.

అగ్నిలో శబ్దం కలిగినట్లయిన దాని శాంతికై దీనితో అగ్నిని ఉపతిష్ఠానం చెయ్యాలి.

అగ్న్యాధానంలో పావకగుణకాగ్ని యాగాన్ని బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి.

మంత్రము :

రక్షోహణం వాజినమా జిఘర్మి
మిత్రం ప్రథిష్ఠ ముప యామి శర్మ ।
శిశానో అగ్నిః క్రతుభిః సమిద్ధః
స నో దివా స రిషః పాతు నక్తమ్ ॥ 1 ॥

పదము :

రక్షఃఽహనమ్ । వాజినమ్ । ఆ । జిఘర్మి ।
మిత్రమ్ । ప్రథిష్ఠమ్ । ఉప । యామి । శర్మ ।
శిశానః । అగ్నిః । క్రతుఽభిః । సమ్ఽఇద్ధః ।
సః । నః । దివా । సః । రిషః । పాతు । నక్తమ్ ॥ 1 ॥

అనువాదం :

రక్షోనిహంత, వీర్యవంతుడు అయిన అగ్నిని
(ఆజ్యాదులతో) సముద్దీపనం చేస్తున్నాను.
మిత్రుడు, పృథుతరుడు అయిన అగ్నిని
శరణు జొచ్చుతున్నాను.
ఆ వహ్ని తన జ్వాలలను తీక్ష్ణీకరించి
క్రతువులతో జ్వలించుగాక!
ఆయన మనుష్యులను హింసకులైన
వానినుంచి రక్షించుగాక!
ఆయనే రాత్రింబవళ్ళు మమ్ము కాపాడుగాక! ॥ 1 ॥

మంత్రము :

అయోదంష్ట్రో అర్చిషా యాతుధానా-

నుప స్పృశ జాతవేదః సమిద్ధః ।

ఆ జిహ్వయా మూరదేవాన్ రభస్వ

క్రవ్యాదో వృష్ట్వాఽపి ధత్స్వాసన్ ॥ 2 ॥

పదము :

అయఃఽదంష్ట్రః । అర్చిషా । యాతుఽధానాన్ ।

ఉప । స్పృశ । జాతఽవేదః । సమ్ఽఇద్ధః ।

ఆ । జిహ్వయా । మూరఽదేవాన్ । రభస్వ ।

క్రవ్యఽఅదః । వృష్ట్వా । అపి । ధత్స్వ । ఆసన్ ॥ 2 ॥

అనువాదం :

ఓ జాతవేదా ! (అగ్నీ !) జ్వాలలతో యాతుధానులను
దహింపజేయ్యి.
మూరదేవులను (వివేకశూన్యులను) నీ జ్వాలలతో స్పృశించు.
మాంస భక్షకులైన రక్షఃపిశాచాదులను
నీ నోట దాచిపెట్టు. (భక్షించు) ॥ 2 ॥

మంత్రము :

ఉభోభయావిన్నుప ధేహి దంష్ట్రా

హింస్రః శిశానోఽవరం పరం చ ।

అథర్వ. iv 4

ఉతాన్తరిక్షే పరి యాహ్యగ్నే
జమ్భైః సం ధేహ్యభి యాతుధానాన్ ॥ 3 ॥

పదము :

ఉభా । ఉభయావిన్ । ఉప । ధేహి । దంష్ట్రౌ ।
హింస్రః । శిశానః । అవరమ్ । పరమ్ । చ ।
ఉత । అన్తరిక్షే । పరి । యాహి । అగ్నే ।
జమ్భైః । సమ్ । ధేహి । అభి । యాతు౽ధానాన్ ॥ 3 ॥

అనువాదం :

ఎవరు రక్షణీయులు, ఎవరు హంతవ్యులు
అన్నది గుర్తించి, హింసా శీలుడు, తీక్ష్ణదంతుడు అయిన
నికృష్ట ద్వేషిని, మా శత్రువు ఉత్కృష్ట ద్వేషిని
ఉభయ దంష్ట్రలతో కరకర నమిలి మ్రింగు.
మరిన్ని అంతరిక్షంలో సంచరించు
ఓ అగ్నీ ! రక్షఃప్రవృత్తులను
దంతములతో పండ్లపొడిని చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

అగ్నే త్వచం యాతుధానస్య భిన్ధి
హింస్రాఽశనిర్హరసా హన్త్వేనమ్ ।
ప్ర పర్వాణి జాతవేదః శృణీహి
క్రవ్యాత్ క్రవిష్ణుర్వి చినోత్వేనమ్

పదము

అగ్నే । త్వచమ్ । యాతుఽధానస్య । భిన్ధి ।

హింస్రా । అశనిః । హరసా । హన్తు । ఏనమ్ ।

ప్ర । పర్వాణి । జాతఽవేదః । శృణీహి ।

క్రవ్యఽఅత్ । క్రవిష్ణుః । వి । చినోతు । ఏనమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ అగ్ని ! నీవు యాతుధానుల చర్మాన్ని ఒలిచి వెయ్యి.
హింసక మైన పిడుగు తన వేడిమితో
వానిని అంతం చే సుగాక !
వాని కీలుకీలు విరిచి వెయ్యి.
తోడేళ్ళు మొదలగునవి మాంసాన్ని తినగోరి
అటూ ఇటూ వానినిలాగి చీల్చి వేయుగాక ! ॥ 4 ॥

మంత్రము :

యత్రేదానీం పశ్యసి జాతవేద-

స్తిష్ఠన్తమగ్న ఉత వా చరన్తమ్ ।

ఉతాన్తరిక్షే పతన్తం యాతుధానం

తమస్తా విధ్య శర్వా శిశానః



పదము :

యత్ర । ఇదానీమ్ । పశ్యసి । జాతఽవేదః ।

తిష్ఠన్తమ్ । అగ్నే । ఉత । వా । చరన్తమ్ ।

ఉత । అ॒న్తరి॑క్షే । పత॑న్తమ్ । యా॒తు॒ఽధానమ్ ।

తమ్ । అస్తా । వి॒ధ్య । శర్వా । శిశానః ॥ 5 ॥

అనువాదం:

ఓ జాతవేదా! ఎక్కడనైతే ఈ కాలంలో
రాక్షసాదులను చూస్తావో,
ఎక్కడనైతే వాడుంటాడో,
ఎక్కడనైతే తిరుగుతుంటాడో,
ఎక్కడ అంతరిక్షాని కెగిరి పోతాడో,
ఆ యాతుధానుని తీవ్రరూపం దాల్చి,
క్షిప్తమైన నీవు బాణములతో మర్దించు. ॥ 5 ॥

మంత్రము:

య॒జ్ఞైరి॒షూః సం॒నమ॑మానో అగ్నే

వా॒చా శ॒ల్యాం అ॒శని॑భి ర్ది॒హా॑నః ।

తాభి॑ర్విధ్య హృ॒దయే యాతు॒ధానా॑న్

ప్రతీ॒చో బా॒హూన్ ప్రతి॑ భఙ్ధ్యేషామ్ ॥ 6 ॥

పదము:

య॒జ్ఞైః । ఇషూః । సమ్ఽనమ॑మానః । అ॒గ్నే ।

వా॒చా । శ॒ల్యాన్ । అ॒శని॑ఽభిః । ది॒హానః ।

తాభిః । వి॒ధ్య । హృ॒దయే । యా॒తు॒ఽధానా॑న్ ।

పతీచః । బాహూన్ । ప్రతి । భఙ్ధి । ఏషామ్ ॥ 6 ॥

అనువాదం:

ఓ అగ్ని! మేము చేసిన యజ్ఞములతో
నీ బాణములను పదును పెట్టుకుని
మంత్రరూపమైన వాక్కుతో
విషదిగ్ధములను చేసి
అశని సదృశమైన, రక్షోఘాతుక యజ్ఞములతో
పదునెక్కిన బాణములతో
యాతుధానుల హృదయప్రదేశం పై కొట్టించు.
ఈ రాక్షసుల బాహువులను మర్దించు. ॥ 6 ॥

మంత్రము :

తారభ్ధా స్పృణుహి జాతవేద
తారేభాణాం ఋష్టిభిర్యాతుధానాన్ ।
అగ్నే పూర్వో ని జహి శోశుచాన
అమాదః క్ష్విఙ్కా స్త మదన్త్వేనీః ॥ 7 ॥

పదము :

త । ఆఽరబ్ధాన్ । స్పృణుహి । జాతఽవేదః ।
ఉత । ఆఽరేభాణాన్ । ఋష్టిఽభిః । యాతుఽధానాన్ ।
అగ్నే । పూర్వః । ని । జహి । శోశుచానః ।
అమఽఅదః । క్ష్విఙ్కాః । తమ్ । అదన్తు । ఏనీః ॥ 7 ॥

అనువాదం :

నిన్ను స్తుతింప మొదలు పెట్టిన మన [illegible]
ఓ అగ్నీ! పాలించు.
మరిన్ని అరుస్తూ వస్తున్న రాక్షసులను
నీ ఆయుధంతో ఖండించు.
ఓ అగ్నీ! శత్రువుల ముందు మండిపోతూ
నీవు వారిని చంపు.
పచ్చిమాంసం తినే *క్వ్యంకములు ( పక్షివిశేషములు )
ఆ హంతుని భక్షించు గాక! ॥ 7 ॥

మంత్రము :

ఇహ ప్ర బ్రూహి యతమః సో అగ్నే
యాతుధానో య ఇదం కృణోతి ।
తమా రభస్వ సమిధా యవిష్ఠ
నృచక్షసశ్చక్షుషే రన్ధయైనమ్ ॥ 8 ॥

పదము :

ఇహ । ప్ర । బ్రూహి । యతమః । సః । అగ్నే ।
యాతుఽధానః । యః । ఇదమ్ । కృణోతి ।

---

* క్వ్యంకము అనగా రక్తమును ఆహారముగల Vedic Dictionaryలోను, Moniar Williams Dictionary లోను ఉన్నది. పక్షివిశేషముగా సాయణ భాష్యం: గ్రద్దలు, డేగలు మొదలైనవి శవాలను భక్షించడం ప్రసిద్ధం.

కమ్ । అ । రభస్య । సమ్ఽఇధా । యవిష్ఠ ।

నృఽచక్షసః । చక్షుషే । రన్ధయ । ఏనమ్ ॥ 8 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! ఈ శాంతి విషయంలో ఏ రాక్షసుడు,
శరీర పీడనాదికములను చేస్తుంటాడో,
ఆ ఘాతుకుని నీ జ్వాలతో దహించు.
ఈ పాపిని నీ కంటితో వశం చేసుకో. ॥ 8 ॥

మంత్రము :

తీక్ష్ణేనాగ్నే చక్షుషా రక్ష యజ్ఞం
ప్రాఞ్చం వసుభ్యః ప్ర ణయ ప్రచేతః ।
హింస్రం రక్షాంస్యభి శోశుచానం
మా త్వా దభన్ యాతుధానా నృచక్షః ॥ 9 ॥

పదము :

తీక్ష్ణేన । అగ్నే । చక్షుషా । రక్ష । యజ్ఞమ్ ।
ప్రాఞ్చమ్ । వసుఽభ్యః । ప్ర । నయ । ప్రఽచేతః ।
హింస్రమ్ । రక్షాంసి । అభి । శోశుచానమ్ ।
మా । త్వా । దభన్ । యాతుఽధానాః । నృఽచక్షః ॥ 9 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! తీక్ష్ణమైన నీ చూపుతో
మా యజ్ఞాన్ని పరిపాలించు.

( ఒక కంటు కని పెట్టు )
మా యందు దయగల నీవు మా యజ్ఞాన్ని
పశువుల వైపు కొనిపో.
పరస్నేతుడవైన నీవు
హింసాశీలురైన రాక్షసులను హింసించు.
సర్వతః దహనం చేస్తున్న నిన్ను ఆ రాక్షసులు
హింసింపకుందురు గాక ! ॥ 9 ॥

మంత్రము :

నృచక్షా రక్షః పరి పశ్య విక్షు
తస్య త్రీణి ప్రతి శృణీహ్యగ్రా ।
తస్యాగ్నే పృష్టీర్హరసా శృణీహి
త్రేధా మూలం యాతుధానస్య వృశ్చ ॥ 10 ॥

పదము :

నృఽచక్షాః । రక్షః । పరి । పశ్య । విక్షు ।
తస్య । త్రీణి । ప్రతి । శృణీహి । అగ్రా ।
తస్య । అగ్నే । పృష్టీః । హరసా । శృణీహి ।
త్రేధా । మూలమ్ । యాతుఽధానస్య । వృశ్చ ॥ 10 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు మానవ నయన రూపుడవు.
ప్రజా మధ్యంలో తిరుగుతున్న రాక్షసుని పర్యాలోకించు.

వాని ఉపరిభాగత్రయాన్ని ఛేదించు.
వెనుకభాగాన్ని ఓ అగ్ని ! నీ తేజస్సుతో ఖండించు.
అలాగే వాని పాదప్రదేశాన్ని
మూడు ముక్కలుగా నఱికి వెయ్యి. ॥ 10 ॥

మంత్రము :

త్రిర్యాతుధానః ప్రసితిం త ఏ-
త్వృతం యో అగ్నే అనృతేన హన్తి ।
తమర్చిషా స్ఫూర్జయన్ జాతవేదః
సమక్షమేనం గృణతే ని యుఙ్గ్ధి ॥ 11 ॥

పదము :

త్రిః । యాతుఽధానః । ప్రఽసితిమ్ । తే । ఏతు ।
ఋతమ్ । యః । అగ్నే । అనృతేన । హన్తి ।
తమ్ । అర్చిషా । స్ఫూర్జయన్ । జాతఽవేదః ।
సమ్ఽఅక్షమ్ । ఏనమ్ । గృణతే । ని । యుఙ్గ్ధి ॥ 11 ॥

అనువాదం :

ఓ అగ్ని ! రాక్షసుడు నీ జ్వాలకు
ముమ్మారు ఆహుతి అగు గాక !
అతడు నా యజ్ఞాన్ని మాయతో పాడుచేస్తున్నాడు.
ఓ జాతవేదా ! అలాంటి రాక్షసుని
నిన్ను స్తుతిస్తున్న నా ఎదుటనే
నీ మంటలతో నిగ్రహించు. ॥ 11 ॥

మంత్రము :

యదగ్నే అద్య మిథునా శపాతో

యద్ వాచస్తృష్టం జనయన్త రేభాః ।

మన్యోర్మనసః శరవ్యా౩ జాయతే యా

తయా విధ్య హృదయే యాతుధానాన్ ॥ 12 ॥

పదము :

యత్ । అగ్నే । అద్య । మిథునా । శపాతః ।

యత్ । వాచః । తృష్టమ్ । జనయన్త । రేభాః ।

మన్యోః । మనసః । శరవ్యా౩ । జాయతే । యా ।

తయా । విధ్య । హృదయే । యాతుఽధానాన్ ॥ 12 ॥

అనువాదం :

ఈ రోజు ఈ దంపతులు ఓ అగ్నీ ! పరస్పరం
శపించుకుంటున్నారు.
కటుభాషలాడుతున్నారు.
స్తోతలు నీ కోపాన్ని ఉద్దీపనం చేస్తున్నారు.
నీ జ్వాలాశర పరంపరతో
యాతుధానుని హృదయాన్ని ఛేదించు. ॥ 12 ॥

మంత్రము :

పరా శృణీహి తపసా యాతుధానాన్

పరాగ్నే రక్షో హరసా శృణీహి ।

పరార్చిషా మూరదేవాన్ ఛృణీహి

పరాసుతృపః శోశుచతః శృణీహి ॥ 13 ॥

పదము:

పరా । శృణీహి । తపసా । యాతు౽ధానాన్ ।

పరా । అగ్నే । రక్షః । హరసా । శృణీహి ।

పరా । అర్చిషా । మూర౽దేవాన్ । శృణీహి ।

పరా । అసు౽తృపః । శోశుచతః । శృణీహి ॥ 13 ॥

అనువాదం:

రాక్షసులను నీ సంతాపక తేజంతో
పరాఙ్ముఖుని చేసి ఓ అగ్నీ! వినష్టం చెయ్యి.
అలాగే రాక్షసుని తేజస్సుతో పరాఙ్ముఖుని చేసి
వినాశం చెయ్యి.
మరణ దేవతలను నీ జ్వాలతో వినష్టం చెయ్యి.
పర ప్రాణములతో తమ్ము తృప్తిపరచుకొంటూ
విజృంభిస్తున్న ఈ రాక్షసులను వినాశం చెయ్యి. ॥ 13 ॥

మంత్రము:

పరాద్య దేవా వృజినం శృణన్తు

ప్రత్యగేనం శపథా యన్తు సృష్టాః ।

వాచా స్తేనం శరవ ఋచ్ఛన్తు మర్మన్

విశ్వస్యైతు ప్రసితిం యాతుధానః ॥ 14 ॥

పదము :

పరా । అద్య । దేవాః । వృజినమ్ । శృణన్తు ।
ప్రత్యక్ । ఏనమ్ । శపథాః । యన్తు । సృష్టాః ।
వాచాఽస్తేనమ్ । శరవః । ఋచ్ఛన్తు । మర్మన్ ।
విశ్వస్య । ఏతు । ప్రఽసితిమ్ । యాతుఽధానః ॥ 14 ॥

అనువాదం :

దేవతలు నేడు ప్రాణాపహరకులైన రాక్షసుని
తిరిగి వెళ్ళకుండా ప్రమందింతురు గాక!
ఈ పాపాత్ముని కటుతర శాపములతో
ఎదురెక్కి పోవుదురు గాక!
ఉపో వచనములతో బాధించే దేవ శరములు
మర్మస్థానములను గాడు గాక!
ఆ రాక్షసుడు విశ్వ హింసికి బలి అగుగాక! ॥ 14 ॥

మంత్రము :

యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే
యో అశ్వ్యేన పశునా యాతుధానః ।
యో అఘ్న్యాయా భరతి క్షీరమగ్నే
తేషాం శీర్షాణి హరసాఽపి వృశ్చ ॥ 15 ॥

పదము :

యః । పౌరుషేయేణ । క్రవిషా । సమ్ఽఅఙ్క్తే ।

యః । అశ్వ్యేన । పశునా । యాతుఽధానః ।

యః । అఘ్న్యాయాః । భరతి । క్షీరమ్ । అగ్నే ।

తేషామ్ । శీర్షాణి । హరసా । అపి । వృశ్చ ॥ 15 ॥

అనువాదం :

ఆ రాక్షసుడు నరమాంసంతో
తన్ను తాను పోషించుకుంటాడు.
అశ్వమాంసంతో, పశుమాంసంతో బ్రదుకుతాడు.
గో క్షీరాన్ని అపహరిస్తాడు.
అలాంటి ఆ రాక్షసులందరి శీర్షములను
నీ మంటలతో దగ్ధం చెయ్యి. ॥ 15 ॥

మంత్రము :

విషం గవాం యాతుధానా భరన్తా-
మా వృశ్చన్తామదితయే దురేవాః ।
పరైణాన్ దేవః సవితా దదాతు
పరా భాగ మోషధీనాం జయన్తామ్ ॥ 16 ॥

పదము :

విషమ్ । గవామ్ । యాతుఽధానాః । భరన్తామ్ ।

ఆ । వృశ్చన్తామ్ । అదితయే । దుఃఽఏవాః ।

పరా । ఏవాన్ । దేవః । సవితా । దదాతు ।

పరా । భాగమ్ । ఓషధీనామ్ । జయన్తామ్ ॥ 16 ॥

అనువాదం ।

రాక్షసులు గో క్షీరాన్ని భుజిస్తే దాని
సంగ్రహించుకోని.
ఆ దుర్మార్గ గాములు అదితికి ఖండితులు అగుదురు గాక !
ఈ రాక్షసులను సవిత వినాశించును గాక !
ఓషధుల భాగాన్ని పొందకుందురు గాక ! ॥ 16 ॥

మంత్రము ।

సంవత్సరీణం పయ ఉస్రియాయాస్తస్య
మాశీద్ యాతుధానో నృచక్షః ।
పీయూష మగ్నే యతమ స్తితృప్సాత్
తం ప్రత్యఞ్చమర్చిషా విధ్య మర్మణి ॥ 17 ॥

పదము :

సమ్ఽవత్సరీణమ్ । పయః । ఉస్రియాయాః । తస్య ।
మా । అశీత్ । యాతుఽధానః । నృఽచక్షః ।
పీయూషమ్ । అగ్నే । యతమః । తితృప్సాత్ ।
తమ్ । ప్రత్యఞ్చమ్ । అర్చిషా । విధ్య । మర్మణి ॥ 17 ॥

అనువాదం :

నరనేత్రుడవైన ఓ అగ్నీ! రాక్షసుడు
ఏడాది పొడుగునా పాలనిచ్చే
మా గోవునకు చెందిన పాలను త్రాగకుండు గాక!
ఆ యాతుధానుడు హవిర్లక్షణమైన
గోఘృతాన్ని త్రావి త్రేన్చవలెనని అనుకుంటున్నాడు.
వాని ఆయువు పట్టులపై నీ జ్వాలతో తాడనం చెయ్యి. ॥17॥

మంత్రము :

సనా దగ్నే మృణసి యాతుధానాన్
నత్వా రక్షాంసి పృతనాసు జిగ్యుః ।
సహమూరా నను దహ క్రవ్యాదో
మా తే హేత్యా ముక్షత దైవ్యాయాః ॥ 18 ॥

పదము ॥

సనాత్ । అగ్నే । మృణసి । యాతుఽధానాన్ ।
న । త్వా । రక్షాంసి । పృతనాసు । జిగ్యుః ।
సహఽమూరాన్ । అను । దహ । క్రవ్యఽఅదః ।
మా । తే । హేత్యాః । ముక్షత । దైవ్యాయాః ॥ 18 ॥

అనువాదం :

ఓ అగ్నీ! నీవు చిరకాలంగా రాక్షసులను చంపుతున్నావు.
అయినా రాక్షసులు సంగ్రామములలో నిన్ను జయించలేదు.

ఆ మాంసాశనులైన రాక్షసులను
సమూలంగా భస్మీకరించు.
నీ దైవతాయుధం నుంచి వారు తప్పించుకొన కుందురు గాక!
॥ 18 ॥

మంత్రము :

త్వం నో అగ్నే అధరా దుదక్త స్త్వం
పశ్చాదుత రక్ష పురస్తాత్ ।
ప్రతి త్యే తే అజరాస స్తపిష్ఠా
అఘశంసం శోశుచతో దహన్తు ॥ 19 ॥

పదము :

త్వమ్ । నః । అగ్నే । అధరాత్ । ఉదక్తః । త్వమ్ ।
పశ్చాత్ । ఉత । రక్ష । పురస్తాత్ ।
ప్రతి । త్యే । తే । అజరాసః । తపిష్ఠాః ।
అఘ2శంసమ్ । శోశుచతః । దహన్తు ॥ 19 ॥

అనువాదం :

ఓ అగ్నీ! మమ్ములను అధోదేశంలో ఉన్న
పీడకుల నుంచి రక్షించు.
ఉత్తరదిశలో నున్న వారి నుంచి రక్షించు.
అట్లాగే ప్రతీచీ దిశలోని వారినుంచి రక్షించు.
పూర్వ దిగ్భాగంలోని వారినుంచి కూడా రక్షించు.
నీ విస్ఫులింగాలు పాపకారి అయిన ఆ రాక్షసుని

వినాశం చేయుగాక!
నీ జ్వాలలు జరాదూరమైనవి.
సంతపింప జేయునవి. ప్రజ్వలించునవి. ॥ 19 ॥

మంత్రము :

పశ్చాత్ పురస్తా దధరా దుతోత్తరాత్
కవిః కావ్యేన పరి పాహ్యగ్నే ।
సఖా సఖాయ మజరో జరిమ్ణే
అగ్నే మర్తాం అమర్త్యస్త్వం నః ॥ 20 ॥

పదము :

పశ్చాత్ । పురస్తాత్ । అధరాత్ । ఉత । ఉత్తరాత్ ।
కవిః । కావ్యేన । పరి । పాహి । అగ్నే ।
సఖా । సఖాయమ్ । అజరః । జరిమ్ణే ।
అగ్నే । మర్తాన్ । అమర్త్యః । త్వమ్ । నః ॥ 20 ॥

అనువాదం :

ఓ అగ్నీ! మమ్ములను పడమటి నుంచి,
తూర్పు నుంచి, దక్షిణం నుంచి, ఉత్తరం నుంచి
నీ స్తుతిపర కవి కావ్యంతో పరిరక్షించు.
నాకు నీవు మిత్రుడవు.
నీ స్నేహితుని రక్షించు
జరా రహితుడవైన నీవు
అత్యంత జీర్ణీభూతుడనైన నన్ను రక్షించు.
నీవు అమరుడవు. మర్త్యులమైన మమ్ము పాలించు. ॥ 20 ॥

అథర్వ. iv 5

మంత్రము :

తదగ్నే చక్షుః ప్రతి ధేహి రేభే

శఫారుజో యేన పశ్యసి యాతుధానాన్ ।

అథర్వవజ్జ్యోతిషా దైవ్యేన సత్యం

ధూర్వన్త మచితం న్యోష ॥ 21 ॥

పదము :

తత్ । అగ్నే । చక్షుః । ప్రతి । ధేహి । రేభే ।

శఫ౽ఆరుజః । యేన । పశ్యసి । యాతు౽ధానాన్ ।

అథర్వ౽వత్ । జ్యోతిషా । దైవ్యేన । సత్యమ్ ।

ధూర్వన్తమ్ । అచితమ్ । ని । ఓష ॥ 21 ॥

అనువాదం :

అరుస్తున్న ఆ రాక్షసుని పై
ఓ అగ్నీ! నీ దృష్టిని ప్రసరింపజెయ్యి.
దీర్ఘనఖాలైన ఆ రాక్షసులను చూడు.
అథర్వ మహర్షివలె దైవ తేజంతో హింసిస్తూ
సత్యహా దప్పిన రాక్షసుని పరిదగ్ధం చెయ్యి. ॥ 21 ॥

మంత్రము :

పరి త్వాగ్నే పురం వయం విప్రం సహస్య ధీమహి ।

ధృషద్వర్ణం దివేదివే హన్తారం భఙ్గురావతః ॥ 22 ॥

పదము :

పరి । త్వా । అగ్నే । పురమ్ । వయమ్ । విప్రమ్ । సహస్య । ధీమహి ।

ధృషత్ఽవర్ణమ్ । దివేఽదివే । హన్తారమ్ । భఙ్గుర ఽ వతః ॥ 22 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! మథించగా ఉత్పన్నుడవైన
నిన్ను ధ్యానిస్తున్నాము.
కోరికలను తీర్చే మేధావి నీవు.
ధర్షక వర్ణయుక్తుడవు.
ప్రతిదిన భంగుర స్వభావులైన రాక్షసులను
భగ్నం చేసే వాడవు. ॥ 22 ॥

మంత్రము :

విషేణ భఙ్గురావతః ప్రతి ష్మ రక్షసో దహ ।
అగ్నే తిగ్మేన శోచిషా తపురగ్రాభి రర్చిభిః ॥ 23 ॥

పదము :

విషేణ । భఙ్గుర ఽ వతః । ప్రతి । స్మ । రక్షసః । దహ ।
అగ్నే । తిగ్మేన । శోచిషా । తపుఃఽఅగ్రాభిః । అర్చిఽభిః ॥23॥

అనువాదం :

ఓ అగ్నీ ! విషంవలె వ్యాపిస్తూ
తీక్ష్ణమైన తేజస్సుతో భంగుర స్వభావులైన

మంత్రము :

యే తే శృఙ్గే అజరే జాతవేద-

స్తిగ్మహేతీ బ్రహ్మసంశితే ।

తాభ్యాం దుర్హార్ద మభిదాసన్తం కిమీదినం

ప్రత్యఞ్చ మర్చిషా జాతవేదో వి నిక్ష్వ ॥ 25 ॥

పదము :

యే ఇతి । తే । శృఙ్గే ఇతి । అజరే ఇతి । జాతఽవేదః ।

తిగ్మహేతీ ఇతి తిగ్మఽహేతీ । బ్రహ్మసంశితే ఇతి బ్రహ్మఽసంశితే ।

తాభ్యామ్ । దుఃఽహార్దమ్ । అభిఽదాసన్తమ్ । కిమీదినమ్ ।

ప్రత్యఞ్చమ్ । అర్చిషా । జాతఽవేదః । వి । నిక్ష్వ ॥ 25 ॥

అనువాదం :

ఓ జాతవేదా! నీ కొమ్ములు ప్రసిద్ధము లైనవి.
వాని కాంతితో నీవు ఎదుటబడిన వారిని వినాశం చేస్తావు.
జరారహితములు, తీక్ష్ణాయుధ భూతములు
మంత్ర ప్రయుక్తములు అయిన విషాణములతో
దుష్టహృదయుని, సర్వత్ర ఉపక్షేపం చేసే
వానిని, కిమీదిని నశింపజెయ్యి. ॥ 25 ॥

మంత్రము :

అగ్నీ రక్షాంసి సేధతి శుక్రశోచి రమర్త్యః ।

శుచిః పావక ఈడ్యః ॥ 26 ॥

ని । అర్పయతమ్ । వృషణా । తమఃఽవృధః ।

పరా । శృణీతమ్ । అచితః । ని । ఓషతమ్ ।

హతమ్ । నుదేథామ్ । ని । శిశీతమ్ । అత్త్రిణః ॥ 1 ॥

అనువాదం :

ఓ ఇంద్ర సోములారా! రాక్షసులను
తపింపజేయండి. హింసించండి.
కామితాలను తీర్చేమీరు రాక్షసులను క్రిందు పరచండి.
అంధకారంలో వృద్ధి చెందే
అజ్ఞానులైన రాక్షసులను పరాఙ్ముఖులను చేసి
మా నుంచి పారద్రోలండి.
ఇలా వారిని శుష్కింప జేయండి. ॥ 1 ॥

మంత్రము :

ఇన్ద్రాసోమా సమఘశంసమభ్యఘం
తపుర్యయస్తు చరురగ్నివాం ఇవ ।
బ్రహ్మద్విషే క్రవ్యాదే ఘోరచక్షసే
ద్వేషో ధత్తమనవాయం కిమీదినే ॥ 2 ॥

పదము :

ఇన్ద్రాసోమా । సమ్ । అఘఽశంసమ్ । అభి । అఘమ్ ।

తపుః । యయస్తు । చరుః । అగ్నివాన్ఽఇవ ।

మం. 8 అ. 2 సూ. 4

**అనువాదం :**

ఇంద్రసోములారా! దుష్టచర్యులైన రాక్షసులను
అలంబన హీనమైన తమస్సులో ముంచి చావగొట్టండి.
ఆ చీకటిలో నుంచి ఈ పతితులలో ఒక్కడు కూడా
బయటకు పోకుండు గాక!
వారిని అభిభవించుటకై మీ బలం క్రోధోద్రిక్త మగు గాక!
॥ 3 ॥

మంత్రము :

ఇన్ద్రాఽఽసోమా వర్తయతం దివో వధం
సం పృథివ్యా అఘశంసాయ తర్హణమ్ ।
ఉత్ తక్షతం స్వర్యం1 పర్వతేభ్యో
యేన రక్షో వావృధానం నిజూర్వథః ॥ 4 ॥

పదము :

ఇన్ద్రాసోమా । వర్తయతమ్ । దివః । వధమ్ ।
సమ్ । పృథివ్యాః । అఘఽశంసాయ । తర్హణమ్ ।
ఉత్ । తక్షతమ్ । స్వర్యఽమ్ । పర్వతేభ్యః ।
యేన । రక్షః । వవృధానమ్ । నిఽజూర్వథః ॥ 4 ॥

అనువాదం :

ఇంద్ర సోములారా! అంతరిక్షం నుంచి
హనన సాధనమైన ఆయుధాన్ని వినియోగించండి.
భూలోకంలో నుంచి కూడా దానిని పరిగ్రహించండి.

అమితంవతుడైన రాక్షసుని వధార్థమై దానిని హింసిందుటకై
ఆ ఆయుధాన్ని తీక్ష్ణీకరించండి.
ఆ ఆయుధాన్ని ఆశ్రమముల నుండి గ్రహించి
వర్ధమానుడైన రాక్షసుని వధించండి. ॥ ౪ ॥

మంత్రము :

ఇన్ద్రాసోమా వర్తయతం దివస్ప-
ర్యగ్నితప్తేభి ర్యువ మశ్మహన్మభిః ।
తపుర్వధేభి రజరేభి రత్త్రిణో ని
పర్శానే విధ్యతం యన్తు నిస్వరమ్ ॥ ౫ ॥

పదము:

ఇన్ద్రాసోమా । వర్తయతమ్ । దివః । పరి ।
అగ్నిఽతప్తేభిః । యువమ్ । అశ్మహన్మఽభిః ।
తపుఃఽవధేభిః । అజరేభిః । అత్త్రిణః । ని ।
పర్శానే । విధ్యతమ్ । యన్తు । నిఽస్వరమ్ ॥ ౫ ॥

అనువాదం:

ఓ ఇంద్రసోములారా! మీ ఆయుధాలను
అంతరిక్షమెల్లా అటునిటు ప్రవర్తిల్ల చేయండి.
అగ్ని సంతప్తములైన పదునైన సంతాపకరములైన
ఆయుధములతో, జరారహితములై, దృఢములైన వాటితో
భక్షకులైన అసురులను పార్శ్వ ప్రదేశంలో కొట్టండి.
నోరు మెదపకుండా చేయండి. ॥ ౫ ॥

కాం. 8 అ. 2 సూ. 4

మంత్రము :

ఇన్ద్రాగ్నిసోమా పరి వాం భూతు విశ్వతి

ఇయం మతిః కక్ష్యాశ్వేవ వాజినా ।

యాం వాం హోత్రాం పరిహినోమి

మేధయేమా బ్రహ్మాణి నృపతీ ఇవ జిన్వతమ్ ॥ 6 ॥

పదము :

ఇన్ద్రాగ్నిసోమా । పరి । వామ్ । భూతు । విశ్వతః ।

ఇయమ్ । మతిః । కక్ష్యాఽ । అశ్వాఽఇవ । వాజినా ।

యామ్ । వామ్ । హోత్రామ్ । పరిఽహినోమి । మేధయా ।

ఇమా । బ్రహ్మాణి । నృపతీ ఇవేతి నృపతీఽఇవ । జిన్వతమ్ ॥6॥

అనువాదం :

ఇంద్రసోములారా ! మీ ఈ స్తుతిని పరిగ్రహించండి.
కక్ష్యములను బంధించే రజ్జువుతో ( పగ్గాలతో )
బలవంతములైన అశ్వములను నిగ్రహించినట్లు నిగ్రహించండి.
ఈ స్తోత్రాన్ని నా బుద్ధితో మీ కొరకై ప్రేరేపిస్తున్నాను.
వందిమాగధ స్తుతులను విన్న రాజుల వలె
ఈ మంత్రములను విని తృప్తి చెందండి. ॥ 6 ॥

మంత్రము :

ప్రతి స్మరేథాం తుజయద్భి రేవై

ర్హతం ద్రుహో రక్షసో భఙ్గురావతః ।

ఇన్ద్రాసోమా దుష్కృతే మా సుగం భూద్

యో మా కదా చిదభిదాసతి ద్రుహః ॥ 7 ॥

పదము :

ప్రతి । స్మరేథామ్ । తుజయత్ఽభిః । ఏవైః ।

హతమ్ । ద్రుహః । రక్షసః । భఙ్గురఽవతః ।

ఇన్ద్రాసోమా । దుఃఽకృతే । మా । సుఽగమ్ । భూత్ ।

యః । మా । కదా । చిత్ । అభిఽదాసతి । ద్రుహః ॥ 7 ॥

అనువాదం :

ఓ ఇంద్రసోములారా! బలవత్తరములైన
అశ్వముల నెక్కి విచ్చేయుండి.
ద్రోహులైన, భంజన శీలురైన రాక్షసులను హింసించండి.
దుష్కార్య కర్త అయిన రాక్షసుడు
బ్రతికి బయట పడకుండుగాక!
ఆ ద్రోహశీలుడు ఏదో ఒక సారి
నన్ను బాధిస్తాడు మరి! ॥ 7 ॥

మంత్రము :

యో మా పాకేన మనసా చరన్త-

మభిచష్టే అనృతేభి ర్వచోభిః ।

అప ఇవ కాశినా సంగృభీతా

అసన్నస్త్వాసత ఇన్ద్ర వక్తా ॥ 8 ॥

పదము:

యః । మా । పాకేన । మనసా । చరన్తమ్ ।

అభిऽచష్టే । అనృతేభిః । వచఃऽభిః ।

అపఃऽఇవ । కాశినా । సమ్ऽగృభీతాః ।

అసన్ । అస్తు । అసతః । ఇన్ద్ర । వక్తా ॥ 8 ॥

అనువాదం:

ఓ ఇంద్రా ! రాక్షసాదులు పరిపక్వ
మనస్సుతో ప్రవర్తిస్తున్న నన్ను
అనృత వాక్కులతో అభిశపిస్తున్నారు.
చేయని దుష్కృత్యాన్ని నాపై ఆరోపించేవారు
దోసిటపట్టుకున్న నీరు
వ్రేళ్ళ సందు నుంచి స్రవించినట్లు
మచ్చుమాసి పోదురు గాక ! ॥ 8 ॥

మంత్రము:

యే పాకశంసం విహరన్త ఏవై

ర్యే వా భద్రం దూషయన్తి స్వధాభిః ।

అహయే వా తాన్ ప్రదదాతు సోమ

ఆ వా దధాతు నిరృతేరుపస్థే ॥ 9 ॥

పదము:

యే । పాకఽశంసమ్ । విఽహరన్తే । ఏవైః ।

యే । వా । భద్రమ్ । దూషయన్తి । స్వధాభిః ।

అహయే । వా । తాన్ । ప్రఽదదాతు । సోమః ।

ఆ । వా । దధాతు । నిఃఽఋతేః । ఉపఽస్థే ॥ 9 ॥

అనువాదం:

ఏ రాక్షసులు సత్యవచనులైన నన్ను
తమ ఇచ్ఛవచ్చినట్లు నిందిస్తున్నారు,
కల్యాణ వర్తనుడనైన నా కర్మను,
అన్నం కోసమై వారిలో కొందరు దూషిస్తున్నారు.
ఈ ఉభయవిధ రాక్షసులను
వృత్రునకు అప్పగించండి.
సోముడు కాని, నిర్ఋతి గాని
వీరిని పాపదేవత ఒడిలో పడవేయుదురు గాక! ॥ 9 ॥

మంత్రము:

యో నో రసం దిప్సతి పిత్వో అగ్నే

అశ్వానాం గవాం యస్తనూనామ్ ।

రిపు స్తేన స్తేయకృద్ దభ్రమేతు

ని ష హీయతాం తన్వా తనా చ ॥ 10 ॥

పదము:

యః । నః । రసమ్ । దిప్సతి । పిత్వః । అగ్నే ।

అశ్వానామ్ । గవామ్ । యః । తనూనామ్ ।

రిపుః । స్తేనః । స్తేయఽకృత్ । దభ్రమ్ । ఏతు ।

ని । సః । హీయతామ్ । తన్వా౩ । తనా । చ ॥ 10 ॥

అనువాదం :

ఓ అగ్నీ! రాక్షసాదులు నా శరీర సారాన్ని
పిండి పిప్పి చేస్తున్నారు.
మా అశ్వముల బలాన్ని గోవుల బలాన్ని పీల్చివేస్తున్నారు.
శత్రువైన తస్కరుడు హింసితుడగుగాక!
వాడు తన శరీరం నుంచి,
తన సంతానం నుంచి వియుక్తుడగుగాక! ॥ 10 ॥

మంత్రము :

పరః సో అస్తు తన్వా౩ తనా చ

తిస్రః పృథివీరధో అస్తు విశ్వాః ।

ప్రతి శుష్యతు యశో అస్య దేవా

యో మా దివా దిప్సతి యశ్చ నక్తమ్ ॥ 11 ॥

పదము :

పరః । సః । అస్తు । తన్వా౩ । తనా । చ ।

తిస్రః । పృథివీః । అధః । అస్తు । విశ్వాః ।

ప్రతి । శుష్యతు । యశః । అస్య । దేవాః ।

యః । మా । దివా । దిప్సతి । యః । చ । నక్తమ్ ॥11॥

అనువాదం:

ఓ దేవతలారా! స్వయం తనతో, స్వయం సంతానంతో
ఆ రాక్షసాదులు వియుక్తు లగుదురు గాక!
అలాగే పృథివీత్రయం కంటె
క్రింద నున్న నరకంలోనికి వారు పడిపోదురు గాక!
ఈ పాపి యశస్సు వినష్ట మగుగాక!
ఈ విరోధి రాత్రింబవళ్ళు నన్ను చంప జూస్తున్నాడు. ॥11॥

మంత్రము:

సువిజ్ఞానం చికితుషే జనాయ
సచ్చాసచ్చ వచసీ పస్పృధాతే ।
తయోర్యత్ సత్యం యతరదృజీయః
తదిత్ సోమోఽవతి హన్త్యాసత్ ॥12॥

పదము:

సుఽవిజ్ఞానమ్ । చికితుషే । జనాయ ।
సత్ । చ । అసత్ । చ । వచసీ ఇతి । పస్పృధాతే ఇతి ।
తయోః । యత్ । సత్యమ్ । యతరత్ । ఋజీయః ।
తత్ । ఇత్ । సోమః । అవతి । హన్తి । అసత్ ॥12॥

అనువాదం:

విద్వాంసులైన వారి కిది తెలుసుకొనుట సులభం.
సత్యాసత్యములు పరస్పరం స్పర్ధ వహిస్తుంటాయి.

ఆ సదసత్తుల మధ్య సత్యమేదో గ్రహించి
ఋజువర్తనుడైన సోముడు రక్షిస్తాడు.
అసత్య వచనాన్ని ఖండిస్తాడు. ॥ 12 ॥

మంత్రము :

న వా ఉ సోమో వృజినం హినోతి
న క్షత్రియం మిథుయా ధారయన్తమ్ ।
హన్తి రక్షో హన్త్యాసద్ వదన్త-
ముభావిన్ద్రస్య ప్రసితౌ శయాతే ॥ 13 ॥

పదము :

న । వై । ఊం ఇతి । సోమః । వృజినమ్ । హినోతి ।
న । క్షత్రియమ్ । మిథుయా । ధారయన్తమ్ ।
హన్తి । రక్షః । హన్తి । అసత్ । వదన్తమ్ ।
ఉభౌ । ఇన్ద్రస్య । ప్రఽసితౌ । శయాతే ఇతి ॥ 13 ॥

అనువాదం :

ఆ సోమదేవుడు పాపి అయిన రాజును
హింసింప కుండా విడిచిపెట్టునా?
మిథ్యాభూతమైన వచనాన్ని ధరించే బలవంతుని
సోముడు వదలి పెట్టడు.
ఆ దురితరూపుడైన రాక్షసుని హింసిస్తాడు.
అనృతభాషి అయిన వానిని వధిస్తాడు.

అథర్వ. iv 6

ఈ రెండు రకాలవారు ఇంద్రుని పాశంతో
బద్ధులై పడి ఉంటారు. ॥ 13 ॥

మంత్రము :

యది వాఽహమనృతదేవ ఆస
మోఘం వా దేవాం అప్యూహే అగ్నే ।
కిమస్మభ్యం జాతవేదో హృణీషే
ద్రోఘవాచస్తే నిరృథం సచన్తామ్ ॥ 14 ॥

పదము :

యది । వా । అహమ్ । అనృతఽదేవః । ఆస ।
మోఘమ్ । వా । దేవాన్ । అపిఽఊహే । అగ్నే ।
కిమ్ । అస్మభ్యమ్ । జాతఽవేదః । హృణీషే ।
ద్రోఘఽవాచః । తే । నిఃఽఋథమ్ । సచన్తామ్ ॥ 14 ॥

అనువాదం :

ఓ అగ్నీ! అనృతదేవుడనో
వ్యర్థంగా స్తోతవ్యులైన దేవతలను వహిస్తున్న వాడనో కాను.
అందువలన ఓ జాతవేదా!
మరి మాపై ఎందుకు కోపిస్తున్నావు?
దేవద్రోహ వచనోపేతులైన ఆ రాక్షసులు
నికృష్టమైన నాశాన్ని పొందుదురు గాక! ॥ 14 ॥

మంత్రము :

అద్యా మురీయ యది యాతుధానో

అస్మి యది వాయు స్తతప పూరుషస్య ।

అధా స వీరై ర్దశభిర్వి యూయా.

యో మా మోఘం యాతుధానేత్యాహ ॥ 15 ॥

పదము :

అద్య । మురీయ । యది । యాతుఽధానః ।

అస్మి । యది । వా । ఆయుః । తతప । పురుషస్య ।

అధ । సః । వీరైః । దశఽభిః । వి । యూయాః ।

యః । మా । మోఘమ్ । యాతుఽధాన । ఇతి । ఆహ ॥ 15 ॥

అనువాదం :

నాపై మిథ్యారోపణలు చేసే ఓరి !
నేను యాతుధానులవలె పీడాకారినైతే,
పురుషుని ఆయున్నును సంతపింపజేసే వాడనైతే,
ఈ రోజే నేను మరణిస్తాను.
నిర్దోషి నయిన నన్ను అనవసరంగా
యాతుధానుడ నని నిందిస్తే నీవు
దశసంఖ్యాక వీరపుత్రులతో వియుక్తుడ వవుతావు. ॥ 15 ॥

మంత్రము :

యో మాయాతుం యాతుధానేత్యాహ

యో మా యాతుం యాతుధానేత్యాహ
యో వా రక్షాః శుచి రస్మీత్యాహ ।
ఇన్ద్రస్తం హన్తు మహతా వధేన
విశ్వస్య జన్తోరధమస్పదీష్ట ॥ 16 ॥

పదము ।

యః । మా । అయాతుమ్ । యాతుఽధాన । ఇతి । ఆహ ।
యః । వా । రక్షాః । శుచిః । అస్మి । ఇతి । ఆహ ।
ఇన్ద్రః । తమ్ । హన్తు । మహతా । వధేన ।
విశ్వస్య । జన్తోః । అధమః । పదీష్ట ॥ 16 ॥

అనువాదం ॥

ఎవడు నన్ను, రాక్షసుడు కాని వానిని
'యాతుధాన' అని పిలుస్తున్నాడో,
ఎవడైతే తాను రాక్షసుడుగా ఉండి
'నేను పరిశుద్ధుడను' అంటున్నాడో,
ఆ ఉభయవిధ అసత్యవాదులను
ఇంద్రుడు మహావజ్రంతో హింసించు గాక !
ఆ రెండు రకాలవారు
సర్వప్రాణులకంటె అధములై నశింతురు గాక ! ॥ 16 ॥

మంత్రము ।

ప్ర యా జిగాతి ఖర్గలేవ నక్త-
మప ద్రుహా తన్వం గూహమానా ।

వ్రవ మనన్త మవ సా పదీష్ట
గ్రావాణో ఘ్నన్తు రక్షస ఉపబ్దైః ॥ 17 ॥

పదము :

ప్ర । యా । జిగాతి । స్వర్గలా ఽ ఇవ । నక్తమ్ ।
అప । ద్రుహుః । తన్వ ఽ మ్ । గూహమానా ।
వ్రవమ్ । అనన్తమ్ । అవ । సా । పదీష్ట ।
గ్రావాణః । ఘ్నన్తు । రక్షసః । ఉపబ్దైః ॥ 17 ॥

అనువాదం :

ఏ రాక్షసి రాత్రిపూట గుడ్లగూబ వలె తిరుగుతుంటుందో
ఏ ద్రోహకారిణి అయిన రాక్షసి
తన శరీరాన్ని కానరాకుండా దాచిపెట్టుకుంటుందో
ఆ దుష్టరాక్షసి అనవధికమైన గుంటలోనికి
అధోముఖంగా పడిపోవుగాక!
పాషాణములు రివ్వున పోయి
రాక్షసులను నశింపజేయుగాక! ॥ 17 ॥

మంత్రము :

వి తిష్ఠధ్వం మరుతో విక్ష్విచ్ఛత
గృభాయత రక్షసః సం పినష్టన ।
వయో యే భూత్వా పతయన్తి నక్తభి-
ర్యే వా రిపో దధిరే దేవే అధ్వరే ॥ 18 ॥

పదము:

వి । తిష్ఠధ్వమ్ । మరుతః । విక్షు । ఇచ్ఛత ।
గృభాయత । రక్షసః । సమ్ । పినష్టన ।
వయః । యే । భూత్వీ । పతయన్తి । నక్తభిః ।
యే । వా । రిపః । దధిరే । దేవే । అధ్వరే ॥ 18 ॥

అనువాదం:

ఓ మరుత్తులారా!
ప్రజామధ్యంలో వ్యాపించండి.
రాక్షసులను చంపుటకై సంకల్పించండి.
వెదకి వారిని పట్టుకోండి.
పట్టుకొని చూర్ణం చేయండి.
ఏ రాక్షసులు పక్షులై రాత్రిపూట తిరుగుతుంటారో,
దైవదీప్తమైన యాగంలో హింసాకృత్యాలను చేస్తుంటారో,
వారిని పిండి పిండి చేయండి. ॥ 18 ॥

మంత్రము:

ప్ర వర్తయ దివో అశ్మాన మిన్ద్ర
సోమశితం మఘవన్త్సం శిశాధి ।
ప్రాక్తా దపాక్తా దధరా దుదక్తా
దభి జహి రక్షసః పర్వతేన ॥ 19 ॥

పదము :

ప్ర । వ॒ర్తయ । దివః । అశ్మానమ్ । ఇన్ద్ర ।

సోమ॑ऽశితమ్ । మఘ॒ऽవన్ । సమ్ । శిశాధి ।

ప్రాక్తాత్ । అపాక్తాత్ । అధరాత్ । ఉదక్తాత్ ।

అభి । జహి । రక్షసః । పర్వతేన ॥ 19 ॥

అనువాదం :

అంతరిక్షం నుంచి ఓ ఇంద్రా!
వజ్రాయుధాన్ని ప్రవర్తింపజేయి.
సోమునితో తీక్ష్ణీకృతమైనట్లు దానిని నిశితం చేయి.
గణుపులు గల వజ్రాయుధం
తూర్పునుంచి, పడమటి నుంచి,
ఉత్తరం నుంచి, దక్షిణం నుంచి
వచ్చే రాక్షసులను పట్టి పల్లార్చుగాక! ॥ 19 ॥

మంత్రము :

ఏత ఉ త్యే పతయన్తి శ్వయాతవ

ఇన్ద్రం దిప్సన్తి దిప్సవోऽదాభ్యమ్ ।

శిశీతే శక్రః పిశునేభ్యో వధం

నూనం సృజ దశనిం యాతుమద్భ్యః ॥ 20 ॥

పదము :

ఏతే । ఉం ఇతి । త్యే । పతయన్తి । శ్వऽయాతవః ।

ఇన్ద్రమ్ । దిప్సన్తి । దిప్సవః । అదాభ్యమ్ ।

శిశీతే । శక్రః । పిశునేభ్యః । వధమ్ ।

నూనమ్ । సృజత్ । అశనిమ్ । యాతుమత్ఽభ్యః ॥ 20 ॥

అనువాదం ॥

ఆ రాక్షసులు శునకరూపం ధరించి తిరుగుతున్నారు.
హింసా కాంక్షతో హింసింప రాని ఇంద్రుని
వధింప వలెనని చూస్తున్నారు.
ఆ ఇంద్రుడు రాక్షసుల కొరకై
వజ్రాయుధాన్ని నిశితం చేస్తున్నాడు.
హింసాపరులైన రాక్షసుల కొరకై
తప్పక వజ్రాయుధాన్ని సృష్టించుగాక! ॥ 20 ॥

మంత్రము ॥

ఇన్ద్రో యాతూనామభవత్ పరాశరో

హవిర్మథీనామభ్యావివాసతామ్ ।

అభీదు శక్రః పరశుర్యథా వనం

పాత్రేవ భిన్దన్త్సత ఏతి రక్షసః ॥ 21 ॥

పదము:

ఇన్ద్రః । యాతూనామ్ । అభవత్ । పరాఽశరః ।

హవిఃఽమథీనామ్ । అభి । ఆఽవివాసతామ్ ।

అభి । ఇత్ । ఊం ఇతి । శక్రః । పరశుః । యథా । వనమ్ ।

పాత్రాఽఇవ । భిన్దన్ । సతః । ఏతు । రక్షసః ॥ 21 ॥

అనువాదం :

ఇంద్రుడు హింసకులైన రాక్షసులపై
శరములు కురిపించు గాక!
హవిస్సును దొంగిలించి వారిపై దాడి చేయుగాక!
ఆ శక్రదేవుడు రాక్షసులను హింసించుటకై వచ్చుగాక!
కుఠారం వృక్షసమూహాన్ని ఛేదించుటకై
వెళ్ళునట్లు వెళ్ళు గాక!
మృణ్మయ పాత్రలను పగులగొట్టుటకై
దుడ్డుకర్ర వెళ్ళునట్లు వెళ్ళుగాక! ॥ 21 ॥

మంత్రము :

ఉలూకయాతుం శుశులూకయాతుం

జహి శ్వయాతు ముత కోకయాతుమ్ ।

సుపర్ణయాతు ముత గృధ్రయాతుం

దృషదేవ ప్ర మృణ రక్ష ఇన్ద్ర ॥ 22 ॥

పదము :

ఉలూకఽయాతుమ్ । శుశులూకఽయాతుమ్ ।

జహి । శ్వఽయాతుమ్ । ఉత । కోకఽయాతుమ్ ।

సుపర్ణఽయాతుమ్ । ఉత । గృధ్రఽయాతుమ్ ।

దృషదాఽఇవ । ప్ర । మృణ । రక్షః । ఇన్ద్ర ॥ 22 ॥

అనువాదం:

ఓ ఇంద్రా! గుడ్లగూబల వంటి రాక్షసులను వినాశం చెయ్యి.
అలాగే గుడ్లగూబల పిల్లల వలె వెడుతున్న
రాక్షసులను వధించు.
అలాగే శునకరూపంలో వెళ్ళు వారిని విధ్వంసం చెయ్యి.
చక్రవాకాలవలె, గరుడ పక్షులవలె,
గ్రద్దల వలె తిరుగుతున్న వారిని సంహరించు.
రాతితో కుండలను ప్రక్కలు చేయునట్లు
నానాకారాలతో నున్న రాక్షసులను మృతి నొందించు. ॥22॥

మంత్రము:

మా నో రక్షో అభి నడ్ యాతుమావ-
దపోచ్ఛన్తు మిథునా యే కిమీదినః।
పృథివీ నః పార్థివాత్ పాత్వంహసో౽-
న్తరిక్షం దివ్యాత్ పాత్వస్మాన్ ॥23॥

పదము:

మా । నః । రక్షః । అభి । నట్ । యాతుఽమావత్ ।
అప । ఉచ్ఛన్తు । మిథునాః । యే । కిమీదినః ।
పృథివీ । నః । పార్థివాత్ । పాతు । అంహసః ।
అన్తరిక్షమ్ । దివ్యాత్ । పాతు । అస్మాన్ ॥23॥

అనువాదం:

మనుష్యులను హింసకమైన రాక్షసజాతి పట్టుకొన కుండుగాక!
కిమీదులైన రాక్షసులు - దంపతుల రూపంలో

ఉండువారు అపగతు లగుదురు గాక!
పృథివీ దేవి మమ్ములను పార్థివ దురితాల నుంచి రక్షించుగాక!
అలాగే అంతరిక్ష దేవత మమ్ము
తనకు చెందిన పాపం నుంచి రక్షించుగాక! ॥ 23 ॥

మంత్రము:

ఇన్ద్ర జహి పుమాంసం యాతుధానముత

స్త్రియం మాయయా శాశదానామ్ ।

విగ్రీవాసో మూరదేవా ఋదన్తు

మా తే దృశన్త్సూర్యముచ్చరన్తమ్ ॥ 24 ॥

పదము:

ఇన్ద్ర । జహి । పుమాంసమ్ । యాతుఽధానమ్ ।

ఉత । స్త్రియమ్ । మాయయా । శాశదానామ్ ।

విఽగ్రీవాసః । మూరఽదేవాః । ఋదన్తు ।

మా । తే । దృశన్ । సూర్యమ్ । ఉత్ఽచరన్తమ్ ॥ 24 ॥

అనువాదం:

ఓ ఇంద్రా! మమ్ములను యాతన పెట్టే
పురుషరూపి అయిన రాక్షసుని చంపు.
మాయతో హింసిస్తున్న
స్త్రీ రూపిణి అయిన రాక్షసిని వధించు.
మారణ క్రీడలతో ఆటలాడే రాక్షసులు

విచ్ఛిన్నకంఠులై నశింతురు గాక!
వారు ఉదయిస్తున్న సూర్యుని చూడకుందురు గాక! ॥ 24 ॥

మంత్రము.

ప్రతి చక్ష్వ వి చక్ష్వేన్ద్రశ్చ సోమ జాగృతమ్ ।
రక్షోభ్యో వధ మస్యత మశనిం యాతుమద్భ్యః ॥ 25 ॥

పదము:

ప్రతి । చక్ష్వ । వి । చక్ష్వ । ఇన్ద్రః । చ । సోమ । జాగృతమ్ ।
రక్షఃఽభ్యః । వధమ్ । అస్యతమ్ । అశనిమ్ । యాతుమత్ఽభ్యః
॥ 25 ॥

అనువాదం:

ఓ సోమదేవా! ఇంద్రదేవునితో కలిసి
హింసాకారులైన రాక్షసులను ప్రతికూలుడవై వీక్షించు.
విపరీత రీతిలో పరికించు.
మీరు మా రక్షణార్థమై జాగరూకులై ఉండండి.
మమ్ములను హింసించే రాక్షసుల పైకి
వజ్రాయుధాన్ని ప్రయోగించండి. ॥ 25 ॥

ఇది నాల్గవ సూక్తం

ఇది రెండవ అనువాకం.

# అనువాకం: 3

## సూక్తం-5

ఋషి: శుక్రుడు ॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు ॥ ఛందస్సు: 1,6 ఉపరిష్టాద్ బృహతీ: 2 త్రిపదా విరాడ్ గాయత్రీ: 3 భురిక్ జగతీ 4,12,13,16,18 అనుష్టుప్; 5 భురిక్ సంస్తార పంక్తి: 7,8 కకుమ్మత్యనుష్టుప్: 9 పురస్కృతిర్జగతీ; 10 త్రిష్టుప్: 11 పథ్యాపంక్తి: 14 షట్పదా జగతీ: 15 పురస్తాద్ బృహతీ: 19 జగతీ గర్భా త్రిష్టుప్: 20 విరాడ్ గర్భాఽఽస్తార పంక్తి: 21 విరాట్ త్రిష్టుప్: 22 సప్తపదా విరాడ్ గర్భా భురిక్ శక్వరీ। మంత్రములు: ॥ 22 ॥

వినియోగం:- ఇది అర్థ సూక్తము. అభిలషితార్థ సిద్ధ్యర్థం దీని వినియోగం. దీనితో పెరుగు, తేనెలో మూడు రాత్రులు నానబెట్టిన తిలకమణిని అభిమంత్రించి కట్టాలి.

ఇంకా కృత్యా ప్రతిహరణ గణంలో దీనిని పఠించుట వలన శాంత్యుదకాభిమంత్రణ హోమాదులలో దీనికి వినియోగం.

ఇంకా రౌద్రాఖ్య మహాశాంతిలో తిలకమణి బంధనంలో దీనికి వినియోగం.

పిష్టరాత్రి విధానంలో ప్రతిసర బంధనంలో కూడా దీనికి వినియోగం.

మంత్రము:

అయం ప్రతిసరో మణిర్వీరో వీరాయ బధ్యతే।

వీర్యఽవాన్త్సపత్నహా శూరవీరః పరిపాణః సుమఙ్గలః ॥ 1 ॥

పదము:

అయమ్। ప్రతిఽసరః। మణిః। వీరః। వీరాయ। బధ్యతే।

వీర్య౽వాన్ । సపత్న౽హా । శూర౽వీరః । పరి౽పానః ।

సు౽మఙ్గలః ॥ 1 ॥

**అనువాదం:**

ఈ *తిలకవృక్ష నిర్మితమైన మణి కంకణ ప్రాయ మైనది.
శత్రు నిబర్హణ క్షమమైనది.
వీర్యలబ్ధి కోసం పురుషుడు దీనిని కట్టుకుంటాడు.
ఇది వీర్యవంత మైనది.
శత్రుఘాతుక మైనది.
వీరమూ శూరమూ అయినది.
పరిరక్షణ సాధన మైనది.
మంగళోపేత మైనది. ॥ 1 ॥

**మంత్రము:**

అయం మణిః సపత్నహా సువీరః

సహస్వాన్ వాజీ సహమాన ఉగ్రః ।

ప్రత్యక్కృత్యా దూషయన్నేతి వీరః ॥ 2 ॥

**పదము:**

అయమ్ । మణిః । సపత్న౽హా । సు౽వీరః ।

సహస్వాన్ । వాజీ । సహమానః । ఉగ్రః ।

ప్రత్యక్ । కృత్యాః । దూషయన్ । ఏతి । వీరః ॥ 2 ॥

---

* తిలక: Clerodendrum phlomoides.
(Symplocos racemosa. L) - Moniar williams Dictionary. లొద్దుగ, I. M. P.
(లోధ్ర, లోధ్రక, లోధ్రవృక్ష, మహాలోధ్ర)

అనువాదం :

ఈ మణి వైరి నిర్మూలన సాధన మైనది.
సువీర్య మైనది. బలవత్తర మైనది.
వేగవంత మైనది. విరోధివర్గ సిబర్హణ మైనది.
ఉగ్ర మైనది.
ఇది శత్రువులు ప్రేరేపించిన కృత్యలను
యజమానికి అభిముఖంలో వినాశం చేయుటకై
బాహుదండాన్ని అధిరోహిస్తున్నది.
వీరుని వంటిదిది. ॥ 2 ॥

మంత్రము :

అనేనేన్ద్రో మణినా వృత్ర మహ-
న్ననేనాసురాన్ పరా భావయ న్మనీషీ ।
అనేనాజయద్ ద్యావాపృథివీ ఉభే
ఇమే అనేనాజయత్ ప్రదిశ శ్చతస్రః ॥ 3 ॥

పదము :

అనేన । ఇన్ద్రః । మణినా । వృత్రమ్ । అహన్ ।
అనేన । అసురాన్ । పరా । అభావయత్ । మనీషీ ।
అనేన । అజయత్ । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి ।
ఇమే ఇతి । అనేన । అజయత్ । ప్రఽదిశః । చతస్రః ॥ 3 ॥

**అనువాదం :**

ఈ మణిని కట్టుకునే
పూర్వం ఇంద్రుడు వృత్రాసురుని వధించినాడు.
దీనితోనే మనీషి అయిన ఇంద్రుడు
ఇతర అసురులను పరాభూతులను చేసినాడు.
అంతేకాక, దీనితో ఈ ద్యావా పృథువులను జయించినాడు.
దీనితోనే దిక్కులను స్వాధీనం చేసుకున్నాడు. ॥ 3 ॥

**మంత్రము :**

అయం స్రాక్త్యో మణిః ప్రతీవర్తః ప్రతిసరః ।
ఓజస్వాన్ విమృధో వశీ సో అస్మాన్ పాతు సర్వతః ॥ 4 ॥

పదము :

అయమ్ । స్రాక్త్యః । మణిః । ప్రతిఽవర్తః । ప్రతిఽసరః ।
ఓజస్వాన్ । విఽమృధః । వశీ । సః । అస్మాన్ । పాతు । సర్వతః
॥ 4 ॥

**అనువాదం :**

ఈ స్రాక్త్య ( తిలకసంబంధి అయిన ) మణి
ప్రతీవర్త మైనది.
రోగాదులను ప్రతిసరింప జేయునది.
ఓజస్స్వంత మైనది.
యుద్ధావసరం లేకనే పగవారిని జయించునది.
సర్వులనూ వశం చేసుకొనునది.
అలాంటి ఈ మణి మమ్ములను
సర్వత్రా అభిభవనం పొందకుండా రక్షించు గాక! ॥ 4 ॥

మంత్రము:

త దగ్నిరాహ తదు సోమ ఆహ

బృహస్పతిః సవితా తదిన్ద్రః ।

తే మే దేవాః పురోహితాః

ప్రతీచీః కృత్యాః ప్రతిసరైరజన్తు ॥ 5 ॥

పదము:

తత్ । అగ్నిః । ఆహ । తత్ । ఓం ఇతి । సోమః । ఆహ ।

బృహస్పతిః । సవితా । తత్ । ఇన్ద్రః ।

తే । మే । దేవాః । పురఃఽహితాః । ప్రతీచీః ।

కృత్యాః । ప్రతిఽసరైః । అజన్తు ॥ 5 ॥

అనువాదం:

ఈ చెప్పనున్న వాటిని అగ్నిదేవుడు నాకు ఉపదేశించి నాడు.
అదే మాటను సోమదేవుడు కూడా అన్నాడు.
బృహస్పతి, సవిత కూడా ఇదే అన్నారు.
ఈ సాధనాన్ని ఇంద్రుడు తెలియ జేసినాడు.
ఇతర ప్రసిద్ధదేవతలు కూడా దీనినే
ప్రతీచీ కృత్యలను విధ్వంసం చేయునదిగా
వక్కాణించినారు. ॥ 5 ॥

మంత్రము:

అ న్తర్దధే ద్యావాపృథివీ ఉతాహరుత సూర్యమ్ ।

అథర్వ. iv 7

తే మే దేవాః పురోహితాః ప్రతీచీః
కృత్యాః ప్రతిసరై రజన్తు ॥ ।

పదము :

అన్తః । దధే । ద్యావాపృథివీ ఇతి । ఉత । అహః । ఉత । సూర్యః

తే । మే । దేవాః । పురఽహితాః । ప్రతీచీః ।
కృత్యాః । ప్రతిఽసరైః । అజన్తు ॥

అనువాదం :

ద్యావా పృథువులను నాకూ, కృత్యకూ
అంతరాళంలో ఉంచుతున్నాను.
అంతేకాక నాలో ఉంచుకుంటున్నాను.
సూర్యుని కూడా ఉంచుకుంటున్నాను.
ఈ ద్యావా పృథువులు మొదలైన దేవతలు
పురోహితులై ప్రతీచీ కృత్యలను
తొలగునట్లు చేయుదురుగాక! ॥

మంత్రము :

యే ప్రాత్త్యం మదిం జనా వర్మాది కృణ్వతే ।
సూర్య ఇవ దివ మారుహ్య వి కృత్యా బాధతే వశీ ॥

పదము :

యే । ప్రాత్త్యమ్ । మదిమ్ । జనాః । వర్మాది । కృణ్వతే ।

సూర్యఃఽఇవ । దివమ్ । ఆఽరుహ్య । వి । కృత్యాః । బాధతే ।
వశీ ॥ 7 ॥

**అనువాదం :**

కృత్యాపరిహారార్థమై జనులు
స్రాక్త్యమణిని కవచంగా ధరిస్తున్నారు.
ఈ మణి సూర్యుని వలె
ద్యులోకాన్ని అధిరోహించినది.
ఇది వశీకరణం చేయునది.
ఇతర కృత్యల నిది నశింపజేయునది. ॥ 7 ॥

మంత్రము :

స్రాక్త్యేన మణినా ఋషిణేవ మనీషిణా ।
అజైషం సర్వాః పృతనా వి మృధో హన్మి రక్షసః ॥ 8 ॥

పదము :

స్రాక్త్యేన । మణినా । ఋషిణాఽఇవ । మనీషిణా ।
అజైషమ్ । సర్వాః । పృతనాః । వి । మృధః । హన్మి । రక్షసః
॥ 8 ॥

**అనువాదం :**

నేను తిలకవృక్ష వికారమైన మణితో
విద్వాంసుడైన అధర్వ మహర్షితో వలె
సర్వరాక్షసులనూ జయిస్తున్నాను.
బాధించే రాక్షసులను ఈ మణితో నశింపజేస్తున్నాను. ॥ 8 ॥

మంత్రము :

యాః కృత్యా ఆఙ్గిరసీ ర్యాః కృత్యా ఆసురీ ర్యాః
కృత్యాః స్వయంకృతా యా ఉ చాన్యేభి రాభృతాః ।
ఉభయీ స్తాః పరా యన్తు పరావతో నవతిం నావ్యా౩ అతి
॥ 9 ॥

పదము :

యాః । కృత్యాః । ఆఙ్గిరసీః । యాః । కృత్యాః । ఆసురీః । యాః
కృత్యాః । స్వయమ్ఽకృతాః । యాః । ఓం ఇతి । చ । అన్యేభిః ।
ఆఽభృతాః ।
ఉభయీః । తాః । పరా । యన్తు । పరాఽవతః । నవతిమ్ ।
నావ్యాః । అతి ॥ 9 ॥

అనువాదం :

అంగిరస – ఋషి ప్రయుక్తమైన కృత్యలు ఏవైతే ఉన్నవో
అసుర నిర్మితాలైన ఏ కృత్యలైతే ఉన్నవో
ఏవైతే స్వయంకృతాలో,
ఇతరములైన కృత్యలేవైతే ఉన్నవో
* ఆ ఉభయ విధ కృత్యలూ దూరం నుంచే
అలాగే వెనుకకు మరలి పోవుగాక!
మహానదులు నవతి సంఖ్యాకాలైనవి –
వానిని కూడా అతిక్రమించి పరావతములు అగుగాక! ॥ 9 ॥

---

* చతుర్విధాలుగా కనబడినా ఇవి ఉభయ విధాలే.
ఆంగిరసములు, అసురములు, అమానుష్యములు అనునవి ఒక విధం.
స్వయంకృతములు, మనుష్యకృతములు మరొక విధం.

కాం. 8 అ. 3 సూ. 5

మంత్రము :

అస్మై మణిం వర్మ బధ్నన్తు దేవా

ఇన్ద్రో విష్ణుః సవితా రుద్రో అగ్నిః ।

ప్రజాపతిః పరమేష్ఠీ విరాడ్

వైశ్వానర ఋషయశ్చ సర్వే ॥ 10 ॥

పదము :

అస్మై । మణిమ్ । వర్మ । బధ్నన్తు । దేవాః ।

ఇన్ద్రః । విష్ణుః । సవితా । రుద్రః । అగ్నిః ।

ప్రజాఽపతిః । పరమేఽస్థీ । విఽరాట్ ।

వైశ్వానరః । ఋషయః । చ । సర్వే ॥ 10 ॥

అనువాదం :

ఈ మణిని ఈ యజమానునకు
ఇతరులు ప్రయోగించిన కృత్యాదుల పరిహారార్థమై
కవచంగా దేవతలు బంధింతురు గాక !
ఇంద్రుడు, విష్ణువు, సవిత, రుద్రుడు, అగ్ని,
ప్రజాపతి, పరాత్పరుడైన విరాట్ పురుషుడు
వైశ్వానరుడు ( జఠరాగ్ని ) సర్వ ఋషులు
ఈ మణిని యజమానునకు కట్టుదురు గాక ! ॥ 10 ॥

మంత్రము :

ఉత్తమో అస్యోషధీనా మనడ్వాన్

జగతామివ వ్యాఘ్రః శ్వపదామివ ।

యమైచ్ఛామావిదామ తం ప్రతిస్పాశనమన్తితమ్ ॥ 11

పదము:

ఉత్‌ఽతమః । అసి । ఓషధీనామ్ । అనడ్వాన్ ।

జగతామ్‌ఽఇవ । వ్యాఘ్రః । శ్వపదామ్‌ఽఇవ ।

యమ్ । ఐచ్ఛామ । అవిదామ । తమ్ । ప్రతిఽస్పాశనమ్ ।

అన్తితమ్ ॥ 11

అనువాదం:

ఓ మణీ! నీవు ఓషధులలో ఉత్తమమైన దానవు.
చతుష్పాత్తులలో వృషభం వంటి దానవు.
అడవి మృగాలలో వ్యాఘ్రం వంటి దానవు.
ఇలాంటి నిన్ను మా కోరికలు తీరుటకై లభింప జేసుకున్నాం
నీవు అభిచరించు వానికి ప్రతిముఖంగా వెళ్ళుదానవు.
నిన్ను అత్యంత సన్నిహితంగా చూస్తున్నాము. ॥ 1.

మంత్రము:

స ఇద్ వ్యాఘ్రో భవత్యథో సింహో అథో వృషా ।

అథో సపత్నకర్శనో యో బిభర్తీమం మణిమ్ ॥ 1

పదము:

సః । ఇత్ । వ్యాఘ్రః । భవతి । అథో ఇతి । సింహః । అథో ఇ

వృ:

అథో ఇతి । సపత్న౨కర్శనః । యః । బిభర్తి । ఇమమ్ । మణిమ్ ॥ 12 ॥

అనువాదం :

వ్యాఘ్రం వలె, సింహం వలె
పరాభిభవన సమర్థమైన దీమణి.
అంతేకాక వృషభం వలె యథేచ్ఛగా సంచరించే శక్తి కలది.
అంతేకాక శత్రు వినాశక మైనది.
ఈ యజమాని ఇలాంటి మణిని ధరించి ఉన్నాడు. ॥ 12 ॥

మంత్రము :

నైనం ఘ్నన్త్యప్సరసో న గన్ధర్వా న మర్త్యాః ।
సర్వా దిశో వి రాజతి యో బిభర్తిమం మణిమ్ ॥ 13 ॥

పదము :

న । ఏనమ్ । ఘ్నన్తి । అప్సరసః । న । గన్ధర్వాః । న । మర్త్యాః
సర్వాః । దిశః । వి । రాజతి । యః । బిభర్తి । ఇమమ్ । మణిమ్ ॥ 13 ॥

అనువాదం :

ఈ మణిని ధరించు వానిని అప్సరసలు ఏమీ చేయలేరు.
గంధర్వు లేమీ చేయలేరు.
మర్త్యు లెవరూ ఏమీ చేయలేరు.
ఈ ధరించిన వాడు సర్వ దిక్కులలోనూ
మేటిగా విరాజిల్లుతాడు. ॥ 13 ॥

మంత్రము:

కశ్యప స్త్వా మసృజత కశ్య పస్త్వా సమైరయత్ ।
అబిభ స్త్వేన్ద్రో మానుషే బిభ్రత్ సంశ్రేషిణేఽజయత్ ।
మణిం సహస్రవీర్యం వర్మ దేవా అకృణ్వత ॥ 14 ॥

పదము :

కశ్యపః । త్వామ్ । అసృజత । కశ్యపః । త్వా । సమ్ । ఐరయత్ ।
అబిభః । త్వా । ఇన్ద్రః । మానుషే । బిభ్రత్ । సమ్ఽశ్రేషిణే ।
అజయత్ ।
మణిమ్ । సహస్రఽవీర్యమ్ । వర్మ । దేవాః । అకృణ్వత ॥ 14 ॥

అనువాదం :

నిన్ను ఓ మణీ! కశ్యప ప్రజాపతి సృష్టించినాడు.
ఆ కశ్యప ప్రజాపతి సర్వోపకారార్థమై
నిన్ను ప్రేరేపించినాడు.
ఓ ప్రశస్తమణీ!
ఇంద్రుడు వృత్రసంహరణార్థమై నిన్ను ధరించినాడు.
మనుష్యులలో, నిన్ను ధరించినవాడు
సంగ్రామాలలో జయం సాధిస్తాడు.
ఈ మణిని దృఢతరమైన కవచంగా దేవతలు చేసినారు. ॥14॥

మంత్రము :

యస్త్వా కృత్యాభి ర్యస్త్వా
దీక్షాభిర్యజ్ఞై ర్యస్త్వా జిఘాంసతి ।

ప్రత్యక్ త్వమిన్ద్ర తం జహి
వజ్రేణ శతపర్వణా ॥ 15 ॥

పదము:

యః । త్వా । కృత్యాభిః । యః । త్వా ।
దీక్షాభిః । యజ్ఞైః । యః । త్వా । జిఘాంసతి ।
ప్రత్యక్ । త్వమ్ । ఇన్ద్ర । తమ్ । జహి ।
వజ్రేణ । శత౽పర్వణా ॥ 15 ॥

అనువాదం:

ఓ శాంతి కాముడా! నిన్ను హింసాక్రియలతో
హననం చేయడానికి ఎవడైతే ఇచ్ఛగిస్తాడో,
ఎవడైతే నిన్ను దీక్షలతో సంహరించునో,
ఎవడైతే నిన్ను యజ్ఞాలతో సంహరించునో,
ఆ ఘాతుకుని ఓ ఇంద్రా!
నూరు కణుపులు గల వజ్రాయుధంతో
ఎదురెక్కి వధించు. ॥ 15 ॥

మంత్రము:

అయమిద్ వై ప్రతీవర్త ఓజస్వాన్ సంజయో మణిః ।
ప్రజాం ధనం చ రక్షతు పరిపాణః సుమఙ్గలః ॥ 16 ॥

పదము:

అయమ్ । ఇత్ । వై । ప్రతి౽వర్తః । ఓజస్వాన్ । సమ్౽జయః
మణిః ।

ప్రఽజామ్ । ధనమ్ । చ । రక్షతు । పరిఽపానః । సుఽమఙ్గలః
॥ 16 ॥

అనువాదం :

కృత్యా ప్రతివర్తన సాధనమైనది ఈ మణి.
ఓజస్స్వంతమైనది. విజయవంతమైనది.
ఈ మణి సంతానాన్ని, ధనాన్ని పరిరక్షించు గాక!
సర్వతః రక్షకమై నాకు
శోభనకారి అయి విలసిల్లుతున్న దిది. ॥ 16 ॥

మంత్రము :

అసపత్నం నో అధరా దసపత్నం న ఉత్తరాత్ ।
ఇన్ద్రాసపత్నం నః పశ్చా జ్జ్యోతిః శూర పురస్కృధి ॥ 17 ॥

పదము :

అసపత్నమ్ । నః । అధరాత్ । అసపత్నమ్ । నః । ఉత్తరాత్ ।
ఇన్ద్ర । అసపత్నమ్ । నః । పశ్చాత్ । జ్యోతిః । శూర । పురః ।
కృధి ॥ 17 ॥

అనువాదం :

ఓ ఇంద్రా! నీవు శూరుడవు.
ఉత్తరం నుంచి, దక్షిణం నుంచి
వస్తున్న శత్రువులను సంహరించే జ్యోతిని మా ముందుంచు.
అలాగే దక్షిణాం నుంచి వచ్చు శత్రువులను
ఉక్కడగించే జ్యోతిని మా ముందుంచు.
అలాగే ఏ దిక్కునుంచి వచ్చే శత్రువులనైనా
మందించి మా ముందు జ్యోతివై వెలుగొందు. ॥ 17

మంత్రము :

వర్మ మే ద్యావాపృథివీ వర్మాఽహర్వర్మ సూర్యః ।

వర్మ మ ఇన్ద్రశ్చాగ్నిశ్చ వర్మ ధాతా దధాతు మే ॥ 18 ॥

పదము :

వర్మ । మే । ద్యావాపృథివీ ఇతి । వర్మ । అహః । వర్మ । సూర్యః

వర్మ । మే । ఇన్ద్రః । చ । అగ్నిః । చ । వర్మ । ధాతా ।

దధాతు । మే ॥ 18 ॥

అనువాదం :

ద్యావా పృథువులు మాకు
కవచమును ప్రసాదింతురు గాక!
అలాగే అహస్సు కవచ మిచ్చును గాక!
సూర్యుడు కవచమును ప్రసాదించు గాక!
ఇంద్రుడు అదే కవచమును ఇచ్చుగాక!
కవచమును అగ్ని కల్పించు గాక!
కవచమును ధాత యోజించు గాక! ॥ 18 ॥

మంత్రము :

ఐన్ద్రాగ్నం వర్మ బహులం యదుగ్రం
విశ్వేదేవా నాతి విధ్యన్తి సర్వే ।
తన్మే తన్వం త్రాయతాం సర్వతో బృహ-
దాయుష్మాం జరదష్టి ర్యథాఽసాని ॥ 19 ॥

పదము :

ఐన్ద్రాగ్నమ్ । వర్మ । బహులమ్ । యత్ । ఉగ్రమ్ ।

విశ్వే । దేవాః । న । అతి౨విధ్యన్తి । సర్వే ।

తత్ । మే । తన్వ౨మ్ । త్రాయతామ్ । సర్వతః । బృహత్ ।

ఆయుష్మాన్ । జరత్౨అష్టిః । యథా । అసాని ॥ 19 ॥

అనువాదం :

ఇంద్రాగ్ని దేవతాకమైన, ప్రపూతమైన,
ఉగ్రమైన కవచమును విశ్వదేవతలు సర్వులూ భేదింపలేరు.
ఈ మణి లక్షణమైన తనుత్రాణం
సర్వత్రా నా శరీరాన్ని రక్షించు గాక!
నేను శతాయుష్కుడనై జరాజీర్ణుడనయ్యే పర్యంతం
ఆహారం కలవాడనై ఉందును గాక! ॥ 19 ॥

మంత్రము:

ఆ మారుక్షద్ దేవమణిర్మహ్యా అరిష్టతాతయే ।
ఇమం మేథి మభిసంవిశధ్వం తనూపానం త్రివరూథ మోజసే ॥ 20 ॥

పదము :

ఆ । మా । అరుక్షత్ । దేవ౨మణిః । మహ్యై । అరిష్ట౨తాతయే ।

ఇమమ్ । మేథిమ్ । అభి౨సంవిశధ్వమ్ । తనూ౨పానమ్ ।

త్రి౨వరూథమ్ । ఓజసే ॥ 20 ॥

**అనువాదం:**

ఈ దేవమణి నా భుజాన్ని ఆరోహించినది.
నా గొప్పకోసమై, నా క్షేమార్థమై ఇది నాకు లభించినది.
మీరు కూడా ఓ నరులారా!
శత్రునిరాసకమైన ఈ మణిని ఆశ్రయింతురు గాక!
ఇది శరీర రక్షక మైనది,
త్రివిధావరణ సముపేతమైనది.
బలాది వర్ధక మైనది. ॥ 20 ॥

**మంత్రము:**

అస్మిన్నిన్ద్రో ని దధాతు నృమ్ణ-
మిమం దేవాసో అభిసంవిశధ్వమ్ ।
దీర్ఘాయుత్వాయ శతశారదాయా-
యుష్మాన్ జరదష్టి ర్యథాఽసత్ ॥ 21 ॥

**పదము:**

అస్మిన్ । ఇన్ద్రః । ని । దధాతు । నృమ్ణమ్ ।
ఇమమ్ । దేవాసః । అభిఽసంవిశధ్వమ్ ।
దీర్ఘాయుఽత్వాయ । శతఽశారదాయ ।
ఆయుష్మాన్ । జరత్ఽఅష్టిః । యథా । అసత్ ॥ 21 ॥

**అనువాదం:**

ఈ మణిలో, ఇంద్రుడు సుఖాన్ని నిక్షేపించు గాక!
ఈ మణిని దేవత లందరూ ఆవేశింతురు గాక!

దీర్ఘాయువు కోసమై ఆయుష్మంతుడనై
జరదష్టినై ( జరాజీర్ణుడనై )
అంతదాకా ఎలా వెలుగొందగలనో
అందుకు అనుకూలంగా
ఇంద్రుడు సుఖాన్ని ఇందులో నిక్షేపించుగాక!
దేవత లందరూ దీనిని అధివసింతురుగాక! ॥ 21 ॥

మంత్రము :

స్వస్తిదా విశాం పతి ర్వృత్రహా విమృధో వశీ ।
ఇన్ద్రో బధ్నాతు తే మణిం జిగివాం
అపరాజితః సోమపా అభయఙ్కరో వృషా ।
స త్వా రక్షతు సర్వతో దివా నక్తం చ విశ్వతః ॥ 22 ॥

పదము :

స్వస్తిఽదాః । విశామ్ । పతిః । వృత్రఽహా । విఽమృధః । వశీ ।
ఇన్ద్రః । బధ్నాతు । తే । మణిమ్ । జిగివాన్ । అపరాఽజితః ।
సోమఽపాః । అభయమ్ఽకరః । వృషా ।
సః । త్వా । రక్షతు । సర్వతః । దివా । నక్తమ్ । చ । విశ్వతః
॥ 22 ॥

అనువాదం:

ఇలాంటి మహిమోపేతమైన మణిని ఇంద్రుడు
నీ చేతికి కట్టుగాక!
ఆయన తన భక్తులకు క్షేమప్రదాత.

దేవ మనుష్యాది లక్షణమైన
ప్రజానీకానికి ఆయన ప్రభువు.
వృత్రాసుర హంత. విగత యుద్ధుడు.
సర్వ వశంకరుడు. సోమపాయి.
అభయంకరుడు ఆయన.
ఇలాంటి ఆ దేవుడు ఈ మణిని
నీ చేతికి కట్టి నిన్ను రాత్రింబవళ్ళూ
సర్వ భయకారణాల నుంచీ రక్షించు గాక! ॥ 22 ॥

ఇది ఐదవ సూక్తం

## సూక్తం - 6

ఋషి: మాతృనామా ॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు, మాతృనామా, 12 బ్రహ్మణస్పతి॥ ఛందస్సు: 1,3-9,13,18-26 అనుష్టుప్; 2 పురస్తాద్ బృహతీ; 10 షట్పదా జగతీ; 11,12,14,16 పథ్యాపంక్తి; 15 సప్త పదా శక్వరీ; 17 సప్తపదా జగతీ॥ మంత్రములు: ॥ 26 ॥

వినియోగం:- ఇది అర్థసూక్తము. దీనిని మాతృ గణములో పఠించుట వలన శాంత్యుదకాది మంత్రణంలో, అద్భుత హోమ, శాంతిహోమాదులలో గణ ప్రయుక్త వినియోగం దీనికి అనుసంధేయము.

సీమంతోన్నయన కర్మలో దీనితో శ్వేత, పీత సర్షపములను (తెల్లని, పసుపు పచ్చని ఆవాలను) అభిమంత్రించి గర్భిణికి కట్టాలి.

మంత్రము:

యౌ తే మాతోన్మమార్జ జాతాయాః పతివేదనౌ ।
దుర్ణామా తత్ర మా గృధదలింశ ఉత వత్సపః ॥ 1 ॥

పదము:

యౌ । తే । మాతా । ఉత్ऽమమార్జ । జాతాయాః । పతిऽవేదనౌ ।

దుఃఽనామా । తత్ర । మా । గృధత్ । అలింశః । ఉత । వత్సఽపః
॥ 1 ॥

**అనువాదం :**

ఓ గర్భిణీ! ప్రసవానంతరమే నీకు జనయిత్రులైన,
నీ పతికి దుఃఖవేదన కల్గించునట్టి,
సునామ, దుర్నామ ధారిణులైన వారిని పరిహరించు.
వా రిద్దరిలో దుర్నామక నిన్ను ఆకాంక్షింపకుండుగాక!
భ్రమరాకారంలో నున్న కొన్ని రోగములకు అధిష్ఠాతయై
వత్సపాలకుడైన దేవుడు నిన్ను కోరకుండు గాక! ॥ 1 ॥

**మంత్రము :**

పలాలానుపలాలౌ శర్కుం కోకం మలిమ్లుచం పలీజకమ్ ।
ఆశ్రేషం వవ్రివాసస మృక్షగ్రీవం ప్రమీలినమ్ ॥ 2 ॥

**పదము :**

పలాలఽఅనుపలాలౌ । శర్కుమ్ । కోకమ్ । మలిమ్లుచమ్ ।
పలీజకమ్ ।
ఆఽశ్రేషమ్ । వవ్రిఽవాససమ్ । ఋక్షఽగ్రీవమ్ । ప్రఽమీలినమ్
॥ 2 ॥

**అనువాదం :**

పలాల, అనుపలాల (అతి తుచ్ఛాంగులు)
అను వారిద్దరినీ నాశం చేస్తున్నాను.
శర్ శర్ అని శబ్దించే వానిని వినాశం చేస్తున్నాను.
చక్రవాకాకారంలో ఉన్న వానిని వినాశం చేస్తున్నాను.

వృద్ధుని వలె కన్పించే వానిని నాశం చేస్తున్నాను.
రూపోపేత వసనవంతుని నాశం చేస్తున్నాను.
కోతిమెడ వంటి మెడ గల వానిని నాశం చేస్తున్నాను.
కనులింత జేసుకుని చూచేవానిని నాశం చేస్తున్నాను.
(వీరందరూ గర్భిణ్యాదులకు పీడకలిగించే వారు.) ॥ 2 ॥

మంత్రము :

మా సం వృతో మోప సృప ఊరూ మావ సృపోఽన్తరా।
కృణోమ్యస్యై భేషజం బజం దుర్ణామచాతనమ్ ॥ 3 ॥

పదము :

మా । సమ్ । వృతః । మా । ఉప । సృపః ।
ఊరూ ఇతి । మా । అవ । సృపః । అన్తరా ।
కృణోమి । అస్యై । భేషజమ్ । బజమ్ । దుర్నామఽచాతనమ్ ॥ 3 ॥

అనువాదం :

ఈమె తొడల నడుమను ఓ దుర్నామా!
ఆచ్ఛాదించ వద్దు.
సంకోచం చెందించ వద్దు.
లోనికి వెళ్ళవద్దు.
మరిన్నీ అవాఙ్ముఖుడవు కావద్దు.
ఈమె కోసం దుర్నామ దోషనాశకమైన
తెల్ల ఆవాల రూపంలో నున్న
ఔషధాన్ని సిద్ధంచేస్తున్నాను. ॥ 3 ॥

అథర్వ iv 8

మంత్రము :

దుర్ణామా చ సునామా చోభా సంవృత మిచ్ఛతః ।
అరాయా నప హన్మః సునామా స్త్రైణ మిచ్ఛతామ్ ॥ 4 ॥

పదము :

దుః౽నామా । చ । సు౽నామా । చ ।
ఉభా । సమ్౽వృతమ్ । ఇచ్ఛతః ।
అరాయాన్ । అప । హన్మః । సు౽నామా ।
స్త్రైణమ్ । ఇచ్ఛతామ్ ॥ 4 ॥

అనువాదం ।

దుర్నామ సునామాఖ్యులైన వారు
(సుభగ; దుర్భగులు)
సంవర్తనం చేయదలచిన వారు.
అమంగళ కరులైన వారిద్దరిని
వినాశం చేస్తున్నాము.
స్త్రీ సంబంధమైన అంగమును
సునాముడు కోరుగాక ! ॥ 4 ॥

మంత్రము :

యః కృష్ణః కేశ్యసుర స్తమ్బజ ఉత తుణ్డికః ।
అరాయా నస్యా ముష్కాభ్యాం భంససోప హన్మసి ॥ 5 ॥

పదము ;

యః । కృష్ణః । కేశీ । అసురః । స్తమ్బ౨జః । ఉత । తుణ్డికః ।

అరాయాన్ । అస్యాః । ముష్కాభ్యామ్ ।

భంససః । అప । హన్మసి ॥ 5 ॥

అనువాదం :

కృష్ణవర్ణుడు, 'కేశి' అను పేరు గల
అసురుడు, స్తంబజుడైన అసురుడు
వికార ముఖం కలవాడు -
- ఈ దుర్భగుల నందరినీ
గర్భిణీ ముష్కముల నుంచి
కటిప్రదేశం నుంచి తొలగిస్తున్నాము. ॥ 5 ॥

మంత్రము :

అనుజిఘ్రం ప్రమృశన్తం క్రవ్యాద ముత రేరిహమ్ ।

అరాయాం ఛ్వకిష్కిణో బజః పిఙ్గో అనీనశత్ ॥ 6 ॥

పదము ;

అను౨జిఘ్రమ్ । ప్ర౨మృశన్తమ్ ।

క్రవ్య౨అదమ్ । ఉత । రేరిహమ్ ।

అరాయాన్ । శ్వ౨కిష్కిణః । బజః । పిఙ్గః । అనీనశత్ ॥ 6 ॥

అనువాదం :

అనుజిఘ్రుని ( వాసన చూడడంతోనే చంపునట్టి వాడు ),
తడివి చంపు వానిని, మాంస భక్షకుని,

మంత్రము :

యః కృణోతి మృతవత్సా మవతోకా మిమాం స్త్రియమ్ ।

తమోషధే త్వం నాశయాస్యాః కమల మఞ్జివమ్ ॥ 9 ॥

పదము :

యః । కృణోతి । మృతఽవత్సామ్ ।

అవఽతోకామ్ । ఇమామ్ । స్త్రియమ్ ।

తమ్ । ఓషధే । త్వమ్ । నాశయ ।

అస్యాః । కమలమ్ । అఞ్జిఽవమ్ ॥ 9 ॥

అనువాదం :

ఏ రాక్షసుడు ఈ గర్భిణీ స్త్రీని
మృత పుత్రను చేస్తాడో
అలాంటి వానినీ ఓ ఓషధీ!
నీవు నశింపజెయ్యి.
ఈమె కమలాన్ని ( గర్భద్వారాన్ని )
అభివ్యక్తం చెయ్యి. ॥ 9 ॥

మంత్రము :

యే శాలాః పరినృత్యన్తి సాయం గర్దభనాదినః ।

కుసూలా యే చ కుక్షిలాః కకుభాః కరుమాః స్రిమాః ।

తానోషధే త్వం గన్ధేన విషూచీనాన్ వి నాశయ ॥ 10 ॥

పదము :

యే । శాలాః । పరిఽనృత్యన్తి । సాయమ్ । గర్దభఽనాదినః ।
కుసూలాః । యే । చ । కుక్షిలాః । కకుభాః । కరుమాః । స్రిమాః ।
తాన్ । ఓషధే । త్వమ్ । గన్ధేన । విషూచీనాన్ । వి । నాశయ ॥10॥

అనువాదం :

ఏ పిశాచులైతే సాయం సమయంలో
గాడిదల వలె ఓండ్ర పెడుతూ
ఇండ్ల వెంబడి నాట్యం చేస్తారో,
ఎవరైతే కుసూలాకృతితో
నాట్యం చేస్తారో,
ఎవరైతే బానకడుపులతో ఉంటారో,
ఎవరైతే మద్ది చెట్టువలె
భయంకరాకారంతో ఉంటారో,
నానాకారాలతో, నానాధ్వనులతో
ఎవరైతే ఇళ్ళచుట్టూ ఆడుతుంటారో
వారందరినీ ఓ ఓషధీ!
నీ వాసనతో పట్టి పల్లార్చు. ॥ 10 ॥

మంత్రము :

యే కుకున్ధాః కుకూరభాః కృత్తీర్దూర్శాని బిభ్రతి ।
క్లీబా ఇవ ప్రనృత్యన్తో వనే యే కుర్వతే
ఘోషం తానితో నాశయామసి ॥ 11 ॥

పదము :

యే । కుకున్ధాః । కుకూరభాః । కృత్తీః । దూర్శాని । బిభ్రతి ।

క్లీబాఃఽఇవ । ప్రఽనృత్యన్తః । వనే । యే । కుర్వతే ।

ఘోషమ్ । తాన్ । ఇతః । నాశయామసి ॥ 11 ॥

అనువాదం :

కృకంధలు అను పేరుగల రాక్షసులు
కోళ్ళవలె కూస్తూ హింసాకర్మలతో
దూషింపదగిన వారౌతారు.
అలాగే ఉన్మత్తుల వలె చేతులు, కాళ్ళూ ఆడిస్తూ
నృత్యం చేస్తూ కొన్ని పిశాచాలు
అరణ్యంలో ఘోషిస్తూ ఉంటాయి.
ఈ ఉభయ విధ పిశాచాలను
గర్భిణీ స్త్రీ సకాశం నుంచి తొలగించి
నాశం చేస్తున్నాము. ॥ 11 ॥

మంత్రము :

యే సూర్యం న తితిక్షన్త ఆతపన్తమముం దివః ।

అరాయాన్ బస్తవాసినో దుర్గన్ధీం-

ల్లోహితాస్యాన్ మకకాన్ నాశయామసి ॥ 12 ॥

పదము :

యే । సూర్యమ్ । న । తితిక్షన్తే । ఆఽతపన్తమ్ । అముమ్ । దివః

అరాయాన్ । బస్తఽవాసినః । దుఃఽగన్ధీన్ ।

లోహితఽఆస్యాన్ । మకకాన్ । నాశయామసి ॥ 12 ॥

అనువాదం:

ద్యులోకం నుంచి తపింప జేస్తున్న
సూర్యుని చూచి సహించలేని పిశాచాలలో
అమంగళకరమైన వానిని నశింపజేస్తున్నాము.
గొర్రెల చర్మాలను ధరించి
దుర్వాసన వేస్తూ ఎర్రని ముఖాలతో
దోమలవలె నడుస్తూ ఉన్న పిశాచాలను
నశింప జేస్తున్నాము. ॥ 12 ॥

మంత్రము:

య ఆత్మాన మతిమాత్ర మంస ఆధాయ బిభ్రతి ।
స్త్రీణాం శ్రోణిప్రతోదిన ఇన్ద్ర రక్షాంసి నాశయ ॥ 13 ॥

పదము:

యే । ఆత్మానమ్ । అతిఽమాత్రమ్ । అంసే । ఆఽధాయ । బిభ్రతి
స్త్రీణామ్ । శ్రోణిఽప్రతోదినః । ఇన్ద్ర । రక్షాంసి । నాశయ ॥ 13 ॥

అనువాదం:

ఏ పిశాచాలైతే శరీరాన్ని అతి స్థూలంగా పెంచుకుని ఉంటారో,
స్త్రీల కటి ప్రదేశాన్ని వ్యథపెట్టే
రాక్షసు లెవరైతే ఉంటారో
వా రందరినీ ఓ ఇంద్రా! నశింపజేయి. ॥ 13 ॥

మంత్రము:

యే పూర్వే వధ్వోఽ యన్తి హస్తే శృఙ్గాణి బిభ్రతః ।
ఆపాకేస్థాః ప్రహాసిన స్తమ్బే యే కుర్వతే
జ్యోతి స్తా నితో నాశయామసి ॥ 14 ॥

పదము :

యే । పూర్వే । వధ్వఽః । యన్తి । హస్తే । శృఙ్గాణి । బిభ్రతః ।
ఆపాకేఽస్థాః । ప్రఽహాసినః । స్తమ్బే । యే । కుర్వతే ।
జ్యోతిః । తాన్ । ఇతః । నాశయామసి ॥ 14 ॥

అనువాదం :

ఏ పిశాచులైతే
స్వస్త్రీల కళ్ళముందు
వెడుతుంటారో,
తమ తమ చేతులలో కొమ్ములను
ధరించి ఉంటారో,
ఏ పిశాచాలైతే పాకశాలలో ఉంటారో,
అట్టహాసం చేస్తూ ఉంటారో,
ఎవరైతే స్తంభములలో జ్యోతిని
వెలిగిస్తారో, వారందరినీ
ఈ గర్భిణీ స్త్రీ నుంచి తొలగించి
నశింపజేస్తున్నాము. ॥ 14 ॥

మంత్రము :

యేషాం పశ్చాత్ ప్రపదాని పురః పార్ష్ణీః పురో ముఖా ।
ఖలజాః శకధూమజా ఉరుణ్డా యే చ
మట్మటాః కుమ్భముష్కా అయాశవః ।
తానస్యా బ్రహ్మణస్పతే ప్రతీబోధేన నాశయ ॥ 15 ॥

పదము:

యేషామ్ । పశ్చాత్ । ప్రఽపదాని ।

పురః । పార్ష్ణిః । పురః । ముఖా ।

ఖలఽజాః । శకధూమఽజాః । ఉరుణ్డాః । యే । చ ।

మట్మటాః । కుమ్భఽముష్కాః । అయాశవః ।

తాన్ । అస్యాః । బ్రహ్మణః । పతే । ప్రతిఽబోధేన । నాశయ ॥ 15 ॥

అనువాదం:

ఏ రాక్షసులకు పాదాగ్రములు వెనుకకు తిరిగి ఉంటాయో,
ఎవరికి ముందు భాగంలో ముఖా లుంటాయో,
అలాంటి వారిని, అలాగే కళ్ళాలలో పుట్టిన వారిని,
పిడకల పొగలో పుట్టిన వారిని,
ఎవరైతే తలలు లేకుండా ఉంటారో,
ఎవరైతే గుటుగుటా శబ్దం చేస్తుంటారో,
ఎవరి ముష్కములు బానల వలె ఉండునో,
ఎవరు వాయువేగంతో వెడుతుంటారో,
అలాంటి సర్వ రాక్షసులను ఓ బ్రాహ్మణస్పతీ!
ఈ ఓషధి సామర్థ్యంతో నశింపజెయ్యి. ॥ 15 ॥

మంత్రము:

పర్యస్తాక్షా అప్రచఙ్కశా అస్త్రైణాః సన్తు పణ్డగాః ।
అవ భేషజ పాదయ య ఇమాం
సంవివృత్స త్యపతిః స్వపతిం స్త్రియమ్ ॥ 16 ॥

పదము :

యే । పూర్వే । వధ్వఽః । యన్తి । హస్తే । శృఙ్గాణి । బిభ్రతః ।
ఆపాకేఽస్థాః । ప్రఽహాసినః । స్తమ్బే । యే । కుర్వతే ।
జ్యోతిః । తాన్ । ఇతః । నాశయామసి ॥ 14 ॥

అనువాదం :

ఏ పిశాచులైతే
స్వస్త్రీల కళ్ళముందు
వెడుతుంటారో,
తమ తమ చేతులలో కొమ్ములను
ధరించి ఉంటారో,
ఏ పిశాచాలైతే పాకశాలలో ఉంటారో,
అట్టహాసం చేస్తూ ఉంటారో,
ఎవరైతే స్తంభములలో జ్యోతిని
వెలిగిస్తారో, వా రందరినీ
ఈ గర్భిణీ స్త్రీ నుంచి తొలగించి
నశింపజేస్తున్నాము. ॥ 14 ॥

మంత్రము ।

యేషాం పశ్చాత్ ప్రపదాని పురః పార్ష్ణీః పురో ముఖా ।
ఖలజాః శకధూమజా ఉరుణ్డా యే చ
మట్మటాః కుమ్భముష్కా అయాశవః ।
తానస్యా బ్రహ్మణస్పతే ప్రతీబోధేన నాశయ ॥ 15 ॥

పదము:

యేషామ్ । పశ్చాత్ । ప్రఽపదాని ।

పురః । పార్ష్ణీః । పురః । ముఖా ।

ఖలఽజాః । శకధూమఽజాః । ఉరుణ్డాః । యే । చ ।

మట్మటాః । కుమ్భఽముష్కాః । అయాశవః ।

తాన్ । అస్యాః । బ్రహ్మణః । పతే । ప్రతిఽబోధేన । నాశయ ॥ 15 ॥

అనువాదం :

ఏ రాక్షసులకు పాదాగ్రములు వెనుకకు తిరిగి ఉంటాయో,
ఎవరికి ముందు భాగంలో ముఖా లుంటాయో,
అలాంటి వారిని, అలాగే కళ్ళాలలో పుట్టిన వారిని,
పిడకల పొగలో పుట్టిన వారిని,
ఎవరైతే తలలు లేకుండా ఉంటారో,
ఎవరైతే గుటుగుటా శబ్దం చేస్తుంటారో,
ఎవరి ముష్కములు బానల వలె ఉండునో,
ఎవరు వాయువేగంతో వెడుతుంటారో,
అలాంటి సర్వ రాక్షసులను ఓ బ్రాహ్మణస్పతీ! ॥ 15 ॥
ఈ ఓషధి సామర్థ్యంతో నశింపజెయ్యి.

మంత్రము:

పర్యస్తాక్షా అప్రచఙ్కశా అస్త్రైణాః సన్తు పణ్డగాః ।

అవ భేషజ పాదయ య ఇమాం

సంవివృత్సత్యపతిః స్వపతిం స్త్రియమ్ ॥ 16 ॥

పదము :

పర్యస్త౽అక్షాః । అప్ర౽చఙ్క్రశాః । అస్త్రైణాః । సన్తు । పణ్డగాః ।
అవ । భేషజ । పాదయ । యః । ఇమామ్ । సమ్౽వివృత్సతి ।
అపతిః । స్వపతిమ్ । స్త్రియమ్ ॥ 16 ॥

అనువాదం

అస్తవ్యస్తంగా నున్న కన్నులు గలవారు,
కృశించిన ఊరుప్రదేశాలు గలవారు,
కాళ్ళతో నడువలేని వారు,
మొదలైన రక్షస్సమూహాలు
స్త్రీరహితు లగుదురు గాక!
కాకుంటే సర్వము లగుదురు గాక!
ఓ సర్షపరూపంలో నున్న ఔషధమా!
నీవు వారిని అవాఙ్ముఖులను చేయి.
ఈ గర్భిణీ స్త్రీని సంవర్తనం చేయవలెనని
వారు చూస్తున్నారు.
అదుపు చేయువారు, లేని వారు
స్వాధీన పతిక అయిన ఈ స్త్రీని సంవర్తనం
చేయ దలుస్తున్నారు.
వారిని నీవు నశింపజెయ్యి. ॥ 16

మంత్రము :

ఉద్ధర్షిణం మునికేశం జమ్భయన్తం మరీమృశమ్ ।
ఉపేషన్త ముదుమ్బలం తుణ్డేల ముత శాలుడమ్ ।
పదా ప్ర విధ్య పార్ష్ణ్యా స్థాలీం గౌరివ స్పన్దనా ॥ 17

పదము :

ఉత్ఽహర్షిణమ్। మునిఽకేశమ్। జమ్భయన్తమ్। మరీమృశమ్।

ఉపఽఏషన్తమ్। ఉదుమ్బలమ్। తుణ్డేలమ్। ఉత। శాలుడమ్।

పదా। ప్ర। విధ్య। పార్ష్ణ్యా। స్థాలీమ్। గౌఃఽఇవ। స్పన్దనా ॥ 17 ॥

అనువాదం :

అతి ఘర్షణోపేతులు, మునివలె జడలు ధరించిన వారు,
హింసకులు, ఎక్కడ నున్న గర్భిణీ స్త్రీలనూ వెతుక్కుంటూ
పట్టుకొన జూస్తున్న వారు
వీరందరినీ నశింప జేస్తున్నాము.
పెద్ద తుండము గల శాలడం అనే పేరు గల అసురుని
సర్షప రూపంలోని ఓషధి
పాదప్రహారంతో తొలగించు గాక!
పాలు పితికే ముంతలను ఆవు తన్ని వేసినట్టుగా
వారిని తన్ని తగులవేయు గాక! ॥ 17 ॥

మంత్రము :

యస్తే గర్భం ప్రతిమృశా జ్జాతం వా మారయాతి తే।

పిఙ్గ స్త ముగ్రధన్వా కృణోతు హృదయావిధమ్ ॥ 18 ॥

పదము ;

యః। తే। గర్భమ్। ప్రతిఽమృశాత్।

జాతమ్। వా। మారయాతి। తే।

పిఙ్గః। తమ్। ఉగ్రఽధన్వా। కృణోతు। హృదయావిధమ్ ॥18॥

**అనువాదం :**

ఏ రాక్షసాదులు ఓ గర్భిణీ!
నీ గర్భాన్ని స్పృశించి పీడిస్తారో,
లేదా బయటికి వచ్చిన పిండాన్ని
నిర్జీవం చేస్తారో
వారిని పాదప్రహారంతో తొలగించు.
ఓ శ్వేత సర్షపమా!
అలాగే గర్భఘాతక మైన రాక్షసిని
ఉద్ఘూర్ణగతివై హృదయ ప్రదేశంలో తాడనం చేయి. ॥ 18 ॥

**మంత్రము :**

**యే అమ్నో జాతాన్ మారయన్తి సూతికా అనుశేరతే।**
**స్త్రీభాగాన్ పిఙ్గో గన్ధర్వాన్ వాతో అభ్రమివాజతు ॥ 19 ॥**

పదము :

**యే। అమ్నః। జాతాన్। మారయన్తి। సూతికాః। అనుఽశేరతే।**
**స్త్రీఽభాగాన్। పిఙ్గః। గన్ధర్వాన్।**
**వాతః। అభ్రమ్ఽఇవ। అజతు ॥ 19 ॥**

**అనువాదం :**

ఏ రాక్షసాదులు పరిపూర్ణంగా ఎదగని
గర్భం లోని పిండములను నశింప జేస్తారో,
ఎవరైతే వారి ప్రక్కనే బాలింతల వలె పడుకుంటారో,
అలాంటి గంధర్వ రక్షః పిశాచాదులను
ఓ గౌర సర్షపమా! వాయువు నీరులేని మబ్బులను
తరిమి వేసినట్లు తరిమి వేయి! ॥ 19 ॥

మంత్రము :

పరిస్పృష్టం ధారయతు యద్ధితం మావ పాది తత్ ।

గర్భం త ఉగ్రౌ రక్షతాం భేషజౌ నీవిభార్యౌ ॥ 20 ॥

పదము :

పరిఽస్పృష్టమ్ । ధారయతు । యత్ ।

హితమ్ । మా । అవ । పాది । తత్ ।

గర్భమ్ । తే । ఉగ్రౌ । రక్షతామ్ । భేషజౌ । నీవిఽభార్యౌ ॥ 20 ॥

అనువాదం :

హోమాదులలో వినియోగించిన తర్వాత
మిగిలిన అవాలను
గర్భిణీ స్త్రీ పారవేయకుండు గాక !
వారికి పుట్టిన పిల్లల హితము చెడకుండు గాక !
ఓ గర్భిణీ! నీ గర్భం ఔషధ రూపమైన
ఆ సర్షపద్వయాన్ని పోకముడిలో కట్టి కాపాడుకో ! ॥ 20 ॥

మంత్రము :

పవీనసాత్ తఙ్గల్వా౩ చ్ఛాయకా దుత నగ్నకాత్ ।

ప్రజాయై పత్యే త్వా పిఙ్గః పరి పాతు కిమీదినః ॥ 21 ॥

పదము :

పవిఽనసాత్ । తఙ్గల్వాఽత్ । ఛాయకాత్ । ఉత । నగ్నకాత్ ।

ప్రఽజాయై । పత్యే । త్వా । పిఙ్గః । పరి । పాతు । కిమీదినః ॥ 21 ॥

అనువాదం :

వజ్రం వంటి నాసిక గలిగిన
అసురాదుల సమ్ముఖం నుంచి,
తంగ నామకుడైన రాక్షసుని
వినాశకారి అయిన సమ్ముఖం నుంచి,
నగ్నులనే పేరుగల రాక్షసుల నుంచి నిన్ను ఓ గర్భిణీ!
పింగవర్ణమైన సర్షపం రక్షించు గాక!
పుత్రలాభార్థమై నీ భర్తకు
అనుకూల్యం కల్పించుటకు కూడా
అది నిన్ను రక్షించు గాక! ॥ 21 ॥

మంత్రము :

**ద్వ్యా౨స్యా చ్చతురక్షాత్ పఞ్చపాదా దనఙ్గురేః ।**
**వృన్తాదభి ప్రసర్పతః పరి పాహి వరీవృతాత్ ॥ 22 ॥**

పదము :

**ద్వి౨ఆస్యాత్ । చతుః౨అక్షాత్ । పఞ్చ౨పాదాత్ । అనఙ్గురేః ।**
**వృన్తాత్ । అభి । ప్ర౨సర్పతః । పరి । పాహి । వరీవృతాత్ ॥22॥**

అనువాదం :

విముఖ రాక్షసి నుంచి,
నాలుగు కళ్ళ రాక్షసి నుంచి,
ఐదు కాళ్ళ రాక్షసి నుంచి,
అంగుళి రహితులై లతాపుంజం వదలి
అభిముఖంగా వస్తున్న రాక్షసి నుంచి,
వెనుకకు నడుస్తున్న రాక్షసి నుంచి,
ఓ ఓషధీ! నీ పిమెను రక్షించు. ॥ 22 ॥

మంత్రము :

య ఆమం మాంస మదన్తి పౌరుషేయం చ యే క్రవిః ।

గర్భాన్ ఖాదన్తి కేశవా స్తా నితో నాశయామసి ॥ 23 ॥

పదము :

యే । ఆమమ్ । మాంసమ్ । అదన్తి ।

పౌరుషేయమ్ । చ । యే । క్రవిః ।

గర్భాన్ । ఖాదన్తి । కేశఽవాః । తాన్ । ఇతః । నాశయామసి

॥ 23 ॥

అనువాదం:

ఏ పిశాచాలు పచ్చిమాంసాన్ని తింటాయో,
ఎవరు మానవ మాంసాన్ని తింటారో,
ఎవరు విపరీత కేశపాశాలు కలవారో,
గర్భంలో మాయారూపంతో ప్రవేశించి,
పిండాన్ని తినివేసే వా రెవరో
- ఇలాంటి వివిధవిధ పిశాచాలను
ఈ గర్భిణీ సకాశం నుంచి తొలగించి
నాశం చేస్తున్నాము. ॥ 23 ॥

మంత్రము :

యే సూర్యాత్ పరిసర్పన్తి స్నుషేవ శ్వశురాదధి ।

బజశ్చ తేషాం పిఙ్గశ్చ హృదయేఽధి ని విధ్యతామ్ ॥ 24 ॥

అథర్వ. iv 9

పదము :

యే। సూర్యాత్। పరి౽సర్పన్తి। స్నుషా౽ఇవ శ్వశురాత్। అధి।

బజః । చ । తేషామ్ । పిఙ్గః । చ ।

హృదయే । అధి । ని । విధ్యతామ్ ॥ 24 ॥

అనువాదం :

సూర్య సకాశం నుంచి అనుజ్ఞాతులై
ఏ పీడకులు భూలోకానికి వస్తుంటారో
తండ్రి అనుమతి పొంది అత్తవారింటికి
వచ్చే కోడళ్ళ వలె
సూర్యుని దగ్గర అనుమతి పొంది వస్తున్న వారిని
ఓ శ్వేత పింగ సర్పములారా!
హృదయప్రదేశంలో కూర్చుండి దెబ్బతీయండి. ॥ 24 ॥

మంత్రము :

పిఙ్గ రక్ష జాయమానం మా పుమాంసం స్త్రియం క్రన్ ।

ఆణ్డాదో గర్భాన్మా దభన్ బాధస్వేతః కిమీదినః ॥ 25 ॥

పదము :

పిఙ్గ । రక్ష । జాయమానమ్ । మా ।

పుమాంసమ్ । స్త్రియమ్ । క్రన్ ।

అణ్డ౽అదః । గర్భాన్ । మా । దభన్ ।

బాధస్వ । ఇతః । కిమీదినః ॥ 25 ॥

**అనువాదం :**

ఓ శ్వేత సర్షపమా!
పుడుతున్న శిశువును రక్షించు!
పుడుతున్న మగపిల్లలను
ఆడపిల్లలుగా మార్చకుండా రక్షించు.
మరి కొందరు అండభక్షకు లుంటారు.
అలాంటి రాక్షసులు
ఈ గర్భాన్ని విచ్ఛిన్నం చేయాలని చూస్తారు.
ఈ ఉభయవిధ రాక్షసులను
ఓ శ్వేత సర్షపమా! ఇక్కడి నుంచి
కొట్టి తరిమివేయి! ॥ 25 ॥

**మంత్రము :**

**అప్రజా స్త్వం మార్తవత్సమాద్ రోద మఘ మావయమ్ ।**
**వృక్షాదివ స్రజం కృత్వాఽప్రియే ప్రతి ముఞ్చ తత్ ॥26॥**

**పదము:**

**అప్రజాఃఽత్వమ్ । మార్తఽవత్సమ్ ।**
**ఆత్ । రోదమ్ । అఘమ్ । ఆఽవయమ్ ।**
**వృక్షాత్ఽఇవ । స్రజమ్ । కృత్వా ।**
**అప్రియే । ప్రతి । ముఞ్చ । తత్** ॥ 26 ॥

**అనువాదం :**

ఓ సర్షపమా! నీవు ఈ గర్భిణీస్త్రీ
సంతాన విధురత్వాన్ని,

మృత వత్సత్వాన్ని దరిచేరకుండా
పాపఫలభూతములైన ఆ దుఃఖాలను
కోసిన పూలతో మాలకట్టినట్లు
వానిని మాలగా కట్టి
ఆ మాలను శత్రువుతో సంయోజనం చెయ్యి. ॥ 26 ॥

ఇది ఆరవ సూక్తం.

ఇది మూడవ అనువాకం

## అనువాకం - 4

### సూక్తం - 7

ఋషి: అథర్వుడు ॥ దేవతలు : భైషజ్యం, ఆయుష్యం, ఓషధులు ॥ ఛందస్సు : 1,7,8,11,13,16-23,27 అనుష్టుప్ : 2 ఉపరిష్టాద్ భురిగ్ బృహతీ : 3 పురఉష్ణిక్ : 4 పఞ్చపదా పరానుష్టు బతిజగతీ : 5,10,25 పథ్యాపంక్తి: 6 విరాడ్ గర్భా భురిక్ పథ్యాపంక్తి : 9 ద్విపదాఽఽర్చీ భురిగనుష్టుప్ : 12 పఞ్చపదా విరా డతిశక్వరీ: 14 ఉపరిష్టాద్ నిచృద్ బృహతీ : 15 త్రిష్టుప్, 24 షట్పదా జగతీ : 26 నిచృదనుష్టుప్ : 28 భురిగనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 28 ॥

వినియోగం :- యక్ష్మాది సర్వవ్యాధి చికిత్సా కర్మలో ఈ అర్థసూక్తంతో దశవృక్షశకలములను లాక్షహిరణ్యయములతో కట్టిన మణిని అభిమంత్రించి మరల సూక్తాన్ని జపించి కట్టవలెను.

పలాశము, ఉదుంబరము, జంబు, కాంపీలము, స్రక్, వఙ్గము, శిరీషము, స్రక్త్యము, వరణము, బిల్వము, జఙ్గిడము, కుటకము, గర్హ్యము, గలావలము, వేతసము, శింబలము, సిపునము, స్యందనము, అరణిక, అశ్మయోక్తము, తున్య, పూతదారు అనేవి శాంత వృక్షములు. వీటిలో ఏదో పదివృక్షముల శకలములతో నిర్మితమైన మణిని 'శాకలమణి' అని అంటారు.

సౌత్రామణీ యాగంలో దీనితో ఓషధులతో సంధీయమానమైన సురను అనుమంత్రించాలి.

మంత్రము :

యా బభ్రవో యాశ్చ శుక్రా రోహిణీ రుత పృశ్నయః ।

అసిక్నీః కృష్ణా ఓషధీః సర్వా అచ్ఛావదామసి ॥ 1 ॥

పదము:

యాః । బభ్రవః । యాః । చ ।

శుక్రాః । రోహిణీః । ఉత । పృశ్నయః ।

అసిక్నీః । కృష్ణాః । ఓషధీః । సర్వాః । అచ్ఛఽఆవదామసి ॥ 1 ॥

అనువాదం :

గోధుమ వర్ణము కలవి, తెల్లనివి, బలవర్ధకమైనవి,
వివిధ వర్ణములైనవి, నల్లనివి, నీలిరంగువి అయిన
ఓషధులను అన్నింటిని ఆహ్వానిస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము :

త్రాయన్తామిమం పురుషం యక్ష్మాద్ దేవేషితా దధి ।

యాసాం ద్యౌష్పితా పృథివీ మాతా

సముద్రో మూలం వీరుధాం బభూవ ॥ 2 ॥

పదము :

త్రాయన్తామ్ । ఇమమ్ । పురుషమ్ । యక్ష్మాత్ ।

దేవఽఇషితాత్ । అధి ।

యాసామ్ । ద్యౌః । పితా । పృథివీ । మాతా ।

సముద్రః । మూలమ్ । వీరుధామ్ । బభూవ ॥ 2 ॥

అనువాదం :

ఈ పురుషుని దేవప్రేరితమైన యక్ష్మ (క్షయ) రోగం నుంచి
ఇవి రక్షించు గాక! ఈ ఓషధులకు ద్యులోకం తండ్రి.
పృథివి తల్లి. సముద్రం మూలము. ॥ 2 ॥

మంత్రము :

ఆపో అగ్రం దివ్యా ఓషధయః ।

తాస్తే యక్ష్మ మేనస్య1 మఙ్గాదఙ్గా దనీనశన్ ॥ 3 ॥

పదము :

ఆపః । అగ్రమ్ । దివ్యాః । ఓషధయః ।

తాః । తే । యక్ష్మమ్ । ఏనస్యఽమ్ ।

అఙ్గాత్ఽఅఙ్గాత్ । అనీనశన్ ॥ 3 ॥

అనువాదం :

జలం ముఖ్యమైనది. ఓషధులు దివ్యమైనవి.
పాప ఫలితంగా నీకు వచ్చిన ఈ రోగాన్ని
ఓ రోగి! నీ ప్రత్యంగముల నుంచి
తొలగించి ఇవి నాశనం చేస్తాయి. ॥ 3 ॥

మంత్రము :

ప్రస్తృణతీ స్తమ్బినీ రేకశుఙ్గాః

ప్రతన్వతీ రోషధీ రా వదామి ।

అంశుమతీః కాణ్డినీర్యా విశాఖా హ్వయామి

తే వీరుధో వైశ్వదేవీ రుగ్రాః పురుషజీవనీః ॥ 4 ॥

పదము :

ప్ర౽స్తృణతీః । స్తమ్బినీః । ఏక౽శుఙ్గాః ।

ప్ర౽తన్వతీః । ఓషధీః । ఆ । వదామి ।

అంశు౽మతీః । కాణ్డినీః । యాః । వి౽శాఖాః । హ్వయామి ।

తే । వీరుధః । వైశ్వ౽దేవీః । ఉగ్రాః । పురుష౽జీవనీః ॥ 4 ॥

అనువాదం :

విశేషంగా విస్తరించునవి,
గుచ్ఛములు కలవి,
ఒక్క కొమ్ముగలవి,
అల్లుకొని ఉన్నవి అయిన
ఈ ఓషధులను నేను ఆహ్వానిస్తున్నాను.
ప్రకాశవంతమైనవి, కాండములు కలవి,
శిఖలు కలవి,
శాఖారహితమైనవి అయిన వీనిని
నీ కొఱకై నేను ఓ రోగీ! ఆహ్వానిస్తున్నాను.
ఇవి వైశ్వదేవములు,
పురుష జీవన దాతులు. ॥ 4 ॥

మంత్రము :

యద్ వః సహః సహమానా వీర్యం౧ యచ్చ వో బలమ్।

తేనేమ మస్మాద్ యక్ష్మాత్ పురుషం

ముఞ్చ తౌషధీ రథో కృణోమి భేషజమ్ ॥ 5 ॥

పదము :

యత్ । వః । సహః । సహమానాః ।

వీర్య౽మ్ । యత్ । చ । వః । బలమ్ ।

తేన । ఇమమ్ । అస్మాత్ । యక్ష్మాత్ । పురుషమ్ ।

ముఞ్చత । ఓషధీః । అథో ఇతి । కృణోమి । భేషజమ్ ॥ 5 ॥

అనువాదం :

ఓ రోగనాశక ఓషధులారా !
మీలో ఉన్న సామర్థ్యం వల్ల, బలం వల్ల,
వీర్యం వల్ల ఈ పురుషుని ఈ రోగం నుంచి
విముక్తిని పొందించండి.
నేను వైద్యం చేస్తున్నాను. ॥ 5 ॥

మంత్రము :

జీవలాం నఘారిషాం జీవన్తీ మోషధీ మహమ్ ।

అరున్ధతీ మున్నయన్తీం పుష్పాం మధుమతీ మిహ

హువేఽస్మా అరిష్టతాతయే ॥ 6 ॥

పదము :

జీవలామ్ । నఘ౽రిషామ్ । జీవన్తీమ్ । ఓషధీమ్ । అహమ్ ।

అరున్ధతీమ్ । ఉత్౽నయన్తీమ్ । పుష్పామ్ । మధు౽మతీమ్ ।

ఇహ । హువే । అస్మై । అరిష్ట౽తాతయే ॥ 6 ॥

**అనువాదం :**

ఆయుష్కారకమైనవి, జీవన దాత్రులైనవి,
హాని చేయనివి, అరుంధతీ రూపమైనవి,
మధుమంతమైనవి, పుష్పసహితమైనవి
అయిన ఓషధులను
ఇతని ఆరోగ్యానికై నేను ఆహ్వానిస్తున్నాను. ॥ 6 ॥

**మంత్రము :**

**ఇహా యన్తు ప్రచేతసో మేదినీ ర్వచసో మమ ।**
**యథేమం పారయామసి పురుషం దురితా దధి ॥ 7 ॥**

**పదము :**

**ఇహ । ఆ । యన్తు । ప్రఽచేతసః । మేదినీః । వచసః । మమ ।**
**యథా । ఇమమ్ । పారయామసి ।**
**పురుషమ్ । దుఃఽఇతాత్ । అధి ॥ 7 ॥**

**అనువాదం :**

నా మాటలతో పుష్టికారకమైన ఓషధులు
ఇక్కడకు వచ్చు గాక!
ఈ పురుషుని పాపరూపమైన రోగం నుంచి
విముక్తి చెందించు గాక! ॥ 7 ॥

**మంత్రము :**

**అగ్నే ర్ఘాసో అపాం గర్భో యా రోహన్తి పునర్నవాః ।**
**ధ్రువాః సహస్రనామ్నీ ర్భేషజీః సన్త్వాభృతాః ॥ 8 ॥**

పదము :

అగ్నేః । ఘాసః । అపామ్ । గర్భః ।

యాః । రోహన్తి । పునః౽నవాః ।

ధ్రువాః । సహస్ర౽నామ్నీః । భేషజీః । సన్తు । ఆ౽భృతాః ॥ 8 ॥

అనువాదం :

ఏ ఓషధులు అగ్నికి సమిధ లైనవో,
జలం యొక్క గర్భరూపము లైనవో,
పునర్నవములై మొలకెత్తునవి అయినవో,
ఆ సహస్ర నామధేయములు గలవి
అమృతములు, ధ్రువములు అగుగాక ! ॥ 8 ॥

మంత్రము :

అవకోల్బా ఉదకాత్మాన ఓషధయః ।

వ్యృషన్తు దురితం తీక్ష్ణశృఙ్గ్యః ॥ 9 ॥

పదము :

అవకా౽ఉల్బాః । ఉదక౽ఆత్మానః । ఓషధయః ।

వి । ఋషన్తు । దుః౽ఇతమ్ । తీక్ష్ణ౽శృఙ్గ్యః ॥ 9 ॥

అనువాదం :

శైవాలంలో పుట్టినవి, ఉదకాత్మకము లైనవి,
తీక్ష్ణశృంగము లైనవి అయిన ఓషధులు
పాపరూపమైన ఈ రోగాన్ని దూరం చేయు గాక ! ॥ 9 ॥

కాం. 8 అ. 4 సూ. 7

మంత్రము :

ఉన్ముఞ్చన్తీ ర్వివరుణా ఉగ్రా యా విషదూషణీః ।
అథో బలాసనాశనీః కృత్యాదూషణీశ్చ
యాస్తా ఇహా యన్త్వోషధీః ॥ 10 ॥

పదము :

ఉత్ఽముఞ్చన్తీః । విఽవరుణాః ।
ఉగ్రాః । యాః । విషఽదూషణీః ।
అథో ఇతి । బలాసఽనాశనీః । కృత్యాఽదూషణీః । చ ।
యాః । తాః । ఇహ । ఆ । యన్తు । ఓషధీః ॥ 10 ॥

అనువాదం :

రోగ విముక్తి కల్గించు నట్టివి,
విశేషవర్ణములు గలిగినట్టివి,
తీక్ష్ణములైనవి, విషనాశకములైనవి,
కఫమును దూరము చేయునవి,
అభిచారిక ప్రయోగములను నాశం చేయునవి
అయిన ఈ ఓషధులు ఇక్కడికి వచ్చు గాక ! ॥ 10 ॥

మంత్రము :

అవక్రీతాః సహీయసీ ర్వీరుధో యా అభిష్టుతాః ।
త్రాయన్తా మస్మిన్ గ్రామే గా మశ్వం పురుషం పశుమ్ ॥11॥

పదము :

అప౽క్రీతాః । సహీయసీః । వీరుధః । యాః । అభి౽స్తుతాః ।

త్రాయన్తామ్ । అస్మిన్ । గ్రామే ।

గామ్ । అశ్వమ్ । పురుషమ్ । పశుమ్ ॥ 11 ॥

అనువాదం :

స్తుతి పాత్రమైనవి, కొన్నవి, బలవత్తరమైనవి
అయిన ఈ ఓషధులు ఈ గ్రామంలో
గోవులను, అశ్వములను, మనుష్యులను
(ఇతర) పశువులను రక్షించు గాక! ॥ 11 ॥

మంత్రము :

మధుమ న్మూలం మధుమ దగ్ర మాసాం

మధుమ న్మధ్యం వీరుధాం బభూవ ।

మధుమత్ పర్ణం మధుమత్ పుష్పమాసాం

మధోః సంభక్తా అమృతస్య భక్షో

ఘృత మన్నం దుహ్రతాం గోపురోగవమ్ ॥ 12 ॥

పదము :

మధు౽మత్ । మూలమ్ । మధు౽మత్ । అగ్రమ్ । ఆసామ్ ।

మధు౽మత్ । మధ్యమ్ । వీరుధామ్ । బభూవ ।

మధు౽మత్ । పర్ణమ్ । మధు౽మత్ । పుష్పమ్ । ఆసామ్ ।

మధోః । సమ్ఽభక్తాః । అమృతస్య । భక్షః ।

ఘృతమ్ । అన్నమ్ । దుహ్రతామ్ । గోఽపురోగవమ్ ॥ 12 ॥

అనువాదం :

ఈ ఓషధుల మూలం మధురమైనది.
అగ్రభాగం మధురమైనది.
మధ్యభాగం కూడా మధురమైనది.
వీని ఆకులు మధురమైనవి.
వీని పుష్పములు మధురమైనవి.
ఇవి మధురములై, అమృతమునకు
అన్నరూపములైనవి. ఇవి గోపురోగవములు,
ఘృతమును, అన్నమును దోహనం చేయు గాక! ॥ 12 ॥

మంత్రము :

యావతీః కియతీశ్చేమాః పృథివ్యా మధ్యోషధీః ।

తా మా సహస్రపర్ణ్యో మృత్యోర్ముఞ్చన్త్వంహసః ॥ 13 ॥

పదము :

యావతీః । కియతీః । చ । ఇమాః । పృథివ్యామ్ । అధి । ఓషధీః

తాః । మా । సహస్రఽపర్ణ్యః ।

మృత్యోః । ముఞ్చన్తు । అంహసః ॥ 13 ॥

అనువాదం :

భూలోకం నుంచి ఈ ఓషధులు ఎన్ని ఉన్నవో,
అవి సహస్ర వర్ణములు కలవి.
అవి పాపరూపమైన మృత్యువు నుంచి
నన్ను రక్షించుగాక! ॥ 13 ॥

మంత్రము :

వైయాఘ్రో మణి ర్వీరుధాం త్రాయమాణో౽భిశస్తిపాః ।
అమీవాః సర్వా రక్షాంస్యప హన్త్వధి దూరమస్మత్ ॥ 14 ॥

పదము :

వైయాఘ్రః । మణిః । వీరుధామ్ ।
త్రాయమాణః । అభిశస్తి౽పాః ।
అమీవాః । సర్వా । రక్షాంసి । అప ।
హన్తు । అధి । దూరమ్ । అస్మత్ ॥ 14 ॥

**అనువాదం :**

ఓషధులలో వ్యాఘ్రప్రాయమైన మణి
వినాశం నుంచి రక్షించు గాక!
ఇవి సర్వ రోగముల నుంచి
సర్వరోగముల బీజముల నుంచి
మమ్ములను దూరం చేయుగాక! ॥ 14 ॥

మంత్రము :

సింహస్యేవ స్తనథోః సం విజన్తే౽
గ్నేరివ విజన్త ఆభృతాభ్యః ।
గవాం యక్ష్మః పురుషాణాం వీరుద్భి-
రతినుత్తో నావ్యా౽ ఏతు స్రోత్యాః ॥ 15 ॥

పదము:

సింహస్య౽ఇవ । స్తనథోః । సమ్ । విజన్తే ।

అగ్నేః౽ఇవ । విజన్తే । ఆ౽భృతాభ్యః ।

గవామ్ । యక్ష్మః । పురుషాణామ్ । వీరుత్౽భిః ।

అతి౽నుత్తః । నావ్యా౽ః । ఏతు । స్రోత్యాః ॥ 15 ॥

అనువాదం:

ఇక్కడికి తెచ్చిన ఓషధుల వల్ల
రోగములు భయభ్రాంతము లవుతున్నవి.
సింహగర్జనంతో వలె, వైశ్వానరాగ్ని విజృంభణంతో వలె
ఓషధులతో మనుష్యాదుల
యక్ష్మరోగం పలాయనం చిత్తగిస్తున్నది. ॥ 15 ॥

మంత్రము:

ముముచానా ఓషధయో౽గ్నే ర్వైశ్వానరాదధి ।

భూమిం సంతన్వతీరిత యాసాం రాజా వనస్పతిః ॥ 16 ॥

పదము:

ముముచానాః । ఓషధయః । అగ్నేః । వైశ్వానరాత్ । అధి ।

భూమిమ్ । సమ్౽తన్వతీః । ఇత ।

యాసామ్ । రాజా । వనస్పతిః ॥ 16 ॥

అనువాదం:

ఈ ఓషధులకు రాజు వనస్పతి. వైశ్వానరాగ్ని పైన
ఓషధులున్నవి. భూమిపై ప్రవహించునవి. ॥ 16 ॥

మంత్రము :

యా రోహన్త్యాఙ్గిరసీః పర్వతేషు సమేషు చ ।

తా నః పయస్వతీః శివా ఓషధీః సన్తు శం హృదే ॥ 17 ॥

పదము :

యాః । రోహన్తి । ఆఙ్గిరసీః । పర్వతేషు । సమేషు । చ ।

తాః । నః । పయస్వతీః । శివాః । ఓషధీః । సన్తు । శమ్ । హృదే ॥ 17 ॥

**అనువాదం :**

అంగిరసమహర్షి సముద్భూతములైన ఓషధులు
పర్వతాలలో, సమస్థలులలో అంకురిస్తున్నవి.
అవి రసవంతమైనవి. శివంకరములైనవి.
ఇవి మా హృదయాలకు శాంతి నిచ్చుగాక! ॥ 17 ॥

మంత్రము :

యశ్చాహం వేద వీరుధో యాశ్చ పశ్యామి చక్షుషా ।

అజ్ఞాతా జానీమశ్చ యా యాసు విద్మ చ సంభృతమ్ ॥ 18 ॥

పదము :

యాః । చ । అహమ్ । వేద । వీరుధః ।

యాః । చ । పశ్యామి । చక్షుషా ।

అజ్ఞాతాః । జానీమః । చ । యాః ।

యాసు । విద్మ । చ । సమ్ఽభృతమ్ ॥ 18 ॥

అనువాదం :

నా కే ఓషధులు తెలుసునో,
వేనిని నేను సరిగా పర్యాలోచిస్తున్నానో,
ఏవి అజ్ఞాతములుగా ఉన్నవో,
వేనిలో వీర్య మహత్త్వం ఇమిడి ఉన్నదో - ॥ 18 ॥

మంత్రము :

సర్వాః సమగ్రా ఓషధీ ర్బోధన్తు వచసో మమ ।
యథేమం పారయామసి పురుషం దురితా దధి ॥ 19 ॥

పదము :

సర్వాః । సమ్ఽఅగ్రాః । ఓషధీః । బోధన్తు । వచసః । మమ ।
యథా । ఇమమ్ । పారయామసి ।
పురుషమ్ । దుఃఽఇతాత్ । అధి ॥ 19 ॥

అనువాదం :

ఈ సర్వ సమగ్ర ఓషధులు
నా మాటతో జాగృతము లగుగాక !
దురిత రూపమైన రుగ్మత నుంచి
నే నీ పురుషుని విముక్తుని చేస్తున్నాను. ॥ 19 ॥

మంత్రము :

అశ్వత్థో దర్భో వీరుధాం సోమో రాజాఽమృతం హవిః ।
వ్రీహిర్యవశ్చ భేషజౌ దివస్పుత్రా వమర్త్యౌ ॥ 20 ॥

అథర్వ iv 10

పదము :

అశ్వత్థః । దర్భః । వీరుధామ్ । సోమః ।

రాజా । అమృతమ్ । హవిః ।

వ్రీహిః । యవః । చ । భేషజౌ । దివః । పుత్రౌ । అమర్త్యౌ ॥20॥

అనువాదం :

అశ్వత్థము (రావిచెట్టు), దర్భ,
ఓషధులకు రాజైన సోముడు,
అమృతమును తమలో దాచుకున్న
జలము, వరి, యవలు -
ఇవి అమరములైన ఓషధులుగా ఉన్నవి.
ఇవి ద్యులోకమునకు పుత్రులుగా నున్నవి. ॥ 20 ॥

మంత్రము :

ఉజ్జిహీధ్వే స్తనయత్యభిక్రన్దత్యోషధీః ।

యదా వః పృశ్నిమాతరః పర్జన్యో రేతసాఽవతి ॥ 21 ॥

పదము :

ఉత్ । జిహీధ్వే । స్తనయతి । అభిఽక్రన్దతి । ఓషధీః ।

యదా । వః । పృశ్నిఽమాతరః । పర్జన్యః । రేతసా । అవతి ॥21॥

అనువాదం :

ఎప్పుడు పర్జన్యుడు గర్జిస్తాడో,
పృథ్వీ సముద్భూతములైన ఓషధులు
ఎప్పుడు పైకి వస్తున్నవో,

అప్పుడు పర్జన్యుడు విడిచిన జలంతో
అవి రక్షితము లవుతున్నవి. ॥ 21 ॥

మంత్రము :

తస్యామృతస్యేమం బలం పురుషం పాయయామసి ।
అథో కృణోమి భేషజం యథాఽసచ్ఛతహాయనః ॥ 22 ॥

పదము :

తస్య । అమృతస్య । ఇమమ్ । బలమ్ ।
పురుషమ్ । పాయయామసి ।
అథో ఇతి । కృణోమి । భేషజమ్ ।
యథా । అసత్ । శతఽహాయనః ॥ 22 ॥

అనువాదం :

ఆ అమృతమునకు చెందిన బలం
ఈ పురుషుడు త్రాగునట్లు చేస్తున్నాము.
ఔషధాన్ని మేము సిద్ధం చేస్తున్నాము.
ఇత నిందుతో నూరేళ్ళు బ్రతుకు గాక!
శతాయుష్కుడై జీవించుగాక! ॥ 22 ॥

మంత్రము :

వరాహో వేద వీరుధం నకులో వేద భేషజీమ్ ।
సర్పా గన్ధర్వా యా విదుస్తా అస్మా అవసే హువే ॥ 23 ॥

పదము :

వరాహః । వేద । వీరుధమ్ । నకులః । వేద । భేషజీమ్ ।

సర్పాః । గన్ధర్వాః । యాః । విదుః ।

తాః । అస్మై । అవసే । హువే ॥ 23 ॥

అనువాదం :

వరాహం ఈ ఓషధిని ఎరుగును.
ముంగిస ఈ ఓషధిని ఎరుగును.
సర్వగంధర్వులు దీని నెరుగుదురు.
ఇతని రక్షణార్థమై దానిని నేను ఆహ్వానిస్తున్నాను. ॥ 23 ॥

మంత్రము :

యాః సుపర్ణా ఆఙ్గిరసీర్దివ్యా యా రఘటో విదుః ।
వయాంసి హంసా యా విదుర్యాశ్చ సర్వే పతత్రిణః ।
మృగా యా విదు రోషధీస్తా అస్మా అవసే హువే ॥ 24 ॥

పదము :

యాః । సుఽపర్ణాః । ఆఙ్గిరసీః । దివ్యాః ।

యాః । రఘటః । విదుః ।

వయాంసి । హంసాః । యాః । విదుః ।

యాః । చ । సర్వే । పతత్రిణః ।

మృగాః । యాః । విదుః । ఓషధీః ।

తాః । అస్మై । అవసే । హువే ‖ 24 ‖

**అనువాదం :**

అంగిరో సముద్భూతములైన ఈ ఓషధులను
గరుడ పక్షులు డేగలు ఎరుగును.
పక్షులకు, హంసలకు వీనిని గురించి తెలియును.
పక్షిజాతి కంతటికి ఇవి పరిచితములు.
అలాగే మృగములు వీని నెరుగును.
వీనిని ఈ రోగి రక్షణార్థమై
ఆహ్వానిస్తున్నాను. ‖ 24 ‖

**మంత్రము :**

యావతీనా మోషధీనాం గావః

ప్రాశ్నన్త్యఘ్న్యా యావతీనా మజావయః ।

తావతీ స్తుభ్య మోషధీః శర్మ యచ్ఛన్త్వాభృతాః ‖ 25 ‖

**పదము :**

యావతీనామ్ । ఓషధీనామ్ । గావః ।

ప్రఽఅశ్నన్తి । అఘ్న్యాః । యావతీనామ్ । అజఽఅవయః ।

తావతీః । తుభ్యమ్ । ఓషధీః । శర్మ । యచ్ఛన్తు । ఆఽభృతాః ‖ 25 ‖

**అనువాదం :**

అవధ్యములైన గోవులను ఏ ఓషధులు అలరిస్తున్నవో,
వేనిని గొఱ్ఱెలు, మేకలు తింటున్నవో,
అలాంటి ఓషధులన్నీ నీకు సుఖం కల్గించుగాక! ॥ 25 ॥

**మంత్రము :**

యావతీషు మనుష్యా౨ భేషజం భిషజో విదుః ।
తావతీర్విశ్వభేషజీరా భరామి త్వామభి ॥ 26 ॥

**పదము :**

యావతీషు । మనుష్యా౨ః । భేషజమ్ । భిషజః । విదుః ।
తావతీః । విశ్వ౨భేషజీః । ఆ । భరామి । త్వామ్ । అభి ॥ 26 ॥

**అనువాదం :**

వైద్యలోకం ఈ ఓషధులలో వేనిని
ప్రయోగించ వలెనో ఎరుగును.
విశ్వజీవనౌషధం గల ఈ ఓషధులను
నీ సమీపమునకు రావలసినదిగా ఆహ్వానిస్తున్నాను. ॥ 26 ॥

**మంత్రము :**

పుష్పవతీః ప్రసూమతీః ఫలినీ రఫలా ఉత ।
సంమాతర ఇవ దుహ్రా మస్మా అరిష్టతాతయే ॥ 27 ॥

**పదము :**

పుష్ప౨వతీః । ప్రసూ౨మతీః । ఫలినీః । అఫలాః । ఉత ।
సంమాతరః౨ఇవ । దుహ్రామ్ । అస్మై । అరిష్ట౨తాతయే ॥ 27 ॥

**అనువాదం :**

కుసుమములు గలవి, చివుళ్ళతో అలరారునవి,
ఫలవంతము లైనవి, ఫలహీనము లైనవి
అయిన ఓషధులు
ఇతని సుఖశాంతి కోసమై
ఉత్తమ మాతల వలె ఇతనికై
రసప్రదానం చేయును గాక! ॥ 27 ॥

**మంత్రము :**

**ఉత్ త్వాహార్షం పఞ్చశలాదథో దశశలాదుత ।**
**అథో యమస్య పడ్వీశాద్ విశ్వస్మాద్ దేవకిల్బిషాత్ ॥ 28 ॥**

పదము :

**ఉత్ । త్వా । అహార్షమ్ । పఞ్చఽశలాత్ ।**
**అథో ఇతి । దశఽశలాత్ । ఉత ।**
**అథో ఇతి । యమస్య పడ్వీశాత్ ।**
**విశ్వస్మాత్ । దేవఽకిల్బిషాత్ ॥ 28 ॥**

**అనువాదం :**

ఐదు నిలువులు, పదినిలువులు లోతు ఉన్న
అధఃప్రాంతం నుంచి వలె
దుఃఖముల నుంచి, యముని దూతల నుంచి
చేదుకొనవలసిందిగా వానిని ప్రార్థిస్తున్నాను.
దేవకిల్బిషం నుంచి నిన్ను పైకి లేవనెత్తుతున్నాను. ॥ 28 ॥

ఇది ఏడవ సూక్తం.

## సూక్తం – 8

ఋషులు : భృగ్వంగిరసులు॥ దేవతలు॥ ఇంద్రుడు, వనస్పతి, మఱియు పర సేనాహననము ॥ ఛందస్సు : 1,5,13-18 అనుష్టుప్ : 2,8-10,23 ఉపరిష్టాద్ బృహతీ; 3 విరాట్ బృహతీ; 4 బృహతీ పురస్తాత్ ప్రస్తార పంక్తి : 6 ఆస్తార పంక్తి : 7 విపరీతపాదలక్ష్మా చతుష్పదాఽతి జగతీ: 11 పథ్యాబృహతీ; 12 భురిగనుష్టుప్ : 19 పురస్తాద్ విరాడ్ బృహతీ : 20 పురస్తాన్నిచృద్ బృహతీ : 21 త్రిష్టుప్ : 22 చతుష్పదా శక్వరీ: 24 త్రిష్టుబుష్ణిగ్గర్భా పరాశక్వరీ చతుష్పదా జగతీ మంత్రములు : ॥ 24 ॥

వినియోగం :- ఈ అర్థసూక్తానికి శత్రుక్షయ, శత్రుభయనాశన, శత్రుజయ, స్వకీయబలవర్ధన కర్మలలో వినియోగం. ఈ కర్మలను 'సేనా కర్మలు' అంటారు.

దీనిలోని ప్రతి ఋక్కుతో అశ్వత్థసమిధను ఆదానం చెయ్యాలి. అట్లు చేయుటవలన శత్రుక్షయ మౌతుంది.

అట్లే ప్రతి ఋక్కుతో కరిమాలక సమిధను ఆదానం చెయ్యాలి.

అట్లే ప్రతిఋక్కుతో ఏరణ్డ (ఆముదపు చెట్టు) సమిధను ఆదానం చెయ్యాలి.

అట్లే ప్రతిఋక్కుతో పలాశ సమిధను ఆదానం చెయ్యాలి. 'తీర్ణ సమిధ' అని కేశవుడు.

అట్లే ప్రతిఋక్కుతో ఖదిర సమిధను ఆదానం చెయ్యాలి.

అట్లే ప్రతిఋక్కుతో శరసమిధను ఆదానం చేయాలి. అటు చేయుటవలన శత్రు భయ ముండదు.

అట్లే అభ్యాతానాంతం చేసి దీనితో భాంగపాశములను అభిమంత్రించి సేనాక్రమములపై వపనం చేయాలి. సర్వత్ర కోపంతో పాశాదులలో అభిమంత్రణం చెయ్యాలి.

అట్లే దీనితో మౌంజపాశములను అభిమంత్రించి సేనాక్రమములలో వపనం చేయాలి.

అట్లే దీనితో బాధకదండములను, అశ్వత్థకూటములను అభి మంత్రించి సేనాక్రమములలో వపనం చేయాలి.

అట్లే దీనితో బాధకదండములను, భాంగములను, జాలములను అభి మంత్రించి సేనాక్రమములలో వపనం చేయాలి. ఇవి జయకర్మలు.

పైన చెప్పిన అన్ని కర్మలలో అంగభూతములైనవి చెప్ప బోయే మూడు కర్మలే,

బాధకకాష్ఠములతో ప్రజ్వలితమైన అగ్నిలో "స్వాహైభ్యః" (24 వ మంత్రంలో) అనే పదద్వయంతో స్వమిత్రబల వృద్ధ్యర్థం దక్షిణహస్తంతో ఆజ్యాన్ని హోమం చేయాలి.

అదే అగ్నిలో పరబల వినాశార్థం సవ్యహస్తంతో "దురాహా మీభ్యః" (24 వ మంత్రంలో)అనే పదద్వయంతో ఇఙ్గిడాన్ని హోమంచేయాలి.

కర్మాగ్నికి ఉత్తరం ప్రక్క ఎర్ర షిప్పల (అశ్వత్థ) శాఖను భూమిపై నిలబెట్టి, నీల, లోహిత, (నలుపు, ఎరుపు) వర్ణములు గల సూత్రములతో పూర్తిగా చుట్టి "నీలలోహితేనామూనభ్య వతనోమి" (24 వ మంత్రంలో) అని అంటూ దక్షిణను దూరంగా విసిరివేయాలి.

సేనా కర్మలను అరణ్యంలో చేయాలి. కానీ గ్రామంలో చేయ రాదు. లేదా సందర్భాన్నిబట్టి యుద్ధప్రదేశంలో చేయవచ్చును.

మంత్రము :

ఇన్ద్రో మన్థతు మన్థితా శక్రః శూరః పురందరః ।
యథా హనామ సేనా అమిత్రాణాం సహస్రశః ॥ 1 ॥

పదము :

ఇన్ద్రః । మన్థతు । మన్థితా । శక్రః । శూరః । పురమ్ఽదరః ।
యథా । హనామ । సేనాః । అమిత్రాణామ్ । సహస్రశః ॥ 1 ॥

అనువాదం:

పురభంజకుడు, శక్రుడు, వీరుడు, శూరుడు,
విరోధి మంథన కారకుడు అయిన ఇంద్రుడు
విరోధి సేనలను మథించు గాక!
మేము ఆయన శక్తితో అమిత్రసేనావారాన్ని
వేయివ్రక్కలు చేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము:

పూతిరజ్జు రుపధ్మానీ పూతిం సేనాం కృణోత్వమూమ్ ।
ధూమమగ్నిం పరాదృశ్యాఽమిత్రా
హృత్స్వా దధతాం భయమ్ ॥ 2 ॥

పదము:

పూతిఽరజ్జుః । ఉపఽధ్మానీ । పూతిమ్ ।
సేనామ్ । కృణోతు । అమూమ్ ।
ధూమమ్ । అగ్నిమ్ । పరాఽదృశ్య ।
అమిత్రాః । హృత్ఽసు । ఆ । దధతామ్ । భయమ్ ॥ 2 ॥

అనువాదం:

శిథిలమై పోయిన దుర్గంధపూరిత రజ్జువు
ఈ సేనను దుర్గంధ కూపంగా చేయుగాక!
ధూమమును, అగ్నిని దూరంనుంచే చూచి
శత్రు హృదయాలలో భయభ్రాంతి
ఉత్పన్న మగు గాక! ॥ 2

మంత్రము :

అమూ నశ్వత్థ నిః శృణీహి ఖాదామూన్ ఖదిరాజిరమ్ ।

తాజద్భఙ్గ ఇవ భజ్యన్తాం హన్త్వేనాన్ వధకో వధైః ॥ 3 ॥

పదము.

అమూన్ । అశ్వత్థ । నిః । శృణీహి । ఖాద ।

అమూన్ । ఖదిర । అజిరమ్ ।

తాజద్భఙ్గః౽ఇవ । భజ్యన్తామ్ । హన్తు ।

ఏనాన్ । వధకః । వధైః ॥ 3 ॥

అనువాదం :

ఓ అశ్వత్థమా ! వీరిని ఖండించు.
ఓ *ఖదిరవృక్షమా !
ఈ పరసేనలను శీఘ్రంగా భక్షించు.
శీఘ్రభంజకుని వలె అరాతిసేనను భంగపరచు. ॥ 3 ॥

మంత్రము :

పరుషా నమూన్ పరుషాహ్వః కృణోతు

హన్త్వేనాన్ వధకో వధైః ।

క్షిప్రం శర ఇవ భజ్యన్తాం బృహజ్జాలేన సందితాః ॥ 4 ॥

---

* చంద్ర.
ఐదవ కాండ, ఐదవ సూక్తం, ఐదవమంత్రంలో దీని వివరం కలదు.

పదము :

పరుషాన్ । అమూన్ । పరుష౽ఆహ్వః । కృణోతు ।
హస్తు । ఏనాన్ । వధకః । వధైః ।
క్షిప్రమ్ । శరః౽ఇవ । భజ్యన్తామ్ ।
బృహత్౽జాలేన । సమ్౽దితాః ॥ 4 ॥

అనువాదం :

కఠోరంగా ఆక్రందించే వీరులు
వీనిని కఠినములను చేయుదురుగాక!
వధకుడు తన ఆయుధంతో వీరిని ఖండించు గాక! ॥ 4 ॥

మంత్రము :

అన్తరిక్షం జాలమాసీ జ్జాలదణ్డా దిశో మహీః
తేనాభిధాయ దస్యూనాం శక్రః సేనామపావపత్ ॥ 5 ॥

పదము :

అన్తరిక్షమ్ । జాలమ్ । ఆసీత్ । జాల౽దణ్డాః । దిశః । మహీః ।
తేన । అభి౽ధాయ । దస్యూనామ్ ।
శక్రః । సేనామ్ । అప । అవపత్ ॥ 5 ॥

అనువాదం :

అంతరిక్షం వల వంటిది.
దిక్కులు దానికి దండములవంటివారు.

ఇందుతో శత్రుసైనికులను బంధించి
శక్రుడు నలిపివేస్తున్నాడు. ॥ 5 ॥

మంత్రము :

బృహద్ధి జాలం బృహతః శక్రస్య వాజినీవతః ।
తేన శత్రూనభి సర్వాన్ న్యుబ్జ
యథా న ముచ్యాతై కతమ శ్చనైషామ్ ॥ 6 ॥

పదము :

బృహత్ । హి । జాలమ్ । బృహతః । శక్రస్య । వాజినీఽవతః ।
తేన । శత్రూన్ । అభి । సర్వాన్ । ని । ఉబ్జ ।
యథా । న । ముచ్యాతై । కతమః । చన । ఏషామ్ ॥ 6 ॥

అనువాదం :

సేనతో పాటు మహేంద్రునిజాలం బృహత్తరమైనది.
దానితో సకల పరవాహినిని స్వాధీనం చేసుకుని
వారిలో ఒక్కడు కూడా తప్పించుకొనకుండా
ఇంద్రుడు చూచు గాక ! ॥ 6 ॥

మంత్రము :

బృహత్ తే జాలం బృహత ఇన్ద్ర శూర
సహస్రార్ఘస్య శతవీర్యస్య ।
తేన శతం సహస్ర మయుతం న్యర్బుదం
జఘాన శక్రో దస్యూనా మభిధాయ సేనయా ॥ 7 ॥

పదము :

బృహత్ । తే । జాలమ్ । బృహతః । ఇన్ద్ర । శూర ।

సహస్రఽఅర్ఘస్య । శతఽవీర్యస్య । తేన । శతమ్ ।

సహస్రమ్ । అయుతమ్ । నిఽఅర్బుదమ్ । జఘాన ।

శక్రః । దస్యూనామ్ । అభిఽధాయ । సేనయా ॥ 7 ॥

అనువాదం :

ఓ శూరుడా! ఇంద్రుడా!
వేలమందితో పూజితుడవు, శతవీరుడవు
మహత్తముడైన నీకు చెందిన జాలం
ఇంద్రజాలం మహత్తర మైనది.
దానితో బంధించి సేనాపరివృతుడవైన
ఇంద్రుడా! దస్యులను, నూరుగా, వేయిగా,
పదివేలుగా, కోట్లాదిగా నున్న
శత్రుసైనికులను ఖండించు! ॥ 7 ॥

మంత్రము :

అయం లోకో జాలమాసీ చ్ఛక్రస్య మహతో మహాన్ ।

తేనాహ మిన్ద్రజాలే నామూం స్తమసాభి దధామి సర్వాన్॥ 8 ॥

పదము .

అయమ్ । లోకః । జాలమ్ । ఆసీత్ ।

శక్రస్య । మహతః । మహాన్ ।

తేన । అహమ్ । ఇన్ద్రజాలేన । అమూన్ ।
తమసా । అభి । దధామి । సర్వాన్ ॥ 8 ॥

**అనువాదం :**

ఆ మహనీయుడైన శక్రునకు
ఈ మహాలోకము జాలంగా నున్నది.
ఈ ఇంద్రజాలంతో సర్వశత్రు సమూహమును
అంధకారంలో ముంచి త్రోసివేస్తాను. ॥ 8 ॥

మంత్రము :

సేదిరుగ్రా వ్యృద్ధిరార్తిశ్చానపవాచనా ।
శ్రమస్తన్ద్రీశ్చ మోహశ్చ తైరమూనభి దధామి సర్వాన్॥9॥

పదము :

సేదిః । ఉగ్రా । విఽఋద్ధిః । ఆర్తిః । చ । అనపఽవాచనా ।
శ్రమః । తన్ద్రీః । చ । మోహః । చ । తైః ।
అమూన్ । అభి । దధామి । సర్వాన్ ॥ 9 ॥

**అనువాదం :**

విపరీత పరాజయంతో, నిరాశా నిస్పృహలతో
దురదృష్టం పాలబడిన శత్రువులను
చెప్పరాని పరిశ్రమతో
అలసత్వంతో, మోహంతో ముంచివేస్తాను.
ఈ సకలారాతి గణాన్ని బంధిస్తున్నాను. ॥ 9 ॥

మంత్రము :

మృత్యవేఽమూన్ ప్ర యచ్ఛామి మృత్యుపాశైరమీ సితాః।

మృత్యోర్యే అఘలా దూతాస్తేభ్య

ఏనాన్ ప్రతి నయామి బద్ధ్వా ॥ 10 ॥

పదము :

మృత్యవే । అమూన్ । ప్ర । యచ్ఛామి ।

మృత్యుఽపాశైః । అమీ ఇతి । సితాః ।

మృత్యోః । యే । అఘలాః । దూతాః । తేభ్యః ।

ఏనాన్ । ప్రతి । నయామి । బద్ధ్వా ॥ 10 ॥

అనువాదం :

వీరిని మృత్యువునకు అర్పిస్తున్నాను.
వీరు మృత్యుపాశాలతో బంధితులై ఉన్నారు.
వీరిని బంధించి మృత్యువునకు అందిస్తున్నాను. ॥ 10 ॥

మంత్రము :

నయతామూన్ మృత్యుదూతా యమదూతా అపోమ్భత ।

పరఃసహస్రా హన్యన్తాం తృణేఢ్వేనాన్ మత్యంఽభవస్య ॥ 11 ॥

పదము :

నయత । అమూన్ । మృత్యుఽదూతాః ।

యమఽదూతాః । అప । ఉమ్భత ।

పరఃఽసహస్రాః । హన్యన్తామ్ । తృణేఢు ।

ఏనాన్ । మత్యఽమ్ । భవస్య ॥ 11 ॥

అనువాదం :

ఓ యమదూతలారా! వీరిని
అంతం చెయ్యండి.
పరస్సహస్రంగా ఉన్న
వీరిని వధింతురు గాక!
ఈశ్వరేచ్ఛానుసారంగా
వీరిని నశింప జేయండి. ॥ 11 ॥

మంత్రము :

సాధ్యా ఏకం జాలదణ్డ ముద్యత్య యన్త్యోజసా ।
రుద్రా ఏకం వసవ ఏకమాదిత్యైరేక ఉద్యతః ॥ 12 ॥

పదము :

సాధ్యాః । ఏకమ్ । జాలఽదణ్డమ్ ।
ఉత్ఽయత్య । యన్తి । ఓజసా ।
రుద్రాః । ఏకమ్ । వసవః । ఏకమ్ ।
ఆదిత్యైః । ఏకః । ఉత్ఽయతః ॥ 12 ॥

అనువాదం ;

సాధ్యులు వలకు ఆధారంగా పెట్టిన ఒక కర్రను
జాలదండాన్ని ఎత్తుకొని

ఒకరి వెంట ఒకరు ఓజస్సుతో వెడుతున్నారు.
రుద్రులు ఒక వేపు
వసువులు ఒక వేపు
ఆదిత్యులు ఇంకా ఒక వేపు
దీనిని పట్టుకున్నారు. ॥ 12 ॥

**మంత్రము:**

విశ్వే దేవా ఉపరిష్టా దుబ్జన్తో యన్త్వోజసా ।
మధ్యేన ఘ్నన్తో యన్తు సేనామఙ్గిరసో మహీమ్ ॥ 13 ॥

**పదము :**

విశ్వే । దేవాః । ఉపరిష్టాత్ । ఉబ్జన్తః । యన్తు । ఓజసా ।
మధ్యేన । ఘ్నన్తః । యన్తు । సేనామ్ । అఙ్గిరసః । మహీమ్ ॥ 13 ॥

**అనువాదం :**

విశ్వేదేవతలు పైపైకి వెళ్ళి
దుష్టులను నురుమాడుతున్నారు.
అంగిరసులు మధ్యభాగంలో చిక్కిన
సేనలను వధించి వేస్తున్నారు. ॥ 13 ॥

**మంత్రము :**

వనస్పతీన్ వానస్పత్యా నోషధీరుత వీరుధః ।
ద్విపాచ్చతుష్పాదిష్ణామి యథా సేనామమూం హనన్ ॥ 14 ॥

పదము :

వనస్పతీన్ । వానస్పత్యాన్ । ఓషధీః । ఉత । వీరుధః ।

ద్విఽపాత్ । చతుఃఽపాత్ । ఇష్ణామి ।

యథా । సేనామ్ । అమూమ్ । హనన్ ॥ 14 ॥

అనువాదం :

వనస్పతులను, వానస్పత్యులను, ఓషధులను,
లతలను చతుష్పాదుల నుంచి, ద్విపాదుల నుంచి
శత్రునిర్మూలనం చేయవలసిందిగా ప్రేరేపిస్తున్నాను.
ఈ సేనను వారు నాశం చేస్తారు. ॥ 14 ॥

మంత్రము :

గన్ధర్వాప్సరసః సర్పాన్ దేవాన్ పుణ్యజనాన్ పితౄన్ ।
దృష్టానదృష్టానిష్ణామి యథా సేనామమూం హనన్ ॥ 15 ॥

పదము :

గన్ధర్వఽఅప్సరసః । సర్పాన్ ।

దేవాన్ । పుణ్యఽజనాన్ । పితౄన్ ।

దృష్టాన్ । అదృష్టాన్ । ఇష్ణామి ।

యథా । సేనామ్ । అమూమ్ । హనన్ ॥ 15 ॥

అనువాదం :

గంధర్వులు, అప్సరసలు, నాగులు, పుణ్యజనులు,
ఇతరులు, కన్పించిన వారు, కన్పించని వారు-

-వీరందరినీ నేను ప్రేరేపిస్తున్నాను.
ఈ సేనను వారు హననం చేస్తారు. ॥ 15 ॥

మంత్రము :

ఇమ ఉప్తా మృత్యుపాశా యానాక్రమ్య న ముచ్యసే ।
అముష్యా హన్తు సేనాయా ఇదం కూటం సహస్రశః ॥ 16 ॥

పదము :

ఇమే । ఉప్తాః । మృత్యుఽపాశాః ।
యాన్ । ఆఽక్రమ్య । న । ముచ్యసే ।
అముష్యాః । హన్తు । సేనాయాః ।
ఇదమ్ । కూటమ్ । సహస్రఽశః ॥ 16 ॥

అనువాదం :

మృత్యుపాశం తనకు చిక్కిన
ఈ సేనలను ఆక్రమించి
విడువకుండు గాక!
ఈ సేనకు చెందిన కేంద్రాన్ని
వేయి ప్రక్కలుగా ఖండించు గాక! ॥ 16 ॥

మంత్రము :

ఘర్మః సమిద్ధో అగ్నినాయం హోమః సహస్రహః ।
భవశ్చ పృశ్నిబాహుశ్చ శర్వ సేనామమూం హతమ్ ॥ 17 ॥

పదము :

ఘర్మః । సమ్ఽఇద్ధః । అగ్నినా ।
అయమ్ । హోమః । సహస్రఽహః ।
భవః । చ । పృశ్నిఽబాహుః । చ ।
శర్వ । సేనామ్ । అమూమ్ । హతమ్ ॥ 17 ॥

అనువాదం:

ఈ ప్రదీప్తమైన హోమం
అగ్నితో వేయి విధాలుగా ప్రజ్వలితమై ఉన్నది.
భవుడు, విచిత్ర బాహువైన శర్వుడు
ఈ సేనను ధ్వంసం చేయుగాక! ॥ 17 ॥

మంత్రము :

మృత్యోరాషమా పద్యన్తాం క్షుధం సేదిం వధం భయమ్ ।
ఇన్ద్రశ్చాక్షుజాలాభ్యాం శర్వ సేనామమూం హతమ్ ॥ 18 ॥

పదము :

మృత్యోః । ఆషమ్ । ఆ । పద్యన్తామ్ ।
క్షుధమ్ । సేదిమ్ । వధమ్ । భయమ్ ।
ఇన్ద్రః । చ । అక్షుఽజాలాభ్యామ్ ।
శర్వ । సేనామ్ । అమూమ్ । హతమ్ ॥ 18 ॥

అనువాదం :

మృత్యువు నుంచి అలతను,
ఆకలిని, వధను, భయాన్ని పొందిన వీరిని,
ఓ శర్వుడా! ఇంద్రునితో పాటు కలిసి
నీ వీ సైనికులను హతులను చెయ్యి. ॥ 18 ॥

మంత్రము :

పరాజితాః ప్ర త్రసతామిత్రా నుత్తా ధావత బ్రహ్మణా ।
బృహస్పతిప్రణుత్తానాం మామీషాం మోచి కశ్చన ॥ 19 ॥

పదము :

పరాఽజితాః । ప్ర । త్రసత । అమిత్రాః ।
నుత్తాః । ధావత । బ్రహ్మణా ।
బృహస్పతిఽప్రనుత్తానామ్ । మా ।
అమీషామ్ । మోచి । కః । చన ॥ 19 ॥

అనువాదం :

అమిత్రులైన మీరు పరాజితులై
భయభ్రాంతులు కండి.
బ్రహ్మతో తరిమి వేయగా
పరువెత్తి పొండి.
బృహస్పతితో ప్రేరితులైన మీలో
ఏ ఒక్కరు కూడా ఏ విధంగానూ
జీవించ కుందురు గాక! ॥ 19 ॥

కాం. 8 అ. 4 సూ. 8

మంత్రము :

అవ పద్యన్తా మేషా మాయుధాని

మా శకన్ ప్రతిధామిషుమ్ ।

అథైషాం బహు బిభ్యతా మిషవో ఘ్నన్తు మర్మణి ॥ 20 ॥

పదము :

అవ । పద్యన్తామ్ । ఏషామ్ । ఆయుధాని ।

మా । శకన్ । ప్రతిఽధామ్ । ఇషుమ్ ।

అథ । ఏషామ్ । బహు । బిభ్యతామ్ ।

ఇషవః । ఘ్నన్తు । మర్మణి ॥ 20 ॥

అనువాదం:

వీరి శస్త్రాస్త్రములు నేలపై పడిపోవు గాక! ప్రతిపక్షుల నుంచి
వస్తున్న బాణములు వీరికి దుస్సహము లగుగాక!
వీరు చంపెదరన్న భయంతో గడగడలాడగా
మా బాణాలు వీరి ఆయువుపట్టులను గాయు గాక! ॥ 20 ॥

మంత్రము :

సం క్రోశతా మేనాన్ ద్యావాపృథివీ

సమన్తరిక్షం సహ దేవతాభిః ।

మా జ్ఞాతారం మా ప్రతిష్ఠాం విదన్త

మిథో విఘ్నానా ఉప యన్తు మృత్యుమ్ ॥ 21 ॥

పదము:

సమ్ । క్రోశతామ్ । ఏనాన్ । ద్యావాపృథివీ ఇతి ।

సమ్ । అన్తరిక్షమ్ । సహ । దేవతాభిః ।

మా । జ్ఞాతారమ్ । మా । ప్రతిऽస్థామ్ । విదన్త ।

మిథః । విऽఘ్నానాః । ఉప । యన్తు । మృత్యుమ్ ॥ 21 ॥

అనువాదం:

ద్యావాపృథువులు వీరిని శపించు గాక!
అంతరిక్షం దేవతలతో పాటు
వీరిని శపించు గాక!
జ్ఞాని నైన నన్ను, నా ఉనికిని
వారు తెలుసుకొన కుందురు గాక! ॥ 21 ॥

మంత్రము:

దిశశ్చతస్రోऽశ్వతర్యోऽ దేవరథస్య

పురోడాశాః శఫా అన్తరిక్షముద్ధిః ।

ద్యావాపృథివీ పక్షసీ ఋతవోऽభీశవోऽ

న్తర్దేశాః కింకరా వాక్ పరిరథ్యమ్ ॥ 22 ॥

పదము:

దిశః । చతస్రః । అశ్వతర్యఃऽ । దేవऽరథస్య ।

పురోడాశాః । శఫాః । అన్తరిక్షమ్ । ఉద్ధిః ।

ద్యావాపృథివీ ఇతి । పక్షసీ ఇతి । ఋతవః । అభీశవః ।

అన్తఃఽదేశాః । కిమ్ఽకరాః । వాక్ । పరిఽరథ్యమ్ ॥ 22 ॥

అనువాదం :

నాలుగు దిక్కులూ దేవరథానికి కట్టిన అశ్వతరులు.
హోమార్థమై ఉంచిన పురోడాశములు గిట్టలు.
అంతరాళం రథపీఠం.
ఆకసము, భూమి రెండు ప్రక్కలు.
ఋతువులు కళ్ళెములు.
విదిక్కులు కింకరులు.
వాక్కు అది నడిచే మార్గము. ॥ 22 ॥

మంత్రము :

సంవత్సరో రథః పరివత్సరో
రథోపస్థో విరాడీషాగ్ని రథముఖమ్ ।
ఇన్ద్రః సవ్యష్ఠా శ్చన్ద్రమాః సారథిః ॥ 23 ॥

పదము .

సమ్ఽవత్సరః । రథః । పరిఽవత్సరః ।
రథఽఉపస్థః । విఽరాట్ । ఈషా । అగ్నిః । రథఽముఖమ్ ।
ఇన్ద్రః । సవ్యఽస్థాః । చన్ద్రమాః । సారథిః ॥ 23 ॥

అనువాదం :

సంవత్సరం రథం.
పరివత్సరం ఇందులో కూర్చునే తావు.

విరాట్ పురుషుడు దీనికి
ఆధారభూతమైన దండము.
అగ్ని రథముఖము.
ఇంద్రుడు ఇందులో కూర్చున్నవాడు.
చంద్రుడు దీనికి సారథిగా ఉన్నాడు. ॥ 23 ॥

మంత్రము :

ఇతో జయేతో వి జయ సం జయ జయ స్వాహా ।
ఇమే జయన్తు పరామీ జయన్తాం
స్వాహైభ్యో దురాహాఽమీభ్యః ।
నీలలోహితేనామూ నభ్యవతనోమి ॥ 24 ॥

పదము :

ఇతః । జయ । ఇతః । వి । జయ। సమ్ । జయ। జయ। స్వాహా।
ఇమే । జయన్తు । పరా । అమీ ఇతి । జయన్తామ్ ।
స్వాహా । ఏభ్యః । దురాహా । అమీభ్యః ।
నీలఽలోహితేన । అమూన్ । అభిఽఅవతనోమి ॥ 24 ।

అనువాదం :

వీరి నుంచి జయాన్ని సంపాదించుకుని
విజయులమై వీరిని జయింతుము గాక!
ఆత్మసమర్పణం చేసి మా వీరులు
జయాన్ని పొందుదురు గాక!

మా శత్రువులు పరాజితు లగుదురు గాక!
మా వీరులు విజేత లగుదురు గాక!
మా వీరులకు జయము జయము.
ఆ నా శత్రువులను నేను నీలలోహితములతో
కట్టి పడవేస్తున్నాను. ॥ 24 ॥

ఇది ఎనిమిదవ సూక్తం.

ఇది నాల్గవ అనువాకం.

# అనువాకం – 5

## సూక్తం - 9

ఋషి: అథర్వుడు ॥ దేవతలు : మంత్రములలో పేర్కొన్నవారు ॥ ఛందస్సు : 1,6,7,10,13,15-21,24 త్రిష్టుప్ : 2 పంక్తి : 3 ఆస్తార పంక్తి : 4,5, 23,25,26 అనుష్టుప్ : 8,11,12,22 జగతీ, 9 భురిక్ త్రిష్టుప్ : 14 చతుష్పదాఽతి జగతీ ॥ మంత్రములు : ॥ 26 ॥

వినియోగం :- ఈ సూక్తంలో విరాట్ మొదలగు విషయములు, సంవాదము, విచారము కలవు.

ఈ చెప్పబోవు రెండు సూక్తములతో (9, 10) స్వర్గ కాముడు జపం చేస్తాడని వినియోగములలో ఉన్నది.

మంత్రము ;

కుతస్తౌ జాతౌ కతమః సో అర్ధః
కస్మాల్లోకాత్ కతమస్యాః పృథివ్యాః ।
వత్సౌ విరాజః సలిలాదుదైతాం
తౌ త్వా పృచ్ఛామి కతరేణ దుగ్ధా ॥ 1 ॥

పదము :

కుతః । తౌ । జాతౌ । కతమః । సః । అర్ధః ।

కస్మాత్ । లోకాత్ । కతమస్యాః । పృథివ్యాః ।

వత్సౌ । వి౨రాజః । సలిలాత్ । ఉత్ । ఐతామ్ ।

తౌ । త్వా । పృచ్ఛామి । కతరేణ । దుగ్ధా ॥ 1 ॥

అనువాదం :

వారు ఎక్కడ పుట్టిన వారు? ఆ అర్ధభాగం ఎన్నవది?
ఏ లోకం నుంచి ఏ ఏ పృథివి పైని
సలిలం నుంచి విరాజితమైన ఈ రెండు వత్సములు
తమ్ము తాము ఆవిష్కరించుకొన్నవి?
ఈ దేవత విషయమై నేను ప్రశ్నిస్తున్నాను.
ఎవరు దీని పాలను పిదికినారు? ॥ 1

మంత్రము :

యో అక్రన్దయత్ సలిలం మహిత్వా

యోనిం కృత్వా త్రిభుజం శయానః ।

వత్సః కామదుఘో విరాజః

స గుహా చక్రే తన్వః పరాచైః ॥ 2

పదము :

యః । అక్రన్దయత్ । సలిలమ్ । మహి౨త్వా ।

యోనిమ్ । కృత్వా । త్రి౨భుజమ్ । శయానః ।

వత్సః । కామ౽దుఘః । వి౽రాజః ।

సః । గుహా । చక్రే । తన్వ౽ః । పరాచైః ॥ 2 ॥

అనువాదం :

త్రిభుజాన్ని యోనినిగా చేసుకుని
అందులో పడుకుని ఉన్న ఎవడు
మహత్వంతో జలాన్ని సంక్షోభింప జేస్తున్నాడు?
విరాడ్రూపమైన కామధేనువునకు
అతను వత్సము.
సుదూరము, గుప్తము అయిన అంగాంగములను
అతను చేసినాడు. ॥ 2 ॥

మంత్రము :

యాని త్రీణి బృహన్తి యేషాం

చతుర్థం వియునక్తి వాచమ్ ।

బ్రహ్మైనద్ విద్యాత్ తపసా విపశ్చిద్

యస్మిన్నేకం యుజ్యతే యస్మిన్నేకమ్ ॥ 3 ॥

పదము :

యాని । త్రీణి । బృహన్తి । యేషామ్ ।

చతుర్థమ్ । వి౽యునక్తి । వాచమ్ ।

బ్రహ్మ । ఏనత్ । విద్యాత్ । తపసా । విపః౽చిత్ ।

యస్మిన్ । ఏకమ్ । యుజ్యతే । యస్మిన్ । ఏకమ్ ॥ 3 ॥

**అనువాదం**

ఏ మహాత్రయం ఉన్నదో,
దేనికి చెందిన నాలుగు వాక్కులు
ప్రకటీకృతమైనవో,
జ్ఞాని అయిన వాడు ఏ బ్రహ్మను
తపస్సుతో కనుగొంటాడో
దానిని బ్రహ్మగా తెలుసుకొనవలెను.
ఎందులో ఒకటి యోగిస్తుందో- ॥ 3 ॥

**మంత్రము :**

**బృహతః పరి సామాని షష్ఠాత్ పఞ్చాధి నిర్మితా ।**

**బృహద్ బృహత్యా నిర్మితం కుతోఽధి బృహతీ మితా ॥4॥**

**పదము :**

**బృహతః । పరి । సామాని । షష్ఠాత్ । పఞ్చ । అధి । నిఃఽమితా।**

**బృహత్ । బృహత్యాః । నిఃఽమితమ్ ।**

**కుతః । అధి । బృహతీ । మితా ॥ 4 ॥**

**అనువాదం :**

బృహత్తు ఆరవదిగా ఉండగా,
అందులో నుండి ఐదు సామములు
నిర్మితమైనవి.
బృహతి నుంచి బృహత్తు
సృష్టి అయినది.
మరి బృహత్తు ఎందులో నుంచి వచ్చినది? ॥ 4 ॥

మంత్రము:

బృహతీ పరి మాత్రాయా మాతుర్మాత్రాధి నిర్మితా ।
మాయా హ జజ్ఞే మాయాయా
మాయాయా మాతలీ పరి ॥ 5 ॥

పదము:

బృహతీ । పరి । మాత్రాయాః । మాతుః ।
మాత్రా । అధి । నిః౽మితా ।
మాయా । హ । జజ్ఞే । మాయాయాః ।
మాయాయాః । మాతలీ । పరి ॥ 5 ॥

అనువాదం:

మాత యైన మాత్రపై బృహతి అనే
తన్మాత్ర నిర్మితమైనది.
మాయలో నుంచి మాయ పుట్టినది.
మాయలో నుంచే మాతలి సృష్టి. ॥ 5 ॥

మంత్రము:

వైశ్వానరస్య ప్రతిమోపరి ద్యౌర్యావద్
రోదసీ విబబాధే అగ్నిః ।
తతః షష్ఠాదాముతో యన్తి స్తోమా
ఉదితో యన్త్యభి షష్ఠమహ్నః ॥ 6 ॥

పదము :

వైశ్వానరస్య । ప్రతిఽమా । ఉపరి । ద్యౌః । యావత్ ।
రోదసీ ఇతి । విఽబబాధే । అగ్నిః ।
తతః । షష్ఠాత్ । ఆ । అముతః । యన్తి । స్తోమాః ।
ఉత్ । ఇతః । యన్తి । అభి । షష్ఠమ్ । అహ్నః ॥ 6 ॥

అనువాదం :

పై నున్న ద్యులోకం వైశ్వానరుని ప్రతిమగా ఉన్నది.
అతనే భూమిని,
ద్యులోకాన్ని వేరు చేసినాడు.
అందులో నుంచి స్తోమం వచ్చినది.
మరి ఇక్కడి నుంచి దినం పైకి వెడుతున్నది. ॥ 6 ॥

మంత్రము :

షట్ త్వా పృచ్ఛామ ఋషయః కశ్యపేమే
త్వం హి యుక్తం యుయుక్షే యోగ్యం చ ।
విరాజ మాహు ర్బ్రహ్మణః పితరం
తాం నో వి ధేహి యతిధా సఖిభ్యః ॥ 7 ॥

పదము :

షట్ । త్వా । పృచ్ఛామ । ఋషయః । కశ్యప । ఇమే ।
త్వమ్ । హి । యుక్తమ్ । యుయుక్షే । యోగ్యమ్ । చ ।

వి౽రాజమ్ । ఆహుః । బ్రహ్మణః । పితరమ్ ।

తామ్ । నః। వి । ధేహి । యతి౽ధా । సఖి౽భ్యః ॥ 7 ॥

అనువాదం:

ఓ కశ్యపా! ఈ ఆరుగురు ఋషులు నిన్ను ప్రశ్నిస్తున్నారు.
నీవు యుక్తము, యోగ్యము అయిన రీతిగా సంయోగించు.
విరాట్ బ్రహ్మకు తండ్రిగా పేర్కొంటాడు.
మేము మిత్రులతో కూడి
దానిని విధవిధాలుగా వర్ణిస్తున్నాము. ॥ 7 ॥

మంత్రము:

యాం ప్రచ్యుతామను యజ్ఞాః ప్రచ్యవన్త

ఉపతిష్ఠన్త ఉపతిష్ఠమానామ్ ।

యస్యా వ్రతే ప్రసవే యక్షమేజతి

సా విరాడృషయః పరమే వ్యోమన్ ॥ 8 ॥

పదము:

యామ్ । ప్ర౽చ్యుతామ్ । అను । యజ్ఞాః । ప్ర౽చ్యవన్తే ।

ఉప౽తిష్ఠన్తే । ఉప౽తిష్ఠమానామ్ ।

యస్యాః । వ్రతే । ప్ర౽సవే । యక్షమ్ । ఏజతి ।

సా । వి౽రాట్ । ఋషయః । పరమే । వి౽ఓమన్ ॥ 8 ॥

అథర్వ. iv 12

**అనువాదం :**

ఓ ఋషులారా! ఎవరిని యజ్ఞములు అనుగమిస్తున్నవో,
ఆమె నిలుచుండగా ప్రక్కన నిలుస్తున్నవో,
ఎవరు నడపడం వల్ల
చైతన్యం చలిస్తున్నదో ఆమే విరాట్.
పైపైన ఉన్న ద్యులోకంలో ఉండునది. ॥ 8 ॥

**మంత్రము :**

అప్రాణైతి ప్రాణేన ప్రాణతీనాం
విరాట్ స్వరాజమభ్యేఽతి పశ్చాత్ ।
విశ్వం మృశన్తీమభిరూపాం విరాజం
పశ్యన్తి త్వే న త్వే పశ్యన్త్యేనామ్ ॥ 9 ॥

**పదము :**

అప్రాణా । ఏతి । ప్రాణేన । ప్రాణతీనామ్ ।
విఽరాట్ । స్వఽరాజమ్ । అభి । ఏతి । పశ్చాత్ ।
విశ్వమ్ । మృశన్తీమ్ । అభిఽరూపామ్ । విఽరాజమ్ ।
పశ్యన్తి । త్వే ఇతి । న । త్వే ఇతి । పశ్యన్తి । ఏనామ్ ॥ 9 ॥

**అనువాదం:**

ఆ విరాట్టు ఇతర ప్రాణుల ప్రాణంతో కదులుతున్నది.
స్వరాట్టును అనుగమించి విరాట్టు వస్తున్నది.
కొందరు విరాట్టును తెలుసుకొనలేరు.

కొందరు ఆ విరాట్టును తెలుసుకుంటారు.
సర్వప్రాణులను స్పృశించుటకు
అనురూప అయిన విరాట్టును కొందరు
తెలుసుకొంటారు, కొందరు తెలుసుకొనలేరు. ॥ 9 ॥

మంత్రము :

కో విరాజో మిథునత్వం ప్ర వేద
క ఋతూన్ క ఉ కల్పమస్యాః ।
క్రమాన్ కో అస్యాః కతిధా విదుగ్ధాన్
కో అస్యా ధామ కతిధా వ్యుష్టీః ॥ 10 ॥

పదము :

కః । వి౨రాజః । మిథున౨త్వమ్ । ప్ర । వేద ।
కః । ఋతూన్ । కః । ఓం ఇతి । కల్పమ్ । అస్యాః ।
క్రమాన్ । కః । అస్యాః । కతి౨ధా । వి౨దుగ్ధాన్ ।
కః । అస్యాః । ధామ । కతి౨ధా । వి౨ఉష్టీః ॥ 10 ॥

అనువాదం :

ఏ విరాడ్దేవతకు చెందిన మిథునత్వం ఎవరికి తెలుసు?
దాని ఋతువులను, కల్పాన్ని ఎవ రెరుగుదురు?
దాని అడుగుల నెవ రెరుగుదురు?
అవి ఎంత త్వరగా పడునో,
అవి ఎంత దూరం విస్తరించునో

ఎవరికి తెలుసు?
దాని స్థానమేదో
ఎవరికి తెలుసు?
దానికి ఉషస్సు ఎప్పుడో
ఎవరికి తెలుసు? ॥ 10 ॥

మంత్రము :

ఇయమేవ సా యా ప్రథమా వ్యౌచ్ఛ
దాస్వితరాసు చరతి ప్రవిష్టా ।
మహాన్తో అస్యాం మహిమానో
అన్తర్వధూర్జిగాయ నవగజ్జనిత్రీ ॥ 11 ॥

పదము :

ఇయమ్ । ఏవ । సా । యా । ప్రథమా । వి౽ఔచ్ఛత్ ।
ఆసు । ఇతరాసు । చరతి । ప్ర౽విష్టా ।
మహాన్తః । అస్యామ్ । మహిమానః ।
అన్తః । వధూః । జిగాయ । నవ౽గత్ । జనిత్రీ ॥ 11 ॥

అనువాదం :

ఇది మొదట ఉండి ఎప్పుడు ప్రకాశిస్తుందో?
ఇది వేనిలో ప్రవేశించి కదలుతుందో?
దీనిలో చాలా గొప్ప శక్తు లున్నవి.
నూతన జనని, వధువు వలె ఇది ప్రకాశిస్తుంది. ॥ 11

మంత్రము :

ఛన్దః పక్షే ఉషసా పేపిశానే

సమానం యోని మను సం చరేతే ।

సూర్యపత్నీ సం చరతః ప్రజానతీ

కేతుమతీ అజరే భూరిరేతసా ॥ 12 ॥

పదము:

ఛన్దఃపక్షే ఇతి ఛన్దఃఽపక్షే । ఉషసా । పేపిశానే ఇతి ।

సమానమ్ । యోనిమ్ । అను । సమ్ । చరేతే ఇతి ।

సూర్యపత్నీ ఇతి సూర్యఽపత్నీ । సమ్ । చరతః ।

ప్రజానతీ ఇతి ప్రఽజానతీ । కేతుమతీ ఇతి కేతుఽమతీ ।

అజరే ఇతి । భూరిఽరేతసా ॥ 12 ॥

అనువాదం :

ఛందస్సు రెక్కలపై నెక్కి రెండు సంధ్యలు
అందంగా అలంకరించుకుని
తమ నివాసస్థలానికి వెడుతున్నవి.
సూర్యుని భార్య లిరువురు
మహాబలశాలురై సంచరిస్తున్నారు. ॥ 12 ॥

మంత్రము :

ఋతస్య పన్థామను తిస్ర ఆగు

స్త్రయో ఘర్మా అను రేత ఆగుః ।

ప్రజా మేకా జిన్వ త్యూర్జ మేకా
రాష్ట్ర మేకా రక్షతి దేవయూనామ్ ॥ 13 ॥

పదము :

ఋతస్య । పన్థామ్ । అను । తిస్రః । ఆ । అగుః ।
త్రయః । ఘర్మాః । అను । రేతః । ఆ । అగుః ।
ప్రఽజామ్ । ఏకా । జిన్వతి । ఊర్జమ్ । ఏకా ।
రాష్ట్రమ్ । ఏకా । రక్షతి । దేవఽయూనామ్ ॥ 13 ॥

అనువాదం :

ముగ్గురు సత్యమార్గాన్ని అనుసరిస్తున్నారు.
ఆ మూడు మార్గాలు వీర్యవంతములై
యజ్ఞాన్ని అనుసరిస్తున్నవి.
ఒకటి ప్రజాసంతతిని తృప్తిపరుస్తున్నది
ఒకటి బలాన్ని కాపాడుతున్నది.
ఒకటి దేవతలతో పాటూ
యజమానుని రాష్ట్రాన్ని రక్షిస్తున్నది. ॥ 13 ॥

మంత్రము :

అగ్నిషోమా పదధుర్యా తురీయాసీద్
యజ్ఞస్య పక్షా వృషయః కల్పయన్తః ।
గాయత్రీం త్రిష్టుభం జగతీ మనుష్టుభం
బృహదర్కం యజమానాయ స్వఽరాభరన్తీమ్ ॥ 14 ॥

పదము:

అగ్నిషోమౌ । అదధుః । యా । తురీయా । ఆసీత్ ।

యజ్ఞస్య । పక్షౌ । ఋషయః । కల్పయన్తః ।

గాయత్రీమ్ । త్రిఽస్తుభమ్ । జగతీమ్ । అనుఽస్తుభమ్ ।

బృహత్ఽఅర్కీమ్ । యజమానాయ । స్వఽః । ఆఽభరన్తీమ్ ॥ 14 ॥

అనువాదం:

అగ్ని, సోముడు యజ్ఞమునకు పక్షములుగా
ఋషులు కల్పించినారు. ఇది నాల్గవది.
గాయత్రి, త్రిష్టుప్, జగతి, అనుష్టుప్
ఛందస్సుల రూపంలో యజమానునకు
ప్రకాశాన్ని సమకూరుస్తూ ఉన్నది. 14 ॥

మంత్రము:

పఞ్చ వ్యుఽష్టీ రను పఞ్చ దోహా
గాం పఞ్చ నామ్నీ మృతవోఽను పఞ్చ ।
పఞ్చ దిశః పఞ్చదశేన క్లృప్తా
స్తా ఏకమూర్ధ్నీ రభి లోకమేకమ్ ॥ 15 ॥

పదము:

పఞ్చ । విఽఉష్టీః । అను । పఞ్చ । దోహాః ।

గామ్ । పఞ్చఽనామ్నీమ్ । ఋతవః । అను । పఞ్చ ।

పఞ్చ । దిశః । పఞ్చఽదశేన । క్లృప్తాః ।

తాః । ఏకఽమూర్ధ్నీః । అభి । లోకమ్ । ఏకమ్ ॥ 15 ॥

**అనువాదం :**

ఐదు వ్యుష్టులు, పంచ దోహన
సమయములలో పంచ దిక్కులు,
పంచ ఋతువులు పంచ నామములు గల
గోవులుగా ఉన్నవి.
అవి ఆకసములోని పంచ స్థానములలో ఉన్నవి.
మొత్తం పదునైదు ఒక శీర్షం కలవై
ఒక లోకం పై ఉన్నవి. ॥ 15 ॥

**మంత్రము :**

షడ్ జాతా భూతా ప్రథమజ ర్తస్య
షడు సామాని షడహం వహన్తి ।
షడ్యోగం సీరమను సామసామ
షడాహు ర్ద్యావాపృథివీః షడుర్వీః ॥ 16 ॥

**పదము :**

షట్ । జాతా । భూతా । ప్రథమఽజా । ఋతస్య ।
షట్ । ఓం ఇతి । సామాని । షట్ఽఅహమ్ । వహన్తి ।
షట్ఽయోగమ్ । సీరమ్ । అను । సామఽసామ ।
షట్ । ఆహుః । ద్యావాపృథివీః । షట్ । ఉర్వీః ॥ 16 ॥

అనువాదం :

ఋతము నుండి ప్రథమ ప్రవర్తకం వెడలినది.
షడ్భూతములు అందులో నుంచి వచ్చినవి.
షట్ సామములు, షడ్దినములుగా అయినవి.

ఆరు జతల ఎడ్లతో నడిచే నాగేటిచాలు
ఆరు రీతులుగా ఉంటుంది.
అవి షట్సంఖ్యాక మైనవి.
ఆరు ద్యావాపృథువులు. ॥ 16 ॥

మంత్రము :

షడాహుః శీతాన్ షడు మాస ఉష్ణా

నృతుం నో బ్రూత యతమోఽతిరిక్తః ।

సప్త సుపర్ణాః కవయో ని షేదుః

సప్త చ్ఛన్దాం స్యను సప్త దీక్షాః ॥ 17 ॥

పదము :

షట్ । ఆహుః । శీతాన్ । షట్ । ఓం ఇతి । మాసః । ఉష్ణాన్ ।

ఋతుమ్ । నః । బ్రూత । యతమః । అతిఽరిక్తః ।

సప్త । సుఽవర్ణాః । కవయః । ని । సేదుః ।

సప్త । ఛన్దాంసి । అను । సప్త । దీక్షాః ॥ 17 ॥

అనువాదం :

శీతాకాలం నెలలు ఆరు.
ఉష్ణ మాసములు ఆరు.

వీనిని ఋతువులుగా చెప్పు.
వీనిలో ఏది అతిరిక్త మైనది?
సుపర్ణులైన సప్త ర్షులు, సప్త పక్షులు
ఒకచోటు ఉన్నవి.
సప్త ఛందస్సులు ఉన్నవి.
అలాగే సప్త దీక్షలు కలవు. ॥ 17 ॥

మంత్రము:

సప్త హోమాః సమిధో హ సప్త
మధూని సప్తర్తవో హ సప్త ।
సప్తాజ్యాని పరి భూత మాయన్
తాః సప్తగృధ్రా ఇతి శుశ్రుమా వయమ్ ॥ 18 ॥

పదము:

సప్త । హోమాః । సమ్ఽఇధః । హ । సప్త ।
మధూని । సప్త । ఋతవః । హ । సప్త ।
సప్త । ఆజ్యాని । పరి । భూతమ్ । ఆయన్ ।
తాః । సప్తఽగృధ్రాః । ఇతి । శుశ్రుమ । వయమ్ ॥ 18 ॥

అనువాదం:

సప్త హోమములు, సప్త సమిధలు, సప్త మధువులు,
సప్త ఋతువులు, సప్త ఆజ్యధారలు లోకంలో నున్నవి.
అవే సప్త గృధ్రములుగా కూడా
మనము వింటూంటాము. ॥ 18 ॥

మంత్రము:

సప్త చ్ఛన్దాంసి చతురుత్తరా

ణ్యన్యో అన్యస్మి న్నధ్యార్పితాని ।

కథం స్తోమాః ప్రతి తిష్ఠన్తి తేషు

తాని స్తోమేషు కథ మార్పితాని ॥ 19 ॥

పదము :

సప్త । ఛన్దాంసి । చతుఃఽఉత్తరాణి ।

అన్యః । అన్యస్మిన్ । అధి । అర్పితాని ।

కథమ్ । స్తోమాః । ప్రతి । తిష్ఠన్తి । తేషు ।

తాని । స్తోమేషు । కథమ్ । అర్పితాని ॥ 19 ॥

అనువాదం :

సప్త ఛందస్సులు కలవు.
వానిలో ఉత్తమ మైనవి నాలుగు.
ఒకటి రెండవ దానిలో సమర్పిత మౌతున్నది.
వీనిలో స్తోమములు (స్తుతి మంత్రములు) ఎలా ఉన్నవి?
అవి స్తోమములలో ఏ విధంగా సమర్పితా లౌతున్నవి? ॥ 19 ॥

మంత్రము:

కథం గాయత్రీ త్రివృతం వ్యాఽప

కథం త్రిష్టుప్ పఞ్చదశేన కల్పతే ।

త్రయస్త్రింశేన జగతీ కథ మనుష్టుప్ కథ మేకవింశః ॥ 20 ॥

పదము :

కథమ్ । గాయత్రీ । త్రిఽవృతమ్ । వి । ఆప ।

కథమ్ । త్రిఽస్తుప్ । పఞ్చఽదశేన । కల్పతే ।

త్రయఃఽత్రింశేన । జగతీ । కథమ్ ।

అనుఽస్తుప్ । కథమ్ । ఏకఽవింశః ॥ 20 ॥

అనువాదం :

గాయత్రి త్రిపాదములతో ఎలా వ్యాపించినది?
త్రిష్టుప్ పంచదశ సంఖ్య గలది
ఎలా అయినది?
ముప్పైమూడుతో జగతి ఎలా ఏర్పడినది?
ఇరవై ఒకటితో అనుష్టుప్ ఎలా అవుతున్నది? ॥ 20 ॥

మంత్రము :

అష్ట జాతా భూతా ప్రథమజర్త స్యాష్టేన్ద్ర ర్త్విజో దైవ్యా యే ।
అష్టయోని రదితి రష్టపుత్రాష్టమీం రాత్రిమభి హవ్యమేతి ॥ 21 ॥

పదము :

అష్ట । జాతా । భూతా । ప్రథమఽజా । ఋతస్య ।

అష్ట । ఇన్ద్ర । ఋత్విజః । దైవ్యాః । యే ।

అష్టఽయోనిః । అదితిః । అష్టఽపుత్రా ।

అష్టమీమ్ । రాత్రిమ్ । అభి । హవ్యమ్ । ఏతి ॥ 21 ॥

**అనువాదం :**

ఋత ప్రవర్తకుని వల్ల అష్ట భూతములు ఉత్పన్నము లైనవి.
ఓ ఇంద్రా! దివ్యులైన ఋత్విజులు అష్ట సంఖ్యాకులు.
అదితి అష్టయోని, అష్టపుత్ర.
అష్టమి రాత్రి హవ్యసమర్పణకు ఉద్దిష్ట మైనది. ॥ 21 ॥

**మంత్రము:**

ఇత్థం శ్రేయో మన్యమా నేద మాగమం
యుష్మాకం సఖ్యే అహ మస్మి శేవా ।
సమానజన్మా క్రతురస్తి వః శివః
స వః సర్వాః సం చరతి ప్రజానన్ ॥ 22 ॥

**పదము :**

ఇత్థమ్ । శ్రేయః । మన్యమానా । ఇదమ్ । అగమమ్ ।
యుష్మాకమ్ । సఖ్యే । అహమ్ । అస్మి । శేవా ।
సమానఽజన్మా । క్రతుః । అస్తి । వః । శివః ।
సః । వః । సర్వాః । సమ్ । చరతి । ప్రఽజానన్ ॥ 22 ॥

**అనువాదం :**

ఈ విధంగా శ్రేయస్కామి అయి
మీతో మైత్రి చేయుటకై వస్తున్నది.
నేను సేవనీయుడను.
మీరు చేస్తున్న యజ్ఞం కల్యాణకారి అగు గాక!
ఇది ఎరిగిన మీ అందరితో అది సంచరిస్తున్నది. ॥ 22 ॥

మంత్రము :

అష్టేన్ద్రస్య షడ్ యమస్య ఋషీణాం సప్త సప్తధా ।

అపో మనుష్యా౩నోషధీ స్తాం౩ ఉ పఞ్చాను సేచిరే ॥ 23 ॥

పదము :

అష్ట । ఇన్ద్రస్య । షట్ । యమస్య ।

ఋషీణామ్ । సప్త । సప్తఽధా ।

అపః । మనుష్యాఽన్ । ఓషధీః ।

తాన్ । ఓం ఇతి । పఞ్చ । అను । సేచిరే ॥ 23 ॥

అనువాదం :

ఇంద్రునకు ఉద్దిష్టము లైనవి అష్ట సంఖ్యాకములు.
యమునకు ఉద్దిష్టము లైనవి షట్సంఖ్యాకములు.
ఋషులకు ఉద్దిష్ట మైనవి సప్త సంఖ్యాకములు.
ఒక్కొక్క ఋషికి ఒక్కొక్క సప్తకం.
పంచ సంఖ్యాకమైన జలములు
మనుష్యులను గూర్చి, ఓషధులను గూర్చి
అనుకూలంగా సేచనం చేస్తున్నవి. ॥ 23 ॥

మంత్రము :

కేవలీన్ద్రాయ దుదుహే హి గృష్టి

ర్వశం పీయూషం ప్రథమం దుహానా ।

అథాతర్పయ చ్చతుర శ్చతుర్ధా

దేవాన్ మనుష్యాం 3 అసు రానుత ఋషీన్ ॥ 24 ॥

పదము :

కేవలీ । ఇన్ద్రాయ । దుదుహే । హి । గృష్టిః ।

వశమ్ । పీయూషమ్ । ప్రథమమ్ । దుహానా ।

అథ । అతర్పయత్ । చతురః । చతుఃఽధా ।

దేవాన్ । మనుష్యాఽన్ । అసురాన్ । ఉత । ఋషీన్ ॥ 24 ॥

అనువాదం :

కేవల ధేనువు అమృతరూపమైన
పీయూషమును, అధికారమును ఇంద్రునకై పిండినది.
ఆయన దేవతలు, ఋషులు, మనుష్యులు, అసురులు
అనే నాలుగు వర్గాలను సంతృప్తి పరచినాడు. ॥ 24 ॥

మంత్రము :

కో ను గౌః క ఏకఋషిః

కిము ధామ కా ఆశిషః ।

యక్షం పృథివ్యా మేకవృ దేకర్తుః కతమో ను సః ॥ 25 ॥

పదము :

కః । ను । గౌః । కః । ఏకఽఋషిః ।

కిమ్ । ఓం ఇతి । ధామ । కాః । ఆఽశిషః ।

యక్షమ్ । పృథివ్యామ్ । ఏకఽవృత్ ।

ఏకఽఋతుః । కతమః । ను । సః ॥

అనువాదం.

ఎవరా గోవు?
ఎవరా ఏక ఋషి?
ఏది ఆ స్థానం?
ఏవి వారి ఆశీర్వచనములు?
పృథ్విలో ఒకే ఒక వ్యాపకుడైన,
పూజనీయుడైన దేవుడు ఒకడు.
అతడు ఏక ఋతువు ఎలా అవుతున్నాడు? ॥

మంత్రము:

ఏకో గౌరేక ఏకఋషి రేకం ధామైకధాశిషః ।

యక్షం పృథివ్యా మేకవృ దేకర్తు ర్నాతి రిచ్యతే ॥

పదము

ఏకః । గౌః । ఏకః । ఏకఽఋషిః ।

ఏకమ్ । ధామ । ఏకఽధా । ఆఽశిషః ।

యక్షమ్ । పృథివ్యామ్ । ఏకఽవృత్ ।

ఏకఽఋతుః । న । అతి । రిచ్యతే ॥

అనువాదం:

ఒకటే గోవు. ఒకడే ఋషి.
ఒకటే స్థానం.

ఒకే రకమైనవి ఆశీస్సులు.
లోకంలో వ్యాపకుడైన దేవు డొక్కడే.
ఒకటే ఋతువు. దీనికి మించి మరొకటి లేదు. ॥ 26 ॥

ఇది తొమ్మిదవ సూక్తం.

## సూక్తం—10 (1)

ఋషి: అథర్వాచార్యుడు ॥ దేవత: విరాట్ ॥ ఛందస్సు: 1 ఆర్చీపంక్తి: 2,4,6, 8,10,12 యాజుషీ జగతి; 3,9 సామ్న్యనుష్టుప్; 5 ఆర్చ్యనుష్టుప్; 7,13 విరాట్ గాయత్రి: 11 సామ్ని బృహతీ ॥ మంత్రములు: ॥ 13 ॥

వినియోగం:— ఇది ఆరు పర్యాయములతో కూడిన సూక్తము. దీని వినియోగ వివారాదులు పూర్వ సూక్తంలో చెప్పబడినవి.

మంత్రము

విరాడ్ వా ఇదమగ్ర ఆసీత్ తస్యా జాతాయాః ।
సర్వమబిభే దియమేవేదం భవిష్యతీతి ॥ 1 ॥

పదము:

వి౽రాట్ । వై । ఇదమ్ । అగ్రే । ఆసీత్ । తస్యాః । జాతాయాః ।
సర్వమ్ । అబిభేత్ । ఇయమ్ । ఏవ । ఇదమ్ । భవిష్యతి । ఇతి
॥ 1 ॥

అనువాదం:

విరాట్టు నిశ్చయంగా సృష్ట్యాదిలో ఈ ప్రపంచంగా ఉండెను.
ఆ దేవత ఉదయించి పైనికి అధిరోహించెను.
అదే సర్వం అవుతుందన్న భావనే భయకారణ మైనది. ॥ 1 ॥

మంత్రము :

సోదక్రామత్ సా గార్హపత్యే న్యక్రామత్

పదము :

సా । ఉత్ । అక్రామత్ । సా । గార్హఽపత్యే । ని । అక్రామత్

మంత్రము :

గృహమేధీ గృహపతిర్భవతి య ఏవం వేద ।

పదము :

గృహఽమేధీ । గృహఽపతిః । భవతి । యః । ఏవమ్ । వేద

అనువాదం :

అది ఉత్క్రమించి గార్హపత్యాగ్నిలో ప్రవేశించింది.
ఈ విషయం తెలిసినవాడు
గృహమేధి అయి గృహపతి అవుతాడు. ॥ 2

మంత్రము :

సోదక్రామత్ సాహవనీయే న్యక్రామత్ ॥

పదము :

సా । ఉత్ । అక్రామత్ । సా । ఆఽహవనీయే । ని । అక్రామత్

మంత్రము :

యన్త్యస్య దేవా దేవహూతిం ప్రియో
దేవానాం భవతి య ఏవం వేద ॥

పదము :

యన్తి। అస్య। దేవాః। దేవఽహూతిమ్। ప్రియః।

దేవానామ్। భవతి। యః। ఏవమ్। వేద ॥ 5 ॥

అనువాదం :

అది ఉత్క్రమించినది.
ఆహవనీయాగ్నిలో ప్రవేశించినది.
ఈ విషయం తెలిసినవాడు
దేవతలకు ప్రియుడు అవుతాడు.
దేవతలు అతని ఆహ్వానాన్ని ఆలకిస్తారు. ॥ 4, 5 ॥

మంత్రము :

సోదక్రామత్ సా దక్షిణాగ్నౌ న్యఽక్రామత్ ॥ 6 ॥

పదము.

సా। ఉత్। అక్రామత్। సా। దక్షిణఽఅగ్నౌ। ని। అక్రామత్ ॥6॥

మంత్రము :

యజ్ఞర్తో దక్షిణీయో వాసతేయో భవతి
య ఏవం వేద ॥ 7 ॥

పదము :

యజ్ఞఽఋతః। దక్షిణీయః। వాసతేయః। భవతి।
యః। ఏవమ్। వేద ॥ 7 ॥

**అనువాదం :**

అది ఉత్క్రమించినది.
దక్షిణాగ్నిలో ప్రవేశించినది.
ఇది తెలిసినవాడు, యుక్త రీతిలో
యజ్ఞం చేయగలవాడు,
సమ్మాన యోగ్యుడు, ఇతరులకు
స్థానమివ్వగలవాడు అవుతాడు. ॥ 6, 7 ॥

**మంత్రము :**

సోదక్రామత్ సా సభాయాం న్యఽక్రామత్ ॥ 8 ॥

**పదము :**

సా । ఉత్ । అక్రామత్ । సా । సభాయామ్ । ని । అక్రామత్ ॥8॥

**మంత్రము :**

యన్త్యస్య సభాం సభ్యో భవతి
య ఏవం వేద ॥ 9 ॥

**పదము :**

యన్తి । అస్య । సభామ్ । సభ్యః । భవతి ।
యః । ఏవమ్ । వేద ॥ 9 ॥

**అనువాదం :**

ఆ దేవత ఉత్క్రమించినది.
సభలో ప్రవేశించినది.
ఈ సంగతి నెరిగిన వాడు.
సభ్యు డవుతాడు. ఇతరు లతని సభకు విచ్చేస్తారు. ॥ 8, 9

తము :

క్రామత్ సా సమితౌ న్యక్రామత్ ॥ 10 ॥

ము ;

। ఉత్ । అక్రామత్ । సా । సమ్ఽఇతౌ । ని । అక్రామత్ ॥10॥

త్రము.

స్త్యస్య సమితిం సామిత్యో భవతి య ఏవం వేద ॥11॥

ము

న్తి । అస్య । సమ్ఽఇతిమ్ । సామ్ఽఇత్యః ।

తి । యః । ఏవమ్ । వేద ॥ 11 ॥

నువాదం :

ఆ దేవత ఉత్క్రమించినది.
సమితిలో ప్రవేశించినది. ఈ సంగతి నెరిగిన వాడు
సమితికి యోగ్యు డవుతాడు.
లోకులు అతని సమితికి ఏస్తారు. ॥ 10, 11 ॥

ంత్రము :

దక్రామత్ సామన్త్రణే న్యక్రామత్ ॥ 12 ॥

దము:

। ఉత్ । అక్రామత్ । సా । ఆఽమన్త్రణే । ని। అక్రామత్॥12॥

ంత్రము ;

రు న్త్యస్యామన్త్రణ మామన్త్రణీయో భవతి య ఏవం వేద ॥ 13 ॥

పదము :

యన్తి । అన్య । ఆఽమన్త్రిణమ్ । ఆఽమన్త్రిణీయః ।

భవతి । యః । ఏవమ్ । వేద ॥ 13 ॥

అనువాదం :

ఆ దేవత ఉత్క్రమించినది. యజ్ఞీయములో ప్రవేశించినది.
ఇది తెలిసినవాడు [illegible]
సమాలోచనకై జనం అతని వద్దకు వస్తారు ॥ 12, 13 ॥

## సూక్తం - 10 ( 2 )

ఋషిః అథర్వాచార్యుడు ॥ దేవత : విరాట్ ॥ ఛందస్సు : 1 త్రిపదా సామ్నీ అనుష్టుప్ : 2 ఉష్ణిగ్గర్భా చతుష్పదోపరిష్టాద్ విరాడ్ బృహతీ : 3 ఏకపదా యాజుషీ గాయత్రీ : 4 ఏకపదా సామ్నీ పంక్తిః 5 విరాడ్ గాయత్రీ: 6 ఆర్చ్యనుష్టుప్ : 7 సామ్నీ పంక్తిః 8 ఆసురీ గాయత్రీ : 9 సామ్నీ అనుష్టుప్ : 10 సామ్నీ బృహతీ ॥ మంత్రములు ॥ 10 ॥

మంత్రము :

సోదక్రామత్ సాఽన్తరిక్షే చతుర్ధా విక్రాన్తాఽతిష్ఠత్ ॥ 1 ॥

పదము :

సా । ఉత్ । అక్రామత్ । సా । అన్తరిక్షే ।

చతుఃఽధా । విఽక్రాన్తా । అతిష్ఠత్ ॥ 1 ॥

అనువాదం :

ఆ విరాట్టు ఉత్క్రమించినది.
అంతరిక్షంలో నాలుగు విధాలుగా విడివడి నిలిచినది. ॥ 1 ॥

పమనుష్యా౨ అబ్రువన్నియమేవ తద్ వేద
యు ఉపజీవేమేమా ముప హ్వయామహా ఇతి ॥ 2 ॥

దేవ౨మనుష్యా౨ః । అబ్రువన్ ।
। ఏవ । తత్ । వేద ।
ఉభయే । ఉప౨జీవే ।
। ఉప । హ్వయామహై । ఇతి ॥ 2 ॥

హ్వయన్త ॥ 3 ॥

ఉప । అహ్వయన్త ॥ 3 ॥

వతలు మనుష్యులు ఆమెతో ఇట్లన్నారు -
సంగతి ఆమెకు తెలుసు.
నం ఉభయులం జీవించుటకై
మెను ఆహ్వానిద్దాము. వారిలా ఆహ్వానించినారు. ॥ 2,3 ॥

హి స్వధ ఏహి సూనృత ఏహిరావత్యేహీతి ॥ 4 ॥

వదము :

ఊర్జే। ఆ। ఇహి। స్వధే। ఆ। ఇహి। సూనృతే।

ఆ। ఇహి। ఇరాఽవతి। ఆ। ఇహి। ఇతి ॥ ౪ ॥

అనువాదం :

ఓ శక్తి! ఇటు రా.
ఓ స్వధా! ఇటు రా.
ఓ సత్యమా! ఇటు రా.
ఓ ఇరావతి! (అన్నదాతీ) ఇటు రా. ॥ ౪ ॥

మంత్రము :

తస్యా ఇన్ద్రో వత్స ఆసీద్ గాయత్ర్యఽభిధాన్యభ్రమూధః ॥ ౫ ॥

వదము

తస్యాః। ఇన్ద్రః। వత్సః। ఆసీత్।

గాయత్రీ। అభిఽధానీ। అభ్రమ్। ఊధః ॥ ౫ ॥

అనువాదం :

ఆమెకు ఇంద్రుడు వత్సముగా ఉన్నాడు.
గాయత్రి ఆమెకు పలుపుతాడుగా ఉన్నది.
మేఘం పొదుగుగా ఉన్నది. ॥ ౫ ॥

మంత్రము :

బృహచ్చ రథంతరం చ ద్వౌ స్తనావాస్తాం

యజ్ఞాయజ్ఞియం చ వామదేవ్యం చ ద్వౌ ॥ ౬ ॥

ము :

్రహత్ । చ । రథమ్౨తరమ్ । చ । ద్వౌ । స్తనౌ । ఆస్తామ్ ।

ంజ్ఞాయజ్ఞియమ్ । చ । వామ౨దేవ్యమ్ । చ । ద్వౌ ॥ 6 ॥

ువాదం.

బృహత్, రథన్తరం స్తనద్వయంగా ఉన్నవి.
యజ్ఞాయజ్ఞం, వామదేవ్యం
స్తనద్వయంగా ఉన్నవి. ॥ 6 ॥

ంత్రము :

షధీరేవ రథంతరేణ దేవా అదుహ్రన్ వ్యచో బృహతా ॥ 7 ॥

దము.

షధీః । ఏవ । రథమ్౨తరేణ । దేవాః ।

ుదుహ్రన్ । వ్యచః । బృహతా ॥ 7 ॥

నువాదం :

దేవతలు రథన్తరంతో ఓషధులను
దోహనం చేసినారు.
బృహత్తు నుంచి ఆకాశాన్ని పిదికినారు. ॥ 7 ॥

మంత్రము :

అపో వామదేవ్యేన యజ్ఞం యజ్ఞాయజ్ఞియేన ॥ 8 ॥

పదము.

అపః । వామ౨దేవ్యేన । యజ్ఞమ్ । యజ్ఞాయజ్ఞియేన ॥ 8 ॥

అనువాదం :

వాడు దివ్యంతో జలాన్ని పోషించి చేసినాడు.
యజ్ఞాయజ్ఞీయంతో యజ్ఞాన్ని పెంచినాడు. ॥ 8

మంత్రము :

ఓషధీరేవాస్మై రథంతరం దుహే వ్యచో బృహత్ ॥ 9

పదము :

ఓషధీః । ఏవ । అస్మై । రథమ్ఽతరమ్ ।
దుహే । వ్యచః । బృహత్ ॥ 9 ॥

అనువాదం :

ఇది తెలిసిన వానికి రథంతరం
ఓషధులను పిదుకుతున్నది.
బృహత్తు అవకాశాన్ని ఇస్తున్నది. ॥ 9 ॥

మంత్రము :

అపో వామదేవ్యం యజ్ఞం యజ్ఞాయజ్ఞీయం
య ఏవం వేద ॥ 10 ॥

పదము :

అపః । వామఽదేవ్యమ్ । యజ్ఞమ్ । యజ్ఞాయజ్ఞీయమ్ ।
యః । ఏవమ్ । వేద ॥ 10 ॥

అనువాదం :

వామదేవ్యం జలాన్ని ఇస్తున్నది.
యజ్ఞాయజ్ఞీయం యజ్ఞాన్ని ఇస్తున్నది. ॥ 10 ॥

## సూక్తం-10 ( 3 )

ఋషి: అథర్వాచార్యః ॥ దేవత : విరాట్ ॥ ఛందస్సు : 1 చతుష్పదా విరాడ నుష్టుప్ : 2 ఆర్చీ త్రిష్టుప్ : 3,5,7 చతుష్పదా ప్రాజాపత్యా పంక్తి : 4,6,8 ఆర్చీ బృహతీ ॥ మంత్రములు ॥ ॥ 8 ॥

మంత్రము

సోదక్రామత్ సా వనస్పతీనాగచ్ఛత్ తాం

వనస్పతయోఽఘ్నత సా సంవత్సరే సమభవత్ ॥ 1 ॥

పదము

సా । ఉత్ । అక్రామత్ । సా । వనస్పతీన్ । ఆ । అగచ్ఛత్ । తామ్ ।

వనస్పతయః । అఘ్నత । సా ।

సమ్ఽవత్సరే । సమ్ । అభవత్ ॥ 1 ॥

మంత్రము

తస్మాద్ వనస్పతీనాం సంవత్సరే వృక్ణమపి రోహతి

వృశ్చతేఽస్యాప్రియో భ్రాతృవ్యో య ఏవం వేద ॥ 2 ॥

పదము :

తస్మాత్ । వనస్పతీనామ్ । సమ్ఽవత్సరే ।

వృక్ణమ్ । అపి । రోహతి ।

వృశ్చతే । అస్య । అప్రియః । భ్రాతృవ్యః ।

యః । ఏవమ్ । వేద ॥ 2 ॥

అనువాదం:

విరాట్టు ఉత్క్రమించినది. ఓషధుల వద్దకు వచ్చినది.
ఆ వనస్పతులు ఆమెను వధించినవి.
సంవత్సరం తరువాత ఆమె తిరిగి జీవించినది.
ఆ తరువాతి
సంవత్సరములో ఓషధుల వ్రణములు మానిపోయినవి.
ఈ సంగతి తెలిసిన వాడు
తన శత్రువు గాయపడడం చూస్తాడు. ॥ 1, 2 ॥

మంత్రము:

సోదక్రామత్ సా పితౄనాగచ్ఛత్ తాం
పితరోఽఘ్నత సా మాసి సమభవత్ ॥ 3 ॥

పదము:

సా । ఉత్ । అక్రామత్ । సా । పితౄన్ । ఆ । అగచ్ఛత్ । తామ్।
పితరః । అఘ్నత । సా । మాసి । సమ్ । అభవత్ ॥ 3 ॥

మంత్రము:

తస్మాత్ పితృభ్యో మాస్యుపమాస్యం దదతి
ప్ర పితృయాణం పన్థాం జానాతి య ఏవం వేద ॥ 4 ॥

పదము:

తస్మాత్ । పితృఽభ్యః । మాసి । ఉపఽమాస్యమ్ । దదతి ।
ప్ర । పితృఽయానమ్ । పన్థామ్ ।
జానాతి । యః । ఏవమ్ । వేద ॥ 4 ॥

**అనువాదం :**

ఆమె ఉత్క్రమించినది. పితరుల వద్దకు వచ్చినది.
వారు ఆమెను చంపివేసినారు.
ఒక నెలలో ఆమె పునరుజ్జీవిత అయినది.
ఈ సంగతి తెలిసినవాడు
పితృయాన మార్గాన్ని తెలుసుకో గలడు.
అందువల్ల పితరులకు మాసికాలు పెడతాడు.
ఇది తెలిసినవాడు పితరుల మార్గం తెలుసుకుంటాడు ॥3, 4॥

**మంత్రము :**

సోదక్రామత్ సా దేవానాగచ్ఛత్
తాం దేవా అఘ్నత సార్ధమాసే సమభవత్ ॥ 5 ॥

**పదము :**

సా । ఉత్ । అక్రామత్ । సా । దేవాన్ । ఆ । అగచ్ఛత్ ।
తామ్ । దేవాః । అఘ్నత । సా ।అర్ధఽమాసే। సమ్ । అభవత్॥5॥

**మంత్రము :**

తస్మాద్ దేవేభ్యోఽర్ధమాసే వషట్ కుర్వన్తి
ప్ర దేవయానం పన్థాం జానాతి య ఏవం వేద ॥ 6 ॥

**పదము :**

తస్మాత్ । దేవేభ్యః । అర్ధఽమాసే । వషట్ । కుర్వన్తి ।
ప్ర । దేవఽయానమ్ । పన్థామ్ । జానాతి । యః । ఏవమ్ । వేద
॥ 6 ॥

అనువాదం :

ఓ శాలా! మా పాశమును వదలి పెట్టు వద్దు.
గురుతరమైన భారం తేలికగు గాక!
వధువును వలె కోరిన చోటుకు నిన్ను కొనిపోతాము. ॥24॥

మంత్రము :

ప్రాచ్యా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేభ్యః ॥ 25 ॥

పదము :

ప్రాచ్యాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేభ్యః ॥ 25 ॥

అనువాదం :

ఈ ఇంటి ప్రాచ్య దిక్కునకు నమస్కారం.
దాని మహిమకు నమస్కారం.
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగు గాక! ॥ 25 ॥

మంత్రము :

దక్షిణాయా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేభ్యః ॥ 26 ॥

పదము :

దక్షిణాయాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేభ్యః ॥ 26 ॥

అనువాదం,

ఈ ఇంటి దక్షిణ దిశకు నమస్కారం.
దాని మహిమకు నమస్కారం.
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుతమగు గాక ॥ 26 ॥

మంత్రము.

ప్రతీచ్యా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేఽభ్యః ॥ 27 ॥

పదము।

ప్రతీచ్యాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేఽభ్యః ॥ 27 ॥

అనువాదం.

ఈ ఇంటి పశ్చిమ దిశకు నమస్కారం.
దాని మహిమకు నమస్కారం.
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగు గాక! ॥ 27 ॥

మంత్రము.

ఉదీచ్యా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేఽభ్యః ॥ 28 ॥

పదము।

ఉదీచ్యాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేఽభ్యః ॥ 28 ॥

అనువాదం :

ఈ ఇంటి ఉత్తర దిశకు నమస్కారం.
దాని మహిమకు నమస్కారం.
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగు గాక! ॥ 28 ॥

మంత్రము :

ధ్రువాయా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేభ్యః ॥ 29 ॥

పదము :

ధ్రువాయాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేభ్యః ॥ 29 ॥

అనువాదం :

ఈ ఇంటి క్రింది దిశకు నమస్కారం.
దాని మహిమకు నమస్కారం.
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగు గాక! ॥ 29 ॥

మంత్రము :

ఊర్ధ్వాయా దిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేభ్యః ॥ 20 ॥

పదము :

ఊర్ధ్వాయాః । దిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేభ్యః ॥ 30 ॥

అనువాదం।

ఈ ఇంటి ఊర్ధ్వ దిశకు నమస్కారం,
దాని మహిమకు నమస్కారం
ఆ వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగుగాక! ॥ 30 ॥

మంత్రము।

దిశోదిశః శాలాయా నమో
మహిమ్నే స్వాహా దేవేభ్యః స్వాహ్యేఽభ్యః ॥ 31 ॥

పదము.

దిశఃఽదిశః । శాలాయాః । నమః ।
మహిమ్నే । స్వాహా । దేవేభ్యః । స్వాహ్యేఽభ్యః ॥ 31 ॥

అనువాదం.

ఈ ఇంటి దిక్కులకు, విదిక్కులకు నమస్కారం.
వాటి మహిమకు నమస్కారం.
వాటి వైపున ఉన్న దేవతలకు స్వాహుత మగుగాక!
॥ 31 ॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం–4

ఋషి: బ్రహ్మ॥ దేవత: ఋషభుడు॥ ఛందస్సు: 1–5,7,9,22 త్రిష్టుప్; 6,10,24 జగతి; 8 భురిక్ త్రిష్టుప్; 11–17,19,20,23 అనుష్టుప్, 18 ఉపరిష్టాద్ బృహతి; 21 ఆస్తార పంక్తి॥ మంత్రములు: ॥ 24 ॥

వినియోగం:– బ్రాహ్మణుడు వృషభాన్ని వధించి దాని మాంసాన్ని తిన్న తిన్న, దేవతలకై హోమం చేస్తాడు. ఆ సమయంలో వృషభాన్ని గూర్చిన ప్రశంస, దాని ఏ అంగములు ఏ దేవతలకు ప్రియములు

అను వివేచనం ఇందులో కలదు. వృషభ బలి హవన మహత్త్వం దాని వలన కలిగే శ్రేయస్సు కూడా ఇచ్చట వర్ణించబడినది.

వృషోత్సర్గంలో ఈ అర్థసూక్తంతో ఋషభాన్ని అభిమంత్రించి వదలి పెట్టాలి.

'ఏకం వో యువానమ్' అనే మంత్రంతో దూడను అభిమంత్రించి ప్రోక్షణం చెయ్యాలి.

అట్లే దీనితో పుష్టికాముడు వశావిధానంతో ఋషభంతో ఇంద్రుని యజిస్తాడు.

అట్లే దీనితో సంపత్కాముడు పూర్ణిమనాడు వశావిధానంతో తెల్లని ఋషభంతో ఇంద్రుని యజిస్తాడు.

అట్లే ఋషభ సవనంలో దీనితో నిరుప్తహవిరభిమర్శనం, దానం చేయాలి.

పరిశిష్ట మైన వృషోత్సర్గంలో కూడా దీనికి వినియోగం.

మంత్రము:

సాహస్ర స్త్వేష ఋషభః పయస్వాన్
విశ్వా రూపాణి వక్షణాసు బిభ్రత్ ।
భద్రం దాత్రే యజమానాయ శిక్షన్
బార్హస్పత్య ఉస్రియ స్తన్తు మాతాన్ ॥ 1 ॥

పదము:

సాహస్రః । త్వేషః । ఋషభః । పయస్వాన్ ।
విశ్వా । రూపాణి । వక్షణాసు । బిభ్రత్ ।

భద్రమ్ । దాత్రే । యజమానాయ । శిక్షన్ ।

బార్హస్పత్యః । ఉస్రియః । తన్తుమ్ । ఆ । అతాన్ ॥ 1 ॥

అనువాదం

సహస్ర శక్తియుక్తము, తేజస్వి,
క్షీరసహితము అయిన ఋషభం,
నదీతీరములలో బహు రూపములను, ధరించి ఉన్నది.
బృహస్పతికి సంబంధించిన ఇది
దాన మిచ్చే యజమానునకు కల్యాణకారియై
యజ్ఞములకు, సహాయపడుతుంది. ॥ 1 ॥

మంత్రము:

అపాం యో అగ్రే ప్రతిమా బభూవ
ప్రభూః సర్వస్మై పృథివీవ దేవీ ।
పితా వత్సానాం పతి రఘ్న్యానాం
సాహస్రే పోషే అపి నః కృణోతు ॥ 2 ॥

పదము:

అపామ్ । యః । అగ్రే । ప్రతిఽమా । బభూవ ।

ప్రఽభూః । సర్వస్మై । పృథివీఽఇవ । దేవీ ।

పితా । వత్సానామ్ । పతిః । అఘ్న్యానామ్ ।

సాహస్రే । పోషే । అపి । నః । కృణోతు ॥ 2 ॥

అనువాదం :

ఏది జలములకు ప్రతిమాన మైనదో,
దేవి పృథివి వలె అన్నిటికి ప్రభావదాత్రి అయి,
వత్సములకు స్వామి అయి,
గోవులకు పతి అయి ఉన్న ఈ ఋషభం వేయి విధాలా
మమ్ము పోషించుగాక ! ॥ 2 ॥

మంత్రము :

పుమా న న్తర్వా న్త్స్థవిరః పయస్వాన్
వసోః కబన్ధ మృషభో బిభర్తి ।
త మిన్ద్రాయ పథిభి ర్దేవయానై-
ర్హుత మగ్ని ర్వహతు జాతవేదాః ॥ 3 ॥

పదము :

పుమాన్ । అన్తఃఽవాన్ । స్థవిరః । పయస్వాన్ ।
వసోః । కబన్ధమ్ । ఋషభః । బిభర్తి ।
తమ్ । ఇన్ద్రాయ । పథిఽభిః । దేవఽయానైః ।
హుతమ్ । అగ్నిః । వహతు । జాతఽవేదాః ॥ 3 ॥

అనువాదం :

ఇది పురుషరూపము. దీనిలో శక్తి ఉన్నది.
ఇది సమర్థవంతమైనది. శక్తిమంతమైనది.
ఈ ఋషభం ధనశరీరధారణం చేస్తున్నది.
దేవయాన మార్గంలో ఇది సమర్పిత మైనది.
అగ్ని ఇంద్రునికై దీనిని కొనిపోవు గాక ! ॥ 3 ॥

మంత్రము :

పితా వత్సానాం పతి రఘ్న్యానా

మథో పితా మహతాం గర్గరాణామ్ ।

వత్సో జరాయు ప్రతిధుక్ పీయూష

ఆమిక్షా ఘృతం తద్ వస్య రేతః ॥ 4 ॥

పదము :

పితా । వత్సానామ్ । పతిః । అఘ్న్యానామ్ ।

అథో ఇతి । పితా । మహతామ్ । గర్గరాణామ్ ।

వత్సః । జరాయు । ప్రతిఽధుక్ । పీయూషః ।

ఆమిక్షా । ఘృతమ్ । తత్ । ఓం ఇతి । అస్య । రేతః ॥ 4 ॥

అనువాదం :

వత్సములకు పిత, గోవులకు పతి,
మహా ప్రవాహములకు పాలకుడు, వత్సము,
జరాయువు, ప్రతిదినం దోహనం చేసే
అమృతము, పెరుగు, నెయ్యి ఇచ్చునది.
తప్పకుండా ఇది దీని రేతస్సు. ॥ 4 ॥

మంత్రము :

దేవానాం భాగ ఉపనాహ ఏషో

అపాం రస ఓషధీనాం ఘృతస్య ।

అథర్వ. iv 19

సోమస్య భక్ష మవృణీత శక్రో
బృహ న్నద్రి రభవద్ యచ్ఛరీరమ్ ॥ 5 ॥

పదము:

దేవానామ్ । భాగః । ఉపఽనాహః । ఏషః ।
అపామ్ । రసః । ఓషధీనామ్ । ఘృతస్య ।
సోమస్య । భక్షమ్ । అవృణీత । శక్రః ।
బృహన్ । అద్రిః । అభవత్ । యత్ । శరీరమ్ ॥ 5 ॥

అనువాదం:

ఇది దేవతలకు సమీపంలో నున్న భాగము.
ఉదకములకు, ఓషధులకు, ఘృతమునకు
సంబంధించిన రసమిది.
ఈ సోమరసం ఇంద్రునకు ప్రాప్తించినది.
దీని శరీరం పెనుమబ్బు వంటిది. ॥ 5 ॥

మంత్రము:

సోమేన పూర్ణం కలశం బిభర్షి
త్వష్టా రూపాణాం జనితా పశూనామ్ ।
శివా స్తే సన్తు ప్రజన్వఽ ఇహ యా ఇమా
న్య1స్మభ్యం స్వధితే యచ్ఛ యా అమూః ॥ 6 ॥

పదము :

సోమేన । పూర్ణమ్ । కలశమ్ । బిభర్షి ।

త్వష్టా । రూపాణామ్ । జనితా । పశూనామ్ ।

శివాః । తే । సన్తు । ప్రఽజన్వఽః । ఇహ । యాః । ఇమాః ।

ని । అస్మభ్యమ్ । స్వఽధితే । యచ్ఛ । యాః । అమూః ॥ 6 ॥

అనువాదం :

సోమపూర్ణమైన కలశాన్ని నీవు ధరిస్తున్నావు.
నీవు రూపస్రష్టవు.
పశువులకు ఉత్పాదకుడవు.
నీ సంతానం మాకు శుభమును కలిగించు గాక!
ఇక్కడ నున్న వీనిని మాకు ప్రసాదించు. ॥ 6 ॥

మంత్రము :

ఆజ్యం బిభర్తి ఘృత మస్య రేతః

సాహస్రః పోష స్తము యజ్ఞ మాహుః ।

ఇన్ద్రస్య రూప మృషభో వసానః

సో అస్మాన్ దేవాః శివ ఐతు దత్తః ॥ 7 ॥

పదము :

ఆజ్యమ్ । బిభర్తి । ఘృతమ్ । అస్య । రేతః ।

సాహస్రః । పోషః । తమ్ । ఓం ఇతి । యజ్ఞమ్ । ఆహుః ।

ఇన్ద్రస్య । రూపమ్ । ఋషభః । వసానః ।

సః । అస్మాన్ । దేవాః । శివః । ఆ । ఏతు । దత్తః ॥ 7

అనువాదం:

దీని ఘృతము, ఆజ్యము రేతస్సును ధరిస్తున్నది.
అది వేలాది మందికి పోషకమై ఉన్నది.
దానిని యజ్ఞ మంటారు.
వృషభం ఇంద్రరూపం ధరించింది.
ఓ దేవతలారా! దీనిని దానం చేసిన
మాకు శుభములు కలుగు గాక! ॥ 7

మంత్రము:

ఇన్ద్ర స్యౌజో వరుణస్య బాహూ
అశ్వినో రంసౌ మరుతా మియం కకుత్ ।
బృహస్పతిం సంభృత మేత మాహు
ర్యే ధీరాసః కవయో యే మనీషిణః ॥ 8

పదము:

ఇన్ద్రస్య । ఓజః । వరుణస్య । బాహూ ఇతి ।

అశ్వినోః । అంసౌ । మరుతామ్ । ఇయమ్ । కకుత్ ।

బృహస్పతిమ్ । సమ్ऽభృతమ్ । ఏతమ్ । అహుః ।

యే । ధీరాసః । కవయః । యే । మనీషిణః ॥ 8

అనువాదం :

ధీరులు మనీషులు, కవులు
దీనిని సంభావితమైన బృహస్పతిగా చెప్తారు.
ఇది ఇంద్రుని ఓజస్సు, వరుణునకు బాహువు,
అశ్వినీ దేవతలకు భుజశిరస్సులు,
మరుత్తులకు మూపురము. ॥ 8 ॥

మంత్రము.

దైవీర్విశః పయస్వానా తనోషి
త్వామిన్ద్రం త్వాం సరస్వన్త మాహుః ।
సహస్రం స ఏకముఖా దదాతి
యో బ్రాహ్మణ ఋషభ మాజుహోతి ॥ 9 ॥

పదము

దైవీః । విశః । పయస్వాన్ । ఆ । తనోషి ।
త్వామ్ । ఇన్ద్రమ్ । త్వామ్ । సరస్వన్తమ్ । ఆహుః ।
సహస్రమ్ । సః । ఏకఽముఖాః । దదాతి ।
యః । బ్రాహ్మణే । ఋషభమ్ । ఆఽజుహోతి ॥ 9 ॥

అనువాదం :

నీవు పయస్వంతుడవు.
దివ్య గుణములు గల ప్రజలకు ఉత్పాదకుడవు.
నిన్ను ఇంద్రుడుగాను,

సారవంతుడుగాను చెప్తారు.
వృషభదానం చేసిన బ్రాహ్మణుడు,
ఏకముఖుడై అనేక వేల గోవులను
దానం చేసినవా డవుతాడు. ॥ 9

మంత్రము :

బృహస్పతిః సవితా తే వయో దధౌ
త్వష్టు ర్వాయోః పర్యాత్మా త ఆభృతః ।
అన్తరిక్షే మనసా త్వా జుహోమి
బర్హిష్టే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 10 ।

పదము :

బృహస్పతిః । సవితా । తే । వయః । దధౌ ।
త్వష్టుః । వాయోః । పరి । ఆత్మా । తే । ఆఽభృతః ।
అన్తరిక్షే । మనసా । త్వా । జుహోమి ।
బర్హిః । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 10 ॥

అనువాదం :

బృహస్పతి, సవిత నీకు ఆయుస్సు నిస్తున్నారు.
నీ ఆత్మ త్వష్ట, వాయువులతో పరిపూర్ణ మైనది.
మనస్సుతో నిన్ను అంతరిక్షంలో అర్పణ చేస్తున్నాను.
ద్యావా పృథువులు రెండూ నీకు ఆసన మైనవి ॥ 10 ॥

మంత్రము :

య ఇన్ద్ర ఇవ దేవేషు

గోష్వేతి వివావదత్ ।

తస్య ఋషభ స్యాఙ్గాని

బ్రహ్మా సం స్తౌతు భద్రయా ॥ 11 ॥

పదము :

యః । ఇన్ద్రఃఽఇవ । దేవేషు ।

గోషు । ఏతి । విఽవావదత్ ।

తస్య । ఋషభస్య । అఙ్గాని ।

బ్రహ్మా । సమ్ । స్తౌతు । భద్రయా ॥ 11 ॥

అనువాదం :

దేవతలలో ఇంద్రుని వలె గోవులలో
రంకె వేస్తూ తిరుగునది వృషభము.
ఈ వృషభ అంగములను శుభంకరమైన
వాక్కులతో బ్రహ్మ ప్రశంసిస్తాడు. ॥ 11 ॥

పార్శ్వే ఆస్తా మనుమత్యా భగస్యాస్తా మనూవృజౌ ।

అష్ఠీవన్తా వబ్రవీ న్మిత్రో మమైతౌ కేవలా వితి ॥ 12 ॥

పదము :

పార్శ్వే ఇతి । ఆస్తామ్ । అనుఽమత్యాః ।

భగస్య । ఆస్తామ్ । అనుఽవృజౌ ।

అష్ఠీవన్తౌ । అబ్రవీత్ । మిత్రః ।

మమ । ఏతౌ । కేవలౌ । ఇతి ॥ 12

అనువాదం :

నీ పార్శ్వములు అనుమతికి చెందినవి.
ప్రక్కలు రెండూ భగునకు చెందినవి.
మిత్రు డన్నాడు కదా 'అవి పూర్తిగా నాంవే'. ॥ 12

మంత్రము :

భస దాసి దాదిత్యానాం శ్రోణీ ఆస్తాం బృహస్పతేః ।
పుచ్ఛం వాతస్య దేవస్య తేన ధూనో త్యోషధీః ॥ 13

పదము :

భసత్ । ఆసీత్ । ఆదిత్యానామ్ ।

శ్రోణీ ఇతి । ఆస్తామ్ । బృహస్పతేః ।

పుచ్ఛమ్ । వాతస్య । దేవస్య ।

తేన । ధూనోతి । ఓషధీః ॥ 13

అనువాదం :

పృష్ఠము ఆదిత్యులకు చెందినది.
పిరుదులు బృహస్పతికి చెందినవి.

పుచ్ఛము వాయుదేవునకు చెందినది
దానితో ఓషధుల నిది కదిలించి వేస్తుంది ॥ 13 ॥

మంత్రము

గుదా అస న్త్సినీవాల్యాః సూర్యాయా స్త్వచ మబ్రువన్।
ఉత్థాతు రబ్రువన్ పద ఋషభం య దకల్పయన్ ॥ 14 ॥

పదము

గుదాః । అసన్ । సినీవాల్యాః ।
సూర్యాయాః । త్వచమ్ । అబ్రువన్ ।
ఉత్థాతుః । అబ్రువన్ । పదః ।
ఋషభమ్ । యత్ । అకల్పయన్ ॥ 14 ॥

అనువాదం :

పాయువు సినీవాలికి చెందినది.
చర్మము సూర్యునకు చెందిన దంటారు.
పాదములు ఉత్థాతకు చెందినవి.
ఈ విధంగా ఋషభాన్ని కల్పించినట్లు చెప్తారు. ॥ 14 ॥

మంత్రము :

క్రోడ ఆసీ జ్జామిశంసస్య సోమస్య కలశో ధృతః ।
దేవాః సంగత్య యత్ సర్వ ఋషభం వ్యకల్పయన్ ॥15॥

పదము :

క్రోడః । ఆసీత్ । జామిఽశంసస్య ।

సోమస్య । కలశః । ధృతః ।

దేవాః । సమ్ఽగత్య । యత్ । సర్వే ।

ఋషభమ్ । విఽఅకల్పయన్ ॥ 15 ॥

అనువాదం:

ముఖం జామిశంసకు చెందినది.
కలశాన్ని సోముడు ధరిస్తున్నాడు.
సర్వ దేవతలు కలిసి వృషభాన్ని కల్పించినారు. ॥ 15 ॥

మంత్రము :

తే కుష్ఠికాః సరమాయై కూర్మేభ్యో అదధుః శఫాన్ ।

ఊబధ్య మస్య కీటేభ్యః శ్వవర్తేభ్యో అధారయన్ ॥ 16 ॥

పదము :

తే । కుష్ఠికాః । సరమాయై । కూర్మేభ్యః । అదధుః । శఫాన్ ।

ఊబధ్యమ్ । అస్య । కీటేభ్యః । శ్వఽవర్తేభ్యః । అధారయన్ ॥ 16 ॥

అనువాదం:

కడుపును సరమకై ధరిస్తున్నారు.
ఖురములు, కూర్మములచే ధరింప బడినవి.
దీని ఆహారాన్ని శునకములు, కీటకములు ధరించినవి. ॥ 16 ॥

మంత్రము:

శృఙ్గాభ్యాం రక్ష ఋష త్యవర్తిం హన్తి చక్షుషా ।

శృణోతి భద్రం కర్ణాభ్యాం గవాం యః పతి రఘ్న్యః ॥17॥

పదము.

శృఙ్గాభ్యామ్ । రక్షః । ఋషతి ।

అవర్తిమ్ । హన్తి । చక్షుషా ।

శృణోతి । భద్రమ్ । కర్ణాభ్యామ్ ।

గవామ్ । యః । పతిః । అఘ్న్యః ॥ 17 ॥

అనువాదం.

ఈ గోపతి హననార్హుడు కాడు.
చెవులతో కల్యాణ వాక్కులను వింటాడు.
కొమ్ములతో రాక్షసులను తరిమివేస్తాడు.
కన్నులతో అకాలికమైన వానిని పోగొడుతాడు. ॥ 17 ॥

మంత్రము:

శతయాజం స యజతే

నైనం దున్వ న్త్యగ్నయః ।

జిన్వన్తి విశ్వే తం దేవా

యో బ్రాహ్మణ ఋషభ మాజుహోతి ॥ 18 ॥

పదము :

శత౨యాజమ్ । సః । యజతే ।

న । ఏనమ్ । దున్వన్తి । అగ్నయః ।

జిన్వన్తి । విశ్వే । తమ్ । దేవాః ।

యః । బ్రాహ్మణే । ఋషభమ్ । ఆ౨జుహోతి ॥ 18 ॥

అనువాదం :

ఏ బ్రాహ్మణుడైతే వృషభాన్ని సమర్పిస్తాడో,
అతనిని విశ్వే దేవతలు తృప్తిపరుస్తారు.
అతను శతయాజకులతో యజ్ఞం చేస్తాడు.
అతనిని అగ్నులు బాధించవు. ॥ 18 ॥

మంత్రము :

బ్రాహ్మణేభ్య ఋషభం దత్త్వా

వరీయః కృణుతే మనః ।

పుష్టిం సో అఘ్న్యానాం

స్వే గోష్ఠే౨వ పశ్యతే ॥ 19 ॥

పదము :

బ్రాహ్మణేభ్యః । ఋషభమ్ । దత్త్వా ।

వరీయః । కృణుతే । మనః ।

పుష్టిమ్ । సః । అఘ్న్యానామ్ ।

స్వే । గోఽస్థే । అవ । పశ్యతే ॥ 19 ॥

అనువాదం.

బ్రాహ్మణునకు వృషభాన్ని దానం చేసి
తన మనసు నెవడైతే ఉత్కృష్టం చేసుకుంటాడో,
అతను తన గోష్ఠం లోని గోవులు
పుష్టి చెందడం చూస్తాడు. ॥ 19 ॥

మంత్రము.

గావః సన్తు ప్రజాః స న్త్వథో అస్తు తనూబలమ్ ।

తత్ సర్వ మను మన్యన్తాం దేవా ఋషభదాయినే ॥ 20 ॥

పదము।

గావః । సన్తు । ప్రఽజాః । సన్తు ।

అథో ఇతి । అస్తు । తనూఽబలమ్ ।

తత్ । సర్వమ్ । అను । మన్యన్తామ్ ।

దేవాః । ఋషభఽదాయినే ॥ 20 ॥

అనువాదం:

గోవులు ఉండు గాక!
ప్రజ లుందురు గాక!
శరీరబలం అలవడు గాక!
ఇవన్నీ వృషభదాతకై దేవతలు అనుమతిస్తారు. ॥ 20 ॥

మంత్రము:

అయం పిపాన ఇన్ద్ర ఇద్ రయిం దధాతు చేతనీమ్।

అయం ధేనుం సుదుఘాం నిత్యవత్సాం

వశం దుహాం విపశ్చితం పరో దివః ॥ 21 ॥

పదము:

అయమ్। పిపానః। ఇన్ద్రః। ఇత్।

రయిమ్। దధాతు। చేతనీమ్।

అయమ్। ధేనుమ్। సుఽదుఘామ్। నిత్యఽవత్సామ్।

వశమ్। దుహామ్। విపఃఽచితమ్। పరః। దివః ॥ 21 ॥

అనువాదం:

ఈ పుష్టిగల ఇంద్రుడు
చైతన్యాన్ని, ధనాన్ని ధరిస్తున్నాడు.
అలాగే ఇంద్రుడు ఉత్తమ దోహనయోగ్య మైన
నిత్యవత్స మైన గోవును
తన వశంలో ఉంచుకుంటాడు.
దీనిని శ్రేష్ఠమైన ద్యులోకం నుంచి
కొని వచ్చినాడు. ॥ 21 ॥

మంత్రము:

పిశఙ్గరూపో నభసో వయోధా

ఐన్ద్రః శుష్మో విశ్వరూపో న ఆగన్।

ఆయు రస్మభ్యం దధత్ ప్రజాం చ

రాయశ్చ పోషై రభి నః సచతామ్ ॥ 22 ॥

పదము.

పిశఙ్గఽరూపః । నభసః । వయఃఽధాః ।

ఐన్ద్రః । శుష్మః । విశ్వఽరూపః । నః । ఆ । అగన్ ।

ఆయుః । అస్మభ్యమ్ । దధత్ । ప్రఽజామ్ । చ ।

రాయః । చ । పోషైః । అభి । నః । సచతామ్ ॥ 22 ॥

అనువాదం :

పిశంగ రూపము, ఆకాశం నుంచి
ఇంద్ర సంబంధమైన బలాన్ని కల్పించునది.
విశ్వరూపమైన అన్నాన్ని ధరించునది.
ఆయుస్సును, సంతానాన్ని, ధనాన్ని
మాకై ధరించునది - అయిన ఇది
మాకు ప్రాప్తించు గాక ! ॥ 22 ॥

మంత్రము.

ఉపే హోపపర్చ నాస్మిన్ గోష్ఠ ఉప పృఞ్చ నః ।

ఉప ఋషభస్య యద్ రేత ఉపేన్ద్ర తవ వీర్యఽమ్ ॥23॥

పదము :

ఉప । ఇహ । ఉపఽపర్చన । అస్మిన్ ।

గోఽస్థే । ఉప । పృఞ్చ । నః ।

ఉప । ఋషభస్య । యత్ । రేతః ।

ఉప । ఇన్ద్ర । తవ । వీర్యఽమ్ ॥ 23 ॥

అనువాదం :

ఈ గోష్ఠంలో సమీపంలో ఉంది,
మాకు ఇది లభించినది.
ఈ వృషభానికి చెందిన వీర్యం
నీ వీర్యంతో పాటూ ఓ ఇంద్రా !
మాకు లభించు గాక ! ॥ 23

మంత్రము :

ఏతం వో యువానం ప్రతి దధ్మో అత్ర
తేన క్రీడన్తీ శ్చరత వశాం అను ।
మా నో హాసిష్ట జనుషా సుభాగా
రాయశ్చ పోషై రభి నః సచధ్వమ్ ॥ 24

పదము :

ఏతమ్ । వః । యువానమ్ । ప్రతి । దధ్మః । అత్ర ।
తేన । క్రీడన్తీః । చరత । వశాన్ । అను ।
మా । నః । హాసిష్ట । జనుషా । సుఽభాగాః ।
రాయః । చ । పోషైః । అభి । నః । సచధ్వమ్ ॥ 24

**అనువాదం :**

ఈ యువకుని మీకై సమర్పిస్తున్నాము.
దీని వద్ద క్రీడిస్తూ, సంచరిస్తూ,
ఇచ్ఛవచ్చిన చోటికి వెళ్ళు.
ఓ సుభగ వృషభమా! జన్మముతో
పాటు మమ్ము త్యాగం చెయ్యకు.
పోషించే ధనములను మాకు ప్రసాదించు. ॥ 24 ॥

ఇది నాల్గవ సూక్తం

ఇది రెండవ అనువాకం.

# అనువాకం: 3

## సూక్తం – 5

ఋషి; భృగువు॥ దేవతలు; అజము, పంచౌదనుడు॥ ఛందస్సు; 1,2,5–9 11–13,15,19,23 త్రిష్టుప్; 3 చతుష్పదా పురోఽతిశక్వరీ జగతీ, 4,10 జగతీ; 14,17,27–29 అనుష్టుప్; 30 కకుమ్మత్యనుష్టుప్; 16 త్రిపదానుష్టుప్; 18,37 త్రిపదా విరాడ్ గాయత్రీ; 20–22,26 పఞ్చపదానుష్టు బుష్ణిగ్గర్భోపరిష్టాద్ బార్హతా భురిక్ (?); 28 పుర ఉష్ణిక్; 24 పఞ్చపదాఽనుష్టు బుష్ణిగ్గర్భోపరిష్టాద్ బార్హతా విరాడ్ జగతీ; 31 సప్తపదాఽష్టిః; 32–35 దశపదా ప్రకృతిః; 36 దశపదాఽఽకృతిః; 38 ద్విపదా సామ్నీ త్రిష్టుప్ (ఏకావసానా)॥ మంత్రములు; ॥ 38 ॥

వినియోగం:– పంచౌదన సవంలో ఈ అర్థసూక్తానికి వినియోగం. దీనితో నిరుప్త హవిరభిమర్శనం, దానం చేయాలి.

అట్లే పశుయాగంలో దీనితో అపరాజిత నుండి తెచ్చిన మేకను అనుమంత్రించాలి.

అట్లే అగ్నిచయనంలో పునశ్చితిలో 'యేనా సహస్రమ్' అనే మంత్రంతో గార్హపత్యాగ్నిలో తీసుకొనిన ఇటుకను బ్రహ్మ అనుమంత్రించాలి.

అష్టే అదే కర్మలో వైశ్వ కర్మణ హోమాను మంత్రణంలో
దీనికి వినియోగం.

మంత్రము :

ఆ నయైత మా రభస్వ సుకృతాం

లోక మపి గచ్ఛతు ప్రజానన్ ।

తీర్త్వా తమాంసి బహుధా మహా

న్త్యజో నాకమా క్రమతాం తృతీయమ్ ॥ 1 ॥

పదము :

ఆ । నయ । ఏతమ్ । ఆ । రభస్వ । సు౽కృతామ్ ।

లోకమ్ । అపి । గచ్ఛతు । ప్ర౽జానన్ ।

తీర్త్వా । తమాంసి । బహు౽ధా । మహాన్తి ।

అజః । నాకమ్ । ఆ । క్రమతామ్ । తృతీయమ్ ॥ 1 ॥

అనువాదం :

దీని నిక్కడకు తీసుకొనిరా.
కర్మను అరంభించు.
దీనికి మార్గం తెలుసు.
సత్కర్మ చేసిన వారు వెళ్ళే చోటు కిది వెడుతుంది.
మార్గంలో గాఢాంధకార ప్రాంతాలను
అనేక విధాల దాటి ఈ అజము ( మేక )
మూడవ స్వర్గానికి వెళ్ళు గాక! ॥ 1 ॥

మంత్రము।

ఇన్ద్రాయ భాగం పరి త్వా నయా-

మ్యస్మిన్ యజ్ఞే యజమానాయ సూరిమ్।

యే నో ద్విష న్త్యను తాన్ రభ

స్వానాగసో యజమానస్య వీరాః ॥ 2 ॥

పదము।

ఇన్ద్రాయ। భాగమ్। పరి। త్వా। నయామి।

అస్మిన్। యజ్ఞే। యజమానాయ। సూరిమ్।

యే। నః। ద్విష న్తి। అను। తాన్। రభస్వ।

అనాగసః। యజమానస్య। వీరాః ॥ 2 ॥

అనువాదం।

ఈ యజ్ఞంలో ఇంద్రుని కోసం,
యజమాని కోసం భాగములను చేసి,
వారు కొని పోవు నట్లు చేస్తాను.
మమ్ము ద్వేషించే వారిని నాశం చేయడానికి అరంభించు.
యజమానునకు చెందిన వీరులు
పాపరహితు లగుదురు గాక! ॥ 2 ॥

మంత్రము।

ప్ర పదోఽవ నేనిగ్ధి దుశ్చరితం య చ్చచార

శుద్ధైః శఫై రా క్రమతాం ప్రజానన్।

తీర్త్వా తమాంసి బహుధా విపశ్య
న్నజో నాకమా క్రమతాం తృతీయమ్ ॥ 3

పదము :

ప్ర । పదః । అవ । నేనిగ్ధి । దుః౽చరితమ్ । యత్ । చచార ।
శుద్ధైః । శఫైః । ఆ । క్రమతామ్ । ప్ర౽జానన్ ।
తీర్త్వా । తమాంసి । బహు౽ధా । వి౽పశ్యన్ ।
అజః । నాకమ్ । ఆ । క్రమతామ్ । తృతీయమ్ ॥ 3

అనువాదం :

ఏ దుశ్చరిత మైతే చేసినదో
దానిని దీని పాదముల నుండి ప్రక్షాళనం చెయ్యి.
పిదప పరిశుద్ధమైన గిట్టలతో
మార్గం తెలుసుకుంటూ ఇది వెళ్ళు గాక!
మార్గంలో గాఢాంధకార ప్రాంతాలను చూచుకుంటూ
వాటిని బహు విధాల దాటి ఈ అజము
మూడవ నాకమునకు వెళ్ళు గాక! ॥ 3

మంత్రము :

అను చ్ఛ్య శ్యామేన త్వచ మేతాం విశస్త
ర్యథాప ర్వ1సినా మాభి మంస్థాః ।
మాభి ద్రుహః పరుశః కల్పయైనం
తృతీయే నాకే అధి వి శ్రయైనమ్ ॥ 4

పదము :

అను । చ్ఛ్య । శ్యామేన । త్వచమ్ । ఏతామ్ । వి౨శ స్తః ।

యథా౨పరు । అసినా । మా । అభి । మంస్థాః ।

మా । అభి । ద్రుహః । పరు౨శః । కల్పయ । ఏనమ్ ।

తృతీయే । నాకే । అధి । వి । శ్రయ । ఏనమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ విశస్తా! దీని చర్మాన్ని ఇనుప కత్తితో
కోసి దానిని అవమానించకుండా,
దానికి ద్రోహం తలపెట్టకుండా,
కీళ్ళ ననుసరించి వేరువేరు చెయ్యి.
మూడవ స్వర్గంలో దీనిని విశ్రమింప జెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

ఋచా కుమ్భీ మధ్యగ్నౌ శ్రయా
మ్యాసిఞ్చోదక మవ ధే హ్యేనమ్ ।
పర్యాధత్తాగ్నినా శమితారః
శృతో గచ్ఛతు సుకృతాం యత్ర లోకః ॥ 5 ॥

పదము :

ఋచా కుమ్భీమ్ । అధి । అగ్నౌ । శ్రయామి ।

ఆ । సిఞ్చ । ఉదకమ్ । అవ । ధేహి । ఏనమ్ ।

పరిఽఅధత్త । అగ్నినా । శమితారః ।
శృతః । గచ్ఛతు । సుఽకృతామ్ । యత్ర । లోకః ॥

అనువాదం :

మంత్రంతో ఈ పాత్రను అగ్నిపై ఉంచుతున్నాను.
దీనిలో ఉదకసేచనం చేసి ఉంచు.
ఓ శమితా! నీవీ అగ్ని ద్వారా దీనిని ధరించు.
ఇది పరిపక్వమై సుకృతులు వెళ్ళే లోకానికి వెళ్ళుగాక!

మంత్రము :

ఉత్క్రామాతః పరి చే దతప్త
స్తప్తాచ్చరో రధి నాకం తృతీయమ్ ।
అగ్నే రగ్ని రధి సం బభూవిథ ।
జ్యోతిష్మన్త మభి లోకం జయైతమ్ ॥

పదము :

ఉత్ । క్రామ । అతః । పరి । చ । ఇత్ । అతప్తః ।
తప్తాత్ । చరోః । అధి । నాకమ్ । తృతీయమ్ ।
అగ్నేః । అగ్నిః । అధి । సమ్ । బభూవిథ ।
జ్యోతిష్మన్తమ్ । అభి । లోకమ్ । జయ । ఏతమ్ ॥

అనువాదం :

ఈ వేడి చేసిన పాత్ర నుంచి
అతప్తమై ఉత్క్రమించి ఇది

తృతీయ నాకమునకు వెళ్ళుగాక! అగ్నిపై నున్న
నీవు తేజస్వంతమైన లోకాన్ని జయించు. ॥ 6 ॥

మంత్రము :

అజో అగ్ని రజము జ్యోతి రాహు
రజం జీవతా బ్రహ్మణే దేయ మాహుః ।
అజ స్తమాం స్యప హన్తి దూర
మస్మిం ల్లోకే శ్రద్ధధానేన దత్తః ॥ 7 ॥

పదము :

అజః । అగ్నిః । అజమ్ । ఓం ఇతి । జ్యోతిః । ఆహుః ।
అజమ్ । జీవతా । బ్రహ్మణే । దేయమ్ । ఆహుః ।
అజః । తమాంసి । అప । హన్తి । దూరమ్ ।
అస్మిన్ । లోకే । శ్రత్ఽదధానేన । దత్తః ॥ 7 ॥

అనువాదం :

అజము అగ్నిరూపం.
ఈ అజమునే తేజ స్సని కూడా చెప్తారు.
సజీవమైన అజమును బ్రాహ్మణునకు
దానం చేయవలెనని అంటారు.
ఈ లోకంలో శ్రద్ధావంతుడు దీనిని దానం చేసినాడు.
ఈ మేక అంధకారాన్ని దూరంగా తరిమి వేస్తుంది. ॥ 7 ॥

మంత్రము:

పఞ్చౌదనః పఞ్చధా వి క్రమతా-

మాక్రంస్యమాన స్త్రీణి జ్యోతీంషి ।

ఈజానానాం సుకృతాం ప్రేహి మధ్యం

తృతీయే నాకే అధి వి శ్రయస్వ ॥ 8 ॥

పదము:

పఞ్చఽఓదనః । పఞ్చఽధా । వి । క్రమతామ్ ।

ఆఽక్రంస్యమానః । త్రీణి । జ్యోతీంషి ।

ఈజానానామ్ । సుఽకృతామ్ । ప్ర । ఇహి । మధ్యమ్ ।

తృతీయే । నాకే । అధి । వి । శ్రయస్వ ॥ 8 ॥

అనువాదం:

మూడు జ్యోతులను ఆక్రమించే పంచౌదనం
ఐదు విధాల విక్రమించు గాక!
యజ్ఞకర్త సుకృతుల మధ్యకు పంపించు గాక!
తృతీయ స్వర్గధామంలో ఇది విశ్రమించు గాక! ॥ 8 ॥

మంత్రము:

అజా రోహ సుకృతాం యత్ర లోకః

శరభో న చత్తోఽతి దుర్గా ణ్యేషః ।

పఞ్చౌదనో బ్రహ్మణే దీయమానః
స దాతారం తృప్త్యా తర్పయాతి ॥ 9 ॥

పదము :

అజ । ఆ । రోహ । సుఽకృతామ్ । యత్ర । లోకః ।
శరభః । న । చత్తః । అతి । దుఃఽగాని । ఏషః ।
పఞ్చఽఓదనః । బ్రహ్మణే । దీయమానః ।
సః । దాతారమ్ । తృప్త్యా । తర్పయాతి ॥ 9 ॥

అనువాదం :

ఓ అజమా ! ఆరోహించు.
ఎక్కడ సుకృతుల లోక మున్నదో అక్కడకు.
తరిమి వేసిన శరభము వలె
దుర్గములను దాటి ఇది వెళ్ళు గాక !
బ్రాహ్మణునకు సమర్పిత మైన పంచౌదనం
దాతను తృప్తి పరుస్తుంది.
తాను తృప్తి చెందుతుంది. ॥ 9 ॥

మంత్రము :

అజ స్త్రినాకే త్రిదివే త్రిపృష్ఠే
నాకస్య పృష్ఠే దదివాంసం దధాతి ।
పఞ్చౌదనో బ్రహ్మణే దీయమానో
విశ్వరూపా ధేనుః కామదుఘాఽస్యేకా ॥ 10 ॥

పదము :

అజః । త్రిఽనాకే । త్రిఽదివే । త్రిఽపృష్ఠే ।

నాకస్య । పృష్ఠే । దదిఽవాంసమ్ । దధాతి ।

పఞ్చఽఓదనః । బ్రహ్మణే । దీయమానః ।

విశ్వఽరూపా । ధేనుః । కామఽదుఘా । అసి । ఏకా ॥ 10 ॥

అనువాదం :

ఈ అజం సమర్పించిన వానిని
మూడవ స్వర్గంలో, మూడవ ద్యులోకంలో పితృత్రయం పై
అధిరోహింప జేసి స్వర్గధామం పై నిలుపుతుంది.
పంచౌదనం బ్రాహ్మణునకు సమర్పితమై
ఒక విశ్వరూప ధేనువు అవుతుంది. ॥ 10 ॥

మంత్రము :

ఏతద్ వో జ్యోతిః పితర స్తృతీయం
పఞ్చౌదనం బ్రహ్మణేఽజం దదాతి ।
అజ స్తమాం స్యప హన్తి దూర-
మస్మిం ల్లోకే శ్రద్దధానేన దత్తః ॥ 11 ॥

పదము :

ఏతత్ । వః । జ్యోతిః । పితరః । తృతీయమ్ ।

పఞ్చఽఓదనమ్ । బ్రహ్మణే । అజమ్ । దదాతి ।

అజః । తమాంసి । అప । హన్తి । దూరమ్ ।

అస్మిన్ । లోకే । శ్రత్ఽదధానేన । దత్తః ॥ 11 ॥

అనువాదం:

పితరులారా! ఈ తృతీయ జ్యోతిగా నున్న
పంచౌదనం, అజము బ్రాహ్మణునకు దత్తమైనవి.
శ్రద్ధధానుడైన వానితో దత్తమైన ఈ అజము
ఈ లోకంలో అంధకారాన్ని దూరం చేస్తుంది. ॥ 11 ॥

మంత్రము:

ఈజానానాం సుకృతాం లోక మీప్సన్

పఞ్చౌదనం బ్రహ్మణేఽజం దదాతి ।

స వ్యాఽప్తి మభి లోకం జయైతం

శివో౽స్మభ్యం ప్రతిగృహీతో అస్తు ॥ 12 ॥

పదము.

ఈజానానామ్ । సుఽకృతామ్ । లోకమ్ । ఈప్సన్ ।

పఞ్చఽఓదనమ్ । బ్రహ్మణే । అజమ్ । దదాతి ।

సః । విఽఆప్తిమ్ । అభి । లోకమ్ । జయ । ఏతమ్ ।

శివః । అస్మభ్యమ్ । ప్రతిఽగృహీతః । అస్తు ॥ 12 ॥

అనువాదం

యజ్ఞకర్త సుకృతుల లోకాన్ని అపేక్షించిన వాడై
పంచౌదనాన్ని, అజాన్ని బ్రాహ్మణులకు సమర్పిస్తాడు.

అతడు వ్యాపకమైన ఈ లోకాన్ని జయిస్తాడు.
ఈ ప్రతిగృహీత మాతై కల్యాణకారి అగు గాక! ॥ 12 ॥

మంత్రము :

అజో హ్య1గ్నే రజనిష్ట శోకాద్
విప్రో విప్రస్య సహసో విపశ్చిత్ ।
ఇష్టం పూర్త మభిపూర్తం వషట్కృతం
తద్ దేవా ఋతుశః కల్పయన్తు ॥ 13 ॥

పదము :

అజః । హి । అగ్నేః । అజనిష్ట । శోకాత్ ।
విప్రః । విప్రస్య । సహసః । విపఃఽచిత్ ।
ఇష్టమ్ । పూర్తమ్ । అభిఽపూర్తమ్ । వషట్ఽకృతమ్ ।
తత్ । దేవాః । ఋతుఽశః । కల్పయన్తు ॥ 13 ॥

అనువాదం :

అజము అగ్ని తేజస్సు నుంచి ఉద్భవించినది.
విప్రుని మహత్వంతో విద్వాంసుడైన విప్రుడు
ఆవిష్కృతు డైనాడు (కలిగినాడు.)
ఈ పూర్తం అభిపూర్తమై
యజ్ఞం ద్వారా సమర్పిత మౌతుంది.
దేవతలు ఋతువులకు అనుకూలంగా
దానిని చేస్తున్నారు. ॥ 13 ॥

మంత్రము :

అమోతం వాసో దద్యా

ద్ధిరణ్య మపి దక్షిణామ్ ।

తథా లోకా న్త్సమాప్నోతి

యే దివ్యా యే చ పార్థివాః ॥ 14 ॥

పదము :

అమాఽఉతమ్ । వాసః । దద్యాత్ ।

హిరణ్యమ్ । అపి । దక్షిణామ్ ।

తథా । లోకాన్ । సమ్ । ఆప్నోతి ।

యే । దివ్యాః । యే । చ । పార్థివాః ॥ 14 ॥

అనువాదం :

నేసిన హిరణ్మయ వస్త్రాన్ని, దక్షిణను ఇవ్వవలెను.
ద్యులోకంలో ఉన్న వారికి, భూలోకంలోని వారికి
అలా ఇవ్వడం వల్ల స్వర్లోకం ప్రాప్తిస్తుంది. ॥ 14 ॥

మంత్రము :

ఏతా స్త్వాజోప యన్తు ధారాః

సోమ్యా దేవీ ర్ఘృతపృష్ఠా మధుశ్చుతః ।

స్తభాన పృథివీ ముత ద్యాం

నాకస్య పృష్ఠేఽధి సప్తరశ్మౌ ॥ 15 ॥

పదము :

ఏతాః । త్వా । అజ । ఉప । యన్తు । ధారాః ।

సోమ్యాః । దేవీః । ఘృతఽపృష్ఠాః । మధుఽశ్చుతః ।

స్తభాన । పృథివీమ్ । ఉత । ద్యామ్ ।

నాకస్య । పృష్ఠే । అధి । సప్తఽరశ్మౌ ॥ 15 ॥

అనువాదం :

ఓ ఛాగమా ! సోమ సంబంధి, దివ్యము
అయిన, ఘృతపృష్ఠము, మధుశ్చుతము అయిన
రసధార నీ వద్దకు ప్రవహించు గాక !
నీవు సప్తరశ్మి ( సూర్యుడు ) పై
నాకపృష్ఠం లోని ద్యులోకాన్ని,
పృథివీ లోకాన్ని స్థిరం చేస్తావు. ॥ 15 ॥

మంత్రము :

అజో౽స్యజ స్వర్గో౽సి

త్వయా లోక మఙ్గిరసః ప్రజానన్ ।

తం లోకం పుణ్యం ప్ర జ్ఞేషమ్ ॥ 16 ॥

పదము :

అజః । అసి । అజ । స్వఃఽగః । అసి ।

త్వయా । లోకమ్ । అఙ్గిరసః । ప్ర । అజానన్ ।

తమ్ । లోకమ్ । పుణ్యమ్ । ప్ర । జ్ఞేషమ్ ॥ 16 ॥

అనువాదం :

ఓ అజమా ! నీవు జన్మరహితమవు, స్వర్గమవు.
అంగిరసుడు నీ ద్వారా పై లోకాన్ని తెలుసుకున్నాడు.
ఆ పుణ్యలోకాన్ని నేను తెలుసుకుంటాను. ॥ 16 ॥

మంత్రము :

యేనా సహస్రం వహసి యేనాగ్నే సర్వవేదసమ్ ।
తే నేమం యజ్ఞం నో వహ స్వఽర్దేవేషు గన్తవే ॥ 17 ॥

పదము :

యేన । సహస్రమ్ । వహసి ।
యేన । అగ్నే । సర్వఽవేదసమ్ ।
తేన । ఇమమ్ । యజ్ఞమ్ । నః । వహ ।
స్వఽః । దేవేషు । గన్తవే ॥ 17 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు వేల మందిని కొని పోతావు.
అందువల్ల నీవు సర్వవేదివి. అందుతో మా ఈ యజ్ఞాన్ని
దేవతల లోకానికి కొని పో. ॥ 17 ॥

మంత్రము :

అజః పక్వః స్వర్గే లోకే దధాతి
పఞ్చౌదనో నిరృతిం బాధమానః ।
తేన లోకా న్త్సూర్యవతో జయేమ ॥ 18 ॥

పదము :

అజః । పక్వః । స్వః౽గే । లోకే । దధాతి ।

పఞ్చ౽ఓదనః । నిః౽ఋతిమ్ । బాధమానః ।

తేన । లోకాన్ । సూర్య౽వతః । జయేమ ॥ 18 ॥

అనువాదం :

పంచౌదనము, అజము నిర్ఋతికి బాధకములు.
స్వర్లోక ప్రాప్తికి మార్గములు.
సూర్యుడున్న లోకాలను
మా ద్వారా జయింతుము గాక! ॥ 18 ॥

మంత్రము :

యం బ్రాహ్మణే నిదధే యం చ విక్షు

యా విప్రుష ఓదనానా మజస్య ।

సర్వం తదగ్నే సుకృతస్య లోకే

జానీతా న్నః సంగమనే పథీనామ్ ॥ 19 ॥

పదము :

యమ్ । బ్రాహ్మణే । ని౽దధే । యమ్ । చ । విక్షు ।

యాః । వి౽ప్రుషః । ఓదనానామ్ । అజస్య ।

సర్వమ్ । తత్ । అగ్నే । సు౽కృతస్య । లోకే ।

జానీతాత్ । నః । సమ్౽గమనే । పథీనామ్ ॥ 19 ॥

అనువాదం :

బ్రాహ్మణుని వద్ద ఉన్నది,
ప్రజలలో ఉన్నది అయిన అజము, ఓదనము
అనుభవ యోగ్యములు.
అవన్నీ మాకు సుకృతలోకములకు
వెళ్ళే మార్గసంగమన జ్ఞాపికలు. ॥ 19 ॥

మంత్రము.

అజో వా ఇద మగ్రే వ్యక్రమత
తస్యోర ఇయ మభవద్ ద్యౌః పృష్ఠమ్ ।
అన్తరిక్షం మధ్యం దిశః పార్శ్వే సముద్రౌ కుక్షీ ॥ 20 ॥

పదము

అజః । వై । ఇదమ్ । అగ్రే । వి । అక్రమత ।
తస్య । ఉరః । ఇయమ్ । అభవత్ । ద్యౌః । పృష్ఠమ్ ।
అన్తరిక్షమ్ । మధ్యమ్ । దిశః । పార్శ్వే ఇతి । సముద్రౌ । కుక్షీ ఇతి
॥ 20 ॥

అనువాదం :

అజము పూర్వం ఇక్కడ విక్రమించినది.
దాని వక్షస్సు భూమి.
ద్యులోకం పిరం
అంతరిక్షం మధ్యం.
దిక్కులు పార్శ్వములు,
సముద్రములు కుక్షి. ॥ 20 ॥

అథర్వ iv 21

మంత్రము:

సత్యం చర్తం చ చక్షుషీ విశ్వం

సత్యం శ్రద్ధా ప్రాణో విరాట్ శిరః।

ఏష వా అపరిమితో యజ్ఞో య దజః పఞ్చౌదనః ॥ 21 ॥

పదము:

సత్యమ్। చ। ఋతమ్। చ। చక్షుషీ ఇతి। విశ్వమ్।

సత్యమ్। శ్రద్ధా। ప్రాణః। వి౨రాట్। శిరః।

ఏషః। వై। అపరి౨మితః। యజ్ఞః।

యత్। అజః। పఞ్చ౨ఓదనః ॥ 21 ॥

అనువాదం:

సత్య, ఋతములు దీని కళ్ళు.
విశ్వం దీని అస్థిత్వము.
శ్రద్ధ ప్రాణము. విరాట్టు శిరస్సు.
పంచౌదనంతో కూడిన ఈ అజము
అపరిమిత యజ్ఞరూప మైనది. ॥ 21 ॥

మంత్రము:

అపరిమిత మేవ యజ్ఞ మాప్నో

త్యపరిమితం లోక మవ రున్ద్ధే।

యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 22 ॥

పదము :

అపరిఽమితమ్ । ఏవ । యజ్ఞమ్ । ఆప్నోతి ।

అపరిఽమితమ్ । లోకమ్ । అవ । రున్ద్ధే ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 22 ॥

అనువాదం :

అపరిమిత మైన యజ్ఞం అపరిమితంగా
లోకాన్ని అవరోధిస్తున్నది.
పంచౌదనాన్ని, దక్షిణాజ్యోతిస్సును
అజము ఇస్తున్నది.
అపరిమిత మైన యజ్ఞాన్ని లభ్యం చేసుకున్నది.
అపరిమిత లోకాన్ని అది స్వాయత్తం చేసుకున్నది. ॥ 22 ॥

మంత్రము :

నాస్యాస్థీని భిన్ద్యాన్న మజ్ఞో నిర్ధ యేత్ ।
సర్వ మేనం సమాదా యేదమిదం ప్ర వేశయేత్ । ॥ 23 ॥

పదము :

న । అస్య । అస్థీని । భిన్ద్యాత్ । న । మజ్ఞః । నిః । ధయేత్ ।

సర్వమ్ । ఏనమ్ । సమ్ఽఆదాయ ।

ఇదమ్ఽఇదమ్ । ప్ర । వేశయేత్ ॥ 23 ॥

అనువాదం :

దీని అస్థికలను విరుగగొట్టకూడదు.
మజ్జను పీల్చకూడదు.
వీటి నన్నిటిని తీసుకుని దీనిని ఇందులో ప్రవేశపెట్ట వలెను.
॥ 23 ॥

మంత్రము :

ఇదమిద మేవాస్య రూపం భవతి తేనైనం సం గమయతి ।
ఇషం మహ ఊర్జ మస్మై దుహే
యో౽జం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 24 ॥

పదము :

ఇదమ్ఽఇదమ్ । ఏవ । అస్య । రూపమ్ ।
భవతి । తేన । ఏనమ్ । సమ్ । గమయతి ।
ఇషమ్ । మహః । ఊర్జమ్ । అస్మై । దుహే ।
యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ । దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి
॥ 24 ॥

అనువాదం :

దీని కిదే రూప మౌతున్నది.
దానితో సంగమిస్తున్నది.
ఇందుకై అన్నాన్ని, తేజస్సును, బలాన్ని
దోహనం చేస్తున్నది.
అది దక్షిణాజ్యోతి రూప మైన
ఈ పంచౌదనాన్ని అజమును ఇస్తున్నది. ॥ 24 ॥

మంత్రము

పఞ్చ రుక్మా పఞ్చ నవాని వస్త్రా

పఞ్చాస్మై ధేనవః కామదుఘా భవన్తి ।

యో౽జం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 25 ॥

పదము.

పఞ్చ । రుక్మా । పఞ్చ । నవాని । వస్త్రా ।

పఞ్చ । అస్మై । ధేనవః । కామఽదుఘాః । భవన్తి ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 25 ॥

అనువాదం.

ఎవడు దక్షిణాతేజస్సుతో పాటు అజమును,
పంచౌదనాన్ని ఇస్తాడో,
అతనికి ఐదు స్వర్ణములు, ఐదు నూతన వస్త్రములు,
ఐదు కామదుఘ లైన ధేనువులు లభిస్తాయి. ॥ 25 ॥

మంత్రము।

పఞ్చ రుక్మా జ్యోతి రస్మై భవన్తి

వర్మ వాసాంసి తన్వే౽ భవన్తి ।

స్వర్గం లోక మశ్నుతే యో౽జం

పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 26 ॥

పదము :

పఞ్చ । రుక్మా । జ్యోతిః । అస్మై । భవన్తి ।

వర్మ । వాసాంసి । తన్వే । భవన్తి ।

స్వఃఽగమ్ । లోకమ్ । అశ్నుతే । యః । అజమ్ ।

పఞ్చఽఓదనమ్ । దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 26 ॥

అనువాదం :

అజమును, దక్షిణాజ్యోతిస్సును
పంచౌదనాన్ని ఎవడైతే ఇస్తాడో,
అతనికి ఐదు సువర్ణముద్రలు,
జ్యోతిస్సు లభిస్తాయి.
అతని శరీరానికి కవచరూప మైన వస్త్రములు లభిస్తాయి.
అతను స్వర్గలోకాన్ని చేరుకుంటాడు. ॥ 26 ॥

మంత్రము :

యా పూర్వం పతిం విత్వాఽథాన్యం విన్దతేఽపరమ్ ।

పఞ్చౌదనం చ తా వజం దదాతో న వి యోషతః ॥ 27 ॥

పదము :

యా । పూర్వమ్ । పతిమ్ । విత్వా ।

అథ । అన్యమ్ । విన్దతే । అపరమ్ ।

పఞ్చఽఓదనమ్ । చ । తౌ । అజమ్ ।

దదాతః । న । వి । యోషతః ॥ 27 ॥

అనువాదం.

తనకు భర్త తొలుత లభింపగా,
తరువాత రెండవ వానిని పొందిన ఆమె,
వా రిరువురు పంచౌదనాన్ని, అజమును
ఇస్తే వారు వియుక్తులు కాకుండా ఉంటారు. ॥ 27 ॥

మంత్రము.

సమానలోకో భవతి పునర్భువాఽపరః పతిః ।
యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 28 ॥

పదము;

సమానఽలోకః । భవతి । పునఃఽభువా । అపరః । పతిః ।
యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।
దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 28 ॥

అనువాదం.

పంచౌదనం, దక్షిణాజ్యోతి, అజము
ఎవరైతే సమర్పిస్తాడో, అతడు
రెండవ భర్త పునర్వివాహిత స్త్రీతో పాటు
సమాన స్థానవంతు డౌతాడు. ॥ 28 ॥

మంత్రము.

అనుపూర్వవత్సాం ధేను మనడ్వాహ ముపబర్హణమ్ ।
వాసో హిరణ్యం దత్త్వా తే యన్తి దివ ముత్తమామ్ ॥29॥

పదము :

అను పూర్వ ఽ వత్సామ్ । ధేనుమ్ ।

అనడ్వాహమ్ । ఉప ఽ బర్హణమ్ ।

వాసః । హిరణ్యమ్ । దత్త్వా ।

తే । యన్తి । దివమ్ । ఉత్ ఽ తమామ్ ॥ 29 ॥

అనువాదం :

దూడతో కూడిన ఆవును, ఎద్దును,
అందుతో పాటు వస్త్రములు, సువర్ణమును
ఇచ్చినవాడు ఉత్తమ ద్యులోకానికి వెడతాడు. ॥ 29 ॥

మంత్రము :

ఆత్మానం పితరం పుత్రం పౌత్రం పితామహమ్ ।
జాయాం జనిత్రీం మాతరం యే ప్రియా స్తా నుప హ్వయే ॥ 30 ॥

పదము :

ఆత్మానమ్ । పితరమ్ । పుత్రమ్ । పౌత్రమ్ । పితామహమ్ ।

జాయామ్ । జనిత్రీమ్ । మాతరమ్ ।

యే । ప్రియాః । తాన్ । ఉప । హ్వయే ॥ 30 ॥

అనువాదం :

తనకు, తండ్రికి, కొడుకునకు, మనుమనికి,
పితామహునికి, భార్యకు, జనిత్రికి, మాతకు,
ఎవరైతే ప్రియులో వారిని నేను ఆహ్వానిస్తున్నాను. ॥ 30 ॥

మంత్రము:

యో వై నైదాఘం నామర్తుం వేద ।
ఏష వై నైదాఘో నామర్తు ర్యదజః పఞ్చౌదనః ।
ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య
శ్రియం దహతి భవ త్యాత్మనా ।
యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 31 ॥

పదము.

యః । వై । నైదాఘమ్ । నామ । ఋతుమ్ । వేద ।
ఏషః । వై । నైదాఘః । నామ । ఋతుః ।
యత్ । అజః । పఞ్చఽఓదనః ।
నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।
శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।
యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।
దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 31 ॥

అనువాదం.

ఇది నిజంగా గ్రీష్మర్తువు
ఇది పంచౌదనము, అజము
దీనిని గ్రీష్మ ఋతువుగా ఎవరు తెలుసుకుంటారో,
ఎవ రైతే దక్షిణాజ్యోతిని, పంచౌదన అజమును

సమర్పిస్తారో - అప్రియ శత్రు సంపదను దగ్ధం చేసే
అతను - ఆత్మశక్తితో ప్రభావితు డౌతాడు. ॥ 31 ॥

మంత్రము 1

యో వై కుర్వన్తం నామర్తుం వేద
కుర్వతీం కుర్వతీ మేవాప్రియస్య
భ్రాతృవ్యస్య శ్రియ మా దత్తే ।
ఏష వై కుర్వన్నామర్తు ర్యదజః పఞ్చౌదనః ।
ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య
శ్రియం దహతి భవ త్యాత్మనా ।
యో౽జం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 32 ॥

పదము .

యః । వై । కుర్వన్తమ్ । నామ । ఋతుమ్ । వేద ।
కుర్వతీమ్ఽకుర్వతీమ్ । ఏవ । అప్రియస్య ।
భ్రాతృవ్యస్య । శ్రియమ్ । ఆ । దత్తే ।
ఏషః । వై । కుర్వన్ । నామ । ఋతుః ।
యత్ । అజః । పఞ్చఽఓదనః ।
నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।

శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 32 ॥

అనువాదం

ఇది నిస్పందేహంగా 'కర్త' అనే ఋతువు
ఏ అజము పంచౌదన అజమో,
ఎవడైతే దీనిని 'కర్త' అనే ఋతువుగా
తెలుసుకుంటాడో, ఎవడైతే దక్షిణాతేజోయుక్త మైన
పంచౌదన అజమును దానం చేస్తాడో
అతడు అప్రియ శత్రు సంపదను అపహరిస్తాడు.
అతను ఆత్మశక్తితో ప్రభావితు డౌతాడు. ॥ 32 ॥

మంత్రము।

యో వై సంయన్తం నానుర్తుం వేద ।
సంయతీంసంయతీ మేవాప్రియస్య
భ్రాతృవ్యస్య శ్రియ మా దత్తే ।
ఏష వై సంయ న్నామ ర్తు ర్యదజః పఞ్చౌదనః ।
ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య
శ్రియం దహతి భవ త్యాత్మనా ।
యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 33 ॥

పదము :

యః । వై । సమ్ఽయన్తమ్ । నామ । ఋతుమ్ । వేద ।

సంయతీమ్ఽసంయతీమ్ । ఏవ । అప్రియస్య ।

భ్రాతృవ్యస్య । శ్రియమ్ । ఆ । దత్తే ।

ఏషః । వై । సమ్ఽయన్ । నామ । ఋతుః ।

యత్ । అజః । పఞ్చఽఓదనః ।

నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।

శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 33 ॥

అనువాదం :

ఇది 'సంయమన' నామ ఋతువు.
ఏది పంచౌదన అజమో,
ఇది నిశ్చయంగా సంయమ నామక
ఋతు వని ఎవడు కనుక్కుంటాడో,
ఎవడు దక్షిణాజ్యోతిస్సుతో పాటూ
పంచౌదన అజమును సమర్పిస్తాడో
అతడు అప్రియ శత్రుసంపదను
అపహరిస్తాడు.
అతను ఆత్మశక్తితో ప్రభావితు డౌతాడు. ॥ 33 ॥

మంత్రము ।

యో వై పిన్వన్తం నామర్తుం వేద ।

పిన్వతీం పిన్వతీ మేవాప్రియస్య

భ్రాతృవ్యస్య శ్రియ మా దత్తే ।

ఏష వై పిన్వ న్నామర్తు ర్యదజః పఞ్చౌదనః ।

ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య

శ్రియం దహతి భవ త్యాత్మనా ।

యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 34 ॥

పదము

యః । వై । పిన్వన్తమ్ । నామ । ఋతుమ్ । వేద ।

పిన్వతీమ్ఽపిన్వతీమ్ । ఏవ । అప్రియస్య ।

భ్రాతృవ్యస్య । శ్రియమ్ । ఆ । దత్తే ।

ఏషః । వై । పిన్వన్ । నామ । ఋతుః ।

యత్ । అజః । పఞ్చఽఓదనః ।

నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।

శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 34 ॥

అనువాదం :

ఇది పోషణ నామ ఋతువు.
ఇది పంచౌదన అజము.
ఇది పోషక నామ ఋతువని నిశ్చయంగా
ఎవడు తెలుసుకుంటాడో,
దక్షిణాతేజస్సుతో కూడిన పంచౌదన
అజమును సమర్పిస్తాడో,
అతను అప్రియ శత్రుసంపదను అపహరిస్తాడు.
అతను ఆత్మశక్తితో ప్రభావితు డౌతాడు. ॥ 34 ॥

మంత్రము :

యో వా ఉద్యన్తం నామర్తుం వేద
ఉద్యతీముద్యతీ మేవాప్రియస్య
భ్రాతృవ్యస్య శ్రియ మా దత్తే ।
ఏష వా ఉద్య న్నామర్తు ర్యదజః పఞ్చౌదనః ।
ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య
శ్రియం దహతి భవ త్యాత్మనా ।
యో౨జం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 35 ॥

పదము .

యః । వై । ఉత్ఽయన్తమ్ । నామ । ఋతుమ్ । వేద ।

ఉద్యతీమ్ఽఉద్యతీమ్ । ఏవ । అప్రియస్య ।

భ్రాతృవ్యస్య । శ్రియమ్ । ఆ । దత్తే ।

ఏషః । వై । ఉత్ఽయన్ । నామ । ఋతుః ।

యత్ । అజః । పఞ్చఽఓదనః ।

నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।

శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 35 ॥

**అనువాదం :**

ఇది ఉద్యన్నామక ఋతువు.
ఇది పంచౌదన అజము.
ఇది నిజంగా ఉదయ నామక - ఋతువని
ఎవడు తెలుసుకుంటాడో,
దక్షిణాతేజస్సుతో కూడిన పంచౌదన
అజమును ఎవడు సమర్పిస్తాడో
అతను అప్రియ శత్రుసంపదను
పోషక శ్రీని అపహరిస్తాడు.
అతను ఆత్మశక్తితో ప్రభావితు డౌతాడు. ॥ 35 ॥

మంత్రము :

యో వా అభిభువం నామర్తుం వేద ।

అభిభవన్తీమభిభవన్తీ మేవాప్రియస్య

భ్రాతృవ్యస్య శ్రియ మా దత్తే ।

ఏష వా అభిభూ ర్నామర్తు ర్యదజః పఞ్చౌదనః ।

ని రేవాప్రియస్య భ్రాతృవ్యస్య

శ్రియం దహతి భవ త్యాత్మనా ।

యోఽజం పఞ్చౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి ॥ 36

పదము :

యః । వై । అభిऽభువమ్ । నామ । ఋతుమ్ । వేద ।

అభిభవన్తీమ్ऽఅభిభవన్తీమ్ । ఏవ । అప్రియస్య ।

భ్రాతృవ్యస్య । శ్రియమ్ । ఆ । దత్తే ।

ఏషః । వై । అభిऽభూః । నామ । ఋతుః ।

యత్ । అజః । పఞ్చऽఓదనః ।

నిః । ఏవ । అప్రియస్య । భ్రాతృవ్యస్య ।

శ్రియమ్ । దహతి । భవతి । ఆత్మనా ।

యః । అజమ్ । పఞ్చఽఓదనమ్ ।

దక్షిణాఽజ్యోతిషమ్ । దదాతి ॥ 36 ॥

అనువాదం

ఇది అభిభవన నామక ఋతువు
ఇది పంచౌదన అజము
ఎవరైతే ఈ అభిభవన నామక
ఋతువును తెలుసుకుంటాడో,
దక్షిణాజ్యోతి యుక్తమైన పంచౌదన
అజమును సమర్పిస్తాడో,
అతడు అప్రియ శత్రుని
అభిభవన శీలమైన సంపదను అపహరిస్తాడు.
అలా దానిని పరిగ్రహించి తన శక్తితో నిలబడతాడు. ॥ 36 ॥

మంత్రము :

అజం చ పచత పఞ్చ చౌదనాన్ ।
సర్వా దిశః సంమనసః సధ్రీచీః
సాన్తర్దేశాః ప్రతి గృహ్ణన్తు త ఏతమ్ ॥ 37 ॥

పదము :

అజమ్ । చ । పచత । పఞ్చ । చ । ఓదనాన్ ।
సర్వాః । దిశః । సమ్ఽమనసః । సధ్రీచీః ।
సఽఅన్తర్దేశాః । ప్రతి । గృహ్ణన్తు । తే । ఏతమ్ ॥ 37 ॥

అనువాదం:

ఈ అజమును, పంచౌదనములను పరిపక్వం చేయండి.
దీనిని మీరు సర్వదిక్కులకు, అంతరిక్ష ప్రదేశానికి
సమ్మతితో సౌమనస్యంతో ప్రతిగ్రహించండి. ॥ 37

మంత్రము:

తాస్తే రక్షన్తు తవ తుభ్య మేతం
తాభ్య అజ్యం హవి రిదం జుహోమి ॥ 38

పదము:

తాః । తే । రక్షన్తు । తవ । తుభ్యమ్ । ఏతమ్ ।
తాభ్యః । అజ్యమ్ । హవిః । ఇదమ్ । జుహోమి ॥ 38 ।

అనువాదం:

మీరు, మీరు మీకు చెందిన వీనిని
రక్షించు కొందురు గాక!
వారికై నే నీ అజ్యాన్ని హోమం చేస్తున్నాను. ॥ 38 ॥

ఇది ఐదవ సూక్తం.

## సూక్తం - 6

ఋషి: బ్రహ్మ ॥ దేవతలు, అతిథి : విద్యా ॥ ఛందస్సు: 1 నాగినామ త్రిపాద్ గాయత్రీ: 2 త్రిపదాఒఒర్షీ గాయత్రీ: 3,7 సామ్నీ త్రిష్టుప్: 4,9 అర్చ్యనుష్టుప్: 5 అసురీ గాయత్రీ: 6 త్రిపదా సామ్నీ జగతీ: 8 యాజుషీ త్రిష్టుప్: 10 సామ్నీ భురిగ్ బృహతీ: 11,14-16 సామ్నానుష్టుప్: 12 విరాడ్ గాయత్రీ: 13 సామ్నీ నిచృత్ పంక్తి: 17 త్రిపదా భురిగ్ విరాడ్ గాయత్రీ ॥ మంత్రములు: ॥ 17 ॥

వినియోగం :- స్వర్గకాముడు దీనితో జపం చేస్తాడు. ఈ ఆరు పర్యాయములలో అతిథి మాహాత్మ్యము, అతిథిపూజ వర్ణిత మైనది. అతిథిపూజకు యజ్ఞఫల తుల్యఫలం కలదని ఆతిథ్యప్రశంస ఉన్నది.

మంత్రము

యో విద్యాద్ బ్రహ్మ ప్రత్యక్షం పరూంషి

యస్య సంభారా ఋచో యస్యానూక్యమ్ ॥ 1 ॥

పదము.

యః । విద్యాత్ । బ్రహ్మ । ప్రతిఽఅక్షమ్ । పరూంషి ।

యస్య । సమ్ఽభారాః । ఋచః । యస్య । అనూక్యమ్ ॥ 1 ॥

అనువాదం:

ఎవడు ప్రత్యక్షంగా బ్రహ్మను ఎరుగునో,
ఎవని అవయవములు యజ్ఞసామగ్రియో,
ఎవని వెన్నెముక ఋక్కులో........ ॥ 1 ॥

మంత్రము

సామాని యస్య లోమాని యజు ర్హృదయ ముచ్యతే

పరి స్తరణ మిద్ధవిః ॥ 2 ॥

పదము.

సామాని । యస్య । లోమాని । యజుః । హృదయమ్ । ఉచ్యతే ।

పరిఽస్తరణమ్ । ఇత్ । హవిః ॥ 2 ॥

అనువాదం :

ఎవరి రోమములు సామములో,
ఎవని హృదయం యజుస్సుగా పేర్కొంటారో,
ఎవరి పరిస్తరణ ( వస్త్రం ) హవిస్సో... ॥ 2 ॥

మంత్రము :

యద్ వా అతిథిపతి రతిథీన్
ప్రతిపశ్యతి దేవయజనం ప్రేక్షతే ॥ 3 ॥

పదము :

యత్ । వై । అతిథిఽపతిః । అతిథీన్ ।
ప్రతిఽపశ్యతి । దేవఽయజనమ్ । ప్ర । ఈక్షతే ॥ 3 ॥

అనువాదం :

ఏ గృహస్థు అతిథుల కోసమై ప్రతీక్షిస్తాడో,
దేవయజ్ఞాన్ని పరికిస్తాడో........ ॥ 3 ॥

మంత్రము :

య దభివదతి దీక్షా ముపైతి
య దుదకం యాచ త్యపః ప్ర ణయతి ॥ 4 ॥

పదము :

యత్ । అభిఽవదతి । దీక్షామ్ । ఉప । ఏతి ।
యత్ । ఉదకమ్ । యాచతి । అపః । ప్ర । నయతి ॥ 4 ॥

అనువాదం.

ఎవడు అతిథులను పలకరిస్తాడో,
ఎవడు యజ్ఞదీక్షను వహిస్తాడో,
ఎవడు జలమును యాచిస్తాడో,
ఎవ డతనికి జలము నిస్తాడో .. ॥ 4 ॥

మంత్రము

యా ఏవ యజ్ఞ ఆపః ప్రణీయన్తే తా ఏవ తాః ॥ 5 ॥

పదము:

యాః । ఏవ । యజ్ఞే । ఆపః । ప్రఽనీయన్తే । తాః । ఏవ । తాః ॥ 5 ॥

అనువాదం:

ఎవడు యజ్ఞజలంతో వెడతాడో వారే వారు. ॥ 5 ॥

మంత్రము:

యత్ తర్పణ మాహరన్తి య ఏవాగ్నీషోమీయః
పశు ర్బధ్యతే స ఏవ సః ॥ 6 ॥

పదము.

యత్ । తర్పణమ్ । ఆఽహరన్తి । యః । ఏవ । అగ్నీషోమీయః
పశుః । బధ్యతే । సః । ఏవ । సః ॥ 6 ॥

అనువాదం:

ఎవడు అతిథిని తృప్తిపరచుటకై
జలమును కొనిపోతాడో,

ఎవడు అగ్నికై, సోమునికై పశువును
బంధిస్తాడో అతడే అతడు. ॥ 6 ॥

మంత్రము :

య దావసథాన్ కల్పయన్తి
సదోహవిర్ధానాన్యేవ తత్ కల్పయన్తి ॥ 7 ॥

పదము :

యత్ । ఆఽవసథాన్ । కల్పయన్తి ।
సదఃఽహవిర్ధానాని । ఏవ । తత్ । కల్పయన్తి ॥ 7 ॥

అనువాదం :

ఎవడు అతిథి కోసమై వసతులను కల్పిస్తాడో,
యజ్ఞమునందు హవిర్ధానమును అతనే కల్పిస్తాడు. ॥ 7 ॥

మంత్రము :

య దుపస్తృణన్తి బర్హి రేవ తత్ ॥ 8 ॥

పదము :

యత్ । ఉపఽస్తృణన్తి । బర్హిః । ఏవ । తత్ ॥ 8 ॥

అనువాదం :

ఎవ డైతే తృణములను పరుస్తాడో,
అతడే యజ్ఞమునందు దర్భలను పరుస్తాడు. ॥ 8 ॥

మంత్రము :

య దుపరిశయన మాహరన్తి
స్వర్గ మేవ తేన లోక మవ రున్ద్ధే ॥ 9 ॥

పదము

యత్ । ఉపరి౽శయనమ్ । ఆ౽హరన్తి ।

స్వః౽గమ్ । ఏవ । తేన । లోకమ్ । అవ । రున్ద్ధే ॥ 9 ॥

అనువాదం

ఎవడు దాసిపై శయనమును అహరిస్తాడో,
అతనిచే స్వర్గలోకం అవరుద్ధ మౌతుంది. ॥ 9 ॥

మంత్రము :

యత్ కశిపూపబర్హణ మాహరన్తి పరిధయ ఏవ తే ॥ 10 ॥

పదము

యత్ । కశిపు౽ఉపబర్హణమ్ । ఆ౽హరన్తి ।

పరి౽ధయః । ఏవ । తే ॥ 10 ॥

అనువాదం :

ఎవడు అతిథి కోసమై ఉపబర్హణాన్ని కొని పోతాడో,
ఎవడు యజ్ఞమునకు పరిధి అవుతాడో ॥ 10 ॥

మంత్రము

య దాఞ్జనాభ్యఞ్జన మాహర న్త్యాజ్య మేవ తత్ ॥ 11 ॥

పదము

యత్ । ఆఞ్జన౽అభ్యఞ్జనమ్ । ఆ౽హరన్తి ।

ఆజ్యమ్ । ఏవ । తత్ ॥ 11 ॥

అనువాదం :

ఎవడు కనులకు అంజనమును,
శరీరమునకు అభ్యంజనమును ఆహరిస్తాడో, అది ఆజ్యమే. ॥11॥

మంత్రము :

యత్ పురా పరివేషాత్ ఖాద మాహరన్తి
పురోడాశౌ వేవ తౌ ॥ 12 ॥

పదము :

యత్ । పురా । పరిఽవేషాత్ । ఖాదమ్ । ఆఽహరన్తి ।
పురోడాశౌ । ఏవ । తౌ ॥ 12 ॥

అనువాదం :

ఎవడు భోజనానికి ముందు అతిథి కోసమై
భోజనం కొని వస్తాడో అది పురోడాశమే ! ॥ 12 ॥

మంత్రము :

య దశనకృతం హ్వయన్తి
హవిష్కృత మేవ తద్ధ్వయన్తి ॥ 13 ॥

పదము :

యత్ । అశనఽకృతమ్ । హ్వయన్తి ।
హవిఃఽకృతమ్ । ఏవ । తత్ । హ్వయన్తి ॥ 13 ॥

అనువాదం:

ఎవడు వంటవారిని ఆహ్వానిస్తాడో,
అతడే హవిస్సును, యజ్ఞం చేయువారిని ఆహ్వానిస్తాడు. ॥13॥

మంత్రము

యే వ్రీహయో యవా నిరుప్యన్తేంఽశవ ఏవ తే ॥ 14 ॥

పదము:

యే । వ్రీహయః । యవాః । నిఃఽఉప్యన్తే ।

అంశవః । ఏవ । తే ॥ 14 ॥

అనువాదం

ఏ వ్రీహి, యవలను నిరూపిస్తారో,
అవి సోమలతా ఖండములే.... ॥ 14 ॥

మంత్రము

యా న్యులూఖలముసలాని గ్రావాణ ఏవ తే ॥ 15 ॥

పదము:

యాని । ఉలూఖలఽముసలాని । గ్రావాణః । ఏవ । తే ॥ 15 ॥

అనువాదం

ఏవి ఉలూఖల ముసలములో (రోలు, రోకలి)
అవి సోమరసాన్ని తీయడాని కుపయోగించే శిలలే. ॥15॥

మంత్రము.

శూర్పం పవిత్రం తుషా ఋజీషా భిషవనీ రాపః ॥ 16 ॥

పదము:

శూర్పమ్ । పవిత్రమ్ । తుషాః । ఋజీషా । అభిఽసవనీః । ఆపః
॥ 16 ॥

అనువాదం :

అతిథికై చేటలో కొని వచ్చిన లాజలు
యజ్ఞంలో పవిత్రంతో సమానం.
ధాన్యం మీది పొట్టు, సోమరసం తీసిన తరువాత
మిగిలిన పిప్పితో సమానం.
అతిథి భోజనానికై ఉపయోగించే జలం
యజ్ఞ జలంతో సమానం. ॥ 16 ॥

మంత్రము :

స్రుగ్ దర్వి ర్నేక్షణ మాయవనం
ద్రోణకలశాః కుమ్భ్యో వాయవ్యాని
పాత్రాణీయ మేవ కృష్ణాజినమ్ ॥ 17 ॥

పదము :

స్రుక్ । దర్విః । నేక్షణమ్ । ఆఽయవనమ్ ।
ద్రోణఽకలశాః । కుమ్భ్యః । వాయవ్యాని ।
పాత్రాణి । ఇయమ్ । ఏవ । కృష్ణఽఅజినమ్ ॥ 71 ॥

అనువాదం :

కొయ్య గరిటె స్రుక్కుతో సమానం.
వంట చేసేటప్పుడు అన్నాన్ని పరికించడం
యజ్ఞాన్ని వీక్షించడంతో సమానం.
చిన్న, పెద్ద పాత్రలు యజ్ఞపాత్రలతో సమాన మైనవి.
అతిథికై ఇతర పాత్ర లేవి చేస్తారో,
అవి యజ్ఞపాత్రలతో సమాన మైనవి.
అలాంటిదే కృష్ణాజినం. ॥ 17 ॥

## సూక్తం - 6 ( 2 )

ఋషిః బ్రహ్మ॥ దేవతలు . అతిథిః విద్యా॥ ఛందస్సు . 1 విరాట్ పురస్తాద్ బృహతీ ; 2,12 సామ్ని త్రిష్టుప్ . 3 అసురీ త్రిష్టుప్ ; 4 సామ్న్యుష్ణిక్, 5 సామ్ని బృహతీ ; 6 ఆర్చ్యనుష్టుప్ ; 7 పఞ్చపదా విరాట్ పురస్తాద్ బృహతీ 8, 9 సామ్న్యనుష్టుప్ ; 10 త్రిపదాఽఽర్చీ త్రిష్టుప్ ; 11 భురిక్ సామ్ని బృహతీ ; 13 త్రిపదాఽఽర్చీ పంక్తి॥ మంత్రములు ; ॥ 13 ॥

మంత్రము

యజమానబ్రాహ్మణం వా ఏత దతిథిపతిః కురుతే

య దాహార్యాఽణి ప్రేక్షత ఇదం భూయాః ఇదాః మితి ॥1॥

పదము

యజమానఽబ్రాహ్మణమ్ । వై । ఏతత్ । అతిథిఽపతిః । కురుతే ।

యత్ । ఆఽహార్యాఽణి । ప్రఽఈక్షతే ।

ఇదమ్ । భూయాః । ఇదాఽమ్ । ఇతి ॥ 1 ॥

అనువాదం

ఏది అధిక మైనదో, ఏ సరిపోవునదో,
ఏది అతిథి కిచ్చుటకు యోగ్యమైన పదార్థంగా
చూస్తున్నాడో, ఆ అతిథిని సత్కరించే యజమానుడు
యజ్ఞం చేసే బ్రాహ్మణునితో సమానుడు.
యజ్ఞంలో యజమాని వంటి వాడు. ॥ 1 ॥

మంత్రము.

య దాహ భూయ ఉద్ధరేతి

ప్రాణ మేవ తేన వర్షీయాంసం కురుతే ॥ 2 ॥

పదము :

యత్ । ఆహ । భూయః । ఉత్ । హర । ఇతి ।

ప్రాణమ్ । ఏవ । తేన । వర్షీయాంసమ్ । కురుతే ॥ 2 ॥

**అనువాదం :**

అధికంగా తిరిగి అతిథికి ఏ దైతే ఇస్తారో,
దానితో తన ప్రాణాన్ని చిరస్థాయిగా చేసుకుంటాడు. ॥2॥

మంత్రము :

**ఉప హరతి హవీం ష్యా సాదయతి ॥ 3 ॥**

పదము :

**ఉప । హరతి । హవీంషి । ఆ । సాదయతి ॥ 3 ॥**

**అనువాదం :**

అది హవిరాది పదార్థాలను కొనిపోయిన ట్లవుతుంది. 3 ॥

మంత్రము :

**తేషా మాసన్నానా మతిథి రాత్మన్ జుహోతి ॥ 4 ॥**

పదము :

**తేషామ్ । ఆఽసన్నానామ్ । అతిథిః । ఆత్మన్ । జుహోతి ॥ 4 ॥**

అనువాదం :

అనన్నము లైన పదార్థముల నుంచి
కొన్ని పదార్థములను అతిథి తాను
హవనం చేసుకుంటాడు. ( స్వీకరిస్తాడు. ) ॥ 4 ॥

మంత్రము

స్రుచా హస్తేన ప్రాణే యూపే స్రుక్కారేణ వషట్కారేణ ॥5॥

పదము ।

స్రుచా । హస్తేన । ప్రాణే । యూపే ।

స్రుక్ऽకారేణ । వషట్ऽకారేణ ॥ 5 ॥

అనువాదం .

స్రుక్కు వంటి చేతితో ప్రాణరూప మైన యూపంపై
భోజనం చేసేటప్పుడు వచ్చే శబ్దాలు
వషట్కారాలుగా ఆహుతి చేసుకుంటాడు. ॥ 5 ॥

మంత్రము :

ఏతే వై ప్రియా శ్చాప్రియా శ్చర్త్విజః

స్వర్గం లోకం గమయన్తి య దతిథయః ॥ 6 ॥

పదము .

ఏతే । వై । ప్రియాః । చ । అప్రియాః । చ । ఋత్విజః ।

స్వఃऽగమ్ । లోకమ్ । గమయన్తి । యత్ । అతిథయః ॥ 6 ॥

అనువాదం

అతిథులుగా వచ్చిన వారు -
ప్రియులు కాని, అప్రియులు కాని
ఆతిథ్యయజ్ఞంలో వారు ఋత్విక్కులు.
వారు యజమానుని స్వర్గలోకానికి పంపుతారు. ॥ 6

మంత్రము :

స య ఏవం విద్వాన్ న ద్విష న్నశ్నీయా

న్న ద్విషతోఽన్న మశ్నీయా

న్న మీమాంసితస్య న మీమాంసమానస్య ॥ 7 ॥

పదము :

సః । యః । ఏవమ్ । విద్వాన్ । న । ద్విషన్ । న । అశ్నీయాత్ ।

న । ద్విషతః । అన్నమ్ । అశ్నీయాత్ ।

న । మీమాంసితస్య । న । మీమాంసమానస్య ॥ 7 ॥

అనువాదం :

ఈ తత్త్వాన్ని తెలిసిన వాడు ఎవరి నైనా
ద్వేషిస్తూ భోజనం చేయకూడదు.
ద్వేషుల అన్నాన్ని తినకూడదు.
అనుమానించే వాని అన్నాన్ని తినకూడదు. ॥ 7 ॥

మంత్రము :

సర్వో వా ఏష జగ్ధపాప్మా యస్యాన్న మశ్నన్తి ॥ 8 ॥

పదము :

సర్వః । వై । ఏషః । జగ్ధపాప్మా ।

యస్య । అన్నమ్ । అశ్నన్తి ॥ 8 ॥

అనువాదం :

ఎవని అన్నాన్ని అతిథులు భుజిస్తారో,
వారు ఇతని సర్వ పాపములను దహించి వేస్తారు. ॥ 8 ॥

మంత్రము :

సర్వో వా ఏషో౽జగ్ధపాప్మా యస్యాన్నం నాశ్నన్తి ॥ 9 ॥

పదము,

సర్వః । వై । ఏషః । అజగ్ధ౽పాప్మా ।

యస్య । అన్నమ్ । న । అశ్నన్తి ॥ 9 ॥

అనువాదం

ఎవరి అన్నాన్ని తినరో, వారి పాప మంతా అలాగే ఉంటుంది ॥ 9 ॥

మంత్రము

సర్వదా వా ఏష యుక్తగ్రావార్ద్రపవిత్రో

వితతాధ్వర ఆహృతయజ్ఞక్రతు ర్య ఉపహరతి ॥ 10 ॥

పదము .

సర్వదా । వై । ఏషః । యుక్త౽గ్రావా । ఆర్ద్ర౽పవిత్రః ।

వితత౽అధ్వరః । ఆహృత౽యజ్ఞక్రతుః । యః । ఉప౽హరతి ॥ 10 ॥

అనువాదం :

ఏ గృహస్థు అతిథికై అవసర సామగ్రిని కొనిపోతాడో,
అతడు సర్వదా సోమరసం తీసి శిలతో
సోమరసాన్ని తీస్తూనే ఉంటాడు
అతను సర్వదా పవిత్రుడు.
సదా యజ్ఞకర్త.
అతను సదా యజ్ఞాన్ని నిర్వర్తించినవాడు ॥ 10 ॥

మంత్రము :

ప్రాజాపత్యో వా ఏతస్య యజ్ఞో వితతో య ఉపహరతి ॥11॥

పదము :

ప్రాజాఽపత్యః । వై । ఏతస్య ।

యజ్ఞః । విఽతతః । యః । ఉపహరతి ॥ 11 ॥

అనువాదం :

ఎవడు అతిథికై సామగ్రిని కొని వస్తాడో,
అతను ప్రాజాపత్య యజ్ఞాన్ని నిర్వర్తించిన వాడు. ॥ 11 ॥

మంత్రము :

ప్రజాపతే ర్వా ఏష విక్రమా నను విక్రమతే య ఉపహరతి ॥ 12 ॥

పదము :

ప్రజాఽపతేః । వై । ఏషః । విఽక్రమాన్ ।

అనుఽవిక్రమతే । యః । ఉపఽహరతి ॥ 12 ॥

అనువాదం :

ఎవడు అతిథికి దాన మిస్తాడో,
అతడు ప్రజాపతి అడుగులలో నడుస్తాడు. ॥ 12 ॥

మంత్రము :

యోఽతిథీనాం స ఆహవనీయో

యో వేశ్మని స గార్హపత్యో

యస్మిన్ పచన్తి స దక్షిణాగ్నిః ॥ 13 ॥

పదము

యః । అతిథినామ్ । సః । ఆఽహవనీయః ।

యః । వేశ్మని । సః । గార్హ్యపత్యః ।

యస్మిన్ । పచన్తి । సః । దక్షిణఽఅగ్నిః ॥ 13 ॥

అనువాదం :

ఏది అతిథులకు భోజనం కల్పిస్తుందో,
అది ఆహవనీయాగ్ని.
ఏది ఇంటిలో ఉంటుందో, అది గార్హ్యపత్యాగ్ని.
దేనితో వంట చేస్తారో, అది దక్షిణాగ్ని. ॥ 13 ॥

## సూక్తం-6 ( 3 )

ఋషి: బ్రహ్మ ॥ దేవతలు : అతిథి, విద్యా ॥ ఛందస్సు: 1-6,9 త్రిపదా పిపీలికా మధ్యా గాయత్రీ: 7 సామ్నీ బృహతీ; 8 పిపీలికమధ్యోష్ణిక్ ॥
మంత్రములు : ॥ 9 ॥

మంత్రము.

ఇష్టం చ వా ఏష పూర్తం చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 1 ॥

మంత్రము ।

ఇష్టమ్ । చ । వై । ఏషః । పూర్తమ్ । చ । గృహాణామ్ ।

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 1 ॥

అనువాదం :

అతిథి కంటె పూర్వం భుజించే వాడు
తన ఇళ్ళ ఇష్టాన్ని, పూర్తిని భుజించిన వా డవుతాడు. ॥ 1 ॥

మంత్రము:

పయశ్చ వా ఏష రసం చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 2 ॥

పదము:

పయః । చ । వై । ఏషః । రసమ్ । చ । గృహాణామ్ ।

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 2 ॥

అనువాదం:

అతిథి కంటె ముందు భుజించిన వాడు

తన ఇంటి రసాన్ని, క్షీరాన్ని భుజించిన వా డవుతాడు. ॥ 2 ॥

మంత్రము:

ఊర్జాం చ వా ఏష స్ఫాతిం చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 3 ॥

పదము:

ఊర్జామ్ । చ । వై । ఏషః । స్ఫాతిమ్ । చ । గృహాణామ్,

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 3 ॥

అనువాదం:

అతిథి కంటె ముందు భుజించిన వాడు

తన ఇంటి ఊర్జస్సును, స్ఫూర్తిని భుజించిన వా డవుతాడు.

॥ 3 ॥

మంత్రము.

ప్రజాం చ వా ఏష పశూంశ్చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 4 ॥

పదము

ప్రఽజామ్ । చ । వై । ఏషః । పశూన్ । చ । గృహాణామ్ ।

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 4 ॥

అనువాదం.

అతిథి కంటె ముందు భుజించిన వాడు
తన ఇంటి సంతానాన్ని, పశువులను
భుజించినవా డవుతాడు. ॥ 4 ॥

మంత్రము.

కీర్తిం చ వా ఏష యశశ్చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 5 ॥

పదము:

కీర్తిమ్ । చ । వై । ఏషః । యశః । చ । గృహాణామ్ ।

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 5 ॥

అనువాదం:

అతిథి కంటె ముందు భుజించిన వాడు
తన ఇంటి కీర్తిని, యశస్సును
భుజించిన వా డవుతాడు. ॥ 5 ॥

మంత్రము :

శ్రియం చ వా ఏష సంవిదం చ గృహాణా

మశ్నాతి యః పూర్వోఽతిథే రశ్నాతి ॥ 6 ॥

పదము :

శ్రియమ్ । చ । వై । ఏషః । సమ్ఽవిదమ్ । చ । గృహాణామ్ ।

అశ్నాతి । యః । పూర్వః । అతిథేః । అశ్నాతి ॥ 6 ॥

అనువాదం :

అతిథి కంటె ముందు భుజించిన వాడు
తన ఇంటి సంపదను, సంజ్ఞానాన్ని
భుజించిన వాడౌతాడు. ॥ 6 ॥

మంత్రము :

ఏష వా అతిథి ర్యచ్ఛ్రోత్రియ

స్తస్మాత్ పూర్వో నాశ్నీయాత్ ॥ 7 ॥

పదము :

ఏషః । వై । అతిథిః । యత్ । శ్రోత్రియః ।

తస్మాత్ । పూర్వః । న । అశ్నీయాత్ ॥ 7 ॥

అనువాదం :

ఈ అతిథి శ్రోత్రియుడు.
అందువల్ల అతని కంటె ముందు
భోజనం చేయడం తగదు. ॥ 7 ॥

మంత్రము.

అశితావ త్యతిథా వశ్నీయాద్ యజ్ఞస్య

సాత్మత్వాయ యజ్ఞస్యావిచ్ఛేదాయ తద్ వ్రతమ్ ॥ 8 ॥

పదము.

అశిత౽వతి । అతిథౌ । అశ్నీయాత్ । యజ్ఞస్య ।

సాత్మ౽త్వాయ । యజ్ఞస్య । అవి౽చ్ఛేదాయ । తత్ । వ్రతమ్ ॥ 8 ॥

అనువాదం :

అతిథి భుజించిన తర్వాత గృహస్థు భుజించాలి.
యజ్ఞ సంగతికై యజ్ఞం అవిచ్ఛేదంగా
సాగుటకై అది వ్రతంగా పాటించాలి. ॥ 8 ॥

మంత్రము :

ఏతద్ వా ఉ స్వాదీయో య దధిగవం

క్షీరం వా మాంసం వా తదేవ నాశ్నీయాత్ ॥ 9 ॥

పదము.

ఏతత్ । వై । ఓం ఇతి । స్వాదీయః । యత్ । అధి౽గవమ్ ।

క్షీరమ్ । వా । మాంసమ్ । వా । తత్ । ఏవ । న । అశ్నీయాత్ ॥ 9 ॥

అనువాదం :

ఏది మధురంగా ఉండునో,
ఏది గోక్షీరము, గోమాంసము అగునో,
దానినే అతిథి కంటె ముందు భుజించ కూడదు. ॥ 9 ॥

## సూక్తం - 6 (4)

ఋషిః బ్రహ్మ॥ దేవతలు: అతిథిః విద్యా॥ ఛందస్సు: 1,3,5,7 ప్రాజాపత్యాఽనుష్టుప్; 2,4,6,8 త్రిపదా గాయత్రీ: 9 భురిక్ ప్రాజాపత్యా గాయత్రీ; 10 చతుష్పదా ప్రస్తారపంక్తి॥ మంత్రములు: ॥ 10 ॥

మంత్రము:

స య ఏవం విద్వాన్ క్షీర ముపసిచ్యోపహరతి ॥ 1 ॥

పదము:

సః । యః । ఏవమ్ । విద్వాన్ ।

క్షీరమ్ । ఉపఽసిచ్య । ఉపఽహరతి ॥ 1 ॥

అనువాదం:

ఈ విషయం తెలిసిన వాడు అతిథి కోసమై
క్షీరాన్ని పాత్రలో తీసుకుని వెడతాడు. ॥ 1 ॥

మంత్రము:

యావ దగ్నిష్టోమే నేష్ట్వా

సుసమృద్ధే నావరున్ద్ధే తావ దేనే నావ రున్ద్ధే ॥ 2 ॥

పదము:

యావత్ । అగ్నిఽస్తోమేన । ఇష్ట్వా । సుఽసమృద్ధేన । అవఽరున్ద్ధే ।

తావత్ । ఏనేన । అవ । రున్ద్ధే ॥ 2 ॥

అనువాదం:

సుసమృద్ధమైన అగ్నిష్టోమాన్ని
పూర్తి చేసిన ఫలాన్ని అనుభవిస్తాడు. ॥ 2 ॥

మంత్రము:

స య ఏవం విద్వాన్త్సర్పి రుపసిచ్యోప హరతి ॥ 3 ॥

పదము

సః । యః । ఏవమ్ । విద్వాన్ ।

సర్పిః । ఉపఽసిచ్య । ఉపఽహరతి ॥ 3 ॥

అనువాదం.

ఈ విషయం తెలిసిన విద్వాంసుడు
అతిథి కోసమై సర్పిని పాత్రలో తీసుకొని వెడతాడు. ॥ 3 ॥

మంత్రము:

యావ దతిరాత్రే ణేష్ట్వా

సుసమృద్ధే నావరున్ద్ధే తావ దేనే నావ రున్ద్ధే ॥ 4 ॥

పదము:

యావత్ । అతిఽరాత్రేణ । ఇష్ట్వా ।

సుఽసమృద్ధేన । అవఽరున్ద్ధే । తావత్ । ఏనేన । అవ । రున్ద్ధే ॥ 4 ॥

అనువాదం:

అతిరాత్ర ఇష్టితో అతి సమృద్ధ మైన
యజ్ఞాన్ని చూసిన ఫలాన్ని పొందుతాడు. ॥ 4 ॥

మంత్రము.

స య ఏవం విద్వాన్ మధూపసి చ్యోపహరతి ॥ 5 ॥

పదము :

సః। యః। ఏవమ్। విద్వాన్। మధు। ఉప౽సిచ్య। ఉప౽హరతి ॥ 5 ॥

అనువాదం :

ఈ విషయం తెలిసిన మనిషి అతిథి కివ్వడానికై
మధువును పాత్రలో ఉంచుకొని తీసుకొని వెడతాడు. ॥ 5

మంత్రము :

యావత్ సత్త్రసద్యే నేష్ట్వా సుసమృద్ధే నావరున్ద్ధే
తావ దేనే నావ రున్ద్ధే ॥ 6 ॥

పదము :

యావత్। సత్త్ర౽సద్యేన। ఇష్ట్వా। సు౽సమృద్ధేన। అవ౽రున్ద్ధే
తావత్। ఏనేన। అవ। రున్ద్ధే ॥ 6 ॥

అనువాదం :

సమృద్ధ మైన సత్రసద్య మనే
యజ్ఞం చేసిన ఫలాన్ని అనుభవిస్తారు. ॥ 6 ॥

మంత్రము :

స య ఏవం విద్వాన్ మాంస ముపసి చ్యోపహరతి ॥ 7 ॥

పదము :

సః। యః। ఏవమ్। విద్వాన్।
మాంసమ్। ఉప౽సిచ్య। ఉప౽హరతి ॥ 7 ॥

అనువాదం:

ఈ విషయం తెలిసిన వాడు మాంసాన్ని
పాత్రలో ఉంచుకొని అతిథికై తీసుకొని వెడతాడు. ॥ 7 ॥

మంత్రము

యావద్ ద్వాదశాహే నేష్ట్వా సుసమృద్ధే నావరున్ద్ధే
తావ దేనే నావ రున్ద్ధే ॥ 8 ॥

పదము

యావత్ । ద్వాదశఽఅహేన । ఇష్ట్వా ।
సుఽసమృద్ధేన । అవఽరున్ద్ధే । తావత్ । ఏనేన । అవ । రున్ద్ధే ॥ 8 ॥

అనువాదం.

అతను ఉత్తమము, సమృద్ధము అయిన
ద్వాదశ ఇష్టిని చేసిన ఫలాన్ని పొందుతాడు. ॥ 8 ॥

మంత్రము

స య ఏవం విద్వా నుదక ముపసి చ్యోపహరతి ॥ 9 ॥

పదము

సః । యః । ఏవమ్ । విద్వాన్ ।
ఉదకమ్ । ఉపఽసిచ్య । ఉపఽహరతి ॥ 9 ॥

అనువాదం.

ఇది తెలిసిన వాడు ఉదకాన్ని
ఉత్తమ పాత్రలో ఉంచి అతిథికై కొని పోతాడు. ॥ 9 ॥

మంత్రము:

ప్రజానాం ప్రజననాయ గచ్ఛతి

ప్రతిష్ఠాం ప్రియః ప్రజానాం భవతి

య ఏవం విద్వా నుదక ముపసి చ్యోపహరతి ॥ 10 ॥

పదము:

ప్రऽజానామ్ । ప్రऽజననాయ । గచ్ఛతి ।

ప్రతిऽస్థామ్ । ప్రియః । ప్రऽజానామ్ । భవతి ।

యః । ఏవమ్ । విద్వాన్ । ఉదకమ్ । ఉపऽసిచ్య । ఉపऽహరతి ॥ 10 ॥

అనువాదం:

సంతానోత్పత్తి ప్రాప్తికై ప్రతిష్ఠను పొందుతాడు.
ప్రజలకు ప్రియు డౌతాడు.
ఇది తెలిసిన వాడు ఉదకాన్ని పాత్రలో
ఉంచుకొని అతిథికై తీసుకొని వెడతాడు. ॥ 10 ॥

## సూక్తం – 6 (5)

ఋషి: బ్రహ్మ॥ దేవతలు: అతిథి; విద్య॥ ఛందస్సు: 1 సామ్న్యుష్ణిక్: 2 పురఉష్ణిక్: 3,5,7 (వీటి రెండింటి ఉత్తరార్ధము), 10 భురిక్ సామ్నీ బృహతీ: 4,6,9 సామ్న్యనుష్టుప్: 6 (పూర్వార్ధము) త్రిపదా నిచృద్ విషమా నామ గాయత్రీ: 7 (పూర్వార్ధము) త్రిపదా విరాడ్ విషమా నామ గాయత్రీ: 8 త్రిపదా విరా డనుష్టుప్॥ మంత్రములు: ॥ 10 ॥

మంత్రము:

తస్మా ఉషా హిఙ్కృణోతి సవితా ప్ర స్తౌతి ॥ 1 ॥

పదము

తస్మై । ఉషాః । హిఙ్ । కృణోతి । సవితా । ప్ర । స్తౌతి ॥ 1 ॥

అనువాదం.

ఇది ఎరిగిన వానికై ఉష ఆనంద సందేశాన్ని ఇస్తుంది.
సవిత ప్రశంస చేస్తాడు. ॥ 1 ॥

మంత్రము :

బృహస్పతి రూర్జయోద్గాయతి
త్వష్టా పుష్ట్యా ప్రతి హరతి విశ్వే దేవా నిధనమ్ ॥ 2 ॥

పదము :

బృహస్పతిః । ఊర్జయా । ఉత్ । గాయతి ।
త్వష్టా । పుష్ట్యా । ప్రతి । హరతి । విశ్వే । దేవాః । ని౨ధనమ్॥2॥

అనువాదం :

బృహస్పతి గుణగానం చేస్తాడు.
త్వష్ట అతనికి పుష్టి నిస్తాడు.
విశ్వేదేవతలు ఆశ్రయప్రదానం చేస్తారు. ॥ 2 ॥

మంత్రము :

నిధనం భూత్యాః ప్రజాయాః
పశూనాం భవతి య ఏవం వేద ॥ 3 ॥

పదము.

ని౨ధనమ్ । భూత్యాః । ప్ర౨జాయాః ।
పశూనామ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 3 ॥

అనువాదం :

అందువల్ల అతను సంపద, సంతానం, పశువులకు
ఆశ్రయస్థానం అవుతాడు. ॥ 3 ॥

మంత్రము :

తస్మా ఉద్యన్త్సూర్యో హిఙ్కృణోతి సంగవః ప్ర స్తౌతి ॥4॥

పదము :

తస్మై । ఉత్ఽయన్ । సూర్యః । హిఙ్ । కృణోతి ।

సమ్ఽగవః । ప్ర । స్తౌతి ॥ 4 ॥

అనువాదం :

ఈ అతిథిసత్కార వ్రతం తెలిసిన వానికి
ఉదయిస్తున్న సూర్యుడు ఆనంద సందేశం ఇస్తాడు.
ప్రభాత సమయం ప్రశంస చేస్తుంది. ॥ 4 ॥

మంత్రము :

మధ్యన్దిన ఉద్గాయ త్యపరాహ్ణః

ప్రతి హర త్యస్తంయ న్నిధనమ్ ।

నిధనం భూత్యాః ప్రజాయాః

పశూనాం భవతి య ఏవం వేద ॥ 5 ॥

పదము :

మధ్యన్దినః । ఉత్ । గాయతి । అపరఽఅహ్నః ।

ప్రతి । హరతి । అస్తమ్ఽయన్ । నిఽధనమ్ ।

నిఽధనమ్ । భూత్యాః । ప్రఽజాయాః ।

పశూనామ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 5 ॥

అనువాదం :

మధ్యందినం గుణగానం చేస్తుంది.
అపరాహ్ణం పుష్టి నిస్తుంది.
అస్తమయం ఆశ్రయ మిస్తుంది.
ఇలా అతను సంపత్తికి, ప్రజకు,
పశువులకు ఆశ్రయస్థాన మౌతాడు. ॥ 5 ॥

మంత్రము

తస్మా అభ్రో భవన్ హిఙ్కృణోతి స్తనయన్ ప్ర స్తౌతి ॥6॥

పదము .

తస్మై । అభ్రః । భవన్ । హిఙ్ । కృణోతి ।

స్తనయన్ । ప్ర । స్తౌతి ॥ 6 ॥

అనువాదం :

ఈ అతిథిసత్కార వ్రతం తెలిసిన వానికి
ఆకసం లోని మేఘం ఆనంద సందేశ మిస్తుంది.
మేఘగర్జనం ప్రశంసిస్తుంది. ॥ 6 ॥

మంత్రము :

విద్యోతమానః ప్రతి హరతి వర్ష

న్నుద్గాయ త్యుద్గృహ్ణన్ నిధనమ్ ।

నిధనం భూత్యాః ప్రజాయాః

పశూనాం భవతి య ఏవం వేద ॥ 7 ॥

పదము:

వి౽ద్యోతమానః । ప్రతి । హరతి । వర్షన్ ।

ఉత్ । గాయతి । ఉత్౽గృహ్ణన్ । ని౽ధనమ్ ।

ని౽ధనమ్ । భూత్యాః । ప్ర౽జాయాః ।

పశూనామ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 7 ॥

అనువాదం:

మెరిసే మబ్బు పుష్టి నిస్తుంది.
వర్షాభ్రం గుణగానం చేస్తుంది.
పై కెగిరే మబ్బు ఆశ్రయ మిస్తుంది.
ఈ విధంగా అతను సంపత్తికి, ప్రజకు,
పశువులకు ఆశ్రయస్థాన మౌతాడు. ॥ 7 ॥

మంత్రము:

అతిథీన్ ప్రతి పశ్యతి హిఙ్కృణో త్యభి వదతి

ప్ర స్తౌ త్యుదకం యాచ త్యుద్గాయతి ॥ 8 ॥

పదము:

అతిథీన్ । ప్రతి । పశ్యతి । హిఙ్ । కృణోతి । అభి । వదతి ।

ప్ర । స్తౌతి । ఉదకమ్ । యాచతి । ఉత్ । గాయతి ॥ 8 ॥

**అనువాదం:**

ఈ అతిథిసత్కార వ్రతం తెలిసిన వాడు
అతిథులను దర్శిస్తాడు.
ఆనందంతో శబ్దం చేస్తాడు.
అతిథులకు నమస్కరిస్తాడు.
వారిని ప్రస్తుతిస్తాడు.
అతను జలం తీసుకున్నపుడు
యజ్ఞంలో ఉద్గాత వలె గానం చేస్తాడు. ॥ 8 ॥

**మంత్రము**

ఉప హరతి ప్రతి హర త్యుచ్ఛిష్టం నిధనమ్ ॥ 9 ॥

**పదము.**

ఉప । హరతి । ప్రతి । హరతి । ఉత్ఽశిష్టమ్ । నిఽధనమ్ ॥ 9 ॥

**అనువాదం:**

అతిథులకు ఇచ్చిన పదార్థాలను
యజ్ఞమునకు ఉపహారంగా భావిస్తాడు.
ఎవడు అతిథులకు భోజనం పెట్టి,
మిగిలిన దానిని భక్షిస్తాడో,
అతడు యజ్ఞాన్ని సంపూర్తి చేస్తాడు. ॥ 9 ॥

**మంత్రము.**

నిధనం భూత్యాః ప్రజాయాః
పశూనాం భవతి య ఏవం వేద ॥ 10 ॥

పదము :

ని౽ధనమ్ । భూత్యాః । ప్ర౽జాయాః ।

పశూనామ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 10 ॥

అనువాదం :

ఈ విధంగా అతిథిసత్కారం చేసే వాడు
సంపదకు, ప్రజకు, పశువులకు
ఆశ్రయస్థాన మౌతాడు. ॥ 10 ॥

## సూక్తం-6 ( 6 )

ఋషి: బ్రహ్మ ॥ దేవతలు: అతిథి: విద్యా ॥ ఛందస్సు: 1 అసురి గాయత్రీ: 2 సామ్న్యనుష్టుప్: 3,5 త్రిపదా౽ఒర్చీ పంక్తి: 4 ఏకపదా ప్రాజాపత్యా గాయత్రీ: 6-11 ఆర్చీ బృహతీ: 12 ఏకపదా అసురీ జగతీ: 13 యాజుషీ త్రిష్టుప్: 14 ఏకపదాసుర్యుష్ణిక్ ॥ మంత్రములు: ॥ 14 ॥

మంత్రము :

యత్ క్షత్తారం హ్వయ త్యా శ్రావయ త్యేవ తత్ ॥ 1 ॥

పదము :

యత్ । క్షత్తారమ్ । హ్వయతి । ఆ । శ్రావయతి । ఏవ । తత్ ॥1॥

అనువాదం :

ద్వారపాలకుని పిలిచిన వాడు
అధిశ్రవణం చేసిన వాడే అవుతాడు. ॥ 1 ॥

మంత్రము :

యత్ ప్రతిశృణోతి ప్రత్యాశ్రావయ త్యేవ తత్ ॥ 2 ॥

పదము

యత్ । ప్రతి౨శృణోతి । ప్రతి౨ఆశ్రావయతి । ఏవ । తత్ ॥ 2 ॥

అనువాదం।

ఎవడు వింటాడో అతను ప్రత్యాశ్రవణం
చేసినవాడే అవుతాడు. ॥ 2 ॥

మంత్రము

యత్ పరివేష్టారః పాత్రహస్తాః

పూర్వే చాపరే చ ప్రపద్యన్తే

చమసాధ్వర్యవ ఏవ తే ॥ 3 ॥

పదము:

యత్ । పరి౨వేష్టారః । పాత్ర౨హస్తాః ।

పూర్వే । చ । అపరే । చ । ప్ర౨పద్యన్తే ।

చమస౨అధ్వర్యవః । ఏవ । తే ॥ 3 ॥

అనువాదం।

అతిథులకై పూర్వం, అపరం పరివేష్టించిన వారు,
పాత్రహస్తులు మొదలైన వారి వద్దకు వెళ్ళేవాడు.
యజ్ఞమునకు చమసాధ్వర్యుడే అవుతాడు. ॥ 3 ॥

మంత్రము:

తేషాం న కశ్చ నాహోతా ॥ 4 ॥

పదము,

తేషామ్ । న । కః । చన । అహోతా ॥ 4 ॥

అథర్వ. IV 24

అనువాదం :

వారిలో ఎవడూ అయాజకుడు కాడు. ॥ 4 ॥

మంత్రము :

యద్ వా అతిథిపతి రతిథీన్ పరివిష్యగృహా నుపోదై

త్యవభృథ మేవ త దుపావైతి ॥ 5 ॥

పదము :

యత్ । వై । అతిథిఽపతిః । అతిథీన్ ।

పరిఽవిష్య । గృహాన్ । ఉపఽఉదైతి ।

అవఽభృథమ్ । ఏవ । తత్ । ఉపఽఅవైతి ॥ 5 ॥

అనువాదం :

ఏ గృహస్థు అతిథులకు భోజనం పెట్టి
తన ఇంటికి వెడుతాడో, అతను
అవభృథ స్నానం చేయడానికి వెళ్ళినట్లే అవుతుంది. ॥ 5 ॥

మంత్రము :

యత్ సభాగయతి దక్షిణాః సభాగయతి

య దనుతిష్ఠత ఉదవస్య త్యేవ తత్ ॥ 6 ॥

పదము :

యత్ । సభాగయతి । దక్షిణాః । సభాగయతి ।

యత్ । అనుఽతిష్ఠతే । ఉత్ఽఅవస్యతి । ఏవ । తత్ ॥ 6 ॥

అనువాదం.

ఎప్పుడు సమాగతు డౌతాడో,
దక్షిణను ఎప్పుడు సమర్పిస్తాడో,
ఎప్పుడు తన అనుష్ఠానం పూర్తిచేస్తాడో,
అప్పుడు అతను యథాపూర్తిగా యజ్ఞాన్ని
చేసినవాడే అవుతాడు. ॥ 6 ॥

మంత్రము.

స ఉపహూతః పృథివ్యాం భక్షయ
త్యుపహూతస్తస్మిన్ యత్ పృథివ్యాం విశ్వరూపమ్ ॥ 7 ॥

పదము.

సః । ఉపఽహూతః । పృథివ్యామ్ । భక్షయతి ।
ఉపఽహూతః । తస్మిన్ । యత్ । పృథివ్యామ్ । విశ్వఽరూపమ్ ॥ 7 ॥

అనువాదం:

అతడు ఆదరంతో పిలిచిన అతిథి
భూమిపై ఏ దేశంలో ఉపహూతు డౌతాడో,
ఏ పృథివిపై విశ్వరూపి యైన అన్నం కలదో,
అక్కడ నిమంత్రితుడై దానిని భుజిస్తాడు. ॥ 7 ॥

మంత్రము:

స ఉపహూతోఽన్తరిక్షే భక్షయ
త్యుపహూతస్తస్మిన్ యదన్తరిక్షే విశ్వరూపమ్ ॥ 8 ॥

పదము :

సః । ఉప౽హూతః । అన్తరిక్షే । భక్షయతి ।

ఉప౽హూతః । తస్మిన్ । యత్ । అన్తరిక్షే । విశ్వ౽రూపమ్ ॥8॥

అనువాదం :

అతను ఆదరంతో పిలిచిన అతిథి
అంతరిక్షంలో ఏ ప్రదేశంలో ఉపహూతు డౌతాడో,
ఏ అంతరిక్షంలో విశ్వరూపి అయిన అన్నం కలదో,
అక్కడ నిమంత్రితుడై దానిని భుజిస్తాడు. ॥ 8 ॥

మంత్రము :

స ఉపహూతో దివి భక్షయ

త్యుపహూత స్తస్మిన్ యద్ దివి విశ్వరూపమ్ ॥ 9 ॥

పదము :

సః । ఉప౽హూతః । దివి । భక్షయతి ।

ఉప౽హూతః । తస్మిన్ । యత్ । దివి । విశ్వ౽రూపమ్ ॥ 9 ॥

అనువాదం :

అతను ఆదరంతో పిలిచిన అతిథి
ద్యులోకంలో ఎచ్చట ఉపహూతు డౌతాడో,
ఏ ద్యులోకంలో విశ్వరూపి అయిన అన్నం కలదో,
అక్కడ నిమంత్రితుడై దానిని భుజిస్తాడు. ॥ 9 ॥

మంత్రము :

స ఉపహూతో దేవేషు భక్షయ

త్యుపహూత స్తస్మిన్ యద్ దేవేషు విశ్వరూపమ్ ॥ 10 ॥

పదము

సః । ఉప౽హూతః । దేవేషు । భక్షయతి ।

ఉప౽హూతః । తస్మిన్ । యత్ । దేవేషు । విశ్వ౽రూపమ్ ॥10॥

అనువాదం :

అతను ఆదరంతో పిలిచిన అతిథి
దేవతలలో ఎక్కడ ఉపహూతు డౌతాడో,
ఏ దేవతలలో విశ్వరూపి అయిన అన్నం కలదో,
అక్కడ నిమంత్రితుడై దానిని భుజిస్తాడు. ॥ 10 ॥

మంత్రము

స ఉపహూతో లోకేషు భక్షయ

త్యుపహూత స్తస్మిన్ య ల్లోకేషు విశ్వరూపమ్ ॥ 11 ॥

పదము :

సః । ఉప౽హూతః । లోకేషు । భక్షయతి ।

ఉప౽హూతః । తస్మిన్ । యత్ । లోకేషు । విశ్వ౽రూపమ్ ॥11॥

అనువాదం :

అతను ఆదరంతో పిలిచిన అతిథి
లోకాలలో ఎక్కడ ఉపహూతు డౌతాడో,
ఏ లోకాలలో విశ్వరూపి అయిన అన్నం కలదో,
అక్కడ నిమంత్రితుడై దానిని భుజిస్తాడు. ॥ 11 ॥

మంత్రము :

స ఉపహూత ఉపహూతః ॥ 12 ॥

పదము :

సః । ఉపఽహూతః । ఉపఽహూతః ॥ 12 ॥

అనువాదం :

ఆ విధంగా ఆదరంతో నిమంత్రితుడైన
అతిథి బహుళ లాభకారి. ॥ 12 ॥

మంత్రము :

ఆప్నోతీమం లోక మాప్నో త్యముమ్ ॥ 13 ॥

పదము :

ఆప్నోతి । ఇమమ్ । లోకమ్ । ఆప్నోతి । అముమ్ ॥ 13 ॥

అనువాదం :

అలా ఆదరంతో పిలిచిన గృహస్థుకు
ఇహలోకం దక్కుతుంది.
అలాగే పరలోకాన్ని కూడా అతను పొందుతాడు. ॥ 13 ॥

మంత్రము :

జ్యోతిష్మతో లోకాన్ జయతి య ఏవం వేద ॥ 14 ॥

పదము :

జ్యోతిష్మతః । లోకాన్ । జయతి । యః । ఏవమ్ । వేద ॥ 14 ॥

అనువాదం :

ఈ విషయాన్ని తెలిసిన వాడు
జ్యోతిర్లోకాలను జయిస్తాడు. ॥ 14 ॥

ఇది ఆరవ సూక్తం.

ఇది మూడవ అనువాకం.

## అనువాకం: 4

### సూక్తం – 7

ఋషి: బ్రహ్మా ॥ దేవత ; వృషభము ॥ ఛందస్సు ; 1 ఆర్చీ బృహతీ ; 6,8 ఆసురీ గాయత్రీ. 7 త్రిపదా పిపీలికామధ్యా నిచృద్ గాయత్రీ ; 9,19 సామ్నీ గాయత్రీ ; 10 పురఉష్ణిక్ ; 11,12,17,25 సామ్న్యుష్ణిక్ ; 18,22 ఏకపదాఽఽసురీ జగతీ. 19 ఏకపదాఽఽసురీ పంక్తి 20 యాజుషీ జగతీ ; 21 ఆసుర్యనుష్టుప్ ; 23 ఏకపదాఽఽసురీ బృహతీ ; 24 సామ్నీ భురిగ్బృహతీ ; 26 సామ్నీ త్రిష్టుప్ ; (ఇచ్చట చెప్పని పాదములు ద్విపదలు) ; మంత్రములు ; ॥ 26 ॥

వినియోగం:– గోష్ఠకర్మలో దీనికి వినియోగం. దీని వివరణ 2వ కాండ, 26వ సూక్తంలో కలదు.

అష్టే అనడుత్సవంలో దీనితో నిరుప్త హవి రభిమర్శనం, దానం చేయాలి.

మేధ్యవృషభం యొక్క భిన్న భిన్న అంగములు భిన్న భిన్న దేవతారూపము లగు నన్న వృషభ ప్రశంస ఇందులో కలదు.

మంత్రము:

ప్రజాపతిశ్చ పరమేష్ఠీ చ శృఙ్గే

ఇన్ద్రః శిరో అగ్ని ర్లలాటం యమః కృకాటమ్ ॥ 1 ॥

పదము

ప్రజాఽపతిః । చ । పరమేఽస్థీ । చ । శృఙ్గే ఇతి ।

ఇన్ద్రః । శిరః । అగ్నిః । లలాటమ్ । యమః । కృకాటమ్ ॥ 1 ॥

అనువాదం.

(ఈ గోవునకు) ప్రజాపతి, పరమేష్ఠి శృంగములు.
ఇంద్రుడు శిరస్సు. అగ్ని లలాటము.
యముడు గంగడోలు ॥ 1 ॥

మంత్రము :

సోమో రాజా మస్తిష్కో

ద్యౌ రుత్తరహనుః పృథి వ్యఽధరహనుః ॥ 2 ॥

పదము :

సోమః । రాజా । మస్తిష్కః ।

ద్యౌః । ఉత్తరఽహనుః । పృథివీ । అధరఽహనుః ॥ 2 ॥

అనువాదం :

రాజు సోముడు మస్తిష్కము.
ద్యులోకం పై దవడ.
పృథ్వి క్రింది దవడ. ॥ 2 ॥

మంత్రము :

విద్యు జ్జిహ్వా మరుతో దన్తా రేవతీ

ర్గ్రీవాః కృత్తికా స్కన్ధా ఘర్మో వహః ॥ 3 ॥

పదము :

విఽద్యుత్ । జిహ్వా । మరుతః । దన్తాః । రేవతీః ।

గ్రీవాః । కృత్తికాః । స్కన్ధాః । ఘర్మః । వహః ॥ 3 ॥

అనువాదం :

మెరుపు జిహ్వా. మరుత్తులు దంతములు.
రేవతి నక్షత్రము గొంతుక.
కృత్తికలు స్కంధములు.
సూర్యుడు పై భాగము. ॥ 3 ॥

మంత్రము।

విశ్వం వాయుః స్వర్గో లోకః

కృష్ణద్రం విధరణీ నివేష్యః ॥ 4 ॥

పదము

విశ్వమ్ । వాయుః । స్వఃऽగః । లోకః ।

కృష్ణऽద్రమ్ । విऽధరణీ । నిऽవేష్యః ॥ 4 ॥

అనువాదం

సర్వమూ వాయువు. స్వర్గము దాని కృష్ణద్రం.
ధారకశక్తి వెనుక బాగము. ॥ 4 ॥

మంత్రము

శ్యేనః క్రోడో౽న్తరిక్షం పాజస్యం।

బృహస్పతిః కకుద్ బృహతీః కీకసాః ॥ 5 ॥

పదము

శ్యేనః । క్రోడః । అన్తరిక్షమ్ । పాజస్యऽమ్ ।

బృహస్పతిః । కకుత్ । బృహతీః । కీకసాః ॥ 5 ॥

అనువాదం।

డేగ దీని క్రోడము. అంతరిక్షం కుక్షి.
బృహస్పతి మూపురము. బృహతి కీకసము. ॥ 5 ॥

మంత్రము.

దేవానాం పత్నీః పృష్టయ ఉపసదః పర్శవః ॥ 6 ॥

పదము :

దేవానామ్ । పత్నీః । పృష్టయః । ఉప౽సదః । పర్శవః ॥ 6 ॥

అనువాదం :

దేవపత్నులు పృష్ఠములు.
అనుచరులు ప్రక్కటెముకలు. ॥ 6 ॥

మంత్రము :

మిత్రశ్చ వరుణ శ్చాంసౌ త్వష్టా చార్యమా చ దోషణీ
మహాదేవో బాహూ ॥ 7 ॥

పదము :

మిత్రః । చ । వరుణః । చ । అంసౌ ।
త్వష్టా । చ । అర్యమా । చ । దోషణీ ఇతి ।
మహా౽దేవః । బాహూ ఇతి ॥ 7 ॥

అనువాదం :

మిత్రుడు, వరుణుడు భుజములు.
త్వష్ట, అర్యముడు బాహుభాగములు.
మహాదేవుడు బాహువులు. ॥ 7 ॥

మంత్రము :

ఇన్ద్రాణీ భసద్ వాయుః పుచ్ఛం పవమానో బాలాః ॥ 8 ॥

పదము :

ఇన్ద్రాణీ । భసత్ । వాయుః । పుచ్ఛమ్ । పవమానః । బాలాః ॥ 8 ॥

**అనువాదం :**

ఇంద్రపత్ని గుహ్య భాగము.
వాయువు పుచ్ఛము.
పవమాన వాయువు వాలము. ॥ 8 ॥

**మంత్రము :**

**బ్రహ్మ చ క్షత్రం చ శ్రోణీ బల మూరూ ॥ 9 ॥**

**పదము :**

**బ్రహ్మ । చ । క్షత్రమ్ । చ । శ్రోణీ ఇతి। బలమ్। ఊరూ ఇతి ॥9॥**

**అనువాదం :**

బ్రహ్మ జాతి, క్షత్రియ జాతి పిరుదులు. బలము తొడలు. ॥ 9 ॥

**మంత్రము .**

**ధాతా చ సవితా చాష్ఠీవన్తౌ జఙ్ఘా గన్ధర్వా**
**అప్సరసః కుష్ఠికా అదితిః శఫాః ॥ 10 ॥**

**పదము:**

**ధాతా । చ । సవితా । చ । అష్ఠీవన్తౌ । జఙ్ఘాః । గన్ధర్వాః ।**
**అప్సరసః । కుష్ఠికాః । అదితిః । శఫాః ॥ 10 ॥**

**అనువాదం :**

ధాత, సవిత మోకాళ్ళు.
గంధర్వులు జంఘలు.
అప్సరసలు ఖుర భాగములు.
అదితి గిట్టలు. ॥ 10 ॥

మంత్రము :

చేతో హృదయం యకృన్మేధా వ్రతం పురీతత్ ॥ 11 ॥

పదము :

చేతః । హృదయమ్ । యకృత్ । మేధా । వ్రతమ్ । పురి౨తత్
॥ 11 ॥

అనువాదం :

చేతన దాని హృదయం.
మేధ, యకృత్తు (కాలేయం)
వ్రతము దాని హృదయవేష్టనం. ॥ 11 ॥

మంత్రము :

క్షుత్ కుక్షి రిరా వనిష్ఠుః పర్వతాః ప్లాశయః ॥ 12 ॥

పదము :

క్షుత్ । కుక్షిః । ఇరా । వనిష్ఠుః । పర్వతాః । ప్లాశయః ॥ 12 ॥

అనువాదం :

క్షుధా కుక్షి. ఇరా (అన్నము) పెద్దప్రేవు.
పర్వతములు చిన్న ప్రేవులు. ॥ 12 ॥

మంత్రము :

క్రోధో వృక్కౌ మన్యు రాణ్డౌ ప్రజా శేపః ॥ 13 ॥

పదము :

క్రోధః । వృక్కౌ । మన్యుః । ఆణ్డౌ । ప్ర౨జా । శేపః ॥ 13 ॥

అనువాదం.

క్రోధము గుదము.

మన్యువు అండములు. ప్రజలు శేఫము. ॥ 13 ॥

మంత్రము.

నదీ సూత్రీ వర్షస్య పతయ స్తనా స్తనయిత్ను రూధః॥14॥

పదము :

నదీ । సూత్రీ । వర్షస్య । పతయః ।

స్తనాః । స్తనయిత్నుః । ఊధః ॥ 14 ॥

అనువాదం :

నది సూత్రనాడి.

వర్షాపతులు ( మేఘములు ) దాని స్తనములు.

గర్జామేఘం పొదుగు. ॥ 14 ॥

మంత్రము :

విశ్వవ్యచా శ్చర్మౌషధయో లోమాని నక్షత్రాణి రూపమ్ ॥ 15 ॥

పదము :

విశ్వఽవ్యచాః । చర్మ । ఓషధయః ।

లోమాని । నక్షత్రాణి । రూపమ్ ॥ 15 ॥

అనువాదం :

విశ్వవ్యాపకము చర్మము

ఓషధులు రోమములు.

నక్షత్రములు రూపము. ॥ 15 ॥

మంత్రము :

దేవజనా గుదా మనుష్యాః అన్త్రాణ్యత్రా ఉదరమ్ ॥ 16॥

పదము :

దేవఽజనాః । గుదాః । మనుష్యాః ।
అన్త్రాణి । అత్రాః । ఉదరమ్ ॥ 16 ॥

అనువాదం :

దేవజనులు గుదము.
మనుష్యులు అంత్రములు. (ప్రేవులు)
భక్షక ప్రాణి ఉదరము. ॥ 16 ॥

మంత్రము :

రక్షాంసి లోహిత మితరజనా ఊబధ్యమ్ ॥ 17 ॥

పదము :

రక్షాంసి । లోహితమ్ । ఇతరఽజనాః । ఊబధ్యమ్ ॥ 17 ॥

అనువాదం :

రాక్షసులు రక్తము.
ఇతర జనులు అపక్వాన్నం. ॥ 17 ॥

మంత్రము :

అభ్రం పీబో మజ్జా నిధనమ్ ॥ 18 ॥

పదము :

అభ్రమ్ । పీబః । మజ్జా । నిఽధనమ్ ॥ 18 ॥

అనువాదం :

అస్థిమము మేదస్సు. నిధనం మజ్జ. ॥ 18 ॥

మంత్రము.

అగ్నిరాసీన ఉత్థితో౽శ్వినా ॥ 19 ॥

పదము.

అగ్నిః । ఆసీనః । ఉత్థితః । అశ్వినా ॥ 19 ॥

అనువాదం :

అగ్ని ఆసనము. అశ్వినీ దేవతలు ఉత్థానము. ॥ 19 ॥

మంత్రము.

ఇన్ద్రః ప్రాఙ్ తిష్ఠన్ దక్షిణా తిష్ఠన్ యమః ॥ 20 ॥

పదము.

ఇన్ద్రః । ప్రాఙ్ । తిష్ఠన్ । దక్షిణా । తిష్ఠన్ । యమః ॥ 20 ॥

అనువాదం :

ఇంద్రుడు దీనికి తూర్పు దిక్కున ఉంటాడు.
యముడు దక్షిణ దిక్కున ఉంటాడు. ॥ 20 ॥

మంత్రము.

ప్రత్యఙ్ తిష్ఠన్ ధాతోదఙ్ తిష్ఠ న్త్సవితా ॥ 21 ॥

పదము :

ప్రత్యఙ్ । తిష్ఠన్ । ధాతా । ఉదఙ్ । తిష్ఠన్ । సవితా ॥ 21 ॥

అనువాదం.

పడమట ధాత ఉంటాడు.
సవిత ఉత్తరాన ఉంటాడు ॥ 21 ॥

మంత్రము :

తృణాని ప్రాప్తః సోమో రాజా ॥ 22 ॥

పదము :

తృణాని । ప్రఽఆప్తః । సోమః । రాజా ॥ 22 ॥

అనువాదం :

రాజు, సోముడు ప్రాప్తతృణములు. ॥ 22 ॥

మంత్రము :

మిత్ర ఈక్షమాణ ఆవృత్త ఆనన్దః ॥ 23 ॥

పదము :

మిత్రః । ఈక్షమాణః । ఆఽవృత్తః । ఆఽనన్దః ॥ 23 ॥

అనువాదం :

అవలోకించు వాడు సూర్యుడు.
పరావృత్తము ఆనందము. ॥ 23 ॥

మంత్రము :

యుజ్యమానో వైశ్వదేవో యుక్తః
ప్రజాపతి ర్విముక్తః సర్వమ్ ॥ 24 ॥

పదము :

యుజ్యమానః । వైశ్వఽదేవః । యుక్తః ।
ప్రజాఽపతిః । విఽముక్తః । సర్వమ్ ॥ 24 ॥

అనువాదం

కలుపువాడు వైశ్వదేవుడు.
కలిసినవాడు ప్రజాపతి.
విడివడునది సర్వము. ॥ 24 ॥

మంత్రము :

ఏతద్ వై విశ్వరూపం సర్వరూపం గోరూపమ్ ॥ 25 ॥

పదము :

ఏతత్ । వై । విశ్వ౽రూపమ్ । సర్వ౽రూపమ్ । గో౽రూపమ్ ॥25॥

అనువాదం :

ఇది నిస్సందేహంగా గోరూపము.
ఇదే సర్వరూపము. ॥ 25 ॥

మంత్రము :

ఉపైనం విశ్వరూపాః సర్వరూపాః
పశవ స్తిష్ఠన్తి య ఏవం వేద ॥ 26 ॥

పదము :

ఉప । ఏనమ్ । విశ్వ౽రూపాః । సర్వ౽రూపాః ।
పశవః । తిష్ఠన్తి । యః । ఏవమ్ । వేద ॥ 26 ॥

అనువాదం :

ఈ సంగతి తెలిసినవాడు దీని ముందుంటాడు.
విశ్వరూపులు, సర్వరూపులు, అందరూ
పశువులై సమీపంలో నిలుస్తారు. ॥ 26 ॥

ఇది ఏడవ సూక్తం

అథర్వ iv 25

# సూక్తం-8

ఋషులు: భృగువు, అంగిరసుడు॥ దేవత: సర్వశీర్షామయాపాకరణమ్॥
ఛందస్సు: 1-11,13,14,16-20 అనుష్టుప్: 12 అనుష్టుబ్గర్భా కకుమ్మతీ
చతుష్పదోష్ణిక్: 15 విరాడనుష్టుప్: 21 విరాట్ పథ్యాబృహతీ: 22
పథ్యాపంక్తి॥ మంత్రములు: ॥ 22 ॥

వినియోగం:- శిరో రోగాది సర్వచికిత్సలలో ఈ అర్థసూక్తంతో వ్యాధితుని శరీరాన్ని అభిమర్షణం చేయాలి. తర్వాత 'పాదాభ్యాం తే' అనే రెండు మంత్రాలతో ఆదిత్యుని ఉపతిష్ఠానం చెయ్యాలి.

అట్లే దీనిని అంహోలింగ గణంలో పఠించుట వలన అగణమునకు వలెనే దీనికి కూడా సర్వ వ్యాధిచికిత్సలలో వినియోగం అనుసంధేయం. దీని వివరణ 2వ కాండ 33వ సూక్తంలో కలదు.

మంత్రము:

శీర్షక్తిం శీర్షామయం కర్ణశూలం విలోహితమ్ ।
సర్వం శీర్షణ్యం౨ తే రోగం బహిర్నిర్మంత్రయామహే ॥1॥

పదము:

శీర్షక్తిమ్ । శీర్ష౨ఆమయమ్ । కర్ణ౨శూలమ్ । వి౨లోహితమ్ ।
సర్వమ్ । శీర్షణ్య౨మ్ । తే । రోగమ్ ।
బహిః । నిః । మంత్రయామహే ॥ 1 ॥

అనువాదం:

శిరశ్శూల, శిరోబాధ, కర్ణశూల, రక్తక్షీణత,
నీకున్న అన్నిరోగాలను
ఓ రోగీ బయటికి త్రోసివేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము:

కర్ణాభ్యాం తే కఙ్కూషేభ్యః కర్ణశూలం విసల్పకమ్ ।
సర్వం శీర్షణ్యం౨ తే రోగం బహి ర్ని ర్మన్త్రయామహే ॥2॥

పదము.

కర్ణాభ్యామ్ । తే । కఙ్కూషేభ్యః । కర్ణ౨శూలమ్। వి౨సల్పకమ్।
సర్వమ్ । శీర్షణ్య౨మ్ । తే । రోగమ్ ।
బహిః । నిః । మన్త్రయామహే ॥ 2 ॥

అనువాదం:

నీ చెవులపైన, చెవుల లోపల విశేషబాధ కల్గిస్తున్న కర్ణశూలను,
సర్వ శిరోరోగాలను బయటికి త్రోసివేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము:

యస్య హేతోః ప్రచ్యవతే యక్ష్మః కర్ణత ఆస్యతః ।
సర్వం శీర్షణ్యం౨ తే రోగం బహి ర్ని ర్మన్త్రయామహే ॥3॥

పదము:

యస్య । హేతోః । ప్ర౨చ్యవతే ।యక్ష్మః । కర్ణతః । ఆస్యతః ।
సర్వమ్ । శీర్షణ్య౨మ్ । తే । రోగమ్ ।
బహిః । నిః । మన్త్రయామహే ॥ 3 ॥

అనువాదం:

ఏకారణం వల్లనైతే చెవుల నుంచి,
ముఖం నుంచి యక్ష్మరోగం స్రవిస్తుందో,

అలాంటి సర్వ శిరోరోగాలను
బయటికి త్రోసివేస్తున్నాను. ॥ 3

మంత్రము :

యః కృణోతి ప్రమోత మన్ధం కృణోతి పూరుషమ్ ।
సర్వం శీర్షణ్యం తే రోగం బహి ర్ని ర్మన్త్రయామహే ॥4

పదము :

యః । కృణోతి । ప్రఽమోతమ్ । అన్ధమ్ । కృణోతి । పురుషమ్

సర్వమ్ । శీర్షణ్యఽమ్ । తే । రోగమ్ ।

బహిః । నిః । మన్త్రయామహే ॥ 4

అనువాదం :

బధిరత్వం, మనుషులకు అంధత్వం
ప్రాప్తింప జేసే సర్వ శిరోరోగాలను
బయటికి త్రోసివేస్తున్నాము. ॥ 4

మంత్రము :

అఙ్గభేద మఙ్గజ్వరం విశ్వాఙ్గ్యం విసల్పకమ్ ।
సర్వం శీర్షణ్యం తే రోగం బహి ర్ని ర్మన్త్రయామహే॥5

పదము :

అఙ్గఽభేదమ్ । అఙ్గఽజ్వరమ్ । విశ్వఽఅఙ్గ్యమ్ । విఽసల్పకమ్ ।

సర్వమ్ । శీర్షణ్యఽమ్ । తే । రోగమ్ ।

బహిః । నిః । మన్త్రయామహే ॥ 5

అనువాదం.

అంగభేదం చేయునది, అంగజ్వరము,
సర్వాంగ పీడాకరమైన అన్ని శిరోరోగాలను
బయటికి త్రోసివేస్తున్నాము. ॥ 5 ॥

మంత్రము:

యస్య భీమః ప్రతీకాశ ఉద్వేపయతి పూరుషమ్ ।
తక్మానం విశ్వశారదం బహిర్నిర్మన్త్రయామహే ॥ 6 ॥

పదము:

యస్య । భీమః । ప్రతిఽకాశః । ఉత్ఽవేపయతి । పురుషమ్ ।
తక్మానమ్ । విశ్వఽశారదమ్ । బహిః । నిః। మన్త్రయామహే॥6॥

అనువాదం।

దేని భయంకర రూపం మనిషిని గజగజ లాడిస్తుందో,
ఆ సర్వ జ్వరాలను బయటికి త్రోసివేస్తున్నాము. ॥ 6 ॥

మంత్రము.

య ఊరూ అనుసర్ప త్యథో ఏతి గవీనికే ।
యక్ష్మం తే అన్తరఙ్గేభ్యో బహిర్నిర్మన్త్రయామహే ॥7॥

పదము.

యః । ఊరూ ఇతి । అనుఽసర్పతి ।
అథో ఇతి । ఏతి । గవీనికే ఇతి ।

యక్ష్మమ్ । తే । అన్తః । అఙ్గేభ్యః ।
బహిః । నిః । మన్త్రియామహే ॥ 7 ॥

అనువాదం :

తొడలపై వ్యాపించేది,
నాడులకు వ్యాపించేది,
అయిన యక్ష్మరోగాన్ని
నీ అంతరవయవముల నుంచి
బయటికి నెట్టివేస్తున్నాను. ॥ 7 ॥

మంత్రము :

యది కామా దపకామా ద్ధృదయా జ్జాయతే పరి ।
హృదో బలాస మఙ్గేభ్యో బహి ర్ని ర్మన్త్రియామహే ॥ 8 ॥

పదము :

యది । కామాత్ । అపఽకామాత్ । హృదయాత్ । జాయతే । పరి ।
హృదః । బలాసమ్ । అఙ్గేభ్యః । బహిః । నిః । మన్త్రియామహే
॥ 8 ॥

అనువాదం :

కామం వల్ల కానీ, కామ హీనత వల్ల కానీ,
ఇతర కారణాల వల్ల కానీ
హృదయం పైభాగంలో ఉత్పన్నమయ్యే కఫమును
నీ గుండె నుంచి, ఇతర అంగముల నుంచి
బయటికి నెట్టివేస్తున్నాము. ॥ 8 ॥

మంత్రము :

హరిమాణం తే అఙ్గేభ్యోఽప్యామన్తరోదరాత్ ।

యక్ష్మోధామన్తరాత్మనో బహిర్నిర్మన్త్రయామహే ॥ 9 ॥

పదము

హరిమాణమ్ । తే । అఙ్గేభ్యః । అప్యామ్ । అన్తరా । ఉదరాత్ ।

యక్ష్మఃఽధామ్ । అన్తః । ఆత్మనః ।

బహిః । నిః । మన్త్రయామహే ॥ 9 ॥

అనువాదం:

నీ కామిలారోగాన్ని నీ అవయవములనుంచి,
నీ ఉదరంలో నుంచి, జలోదర రోగాన్ని,
లోపల నున్న యక్ష్మరోగ కారణ మైన దానిని
బయటకు నెట్టివేస్తున్నాను. ॥ 9 ॥

మంత్రము :

ఆసో బలాసో భవతు మూత్రం భవత్వామయత్ ।

యక్ష్మాణాం సర్వేషాం విషం నిరవోచమహం త్వత్ ॥10॥

పదము :

ఆసః । బలాసః । భవతు । మూత్రమ్ । భవతు । ఆమయత్ ।

యక్ష్మాణామ్ । సర్వేషామ్ । విషమ్ ।

నిః । అవోచమ్ । అహమ్ । త్వత్ ॥ 10 ॥

అనువాదం।

కఫము బయట పడిపోవు గాక!
ఆమదోషం మూత్రరూపంలో బయటికి పోవు గాక!
సర్వ యక్ష్మరోగాల విషమును నీలో నుంచి
నేను బయటికి నెట్టివేస్తున్నాను. ।10॥

మంత్రము।

బహి ర్బిలం ని ర్ద్రవతు కాహాబాహం త వోదరాత్ ।
యక్ష్మాణాం సర్వేషాం విషం ని రవోచ మహం త్వత్ ॥11॥

పదము :

బహిః । బిలమ్ । నిః । ద్రవతు । కాహాబాహమ్ । తవ । ఉదరాత్।
యక్ష్మాణామ్ । సర్వేషామ్ । విషమ్ ।
నిః । అవోచమ్ । అహమ్ । త్వత్ ॥ 11 ॥

అనువాదం :

నీ కడుపులో వినవచ్చే సవ్వడి తొలగి పోవు గాక!
మూత్రనాళిక నుంచి విషం స్రవించి పోవు గాక!
సర్వ యక్ష్మరోగాల విషమును నీలో నుంచి
నేను బయటికి నెట్టివేస్తున్నాను. ॥ 11 ॥

మంత్రము :

ఉదరాత్ తే క్లోమ్నో నాభ్యా హృదయా దధి ।
యక్ష్మాణాం సర్వేషాం విషం ని రవోచ మహం త్వత్ ॥12॥

పదము :

ఉదరాత్ । తే । క్లోమ్నః । నాభ్యాః । హృదయాత్ । అధి ।

యక్ష్మాణామ్ । సర్వేషామ్ । విషమ్ ।

నిః । అవోచమ్ । అహమ్ । త్వత్ ॥12॥

అనువాదం :

ఉదరం నుంచి, ఊపిరితిత్తుల నుంచి
నాభి నుంచి, గుండె నుంచి
సర్వ యక్ష్మరోగాలకు చెందిన విషాన్ని
నీ నుంచి బయటకు నెట్టివేస్తున్నాను. ॥ 12 ॥

మంత్రము :

యాః సీమానం విరుజన్తి మూర్ధానం ప్రత్యర్షణీః ।
అహింసన్తీ రనామయా నిర్ద్రవన్తు బహిర్బిలమ్ ॥ 13 ॥

పదము :

యాః । సీమానమ్ । వి౽రుజన్తి । మూర్ధానమ్ । ప్రతి । అర్షణీః ।

అహింసన్తీః । అనామయాః । నిః । ద్రవన్తు । బహిః । బిలమ్ ॥13॥

అనువాదం :

తలను పగులగొట్టే పీడ,
తలను చీల్చుకొని పోయే నొప్పి
దోషరహితములై నీకు చెడుపు చేయకుండా
శరీర రంధ్రములలో నుంచి
బయటికి వెళ్ళిపోవుగాక ! ॥ 13 ॥

మంత్రము :

యా హృదయ ముపర్ష న్త్యనుతన్వన్తి కీకసాః ।
అహింస న్తీ రనామయా నిర్ద్రవన్తు బహి ర్బిలమ్ ॥ 14 ॥

పదము :

యాః । హృదయమ్ । ఉపఽఋష న్తి ।
అనుఽతన్వ న్తి । కీకసాః ।
అహింస న్తీః । అనామయాః ।
నిః । ద్రవన్తు । బహిః । బిలమ్ ॥ 14 ॥

అనువాదం :

గుండెను చీల్చునవి, ప్రక్కటెముకలకు
అల్లుకొనునవి అయిన రోగాలు
నీకు చెడుపు చేయకుండా,
మరొక రోగానికి కారణం కాకుండా
మూత్రాశయం నుంచి బయటికి వచ్చివేయు గాక! ॥ 14 ॥

మంత్రము :

యాః పార్శ్వే ఉపర్ష న్త్యనునిక్ష న్తి పృష్టీః ।
అహింస న్తీ రనామయా ని ర్ద్రవన్తు బహి ర్బిలమ్ ॥ 15 ॥

పదము :

యాః । పార్శ్వే ఇతి । ఉపఽఋష న్తి ।
అనుఽనిక్ష న్తి । పృష్టీః ।

అహింసన్తీః । అనామయాః ।

నిః । ద్రవన్తు । బహిః । బిలమ్ ॥ 15 ॥

**అనువాదం :**

ప్రక్కలను పొడుచుకొని పోవునవి,
ప్రక్కటెముకలను పొడుచుకొని పోవునవి
అయిన వానిని నీకు చెడుపు చేయకుండా
మరొక రోగానికి కారణం కాకుండా చేస్తాను.
మూత్రాశయం నుంచి అవి బయటకు వచ్చి వేయు గాక! ॥15॥

**మంత్రము :**

యా స్తిరశ్చీ రుపర్ష న్త్యర్షణీ ర్వక్షణాసు తే ।
అహింసన్తీ రనామయా ని ర్ద్రవన్తు బహి ర్బిలమ్ ॥ 16 ॥

**పదము :**

యాః । తిరశ్చీః । ఉపఽఋషన్తి । అర్షణీః । వక్షణాసు । తే ।
అహింసన్తీః । అనామయాః ।
నిః । ద్రవన్తు । బహిః । బిలమ్ ॥ 16 ॥

**అనువాదం:**

వెన్నుదిరిగి పోట్లు పొడుచునవి,
కడుపులో ఉండినవి అయిన అన్నిపీడలు
నీకు చెడుపు చేయకుండా,
మరొక రోగానికి కారణం కాకుండా
మూత్రాశయం నుంచి బయటికి వచ్చివేయు గాక! ॥ 16 ॥

మంత్రము :

యా గుదా అనుసర్ప న్త్యాన్త్రాణి మోహయ న్తి చ ।

అహింస న్తీ రనామయా ని ర్ద్రవన్తు బహి ర్బిలమ్ ॥ 17 ॥

పదము :

యాః । గుదాః । అనుఽసర్ప న్తి । అన్త్రాణి । మోహయ న్తి । చ।

అహింస న్తీః । అనామయాః । నిః । ద్రవన్తు । బహిః । బిలమ్

॥ 17 ॥

అనువాదం :

గుదములో వ్యాపించునవి.
ప్రేగులను మెలివేయునవి
అయిన రోగాలన్నీ
నిన్ను గాయపరచకుండా,
మరొక రోగానికి కారణం కాకుండా,
మూత్రాశయం నుంచి బయటికి వచ్చివేయు గాక! ॥ 17 ॥

మంత్రము :

యా మజ్ఞో నిర్ధయ న్తి పరూంషి విరుజ న్తి చ ।

అహింసన్తీ రనామయా నిర్ద్రవన్తు బహి ర్బిలమ్ ॥ 18 ॥

పదము :

యాః । మజ్జః । నిఃఽధయ న్తి । పరూంషి । విఽరుజ న్తి । చ ।

అహింస న్తీః । అనామయాః ।

నిః । ద్రవన్తు । బహిః । బిలమ్ ॥ 18 ॥

అనువాదం :

మూలగులను పీల్చివేయునవి,
కీళ్ళను విరిచివేయునవి, అయిన రుగ్మతలన్నీ
నిన్ను గాయపరచకుండా,
మరొక రోగానికి కారణం కాకుండా,
మూత్రాశయం నుంచి బయటకు వచ్చివేయు గాక! ॥ 18 ॥

మంత్రము :

యే అఙ్గాని మదయన్తి యక్ష్మాసో రోపణా స్తవ ।
యక్ష్మాణాం సర్వేషాం విషం నిరవోచ మహం త్వత్ ॥19॥

పదము :

యే । అఙ్గాని । మదయన్తి । యక్ష్మాసః । రోపణాః । తవ ।
యక్ష్మాణామ్ । సర్వేషామ్ । విషమ్ ।
నిః । అవోచమ్ । అహమ్ । త్వత్ ॥ 19 ॥

అనువాదం :

ఏ యక్ష్మరోగములు నిన్ను వ్యాకులపరుస్తున్నవో,
నీ అంగములను చలనరహితములుగా చేస్తున్నవో,
ఆ సర్వ యక్ష్మరోగాల విషాన్ని నేను నీ నుంచి
బయటకు నెట్టివేస్తున్నాను. ॥ 19 ॥

మంత్రము :

విసల్పస్య విద్రధస్య వాతీకారస్య వాలజేః ।
యక్ష్మాణాం సర్వేషాం విషం నిరవోచ మహం త్వత్ ॥ 20 ॥

పదము :

విఽసల్పస్య । విఽద్రధస్య । వాతీఽకారస్య । వా । అలజేః ।

యక్ష్మాణామ్ । సర్వేషామ్ । విషమ్ ।

నిః । అవోచమ్ । అహమ్ । త్వత్ ॥ 20 ॥

అనువాదం :

పీడలు, వాపులు, కురుపులు, కండ్లకలకలు
వగైరా సర్వ రోగ విషాన్ని నీ నుంచి
బయటకు నెట్టివేస్తున్నాను. ॥ 20 ॥

మంత్రము :

పాదాభ్యాం తే జానుభ్యాం శ్రోణిభ్యాం పరి భంససః ।

అనూకా దర్షణీ రుష్ణిహాభ్యః శీర్ష్ణో రోగ మనీనశమ్ ॥ 21 ॥

పదము :

పాదాభ్యామ్ । తే । జానుఽభ్యామ్ ।

శ్రోణిఽభ్యామ్ । పరి । భంససః ।

అనూకాత్ । అర్షణీః । ఉష్ణిహాభ్యః ।

శీర్ష్ణః । రోగమ్ । అనీనశమ్ ॥ 21 ॥

అనువాదం :

నీ పాదాల నుంచి, మోకాళ్ళ నుంచి,
పిరుదుల నుంచి, మర్మస్థానాల నుంచి,
నీ వెన్నెముకలో నుంచి, గొంతులో నుంచి,

నీ తలలో నుంచి పొడుచుకొని వచ్చే
నొప్పు లన్నింటినీ నేను నీ తల నుంచి తొలగించి వేసినాను.
॥ 21 ॥

మంత్రము:

సం తే శీర్ష్ణః కపాలాని
హృదయస్య చ యో విధుః ।
ఉద్య న్నాదిత్య రశ్మిభిః
శీర్ష్ణో రోగ మనీనశోఽఙ్గభేద మశీశమః ॥ 22 ॥

పదము:

సమ్ । తే । శీర్ష్ణః । కపాలాని ।
హృదయస్య । చ । యః । విధుః ।
ఉత్ఽయన్ । ఆదిత్య । రశ్మిఽభిః ।
శీర్ష్ణః । రోగమ్ । అనీనశః । అఙ్గఽభేదమ్ । అశీశమః ॥ 22 ॥

అనువాదం:

నీ కపాల భాగం గట్టిగా నున్నది.
నీ గుండె ఖచ్చితంగా ఆడుతున్నది.
ఉదయిస్తున్న సూర్యుడు
ఈ రోగి తలనొప్పులను, ఒంటినొప్పులను
తొలగించు గాక! ॥ 22 ॥

ఇది ఎనిమిదవ సూక్తం
ఇది నాల్గవ అనువాకం.

# అనువాకం - 5

## సూక్తం - 9

ఋషి: బ్రహ్మ॥ దేవతలు: ఆదిత్యుడు, అధ్యాత్మము॥ ఛందస్సు: 1.
15,17,19-22 త్రిష్టుప్; 12,14,16,18, జగతీ॥ మంత్రములు:

వినియోగం - ఈ అనువాకం సలిలగణం లోనిది. కావున దీనికి ఆ ?
యోగం అనుసంధేయము. దీని వివరణ 1వ కాం
సూక్తంలో కలదు. ఈ సూక్తమంత్రములు ఋగ్వేదం,
మండలం, 164 వ సూక్తంలో కలవు.

మంత్రము:

అస్య వామస్య పలితస్య హోతు-
స్తస్య భ్రాతా మధ్యమో అస్త్యశ్నః ।
తృతీయో భ్రాతా ఘృతపృష్ఠో అస్యా-
త్రాపశ్యం విశ్పతిం సప్తపుత్రమ్

పదము:

అస్య । వామస్య । పలితస్య । హోతుః ।
తస్య । భ్రాతా । మధ్యమః । అస్తి । అశ్నః ।
తృతీయః । భ్రాతా । ఘృతఽపృష్ఠః । అస్య ।
అత్ర । అపశ్యమ్ । విశ్పతిమ్ । సప్తఽపుత్రమ్

అనువాదం:

సేవనీయుడు, పాలకుడు అయినట్టి,
ఆకాశంలో వెలుగొందే ఆదిత్యునకు

మధ్యముడు ( వాయువు ) సర్వవ్యాపి
అలాంటి భ్రాతృస్థానీయుడు ఉన్నాడు.
అహుతి లక్షణమైన ఘృతం పృష్ఠము నందు కలవాడు
అతనికి తృతీయ భ్రాతగా ఉన్నాడు,
వారిలో ప్రజలకు పాలకుడు, సప్తపుత్రుడు అయిన
ఆదిత్యుని నేను సాక్షాత్కరించు కున్నాను. ॥ 1 ॥

మంత్రము :

సప్త యుఞ్జన్తి రథ మేకచక్ర
మేకో అశ్వో వహతి సప్తనామా ।
త్రినాభి చక్ర మజర మనర్వం
యత్రేమా విశ్వా భువనాధి తస్థుః ॥ 2 ॥

పదము :

సప్త । యుఞ్జన్తి । రథమ్ । ఏకఽచక్రమ్ ।
ఏకః । అశ్వః । వహతి । సప్తఽనామా ।
త్రిఽనాభి । చక్రమ్ । అజరమ్ । అనర్వమ్ ।
యత్ర । ఇమా । విశ్వా । భువనా । అధి । తస్థుః ॥ 2 ॥

అనువాదం :

ఏకచక్ర మైన రథం సప్తాశ్వాలతో పూన్చబడి ఉన్నది.
అందులో సప్తనామక మైన ఏకాశ్వం
ఆ రథాన్ని లాగుతుంది.

అథర్వ. iv 26

ఆ చక్రం త్రినాభి, అజర మైనది.
అశిథిల మైనది.
అందులో ఈ విశ్వభువనములు అధివసించి ఉన్నవి. ॥ 2

సుంత్రము :

ఇమం రథ మధి యే స॒ప్త త॒స్థుః
స॒ప్తచ॑క్రం స॒ప్త వ॑హ॒ న్త్యశ్వాః ।
స॒ప్త స్వసా॑రో అ॒భి సం న॑వ॒న్త
యత్ర॑ గ॒వాం॑ నిహి॑తా స॒ప్త నామ॑ ॥ 3

పదము :

ఇ॒మమ్ । రథ॑మ్ । అధి॑ । యే । స॒ప్త । త॒స్థుః ।
స॒ప్త ఽచ॑క్రమ్ । స॒ప్త । వ॒హ॒న్తి॒ । అశ్వాః॑ ।
స॒ప్త । స్వసా॑రః । అ॒భి । సమ్ । న॒వ॒న్త॒ ।
యత్ర॑ । గవా॑మ్ । ని ఽహి॑తా । స॒ప్త । నామ॑ ॥ 3

అనువాదం :

ఈ ఆదిత్య మండలాఖ్య మైన రథాన్ని,
ఏ సప్త రశ్ములు అధిష్ఠించి ఉన్నవో,
ఆ రథం సప్త చక్రములు కలది.
అశ్వములు సప్త సంఖ్యాకములు దానిని వహిస్తున్నవి.
దానికి ఏడుగురు సోదరీమణులు
( రశ్ములు, లేక ఋతువులు ) అభిముఖులై వెడుతున్నారు.

ఆ రథంలో ఉభయవిధా లైన, స్తుతిరూపా లైన
వాక్కులు సప్త విధములై సప్త స్వరూపములై
నిహితములై ఉన్నవి. ॥ 3 ॥

మంత్రము.

కో దదర్శ ప్రథమం జాయమాన-
మస్థన్వ న్తం య దనస్థా బిభ ర్తి ।
భూమ్యా అసురసృ గాత్మా క్వఽస్విత్
కో విద్వాంస ముప గాత్ ప్రష్టు మేతత్ ॥ 4 ॥

పదము :

కః । దదర్శ । ప్రథమమ్ । జాయమానమ్ ।
అస్థన్ఽవన్తమ్ । యత్ । అనస్థా । బిభ ర్తి ।
భూమ్యాః । అసుః । అసృక్ । ఆత్మా । క్వ ఽ । స్విత్ ।
కః । విద్వాంసమ్ । ఉప । గాత్ । ప్రష్టుమ్ । ఏతత్ ॥ 4 ॥

అనువాదం.

ఎవడు తొలుత చూడగలిగినాడు ?
సృష్టికి పూర్వం జాయమాన మైన సృష్టిని
సశరీర మైన దానిని అస్థి రహిత మైన, అశరీర మైన
ప్రకృతి, లేక ఈశ్వరాయత్త మైన మాయ
గర్భం వలె తనలో ధరిస్తున్నది.
భూమికి సంబంధించిన ( పార్థివ మైన ) శరీరం,

ప్రాణం (సూక్ష్మశరీరం), రక్తము, ఆత్మ -
వీనితో సంబద్ధమైన చేతన ఎక్కడ ఉన్నవి?
విద్వాంసుని దీని యొక్క కారణం ప్రశ్నించడానికి
ఏ శిష్యుడు ముందుకు వస్తున్నాడు? ॥ 4 ॥

మంత్రము:

ఇహ బ్రవీతు య ఈమఙ్గ వేదా
స్య వామస్య నిహితం పదం వేః ।
శీర్ష్ణః క్షీరం దుహ్రతే గావో అస్య
వవ్రిం వసానా ఉదకం పదాఽపుః ॥ 5 ॥

పదము:

ఇహ । బ్రవీతు । యః । ఈమ్ । అఙ్గ । వేద ।
అస్య । వామస్య । నిఽహితమ్ । పదమ్ । వేః ।
శీర్ష్ణః । క్షీరమ్ । దుహ్రతే । గావః । అస్య ।
వవ్రిమ్ । వసానాః । ఉదకమ్ । పదా । అపుః ॥ 5 ॥

అనువాదం:

ఇక్కడ ఈ చెప్పనున్న తత్త్వాన్ని
త్వరగా వచించు గాక!
ఎవడికైతే ఈ సంగతి తెలియునో,
అతని ముందు దృశ్యమాన మైన, వందనయోగ్య మైన
ఆదిత్యపదం సర్వులకూ గంతవ్యమై నిగూఢంగా ఉంటున్నది.

తా. ఆదిత్యుని శీర్ష ప్రాయులైన కొన్ని రశ్ములు
క్షీరాన్ని దోహనం చేస్తున్నవి. (ఉదకాన్ని స్రవిస్తున్నవి.)
రూపాన్ని ఆచ్ఛాదిస్తూ, అతి విస్తర తేజస్సుతో
తపింపజేస్తూ ఈయన కొన్ని రశ్ములు ఉదకాన్ని
సృష్టించిన మార్గంలో పానం చేస్తూ,
భూమిని నిరుదకంగా చేస్తున్నవి.
దాని స్వరూపాన్ని చెప్పవలసింది. ॥ 5 ॥

మంత్రము

పాకః పృచ్ఛామి మనసాఽవిజానన్
దేవానా మేనా నిహితా పదాని ।
వత్సే బష్కయేఽధి సప్త తన్తూన్
వి తత్నిరే కవయ ఓతవా ఉ ॥ 6 ॥

పదము :

పాకః । పృచ్ఛామి । మనసా । అవిఽజానన్ ।
దేవానామ్ । ఏనా । నిఽహితా । పదాని ।
వత్సే । బష్కయే । అధి । సప్త । తన్తూన్ ।
వి । తత్నిరే । కవయః । ఓతవై । ఓం ఇతి ॥ 6 ॥

అనువాదం :

పచనం చేయదగిన (అపరిపక్వమతి నైన) నేను
మనస్సుతో అతి గహన మైన తత్త్వమును

గ్రహించుటకు అశక్తుడనై ప్రశ్నిస్తున్నాను.
ఈ సందేహాస్పద పదములు దేవతలకు కూడా తెలియరానివి
సర్వ నివాసభూత మైన ఆదిత్యుడు, అధికంగా
సప్త తంతువులను సిద్ధం చేస్తూ, సప్త సోమసంస్థలను,
కవులు, యజమానులు జగద్రూప తిర్యక్తంతువులను
నేయుటకై ప్రయత్నిస్తున్నారు. ॥ 6 ॥

మంత్రము :

అచికిత్వాం శ్చికితుష శ్చిదత్ర
కవీన్ పృచ్ఛామి విద్మనో న విద్వాన్ ।
వి యస్తస్తమ్భ షడిమా రజాం
స్యజస్య రూపే కిమపి స్విదేకమ్ ॥ 7 ॥

పదము :

అచికిత్వాన్ । చికితుషః । చిత్ । అత్ర ।
కవీన్ । పృచ్ఛామి । విద్మనః । న । విద్వాన్ ।
వి । యః । తస్తమ్భ । షట్ । ఇమా । రజాంసి ।
అజస్య । రూపే । కిమ్ । అపి । స్విత్ । ఏకమ్ ॥ 7 ॥

అనువాదం :

తత్త్వం తెలియక, తెలుసుకొన గోరి
కవులను ఈ తత్త్వవిషయంలో ప్రశ్నిస్తున్నాను.
వేదనార్థమై విద్వాంసుని అడుగుటలేదు.
అజ్ఞానం వల్లనే అడుగుతున్నాను.

ఏ పరమేశ్వరుడు స్తంభితుడై ఉన్నాడో,
ఈ ఆరు లోకాలను జననాది రహిత మైన
చతుర్ముఖునకు స్వరూపంలో పునరావృత్తి రహిత మైన
సత్యలోకం ఏదో ఒకటి ఉన్నది. ॥ 7 ॥

మంత్రము

మాతా పితర మృత ఆ బభాజ
ధీత్యగ్రే మనసా సం హి జగ్మే ।
సా బీభత్సు ర్గర్భరసా నివిద్ధా
నమస్వ న్త ఇదుపవాక మీయుః ॥ 8 ॥

పదము ।

మాతా । పితరమ్ । ఋతే । ఆ । బభాజ ।
ధీతీ । అగ్రే । మనసా । సమ్ । హి । జగ్మే ।
సా । బీభత్సుః । గర్భఽరసా । నిఽవిద్ధా ।
నమస్వన్తః । ఇత్ । ఉపఽవాకమ్ । ఈయుః ॥ 8 ॥

అనువాదం;

సర్వ నిర్మాత్రి అయిన పృథివి,
పాలక మైన ద్యులోకము ఉద్భవించినవి
ఋతం నిమిత్త భూతంగా
యాగాదిరూపకర్మతో తృప్తిపరుస్తున్నది.
మొదట పిత మనస్సుతో అభిప్రాయవంత మైన చేతస్సుతో

సంశ్లిష్టుడై ఉంటున్నాడు కదా!
ఆ తర్వాత మాత గర్భబంధనేచ్ఛావతియై
గర్భరసంతో నివిద్ధ అయినది.
అన్నవంతులై పరస్పరం సంభాషించుకుంటూ
సస్య సంపదను పొందుతారు. ॥ 8

మంత్రము :

యుక్తా మాతాసీ ద్ధురి దక్షిణాయా
అతిష్ఠద్ గర్భో వృజనీ ష్వన్తః ।
అమీమేద్ వత్సో అను గా మపశ్యద్
విశ్వరూప్యం౨ త్రిషు యోజనేషు ॥ 9 ॥

పదము :

యుక్తా । మాతా । ఆసీత్ । ధురి । దక్షిణాయాః ।
అతిష్ఠత్ । గర్భః । వృజనీషు । అన్తః ।
అమీమేత్ । వత్సః । అను । గామ్ । అపశ్యత్ ।
విశ్వ౨రూప్య౨మ్ । త్రిషు । యోజనేషు ॥ 9 ॥

అనువాదం :

మాత (ద్యులోకం) అభిమత పూరణ సమర్థ అయిన
పృథివిని నిర్వహించడంలో యుక్తయై
వృష్టికి సమర్థయై ఉన్నది.
వత్సం మూడు యోజనాలలో
మేఘరశ్మి వాయువులు సంయుక్తం కాగా

వర్షించే సమయంలో శబ్దిస్తుంది.
విశ్వరూపవతి అయిన భూమిని అనుక్రమంగా
చూస్తుంది (వర్షిస్తుంది.) ॥ 9 ॥

మంత్రము.

తిస్రో మాతౄస్త్రీన్ పితౄన్ బిభ్ర
దేక ఊర్ధ్వ స్తస్థౌ నేమవ గ్లాపయన్తి ।
మన్త్రయన్తే దివో అముష్య పృష్ఠే
విశ్వవిదో వాచ మవిశ్వవిన్నామ్ ॥ 10 ॥

పదము.

తిస్రః । మాతౄః । త్రీన్ । పితౄన్ । బిభ్రత్ ।
ఏకః । ఊర్ధ్వః । తస్థౌ । న । ఈమ్ । అవ । గ్లపయన్తి ।
మన్త్రయన్తే । దివః । అముష్య । పృష్ఠే ।
విశ్వఽవిదః । వాచమ్ । అవిశ్వఽవిన్నామ్ ॥ 10 ॥

అనువాదం.

పుత్రస్థానీయు లైన ప్రధానభూతు లైన
ఆదిత్యుడు లేక కాలం
(సస్య వృష్ట్యాది ఉత్పాదయిత్రి అయిన) తల్లిని
(లోకత్రయాన్ని), అలాగే మువ్వురు తండ్రులను
(అనగా లోకపాలకు లైన అగ్ని, వాయు, సూర్యులను)
భరిస్తూ ఉన్నతమై ఉంటున్నది.

దీనిని గ్లానిని చెందింప లేరు.
ద్యులోకం పై గుప్తంగా సంభాషించుకుంటున్న దేవతలు
విశ్వవేదన సమర్థము, అసర్వవ్యాపిని అయిన వాక్కును
గర్జిత లక్షణ మైన దానిని, అదిత్యునకు
సంబంధించిన దానిని సంప్రతించు కుంటున్నారు. ॥ 10

మంత్రము :

పఞ్చారే చక్రే పరివర్తమానే
యస్మి న్నాతస్థు ర్భువనాని విశ్వా ।
తస్య నాక్ష స్తప్యతే భూరిభారః
సనా దేవ న చ్ఛిద్యతే సనాభిః ॥ 11 ॥

పదము :

పఞ్చఽఅరే । చక్రే । పరిఽవర్తమానే ।
యస్మిన్ । అఽతస్థుః । భువనాని । విశ్వా ।
తస్య । న । అక్షః । తప్యతే । భూరిఽభారః ।
సనాత్ । ఏవ । న । ఛిద్యతే । సఽనాభిః ॥ 11 ॥

అనువాదం :

ఐదు ఆకులు గల ( సంవత్సరాత్మక మైన )
చక్రంలో మరీ మరీ తిరుగుతుండగా
ఆ కాలచక్రంలో విశ్వ భువనములు అంతర్వర్తులై ఉన్నవి.
ఆ చక్రం మధ్యంలో నున్న ఇరుసు

సకల భువన వహనం చేస్తున్నప్పటికీ దెబ్బతినడం లేదు.
సనాతనమై సమానసాభిక మైన ఆవి భిన్నం కాదు ॥ 11 ॥

మంత్రము.

పఞ్చపాదం పితరం ద్వాదశాకృతిం
దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్ ।
అథేమే అన్య ఉపరే విచక్షణే
సప్తచక్రే షడర ఆహు రర్పితమ్ ॥ 12 ॥

పదము.

పఞ్చఽపాదమ్ । పితరమ్ । ద్వాదశఽఆకృతిమ్ ।
దివః । ఆహుః । పరే । అర్ధే । పురీషిణమ్ ।
అథ । ఇమే । అన్యే । ఉపరే । విఽచక్షణే ।
సప్తఽచక్రే । షట్ఽఅరే । ఆహుః । అర్పితమ్ ॥ 12 ॥

అనువాదం:

పంచ ఋతువులనే పాదములు కలది,
సర్వులనూ ప్రీతి చెందించునది,
ద్వాదశ మాసములు ఆకృతిగా గలది,
వృష్ట్యుదకవతి అయిన సంవత్సరచక్రం
ద్యులోకంలో పరార్ధంలో అవస్థితమై ఉన్న దని చెప్తారు.
ఇక మరి కొందరు వేదవాదు లిలా అంటారు.
సప్తచక్ర మైన సంవత్సరం ( సప్త ఆదిత్యులు.

సప్త రశ్మలు అందులో అవృత్తము లవుతుంటవి.)
ష డృతువులు నాభికి బిగించిన అకుల వంటివి.
ఆ సంవత్సర రథంలో వివిధ దర్శనకరు డైన
ఆదిత్యుడు తదధీను డని చెప్తారు. ॥ 12

మంత్రము :

ద్వాదశారం నహి త జ్జరాయ
వర్వర్తి చక్రం పరి ద్యా మృతస్య ।
ఆ పుత్రా అగ్నే మిథునాసో అత్ర
సప్త శతాని వింశతిశ్చ తస్థుః ॥ 13 ॥

పదము :

ద్వాదశఽఅరమ్ । నహి । తత్ । జరాయ ।
వర్వర్తి । చక్రమ్ । పరి । ద్యామ్ । ఋతస్య ।
ఆ । పుత్రాః । అగ్నే । మిథునాసః । అత్ర ।
సప్త । శతాని । వింశతిః । చ । తస్థుః ॥ 13 ॥

అనువాదం :

ఋతాత్మకు డైన అదిత్యుడు
పునః పునః క్రమణశీల మైన రథచక్రాన్ని
పదే పదే త్రిప్పుతుంటాడు.
ద్యులోక మంతటా తిరుగుతుంటాడు.
ద్వాదశ సంఖ్యాక మేషాది రాశ్యాత్మక మైన

రథాంగావయవములతో కూడినది ఆ చక్రం.
అది జరాదూషితం కాదు.
ఓ అగ్నీ! సర్వదా గమనయుక్తుగ వైన ఆదిత్యా!
ఆ చక్రంలో మిథునభూతము లైన
ఏడు వందల ఇరవై మంది పుత్రులు
(అహోరాత్రరూపులు) ఉన్నారు. ॥ 13 ॥

మంత్రము:

సనేమి చక్ర మజరం వి వావృత
ఉత్తానాయాం దశ యుక్తా వహన్తి ।
సూర్యస్య చక్షూ రజసై త్యావృతం
యస్మి న్నాతస్థు ర్భువనాని విశ్వా ॥ 14 ॥

పదము.

సఽనేమి । చక్రమ్ । అజరమ్ । వి । వవృతే ।
ఉత్తానాయామ్ । దశ । యుక్తాః । వహన్తి ।
సూర్యస్య । చక్షుః । రజసా । ఏతి । ఆఽవృతమ్ ।
యస్మిన్ । ఆఽతస్థుః । భువనాని । విశ్వా ॥ 14 ॥

అనువాదం:

ఏక ప్రకార బహిర్వలయ సంయుక్త మైన
సంవత్సరాఖ్య చక్రం జరారహిత మైనది.
పునః పునః తిరుగునది.

ఉపరి విస్తృత భూమిలో పది మంది ఇంద్రాదులు,
పంచ లోకపాలురు, నిషాద, పంచమాదులతో
కూడిన చతుర్వర్ణాలు, దశసంఖ్యాకులు
వారి వారి వృత్తులలో నియుక్తులై దానిని వహిస్తున్నారు,
సర్వ జగత్తును నిర్వహిస్తున్నారు.
సూర్యుని యొక్క సర్వ చక్షుస్థానీయ మైన
సూర్యమండలం వృష్ట్యుదకంతో
ఆవృతమై వెడుతున్నది.
సర్వ భూతజాతములు ఆ మండలంలో
అర్పితములై ( తదధీనములై ) ఉన్నవి. ॥ 14 ॥

మంత్రము :

స్త్రియః సతీ స్తాం ఉ మే పుంస ఆహుః
పశ్య దక్షణ్వా న్న వి చేత దన్ధః ।
కవి ర్యః పుత్రః స ఈమా చికేత
య స్తా విజానాత్ స పితు ష్పితాఽసత్ ॥ 15 ॥

పదము:

స్త్రియః । సతీః । తాన్ । ఓం ఇతి । మే । పుంసః । ఆహుః ।
పశ్యత్ । అక్షణ్ఽవాన్ । న । వి । చేతత్ । అన్ధః ।
కవిః । యః । పుత్రః । సః । ఈమ్ । ఆ । చికేత ।
యః । తా । విఽజానాత్ । సః । పితుః । పితా । అసత్ ॥ 15 ॥

అనువాదం.

ఆ సూర్య దీధితులు (రశ్మలు) స్త్రీలు, సతులుగా ఉన్నారు
వానినే (ఆ రశ్ములనే) పురుషులనుగా చెప్తారు.
జ్ఞానదృష్టి సముపేతుడైన ఒక మహాత్ముడు తెలుసుకొంటాడు
అంధుడు (అయథార్థరూప మైన స్థూల దృష్టితో)
దానిని తెలుసుకొన లేడు.
ఏ కవి స్త్రీ పురుష రూప మైన రశ్ములు గల
జగత్ర్రాత ఉన్నాడో, అతడే పుత్రుడు.
ఎవడో ఒకడు వానిని తెలుసుకొన్నపుడు
అతడు తండ్రి అవుతాడు.

అర్థాంతరం:-

ఎవ రైతే స్త్రీత్వాన్ని పొందిన వారినిగా చెప్తారో,
వారినే నాకు పురుషులనుగా తత్త్వజ్ఞులు ప్రతిపాదిస్తారు
మరి పుత్రుడు అల్పవయస్కు డైనా, జ్ఞాని అయి
ఈ అర్థాన్ని అవగాహన చేసుకుంటాడు.
అతడు పిత వలె పూజ్యు డవుతాడు. ॥ 15 ॥

మంత్రము:

సాకంజానాం సప్తథ మాహు రేకజం
షడి ద్యమా ఋషయో దేవజా ఇతి ।
తేషా మిష్టాని విహితాని ధామశ
స్థాత్రే రేజన్తే వికృతాని రూపశః ॥ 16 ॥

పదము:

సాకమ్ౘజానామ్ । సప్తథమ్ । ఆహుః । ఏకౘజమ్ ।
షట్ । ఇత్ । యమాః । ఋషయః । దేవౘజాః । ఇతి ।

తేషామ్ । ఇష్టాని । వి౽హితాని । ధామ౽శః ।

స్థాత్రే । రేజన్తే । వి౽కృతాని । రూప౽శః ॥ 16 ॥

అనువాదం :

ఒకే ఆదిత్యుని నుంచి సహోత్పన్ను లైన
*సప్త ఋతువులలో సప్తమ ఋతువుగా
ఏకోత్పన్నంగా కాలతత్త్వవిదులు చెప్తారు.
మాసద్వయ రూపము లైన ఆరు ఋతువులు, ఋషులు,
వారు దేవతల నుండి, ఆదిత్యుల నుండి కలిగిన వారు
అని చెప్తారు.
ఆ ఋతువులలో సర్వ లోకాభిమత మైన
ఆ యా స్థానములలో వేరు వేరుగా స్థాపితములై
రూపభేదంతో వివిధాకృతులలో ఉన్నవై
తదధిష్ఠాతకై చలిస్తున్నవి.
(జగద్వ్యవహారార్థమై పునః పునః
ఆవర్తనం చెందుతున్నవి.) ॥ 16 ॥

మంత్రము :

అవః పరేణ పర ఏనా౽వరేణ
పదా వత్సం బిభ్రతీ గౌ రుదస్థాత్ ।
సా కద్రీచీ కం స్వి దర్ధం పరాగాత్
క్వ౽ స్విత్ సూతే నహి యూథే అస్మిన్ ॥ 17 ॥

---

* చైత్రాది ద్వాదశ మాసములు రెండు రెండు కలువగా
ఆరు ఋతువు లవుతాయి. అధిక మాసము ఏడవ ఋతువు.

పదము.

అవః । పరేణ । పరః । ఏనా । అవరేణ ।

పదా । వత్సమ్ । బిభ్రతీ । గౌః । ఉత్ । అస్థాత్ ।

సా । కద్రీచీ । కమ్ । స్విత్ । అర్ధమ్ । పరా । అగాత్ ।

క్వ౽ । స్విత్ । సూతే । నహి । యూథే । అస్మిన్ ॥ 17 ॥

అనువాదం :

గోరూప మైన ఆహుతితో పోష్య మైన,
వత్సస్థానీయ మైన అగ్నిని అధోదేశంలో
పరపాదద్వయంతో ఆకర్షించి ధరిస్తున్నది.
ఉపరి ప్రదేశంలో ఈ అవర మైన
పాదద్వయంతో ఆకర్షించి ఆ వత్సమునే ధరిస్తున్నది.
సూర్యుని వైపు ఉత్క్రమిస్తున్నది.
ఇలాంటి ఆ ఆహుతి ఎక్కడికి వెళ్ళినదో తెలియదు.
ఏదో ఫలభాజకు డైన పురుషునికై
అర్ధమార్గంలో వచ్చి తిరిగి పోతున్నది.
ఎక్కడో ఫలము సంపాదిస్తున్నది.
ఇది ఇతర గోవుల వలె మందలో ప్రసవించదు. ॥ 17 ॥

మంత్రము :

అవః పరేణ పితరం యో అస్య వే

దావః పరేణ పర ఏనావరేణ ।

కవీయమానః క ఇహ ప్ర వోచద్

దేవం మనః కుతో అధి ప్రజాతమ్ ॥ 18 ॥

అథర్వ. IV 27

పదము :

అవః । పరేణ । పితరమ్ । యః । అస్య । వేద ।

అవః । పరేణ । పరః । ఏనా । అవరేణ ।

కవిఽయమానః । కః । ఇహ । ప్ర । వోచత్ ।

దేవమ్ । మనః । కుతః । అధి । ప్రఽజాతమ్ ॥ 18

అనువాదం :

అథస్థితంగా ఉన్న దీని తండ్రిని
(ఈ లోకపాలకు డైన అగ్నిని)
పరు డైన ఆదిత్యునితో కలిసి
ఎవ డైతే అనుక్రమంగా తెలుసుకుంటాడో
పరస్థితు డైన ఆదిత్యుని
పాలకునిగా ఈ అగ్నితో కూడా
ఎవ డైతే ఉపాసిస్తాడో, అలాంటి పురుషుడు
కవి అయి తన క్రాంతదర్శిత్వాన్ని ఈ లోకంలో
ప్రకటించుకుంటాడు.
ద్యోతమాన మైన మనస్సు దేని నుంచి
అధిక్యంతో ఉత్పన్న మౌతుందో, అది కూడా దుర్లభం.
(ఈ రెండూ దుర్లభములు అని అర్థం.) ॥ 18

మంత్రము :

యే అర్వాఞ్చ స్తాం ఉ పరాచ ఆహు

ర్యే పరాఞ్చ స్తాం ఉ అర్వాచ ఆహుః ।

ఇన్ద్రశ్చ యా చక్రథుః సోమ తాని
ధురా న యుక్తా రజసో వహన్తి ॥ 19 ॥

పదము,

యే । అర్వాఞ్చః । తాన్ । ఓం ఇతి । పరాచః । ఆహుః ।
యే । పరాఞ్చః । తాన్ । ఓం ఇతి । అర్వాచః । ఆహుః ।
ఇన్ద్రః । చ । యా । చక్రథుః । సోమ । తాని ।
ధురా । న । యుక్తాః । రజసః । వహన్తి ॥ 19 ॥

అనువాదం:

సూర్య చంద్ర చక్రంలో ఉన్న రశ్మలు,
గ్రహాదులు తత్పరిభ్రమణ వశంలో
అధోముఖము లవుతున్నవి.
వానినే ఊర్ధ్వముఖము లని కూడా కాలవిదులు చెప్తారు.
ఏవి తొలుత అధోముఖము లని చెప్తారో,
వానినే ఊర్ధ్వముఖము లని కూడా చెప్తారు.
ఓ సోమదేవా! నీవు ఇంద్రుదవు.
బండి మీద వేసిన బరువును, దానికి కట్టిన
అశ్వాదులు ఏ విధంగా వహిస్తాయో,
అలాగే, మీ చక్రములు ఏ మండల పరిభ్రమణములను
చేస్తున్నవో, అవి లోకమునకు చెందినవి. ॥ 19 ॥

మంత్రము:

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరి షస్వజాతే ।

తయో రన్యః పిప్పలం స్వాద్వ

త్త్యనశ్న న్నన్యో అభి చాకశీతి ॥ 20

పదము :

ద్వా । సుఽపర్ణా । సఽయుజా । సఖాయా ।

సమానమ్ । వృక్షమ్ । పరి । సస్వజాతే ఇతి ।

తయోః । అన్యః । పిప్పలమ్ । స్వాదు । అత్తి ।

అనశ్నన్ । అన్యః । అభి । చాకశీతి ॥ 20 ।

అనువాదం:

శోభన గమనములు గల, సమాన యోగులైన
సమాన ఖ్యానము లైన పక్షులు రెండు
సమాన వృక్షాన్ని ఆశ్రయిస్తాయి.
వానిలో ఒకటి పండిన తియ్యటి ఫలాన్ని తింటుంది.
మరొకటి తినకుండా చూస్తూ ఉంటుంది.
( ఇందలి పక్షులు జీవాత్మ, పరమాత్మకు ప్రతీకలని,
వృక్షం దేహమని అధ్యాత్మికార్థం ఇందులో స్ఫురిస్తుంది. )
॥ 20 ॥

మంత్రము :

యస్మిన్ వృక్షే మధ్వదః సుపర్ణా

నివిశన్తే సువతే చాధి విశ్వే ।

తస్య యదాహుః పిప్పలం స్వా ద్వగ్రే
తన్నోన్నశద్యః పితరం న వేద ॥ 21 ॥

పదము :

యస్మిన్ । వృక్షే । మధుఽఅదః । సుఽపర్ణాః ।
నిఽవిశన్తే । సువతే । చ । అధి । విశ్వే ।
తస్య । యత్ । ఆహుః । పిప్పలమ్ । స్వాదు । అగ్రే ।
తత్ । న । ఉత్ । నశత్ । యః । పితరమ్ । న । వేద ॥ 21 ॥

అనువాదం.

ఆదిత్యుని యందు వృక్షమునందు వలె
సర్వఫలాశ్రయ భూతమై, ఉదకపానం చేసే
సుగమనం గల రశ్ములు రాత్రి లోన ప్రవేశించి,
పునః ప్రభాత సమయంలో ప్రకాశిస్తాయి.
విశ్వోపరిభాగంలో ఆ ఆదిత్యవృక్షానికి చెందిన
పరిపక్వ ఫలాన్ని, మధురమైన దానిని
ఉపాసనానంతరం తత్త్వవిదులు చెప్తారు.
ఇలాంటి జగత్పితను ఏ నరుడు ఉపాసింపడో,
అతడు ఆ ఫలాన్ని పొందలేడు. ॥ 21 ॥

మంత్రము :

యత్రా సుపర్ణా అమృతస్య భక్ష-
మనిమేషం విదథాఽభిస్వరన్తి ।

ఏనా విశ్వస్య భువనస్య గోపాః
స మా ధీరః పాక మత్రా వివేశ ॥ 22

పదము :

యత్ర । సుఽపర్ణాః । అమృతస్య । భక్షమ్ ।
అనిఽమేషమ్ । విదథా । అభిఽస్వరన్తి ।
ఏనా । విశ్వస్య । భువనస్య । గోపాః ।
నః । మా । ధీరః । పాకమ్ । అత్ర । ఆ । వివేశ ॥ 22 ।

అనువాదం :

ఏ ఆదిత్యమండలంలో శోభన గమనము లైన
రశ్ములు అమృతభాగాన్ని తీసుకుని అనవరతం
జ్ఞానంతో అభిప్రాయ ప్రకటన చేస్తున్నవో,
విశ్వ భువనమునకు స్వామి అయిన, రక్షకుడైన
ఈ ఆదిత్యుడు ఎవడైతే ఉన్నాడో,
అతడే పరమేశ్వరుడు, ధీరుడు.
నన్ను అపక్వ బుద్ధిని ఇక్కడ
స్వకీయ మండలంలో ప్రవేశింప జేస్తున్నాడు. ॥ 22 ॥

ఇది తొమ్మిదవ సూక్తం.

# సూక్తం-10

ఋషిః బ్రహ్మ ॥ దేవతలు : ఎద్దు, విరాట్, అధ్యాత్మమ్; 23 మిత్రావరుణులు ॥
ఛందస్సు : 1,7,14,17,18 జగతి. 2,26,27 భురిక్ త్రిష్టుప్ : 3-6, 8-13,15,16,19,20,22,23,25 28 త్రిష్టుప్ : 21 పఞ్చపదాఽతి శక్వరీ : 24 చతుష్పదా పురస్కృతి ర్భురిగతిజగతీ ॥ మంత్రములు 1 ॥ 28 ॥

వినియోగం :- పూర్వ సూక్తం వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము .

యద్ గాయత్రే అధి గాయత్ర మాహితం
త్రైష్టుభం వా త్రైష్టుభా న్నిరతక్షత ।
యద్వా జగ జ్జగ త్యాహితం పదం
య ఇత్ తద్ విదు స్తే అమృతత్వ మానశుః ॥ 1 ॥

పదము :

యత్ । గాయత్రే । అధి । గాయత్రమ్ । ఆఽహితమ్ ।
త్రైస్తుభమ్ । వా । త్రైస్తుభాత్ । నిఃఽఅతక్షత ।
యత్ । వా । జగత్ । జగతి । ఆఽహితమ్ । పదమ్ ।
యే । ఇత్ । తత్ । విదుః । తే । అమృతఽత్వమ్ । ఆనశుః ॥ 1 ॥

అనువాదం :

ప్రధానత్వం ఇచ్చి సర్వులూ స్తుతిస్తున్నందువల్ల
గాయత్రీ ఛందస్సులో గాయత్రి ఉపస్థిత మైనది.
అలాగే ద్వితీయత్వం వల్ల త్రిష్టుప్ఛందస్సులో

స్తోమత్రయోపేత మైన స్తుతితో
వాయువును సంపాదించుకున్న వారు దేవతలు.
అలా కాక జగతీ ఛందస్సులో తృతీయ భూత మైన
ద్యులోకంలో ఆదిత్యాఖ్య మైన పదం ఆహిత మైనది.
ఈ విధంగా స్థానత్రయంలో అగ్న్యాదులకు
పదాధానం దొరికింది.
దీనిని ఏ నరులు తెలుసుకుంటారో
వారే అమృతత్వాన్ని పొందుతారు. ॥ 1 ॥

మంత్రము :

గాయత్రేణ ప్రతి మిమీతే అర్క-
మర్కేణ సామ త్రైష్టుభేన వాకమ్ ।
వాకేన వాకం ద్విపదా చతుష్పదా2-
క్షరేణ మిమతే సప్త వాణీః ॥ 2 ॥

పదము :

గాయత్రేణ । ప్రతి । మిమీతే । అర్కమ్ ।
అర్కేణ । సామ । త్రైస్తుభేన । వాకమ్ ।
వాకేన । వాకమ్ । ద్విఽపదా । చతుఃఽపదా ।
అక్షరేణ । మిమతే । సప్త । వాణీః ॥ 2 ॥

అనువాదం :

గాయత్రీ ఛందస్సుతో అర్చన సాధన మైన మంత్రాన్ని
ప్రత్యేకంగా ఉపనిబద్ధం చేస్తారు.

ఆ మంత్రంతో సామమును ఉపనిబద్ధం చేస్తారు.
త్రిష్టుప్ఛందస్సుతో సూక్తాన్ని ఉపనిబద్ధం చేస్తారు
అలాంటి సూక్తంతో అనువాకాన్ని ఉపనిబద్ధం చేసారు.
పాదద్వయంతో, పాదచతుష్టయంతో
ఈ అనువాకాన్ని అక్షరబద్ధం చేస్తారు.
వాగధిష్ఠాతలైన సప్తఛందస్సులను నిర్మిస్తారు.
అష్టాక్షర గాయత్రీ, ఏకాదశాక్షర త్రిష్టుప్,
ద్వాదశాక్షర జగతీ అని నియమబద్ధం చేస్తారు
(అక్షరములతో పాదములు, పాదములతో ఛందస్సులు
నిపతితము లౌతాయి. పాదములకు ఛందస్సులకు
అక్షరం మూలం. కాబట్టి ఋక్కునకు, వర్గమునకు,
సూక్తమునకు, అనువాకాదులకు కూడా
అక్షరమే మూలం అని భావము.) ॥ 2 ॥

మంత్రము :

**జగతా సిన్ధుం దివ్యఽస్కభాయద్**

**రథంతరే సూర్యం పర్యపశ్యత్ ।**

**గాయత్రస్య సమిధ స్తిస్ర ఆహు-**

**స్తతో మహ్నా ప్ర రిరిచే మహిత్వా** ॥ 3 ॥

పదము.

**జగతా । సిన్ధుమ్ । దివి । అస్కభాయత్ ।**

**రథమ్ఽతరే । సూర్యమ్ । పరి । అపశ్యత్ ।**

గాయత్రస్య । సమ్ఽఇధః । తిస్రః । ఆహుః ।

తతః । మహ్నా । ప్ర । రిరిచే । మహిఽత్వా ॥ 3 ।

అనువాదం:

జగతీ ఛందోబద్ధ మైన ఋక్కులో
ఉత్పన్న మైన సామజగత్తు
బ్రహ్మ సృష్టికాలంలో దానితో ఉదకస్యందకు డైన
ఆదిత్యుని ద్యులోకంలో స్తంభీభూతుని చేసినాడు.
రథంతర సామంలో స్తంభితు డైన సూర్యుని
ప్రజాపతి పరికించినాడు.
గాయత్రిలో ఉత్పన్న మైన సామమునకు
సమిధలు మూడు విభక్తు లని (పాదత్రయ మని,
లేదా మంత్రత్రయ మని చెప్తారు.)
అందువల్ల బలంతో మహత్త్వంతో
ఇతర సామములను వేరు వేరుగా నిర్మించినారు. ॥ 3 ॥

మంత్రము:

ఉప హ్వయే సుదుఘాం ధేను మేతాం

సుహస్తో గోధు గుత దోహ దేనామ్ ।

శ్రేష్ఠం సవం సవితా సావిష న్నోఽ-

భీఽద్ధో ఘర్మ స్తదు షు ప్ర వోచత్ ॥ 4 ॥

పదము:

ఉప । హ్వయే । సుఽదుఘామ్ । ధేనుమ్ । ఏతామ్ ।

సుఽహస్తః । గోఽధుక్ । ఉత । దోహత్ । ఏనామ్ ।

శ్రేష్ఠమ్ । సవమ్ । సవితా । సావిషత్ । నః ।

అభి౽ఇద్ధః । ఘర్మః । తత్ । ఓం ఇతి । సు । ప్ర । వోచత్ ॥ 4 ॥

అనువాదం :

(హోత నైన నేను)
ఈ ధేనువును ఆహ్వానిస్తున్నాను.
ఇది బాగా క్షీర మొసగునది.
అంతే కాక ఇలాంటి ఉక్తలక్షణ మైన గోవును
దోహనకుశలు డైన దోగ్ధ (అధ్వర్యుడు)
దోహనం చేస్తాడు.
ఇందుకై సర్వానుజ్ఞాత అయిన పరమేశ్వరుడు
మా ప్రశస్త మైన సోమయాగమును లేదా
క్షీరమును అనుమతించు గాక !
దీని వల్ల ఘర్మం (ప్రవర్గ్యం) అభిదీప్త మౌతుంది.
అందువల్లనే నోరారా ఆహ్వానిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

హిఙ్కృణ్వతీ వసుపత్నీ వసూనాం

వత్స మిచ్ఛన్తీ మనసా౽భ్యాగాత్ ।

దుహా మశ్విభ్యాం పయో అఘ్న్యేయం

సా వర్ధతాం మహతే సౌభగాయ ॥ 5 ॥

పదము :

హిఙ్౽కృణ్వతీ । వసు౽పత్నీ । వసూనామ్ ।

వత్సమ్ । ఇచ్ఛన్తీ । మనసా । అభి౽ఆగాత్ ।

దుహామ్ । అశ్విఽభ్యామ్ । పయః । అఘ్న్యా । ఇయమ్ ।

సా । వర్ధతామ్ । మహతే । సౌభగాయ ॥ 5 ।

**అనువాదం :**

(ఆ పిలిచిన గోవు)
హింకారం చేస్తూ వత్సము కోసమై
క్షీర, దధి, ఆజ్యాది బహు ధనములకు,
పాలయిత్రి అయిన మనస్సుతో,
వత్సమును అపేక్షిస్తున్న ఆ గోవు వచ్చినది.
ఈ వచ్చిన గోవు అశ్వినీదేవతలకై
క్షీరమును దోహనం చేస్తున్నది.
అలాంటి గోవు మహా సౌభాగ్యమునకై
ప్రవృద్ధ మగు గాక! ॥ 5 ॥

**మంత్రము :**

గౌ రమీమే దభి వత్సం మిషన్తం

మూర్ధానం హిఙ్ఙకృణో న్మాత వా ఉ ।

సృక్వాణం ఘర్మ మభి వావశానా

మిమాతి మాయుం పయతే పయోభిః ॥ 6 ॥

**పదము :**

గౌః । అమీమేత్ । అభి । వత్సమ్ । మిషన్తమ్ ।

మూర్ధానమ్ । హిఙ్ । అకృణోత్ । మాతవై । ఉం ఇతి ।

సృక్వాణమ్ । ఘర్మమ్ । అభి । వావశానా ।
మిమాతి । మాయుమ్ । పయతే । పయఃఽభిః ॥ 6 ॥

అనువాదం .

ధేనువు నిమీలితాక్ష మైన వత్సమును
సమీపించి అరుస్తున్నది.
దాని తలను మూర్కొనుటకై
హింకారం చేస్తున్నది.
ఆ వత్సం వదనప్రాంతం
పాల నురుగుతో ఉన్నది.
దానిని చూచి అభిలాష పైకొనగా
మరింతగా అరుస్తున్నది.
ప్రభూత క్షీరముతో వత్సమును
ఆప్యాయతతో సంతృప్తం చేస్తున్నది. ॥ 6 ॥

మంత్రము :

అయం స శిజ్క్తే యేన గౌ రభీవృతా
మిమాతి మాయుం ధ్వసనా వధి శ్రితా ।
సా చిత్తిభి ర్ని హి చకార మర్త్యాన్
విద్యు ద్భవన్తీ ప్రతి వవ్రి మౌహత ॥ 7 ॥

పదము :

అయమ్ । సః । శిజ్క్తే । యేన । గౌః । అభిఽవృతా ।
మిమాతి । మాయుమ్ । ధ్వసనౌ । అధి । శ్రితా ।

సా । చి_త్తి౽భిః । ని । హి । చకార । మర్త్యాన్ ।

వి౽ద్యుత్ । భవన్తి । ప్రతి । వవ్రిమ్ । ఔహత ॥ 7 ॥

అనువాదం :

ఈ వత్సం అవ్యక్త ధ్వనిని చేస్తున్నది.
ఆ వత్సం తల్లి అయిన ఆవు చుట్టూ తిరుగుతుంది.
ఆ ఆవు అంభారవం చేస్తుంది.
గోష్ఠంలో ఉండి అలాంటి ధేనువు
ఆ ప్రేమపూర్వక చేష్టలతో
మానవుని అధఃకరిస్తుంది.
( మనుష్యుల కంటె అధికంగా వత్సమును ప్రేమిస్తుంది. )
బహు క్షీరత్వం వల్ల ద్యోతమానయై
తన రూపాన్ని ప్రకాశింప జేస్తుంది. ॥ 7 ॥

మంత్రము :

అనచ్ఛయే తురగాతు జీవ మేజద్

ధ్రువం మధ్య ఆ పస్త్యా౽నామ్ ।

జీవో మృతస్య చరతి స్వధాభి-

రమర్త్యో మర్త్యేనా సయోనిః ॥ 8 ॥

పదము :

అనత్ । శయే । తుర౽గాతు । జీవమ్ । ఏజత్ ।

ధ్రువమ్ । మధ్యే । ఆ । పస్త్యా౽నామ్ ।

జీవః । మృతస్య । చరతి । స్వధాభిః ।
అమర్త్యః । మర్త్యేన । సఽయోనిః ॥ 8 ॥

అనువాదం :

(ప్రాణాపగమనానంతరం ఇందుకు విలక్షణమై)
ప్రాణయుక్తమై, జీవవంతమై స్వవ్యాపారార్థమై
తూర్ణగమనంతో అది ఉన్నది.
అవిచలితమై, గృహముల మధ్యలో
స్థాణువు వలె ఉంటుంది.
మృతశరీరానికి చెందిన జీవుడు
మరణ ధార్మిక మైన శరీరంతో
పూర్వం సమానోత్పత్తిస్థానుడై
అమరణస్వభావుడు పుత్రకృతము లైన
స్వధాకారపూర్వక అన్నాదులతో వర్తిస్తుంటాడు. ॥ 8 ॥

మంత్రము .

విధుం దద్రాణం సలిలస్య పృష్ఠే
యువానం సన్తం పలితో జగార ।
దేవస్య పశ్య కావ్యం మహిత్వాఽ
ద్యా మమార స హ్యః సమాన ॥ 9 ॥

పదము :

విఽధుమ్ । దద్రాణమ్ । సలిలస్య । పృష్ఠే ।
యువానమ్ । సన్తమ్ । పలితః । జగార ।

అనువాదం :

ఓ భూమిపతీ! నీ అన్నం
పృథివిపై నున్నది.
ఓ ప్రజాపతీ! ఆ అన్నాన్ని
మాకు ప్రదానం చెయ్యి. ॥ 45 ॥

మంత్రము :

అపో దివ్యా అచాయిషం
రసేన స మపృక్ష్మహి ।
పయస్వా నగ్న ఆగమం
తం మా సం సృజ వర్చసా ॥ 46 ॥

పదము :

అపః । దివ్యాః । అచాయిషమ్ ।
రసేన । సమ్ । అపృక్ష్మహి ।
పయస్వాన్ । అగ్నే । ఆ । అగమమ్ ।
తమ్ । మా । సమ్ । సృజ । వర్చసా ॥ 46 ॥

అనువాదం:

ఓ దివ్య జలములారా! మిమ్ములను యాచిస్తున్నాను.
మమ్ములను రససంయుక్తులను చేయండి.
ఓ అగ్నీ! నేను రసంతోపాటూ వస్తున్నాను.
నన్ను తేజస్సంయుక్తునిగా చెయ్యి. ॥ 46 ॥

మంత్రము :

సం మాఽగ్నే వర్చసా సృజ

సం ప్రజయా స మాయుషా ।

విద్యుర్మే అస్య దేవా

ఇన్ద్రో విద్యాత్ సహ ఋషిభిః ॥ 47 ॥

పదము :

సమ్ । మా । అగ్నే । వర్చసా । సృజ ।

సమ్ । ప్రఽజయా । సమ్ । ఆయుషా ।

విద్యుః । మే । అస్య । దేవాః ।

ఇన్ద్రః । విద్యాత్ । సహ । ఋషిఽభిః ॥ 47 ॥

అనువాదం :

ఓ అగ్ని ! నన్ను తేజస్సంయుక్తుని చెయ్యి.
సంతానంతో ఆయుస్సుతో సంయోజనం చేసే
దేవత నా భావమును ఎరుగును.
ఇంద్రునకు, ఋషులకు కూడా
ఈ విషయం తెలియును. ॥ 47 ॥

మంత్రము :

య దగ్నే అద్య మిథునా శపాతో

య ద్వాచ స్తృష్టం జనయన్త రేభాః ।

మన్యో ర్మనసః శరవ్యా౩ జాయతే యా
తయా విధ్య హృదయే యాతుధానాన్ ॥ 48 ॥

పదము.

యత్ । అగ్నే । అద్య । మిథునా । శపాతః ।
యత్ । వాచః । తృష్టమ్ । జనయన్త । రేభాః ।
మన్యోః । మనసః । శరవ్యా౨ । జాయతే । యా ।
తయా । విధ్య । హృదయే । యాతు౨ధానాన్ ॥ 48 ॥

అనువాదం

ఓ అగ్నీ! ఏది నేడు
జత చేరి తెప్పిస్తున్నదో,
ఏ వక్త వాగ్ఘోషాన్ని కల్పిస్తున్నాడో,
ఎవరి క్రోధం మనశ్శల్యంగా పరిణమించినదో,
దానితో యాతుధానుల
హృదయవిదారణం చెయ్యి. ॥ 48 ॥

మంత్రము.

పరా శృణీహి తపసా యాతుధానాన్
పరా౨గ్నే రక్షో హరసా శృణీహి ।
పరా౨ర్చిషా మూరదేవాం ఛృణీహి
పరా౨సుతృపః శోశుచతః శృణీహి ॥ 49 ॥

పదము :

పరా । శృణీహి । తపసా । యాతు౽ధానాన్ ।

పరా । అగ్నే । రక్షః । హరసా । శృణీహి ।

పరా । అర్చిషా । మూర౽దేవాన్ । శృణీహి ।

పరా । అసు౽తృపః । శోశుచతః । శృణీహి ॥ 49 ॥

అనువాదం :

యాతుధానులను తపస్సుతో దూరం చేసి
ఓ అగ్నీ ! రాక్షసులను నీ బలంతో దూరీకరించు.
నీ జ్వాలతో మూర్ఖులను దూరం చెయ్యి.
ఇతర ప్రాణులపై తృప్తి చెందే వారికి
శోకం కల్పించి, దూరంగా పారదోలు. ॥ 49 ॥

మంత్రము :

అపాం మస్మై వజ్రం ప్ర హరామి
చతుర్భృష్టిం శీర్షభిద్యాయ విద్వాన్ ।
సో అస్యాఙ్గాని ప్ర శృణాతు సర్వా
త న్మే దేవా అను జానన్తు విశ్వే ॥ 50 ॥

పదము :

అపామ్ । అస్మై । వజ్రమ్ । ప్ర । హరామి ।

చతుః౽భృష్టిమ్ । శీర్ష౽భిద్యాయ । విద్వాన్ ।

సః । అస్య । అఙ్గాని । ప్ర । శృణాతు । సర్వా ।
తత్ । మే । దేవాః । అను । జానన్తు । విశ్వే ॥ 50 ॥

అనువాదం :

వేత్త నైన నేను దీని శీర్షభేదనమునకై
జలచరాలను నాశం చేసే
వజ్రాన్ని ప్రయోగిస్తున్నాను.
అది దీని సర్వాంగాలను భేదించు గాక!
ఈ నా చేష్టను విశ్వేదేవులు
అనుమతింతురు గాక! ॥ 50 ॥

ఇది ఐదవ సూక్తం.

## సూక్తం-6

ఋషి: బృహస్పతి॥ దేవతలు; వనస్పతి; ఫాలమణి; 3 అపోదేవత॥ ఛందస్సు: 1,4,21 గాయత్రీ: 2,3,18,19,22,28-30,32-34 అనుష్టుప్: 5,31 షట్పదా జగతీ: 6 సప్తపదా విరాట్ శక్వరీ: 7-9 అష్టపదాఽష్టి: 10 నవపదాధృతి: 11,20,23-27 పథ్యాపంక్తి: 12-27 త్ర్యవసానా (? సప్తపదా) శక్వరీ: 35 పఞ్చపదాఽను (త్ర్యను)ష్టుబ్గర్భా జగతీ॥ మంత్రములు: ॥ 35 ॥

వినియోగం:- ఖదిరకాష్ఠ ఫాలవికార మైన మణిని శత్రునాశనార్థం, సర్వకామావాప్త్యై బంధించుటలో దీనికి వినియోగం.

అట్లే పశుయాగంలో వృశ్చ్యమాన యూపానుమంత్రణంలో దీనికి వినియోగం.

అట్లే పార్థివ మహాశాంతిలోను, ఖదిరఫాల మణిబంధనంలోను దీనికి వినియోగం.

మంత్రము :

అరాతీయో ర్భ్రాతృవ్యస్య

దుర్హార్దో ద్విషతః శిరః ।

అపి వృశ్చామ్యోజసా ॥ 1 ॥

పదము :

అరాతిఽయోః । భ్రాతృవ్యస్య ।

దుఃఽహార్దః । ద్విషతః । శిరః ।

అపి । వృశ్చామి । ఓజసా ॥ 1 ॥

అనువాదం :

శత్రువుల, వైరుల, దుష్టహృదయుల,
ద్వేషుల శిరస్సును ఓజస్సుతో తెగవేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

వర్మ మహ్య మయం మణిః

ఫాలా జ్జాతః కరిష్యతి ।

పూర్ణో మన్థేన మాగమద్

రసేన సహ వర్చసా ॥ 2 ॥

పదము :

వర్మ । మహ్యమ్ । అయమ్ । మణిః ।

ఫాలాత్ । జాతః । కరిష్యతి ।

పూర్ణః। మన్థేన। మా। ఆ। అగమత్।

రసేన। సహ। వర్చసా ॥ 2 ॥

అనువాదం.

నాగేటి కర్రు నుంచి సిద్ధపరచిన ఈ మణి
మాకు కవచం వలె రక్షక మౌతుంది.
మంథన శక్తితో, రసంతో, వర్చస్సుతో
సంయుక్తమై పూర్ణమైన ఈ మణి నాకు లభించినది. ॥ 2 ॥

మంత్రము:

యత్ త్వా శిక్వః పరాఽవధీత్

తక్షా హస్తేన వాస్యా।

ఆప స్త్వా తస్మా జ్జీవలాః

పునన్తు శుచయః శుచిమ్ ॥ 3 ॥

పదము:

యత్। త్వా। శిక్వః। పరాఽఅవధీత్।

తక్షా। హస్తేన। వాస్యా।

ఆపః। త్వా। తస్మాత్। జీవలాః।

పునన్తు। శుచయః। శుచిమ్ ॥ 3 ॥

అనువాదం.

కుశలమైన రక్షకమైన ఇది
శస్త్రయుక్తమైన చేతితో కొడుతున్నది

దీనికి జీవ మిచ్చే పరిశుద్ధ జలం
పరిశుద్ధుడ వైన నిన్ను పవిత్రుని చేయు గాక! ॥ 3 ॥

మంత్రము :

హిరణ్యస్ర గయం మణిః
శ్రద్ధాం యజ్ఞం మహో దధత్ ।
గృహే వసతు నోఽతిథిః ॥ 4 ॥

పదము :

హిరణ్యఽస్రక్ । అయమ్ । మణిః ।
శ్రద్ధామ్ । యజ్ఞమ్ । మహః । దధత్ ।
గృహే । వసతు । నః । అతిథిః ॥ 4 ॥

అనువాదం :

ఈ మణి హిరణ్మయమాల.
శ్రద్ధ, భక్తి, యజ్ఞ మహాత్త్వములు కలది.
మా ఇంటిలో అతిథి వలె ఉండు గాక! ॥ 4 ॥

మంత్రము :

తస్మై ఘృతం సురాం మ
ధ్వన్నమన్నం క్షదామహే ।
స నః పితేవ పుత్రేభ్యః
శ్రేయఃశ్రేయ శ్చికిత్సతు

భూయోభూయః శ్వఃశ్వో

దేవేభ్యో మణి రేత్య ॥ 5 ॥

పదము

తస్మై । ఘృతమ్ । సురామ్ । మధు ।

అన్నమ్ఽఅన్నమ్ । క్షదామహే ।

సః । నః । పితాఽఇవ । పుత్రేభ్యః ।

శ్రేయఃఽశ్రేయః । చికిత్సతు ।

భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।

దేవేభ్యః । మణిః । ఆఽఇత్య ॥ 5 ॥

అనువాదం.

దానికై ఆజ్యం, సుర, మధువు అన్నం నివేదిస్తున్నాము.
అది మాకు పిల్లలకు తండ్రి వలె
శ్రేయస్సును సమకూర్చు గాక!
ఈ మణి దేవతల నుంచి ఇక్కడకు వచ్చి
పదే పదే ప్రతిదినము మాకు సుఖము నిచ్చు గాక! ॥ 5 ॥

మంత్రము

య మబధ్నాద్ బృహస్పతి

ర్మణిం ఫాలం ఘృతశ్చుత

ముగ్రం ఖదిర మోజసే ।

త మగ్నిః ప్రత్యముఞ్చత
సో అస్మై దుహ ఆజ్యం
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 6 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।
మణిమ్ । ఫాలమ్ । ఘృతఽశ్చుతమ్ ।
ఉగ్రమ్ । ఖదిరమ్ । ఓజసే ।
తమ్ । అగ్నిః । ప్రతి । అముఞ్చత ।
సః । అస్మై । దుహే । ఆజ్యమ్ ।
భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।
తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 6 ॥

అనువాదం :

ఫాలము ( నాగేటి కర్రు ) నందు పుట్టినది,
ఘృతాన్ని స్రవించునది, ఖదిర వృక్షంతో చేసినది,
ఉగ్ర మైనది, అయిన ఈ మణిని
బలవృద్ధి కోసమై బృహస్పతి కట్టుకొన్నాడు.
దీనిని అగ్ని నాకు ఇచ్చినాడు.

దీనిపై ప్రతిదినము పదే పదే అజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 6 ॥

మంత్రము.

యమబధ్నాద్ బృహస్పతి ర్మణిం
ఫాలం ఘృతశ్చుత ముగ్రం ఖదిర మోజసే ।
త మిన్ద్రః ప్రత్యముఞ్చ
తౌజసే వీర్యా౨య కమ్ ।
సో అస్మై బల మిద్ దుహే
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 7 ॥

పదము।

యమ్। అబధ్నాత్। బృహస్పతిః। మణిమ్।
ఫాలమ్। ఘృత౨శ్చుతమ్। ఉగ్రమ్। ఖదిరమ్। ఓజసే।
తమ్। ఇన్ద్రః। ప్రతి। అముఞ్చత।
ఓజసే। వీర్యా౨య। కమ్।
సః। అస్మై। బలమ్। ఇత్। దుహే।
భూయః౨భూయః। శ్వః౨శ్వః।
తేన। త్వమ్। ద్విషతః। జహి ॥ 7 ॥

అనువాదం।

దీనిని బృహస్పతి ధరించినాడు.
ఫాలము నందు పుట్టినది ఇది.
ఘృతాన్ని స్రవించునది, ఖదిర వృక్షంతో చేసినది,
ఉగ్ర మైనది అయిన ఈ మణిని
బలవృద్ధి కోసమై బృహస్పతి కట్టుకొన్నాడు.
దీనిని ఇంద్రుడు నాకు ఇచ్చినాడు.
ఇందుతో ఓజస్సును, వీర్యమును, సుఖమును పొందును గా
ఇది బలమును దోహనం చేయు గాక!
పదే పదే దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాను.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 7

మంత్రము:

య మబధ్నాద్ బృహస్పతి ర్మణిం
ఫాలం ఘృతశ్చుత ముగ్రం ఖదిర మోజసే।
తం సోమః ప్రత్యముఞ్చత
మహే శ్రోత్రాయ చక్షసే।
సో అస్మై వర్చ ఇద్ దుహే
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 8

పదము:

యమ్। అబధ్నాత్। బృహస్పతిః। మణిమ్।
ఫాలమ్। ఘృతఽశ్చుతమ్। ఉగ్రమ్। ఖదిరమ్। ఓజసే।

తమ్ । సోమః । ప్రతి । అముఞ్చత ।

మహే । శ్రోత్రాయ । చక్షసే ।

సః । అస్మై । వర్చః । ఇత్ । దుహే ।

భూయఃऽభూయః । శ్వఃऽశ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 8 ॥

అనువాదం :

ఫాలము నందు పుట్టినది, ఘృతాన్ని స్రవించునది,
ఖదిర వృక్షంతో చేసినది, ఉగ్ర మైనది అయిన
ఈ మణిని బలవృద్ధి కోసమై బృహస్పతి కట్టుకొన్నాడు.
దీనిని సోముడు నాకు ఇచ్చినాడు.
అది ఓజస్సును, వీర్యమును, సుఖమును ఇచ్చు గాక!
నాకు శ్రోత్రమును, దృష్టిని సమకూర్చు గాక!
ఇది వర్చస్సును దోహనం చేయు గాక!
పదే పదే దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 8 ॥

మంత్రము

య మబధ్నాద్ బృహస్పతి ర్మణిం

ఫాలం ఘృతశ్చుత ముగ్రం ఖదిర మోజసే ।

తం సూర్యః ప్రత్యముఞ్చత

తే నేమా అజయద్ దిశః ।

నో అస్మై భూతి మిద్ దుహే

భూయోభూయః శ్వఃశ్వ

స్తేన త్వం ద్విషతో జహి ॥ 9

పదము।

యమ్। అబధ్నాత్। బృహస్పతిః। మణిమ్।

ఫాలమ్। ఘృతఽశ్చుతమ్। ఉగ్రమ్। ఖదిరమ్। ఓజసే।

తమ్। సూర్యః। ప్రతి। అముఞ్చత।

తేన। ఇమాః। అజయత్। దిశః।

నః। అస్మై। భూతిమ్। ఇత్। దుహే।

భూయఃఽభూయః। శ్వఃఽశ్వః।

తేన। త్వమ్। ద్విషతః। జహి ॥ 9

అనువాదం।

ఫాలము నందు పుట్టినది, ఘృతాన్ని స్రవించునది,
ఖదిర వృక్షంతో చేసినది, ఉగ్ర మైనది
అయిన ఈ మణిని బలవృద్ధి కోసమై
బృహస్పతి కట్టుకొన్నాడు.
సూర్యుడు దీనిని నా కిచ్చినాడు.
ఇది దిక్కులను జయిస్తున్నది.
ఇది మాకై ఐశ్వర్యాన్ని దోహనం చేస్తున్నది.
పదే పదే దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాను.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 9

మంత్రము :

యమబధ్నాద్ బృహస్పతిర్మణిం

ఫాలం ఘృతశ్చుత ముగ్రం ఖదిర మోజసే ।

తం బిభ్ర చ్చన్ద్రమా మణి మసురాణాం

పురోఽజయద్ దానవానాం హిరణ్యయీః ।

సో అస్మై శ్రియ మిద్ దుహే

భూయోభూయః శ్వఃశ్వ

స్తేన త్వం ద్విషతో జహి ॥ 10 ॥

పదము

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః । మణిమ్ ।

ఫాలమ్ । ఘృతఽశ్చుతమ్ । ఉగ్రమ్ । ఖదిరమ్ । ఓజసే ।

తమ్ । బిభ్రత్ । చన్ద్రమాః । మణిమ్ । అసురాణామ్ ।

పురః । అజయత్ । దానవానామ్ । హిరణ్యయీః ।

సః । అస్మై । శ్రియమ్ । ఇత్ । దుహే ।

భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 10 ॥

అథర్వ IV 39

అనువాదం।

బృహస్పతి ధరించిన ఫాలనిర్మిత మైన మణి,
ఖదిర సంబంధ మైనది, ఘృతాన్ని స్రవించునది
అయిన ఈ మణి నాకు ఓజస్సును కల్పించు గాక।
ఈ మణిని ధరించిన చంద్రుడు
అసురుల, దానవుల, సువర్ణపురాలను పరాజితం చేసినాడు.
అది ఆయనకు సౌభాగ్యాన్ని ఇచ్చినది.
పదే పదే ప్రతిదినము దీనపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 10

మంత్రము:

య మబధ్నాద్ బృహస్పతి

ర్వాతాయ మణి మాశవే।

సో అస్మై వాజినం దుహే

భూయోభూయః శ్వఃశ్వ

స్తేన త్వం ద్విషతో జహి ॥ 11।

పదము:

యమ్। అబధ్నాత్। బృహస్పతిః।

వాతాయ। మణిమ్। ఆశవే।

సః। అస్మై। వాజినమ్। దుహే।

భూయఃऽభూయః। శ్వఃऽశ్వః।

తేన। త్వమ్। ద్విషతః। జహి ॥ 11।

అనువాదం।

బృహస్పతి వాయుదేవానుగ్రహార్థమై
ఈ మణిని ధరించినాడు.
వాయువు శక్తియుతు డైనాడు.
అతడు ఇతనికి అశ్వముల నిస్తున్నాడు.
పదే పదే ప్రతిదినము దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 11 ॥

మంత్రము।

య మబధ్నాద్ బృహస్పతి
ర్వాతాయ మణీ మాశవే।
తే నేమాం మణినా కృషి
మశ్వినా వభి రక్షతః ।
స భిషగ్భ్యాం మహో దుహే
భూయోభూయః శ్వః శ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 12 ॥

పదము.

యమ్। అబధ్నాత్। బృహస్పతిః।
వాతాయ। మణిమ్। ఆశవే।
తేన। ఇమామ్। మణినా। కృషిమ్।

అశ్వినా । అభి । రక్షతః ।

సః । భిషక్ ఽభ్యామ్ । మహః । దుహే ।

భూయః ఽ భూయః । శ్వః ఽ శ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 12 ॥

అనువాదం:

వాయుదేవానుగ్రహార్థమై బృహస్పతి
ఈ మణిని ధరించినాడు.
దానితో అశ్వనీదేవతలు ఇతని కృషిని రక్షిస్తున్నారు.
ఈ వైద్యుల ద్వారా తేజస్సును, అన్నాన్ని ఇస్తున్నాడు.
పదే పదే ప్రతిదినము దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 12 ॥

మంత్రము :

య మబధ్నాద్ బృహస్పతి

ర్వాతాయ మణి మాశవే ।

తం బిభ్రత్ సవితా మణిం

తేనేద మజయత్ స్వః ।

సో అస్మై సూనృతాం దుహే

భూయోభూయః శ్వఃశ్వ

స్తేన త్వం ద్విషతో జహి ॥ 13 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

వాతాయ । మణిమ్ । ఆశవే ।

తమ్ । బిభ్రత్ । సవితా । మణిమ్ ।

తేన । ఇదమ్ । అజయత్ । స్వ౨ః ।

సః । అస్మై । సూనృతామ్ । దుహే ।

భూయః౨భూయః । శ్వః౨శ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 13 ॥

అనువాదం :

వాయుదేవుని అనుగ్రహార్థమై బృహస్పతి
ఈ మణిని ధరించినాడు.
దానిని ధరించి సవిత స్వీయ ప్రకాశాన్ని పొందినాడు.
అతడు దీనికై సత్యాన్ని ప్రసాదిస్తున్నాడు.
పదే పదే ప్రతిదినము దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 13 ॥

మంత్రము.

య మబధ్నాద్ బృహస్పతి

ర్వాతాయ మణి మాశవే ।

త మాపో బిభ్రతీ ర్మణిం

సదా ధావ న్త్యక్షితాః ।
స ఆభ్యోఽమృత మిద్ దుహే
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 14 ॥

పదము;

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।
వాతాయ । మణిమ్ । ఆశవే ।
తమ్ । ఆపః । బిభ్రతీః । మణిమ్ ।
సదా । ధావన్తి । అక్షితాః ।
సః । ఆభ్యః । అమృతమ్ । ఇత్ । దుహే ।
భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।
తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 14 ॥

అనువాదం:

బృహస్పతి వాయుదేవుని అనుగ్రహార్థమై
ఈ మణిని ధరించినాడు.
ఈ మణిని జలదేవతలు ధరించినారు.
అందుతో అవి అక్షతమై సదా పరువెత్తుతున్నవి.
అవి ఈతనికై అమృతాన్ని ప్రసాదిస్తున్నవి.

పదే పదే ప్రతిదినము దీనిపై
ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 14 ॥

మంత్రము ;

య మబధ్నాద్ బృహస్పతి
ర్వాతాయ మణి మాశవే ।
తం రాజా వరుణో మణిం
ప్రత్యముఞ్చత శంభువమ్ ।
సో అస్మై సత్యమిద్ దుహే
భూయోభూయః శ్వశ్శ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 15 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।
వాతాయ । మణిమ్ । ఆశవే ।
తమ్ । రాజా । వరుణః । మణిమ్ ।
ప్రతి । అముఞ్చత । శమ్ౘభువమ్ ।
సః । అస్మై । సత్యమ్ । ఇత్ । దుహే ।

భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 15 ॥

అనువాదం :

బృహస్పతి వాయుదేవానుగ్రహార్థమై
ఈ మణిని ధరించినాడు.
ఈ సుఖదాయి అయిన మణిని
రాజు వరుణుడు వదలివేస్తున్నాడు.
ఆయన ఇతనికై సత్యాన్ని ప్రసాదిస్తున్నాడు.
పదే పదే ప్రతిదినము దీనిపై
ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 15 ॥

మంత్రము :

య మబధ్నాద్ బృహస్పతి
ర్వాతాయ మణి మాశవే ।
తం దేవా బిభ్రతో మణిం
సర్వాం ల్లోకాన్ యుధాఽజయన్ ।
స ఏభ్యో జితి మిద్ దుహే
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 16 ॥

పదము

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

వాతాయ । మణిమ్ । ఆశవే ।

తమ్ । దేవాః । బిభ్రతః । మణిమ్ ।

సర్వాన్ । లోకాన్ । యుధా । అజయన్ ।

సః । ఏభ్యః । జితిమ్ । ఇత్ । దుహే ।

భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 16 ॥

అనువాదం :

బృహస్పతి వాయుదేవుని అనుగ్రహార్థమై
ఈ మణిని ధరించినాడు.
ఈ మణిని దేవతలు ధరించినారు.
యుద్ధంలో సర్వలోకాలను జయించినారు.
అది ఇతనికి విజయాన్ని ప్రసాదిస్తున్నది.
పదే పదే ప్రతిదినము దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము
దీనితో నీవు శత్రువులను నిర్జించు. ॥ 16 ॥

మంత్రము .

య మబధ్నాద్ బృహస్పతి

ర్వాతాయ మణి మాశవే ।

తమిమం దేవతా మణిం

ప్రత్యముఞ్చన్త శంభువమ్ ।
స ఆభ్యో విశ్వమిద్ దుహే
భూయోభూయః శ్వఃశ్వ
స్తేన త్వం ద్విషతో జహి ॥ 17 ॥

పదము:

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।
వాతాయ । మణిమ్ । ఆశవే ।
తమ్ । ఇమమ్ । దేవతాః । మణిమ్ ।
ప్రతి । అముఞ్చన్త । శమ్ఽభువమ్ ।
సః । ఆభ్యః । విశ్వమ్ । ఇత్ । దుహే ।
భూయఃఽభూయః । శ్వఃఽశ్వః ।
తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 17 ॥

అనువాదం:

బృహస్పతి వాయుదేవుని అనుగ్రహార్థమై
ఈ మణిని ధరిస్తున్నాడు.
సుఖప్రద మైన ఈ మణిని దేవతలు
ప్రతివిమోచనం చేసినారు.
అది వీరికి సర్వ సుఖాలను ప్రసాదిస్తున్నది.

పదే పదే ప్రతిదినము దీనిపై ఆజ్యాన్ని సమర్పిస్తున్నాము.
దీనితో నీవు శత్రువులను నిర్జించు ॥ 17 ॥

మంత్రము :

ఋతవ స్త మబధ్న
తా ర్తవా స్త మబధ్నత ।
సంవత్సర స్తం బద్ధ్వా
సర్వం భూతం వి రక్షతి ॥ 18 ॥

పదము :

ఋతవః । తమ్ । అబధ్నత ।
ఆ ర్తవాః । తమ్ । అబధ్నత ।
సమ్ఽవత్సరః । తమ్ । బద్ధ్వా ।
సర్వమ్ । భూతమ్ । వి । రక్షతి ॥ 18 ॥

అనువాదం :

ఋతువులు దీనిని ధరించినవి.
ఆర్తవ మైన పదార్థం దీనిని ధరిస్తున్నది.
సంవత్సరం దానిని ధరించి
సర్వ భూతజాతమును రక్షిస్తున్నది. ॥ 18 ॥

మంత్రము :

అ న్తర్దేశా అబధ్నత
ప్రదిశ స్త మబధ్నత ।

ప్రజాపతిసృష్టో మణి

ర్ద్విషతో మేఽధరాం అకః ॥ 19

పదము :

అన్తః౽దిశాః । అబధ్నత ।

ప్ర౽దిశః । తమ్ । అబధ్నత ।

ప్రజాపతి౽సృష్టః । మణిః ।

ద్విషతః । మే । అధరాన్ । అకః ॥ 19

అనువాదం :

విదిశలు దీనిని ధరించినవి.
దిక్కులు దీనిని ధరించినవి.
ప్రజాపతి నిర్మించిన ఈ మణి
మా శత్రువులను అధఃకరించు గాక ! ॥ 19

మంత్రము :

అథర్వాణో అబధ్న

తాథర్వణా అబధ్నత ।

తై ర్మేదినో అఙ్గిరసో

దస్యూనాం బిభిదుః పుర

స్తేన త్వం ద్విషతో జహి ॥ 20 ॥

పదము.

అథర్వాణః । అబధ్నత ।

అథర్వణాః । అబధ్నత ।

తైః । మేదినః । అఙ్గిరసః ।

దస్యూనామ్ । బిభిదుః । పురః ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 20 ॥

అనువాదం.

అథర్వ సంతానం దీనిని కట్టుకొన్నది.
అథర్వాణకులు దీన్ని కట్టుకున్నారు.
వారు బలవంతులై అంగిరసుల శత్రువుల
నగరములను భేదిస్తున్నారు.
దీనితో శత్రువులను పరాస్తం చెయ్యి. ॥ 20 ॥

మంత్రము :

తం ధాతా ప్రత్యముఞ్చత

స భూతం వ్యకల్పయత్ ।

తేన త్వం ద్విషతో జహి ॥ 21 ॥

పదము :

తమ్ । ధాతా । ప్రతి । అముఞ్చత ।

సః । భూతమ్ । వి । అకల్పయత్ ।

తేన । త్వమ్ । ద్విషతః । జహి ॥ 21 ॥

అనువాదం:

దీనిని విధాత ధరించినాడు.
అతను భూతజాతమును సృష్టించగలిగినాడు.
ఆ బలంతో నీవు శత్రువులను పరాస్తం చెయ్యి. ॥ 21 ॥

మంత్రము:

య మబధ్నాద్ బృహస్పతి
ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।
స మాఽయం మణి రాగమద్
రసేన సహ వర్చసా ॥ 22 ॥

పదము:

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।
దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।
సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।
రసేన । సహ । వర్చసా ॥ 22 ॥

అనువాదం:

బృహస్పతి దీనిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.

ఈ మణి నా వద్దకు వచ్చినది.
తేజస్సును కొనివచ్చినది. ॥ 22 ॥

మంత్రము :

యమబధ్నాత్ బృహస్పతి-

ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।

స మాఽయం మణి రాగమత్

సహ గోభి రజావిభి

రన్నేన ప్రజయా సహ ॥ 23 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।

సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।

సహ । గోభిః । అజావిఽభిః ।

అన్నేన । ప్రఽజయా । సహ ॥ 23 ॥

అనువాదం :

బృహస్పతి దీనిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.

గోవులతో, మేకలతో, అన్నంతో, సంతానంతో పాటు
ఇది నా వద్దకు వచ్చినది. ॥ 23 ॥

మంత్రము :

య మబధ్నాద్ బృహస్పతి-
ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।
స మాఽయం మణి రాగమత్
సహ వ్రీహియవాభ్యాం
మహసా భూత్యా సహ ॥ 24 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః
దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।
సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।
సహ । వ్రీహిఽయవాభ్యామ్ ।
మహసా । భూత్యా । సహ ॥ 24 ॥

అనువాదం :

బృహస్పతి దీనిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.
వ్రీహి యవలతో, ఐశ్వర్యంతో పాటు మా వద్దకు వచ్చినది.
॥ 24 ॥

మంత్రము.

య మబధ్నాద్ బృహస్పతి-

ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।

స మాఽయం మణి రాగమ-

న్మధో ర్ఘృతస్య ధారయా

కీలాలేన మణిః సహ ॥ 25 ॥

పదము:

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।

సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।

మధోః । ఘృతస్య । ధారయా ।

కీలాలేన । మణిః । సహ ॥ 25 ॥

అనువాదం:

బృహస్పతి దీనిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.
ఈ మణి మధువుతో, ఘృతధారతో
మధురస ధారలతో మా వద్దకు వచ్చినది. ॥ 25 ॥

అథర్వ. iv 40

మంత్రము :

య మబధ్నాద్ బృహస్పతి-

ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।

స మాఽయం మణి రాగమ

దూర్జయా పయసా సహ

ద్రవిణేన శ్రియా సహ ॥ 26 ॥

పదము

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।

సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।

ఊర్జయా । పయసా । సహ ।

ద్రవిణేన । శ్రియా । సహ ॥ 26 ॥

అనువాదం ।

బృహస్పతి దీనిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.
ఈ మణి క్షీరంతో, ధనంతో,
ఐశ్వర్యంతో పాటు
నా వద్దకు వచ్చినది. ॥ 26 ॥

మంత్రము·

య మబధ్నాద్ బృహస్పతి-

ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।

స మా౽యం మణి రాగమత్

తేజసా త్విష్యా సహ

యశసా కీర్త్యా౽ సహ ॥ 27 ॥

పదము,

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

దేవేభ్యః । అసుర౽క్షితిమ్ ।

సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।

తేజసా । త్విష్యా । సహ ।

యశసా । కీర్త్యా౽ । సహ ॥ 27 ॥

అనువాదం

బృహస్పతి ఈ మణిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి ధరించి ఉన్నాడు.
ఆ మణి తేజస్సుతోను, ప్రకాశంతోను,
యశస్సుతోను, కీర్తితోను కలిసి
నా వద్దకు వచ్చినది. ॥ 27 ॥

మంత్రము :

య మబధ్నాద్ బృహస్పతి-

ర్దేవేభ్యో అసురక్షితిమ్ ।

స మాఽయం మణి రాగమత్

సర్వాభి ర్భూతిభిః సహ ॥ 28 ॥

పదము :

యమ్ । అబధ్నాత్ । బృహస్పతిః ।

దేవేభ్యః । అసురఽక్షితిమ్ ।

సః । మా । అయమ్ । మణిః । ఆ । అగమత్ ।

సర్వాభిః । భూతిఽభిః । సహ ॥ 28 ॥

అనువాదం :

బృహస్పతి ఈ మణిని ధరించినాడు.
అసుర వినాశకు లైన దేవతలకై
బృహస్పతి దీనిని ధరించినాడు.
ఆ మణి సర్వైశ్వర్యాలతో పాటు
నా వద్దకు వచ్చినది. ॥ 28 ॥

మంత్రము :

త మిమం దేవతా మణిం

మహ్యం దదతు పుష్టయే ।

అభిభుం క్షత్రవర్ధనం

సపత్నదమ్భనం మణిమ్ ॥ 29 ॥

పదము :

తమ్ । ఇమమ్ । దేవతాః । మణిమ్ ।

మహ్యమ్ । దదతు । పుష్టయే ।

అభి౨భుమ్ । క్షత్ర౨వర్ధనమ్ ।

సపత్న౨దమ్భనమ్ । మణిమ్ ॥ 29 ॥

అనువాదం :

ఈ మణిని దేవతలు నాకు
పుష్ట్యర్థమై ప్రసాదింతురు గాక !
ఈ మణి శత్రునాశకము,
క్షాత్రతేజాన్ని అధికం చేయునది,
శత్రువిధ్వంసనం చేయునది. ॥ 29 ॥

మంత్రము :

బ్రహ్మణా తేజసా సహ

ప్రతి ముఞ్చామి మే శివమ్ ।

అసపత్నః సపత్నహా

సపత్నాన్ మే౨ధరాం అకః ॥ 30 ॥

పదము :

బ్రహ్మణా । తేజసా । సహ ।

ప్రతి । ముఞ్చామి । మే । శివమ్ ।

అసపత్నః । సపత్నఽహా ।

సఽపత్నాన్ । మే । అధరాన్ । అకః ॥ 30 ॥

అనువాదం :

బ్రహ్మతో తేజస్సుతో పాటు
కల్యాణకారి యైన ఈ మణి
ధారణం చేస్తున్నాను.
ఈ మణి శత్రురహితము,
శత్రుఘాతుకము అయినది,
ఇది నా శత్రువులను అధఃకరిస్తుంది. ॥ 30 ॥

మంత్రము :

ఉత్తరం ద్విషతో మా మయం
మణిః కృణోతు దేవజాః ।
యస్య లోకా ఇమే త్రయః
పయో దుగ్ధ ముపాసతే ।
స మాఽయ మధి రోహతు
మణిః శ్రైష్ఠ్యాయ మూర్ధతః ॥ 31 ॥

పదము :

ఉత్ऽతరమ్ । ద్విషతః । మామ్ । అయమ్ ।

మణిః । కృణోతు । దేవऽజాః ।

యస్య । లోకాః । ఇమే । త్రయః ।

పయః । దుగ్ధమ్ । ఉపऽఆసతే ।

సః । మా । అయమ్ । అధి । రోహతు ।

మణిః । శ్రైష్ఠ్యాయ । మూర్ధతః ॥ 31 ॥

అనువాదం :

ఈ దేవతాజనిత మైన మణి నన్ను
శత్రువుల కంటె అధిక స్థితిలో ఉంచు గాక!
దీని దుగ్ధాన్ని మూడు లోకాలు ఉపాసిస్తున్నవి.
ఈ మణి నన్ను ఉత్కృష్ట స్థానాన్ని
అధిరోహింప జేయు గాక! ॥ 31 ॥

మంత్రము :

యం దేవాః పితరో మనుష్యాऽ

ఉపజీవన్తి సర్వదా ।

స మా యమధి రోహతు

మణిః శ్రైష్ఠ్యాయ మూర్ధతః ॥ 32 ॥

పదము :

యమ్ । దేవాః । పితరః । మనుష్యాః ।

ఉపఽజీవన్తి । సర్వదా ।

సః । మా । అయమ్ । అధి । రోహతు ।

మణిః । శ్రైష్ఠ్యాయ । మూర్ధతః ॥ 32 ॥

అనువాదం :

దేనిపై దేవతలు, పితరులు, మనుష్యులు
సర్వదా ఉపజీవనం చేస్తున్నారో,
ఆ శ్రేష్ఠ స్థానమును నన్ను అధిరోహింప జేయు గాక! ॥32॥

మంత్రము :

యథా బీజ ముర్వరాయాం

కృష్టే ఫాలేన రోహతి ।

ఏవా మయి ప్రజా పశవో-

న్న మన్నం వి రోహతు ॥ 33 ॥

పదము :

యథా । బీజమ్ । ఉర్వరాయామ్ ।

కృష్టే । ఫాలేన । రోహతి ।

ఏవ । మయి । ప్రఽజా । పశవః ।

అన్నమ్ఽఅన్నమ్ । వి । రోహతు ॥ 33 ॥

**అనువాదం:**

నాగేటితో దున్నిన భూమిలో విత్తిన
విత్తనం ఏ విధంగా అంకురిస్తుందో,
అలాగే సంతానం, పశువులు, అన్నము
మొదలైనవి నాకై ఉత్పన్నము లగు గాక! ॥ 33 ॥

మంత్రము:

**యస్మై త్వా యజ్ఞవర్ధన**
**మణే ప్రత్యముచం శివమ్ ।**
**తం త్వం శతదక్షిణ**
**మణే శ్రైష్ఠ్యాయ జిన్వతాత్** ॥ 34 ॥

పదము.

**యస్మై । త్వా । యజ్ఞఽవర్ధన ।**
**మణే । ప్రతిఽఅముచమ్ । శివమ్ ।**
**తమ్ । త్వమ్ । శతఽదక్షిణ ।**
**మణే । శ్రైష్ఠ్యాయ । జిన్వతాత్** ॥ 34 ॥

**అనువాదం:**

ఓ యజ్ఞవర్ధనమణి! నీవు శుభప్రద మైన
మణి వని నేను ధరించినాను.
నూరు విధాల దక్షిణ నిచ్చే ఓ మణీ!
నీవు శ్రేష్ఠత్వమునకై వృద్ధిపొందుదువు గాక! ॥ 34 ॥

మంత్రము :

ఏత మిధ్మం సమాహితం

జుషాణో అగ్నే ప్రతి హర్య హోమైః ।

తస్మిన్ విదేమ సుమతిం

స్వస్తి ప్రజాం చక్షుః పశూ

న్త్సమిద్ధే జాతవేదసి బ్రహ్మణా ॥ 35 ॥

పదము :

ఏతమ్ । ఇధ్మమ్ । సమ్ఽఆహితమ్ ।

జుషాణః । అగ్నే । ప్రతి । హర్య । హోమైః ।

తస్మిన్ । విదేమ । సుఽమతిమ్ ।

స్వస్తి । ప్రఽజామ్ । చక్షుః । పశూన్ ।

సమ్ఽఇద్ధే । జాతఽవేదసి । బ్రహ్మణా ॥ 35 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! ప్రదీప్త మైన ఇంధనములతో నిన్ను సేవిస్తున్నాను.
హోమ హవనములతో సమృద్ధుడవు కా.
అలాగే ప్రదీప్త మైన అగ్ని యందు
జ్ఞానంతో ఉత్తమ బుద్ధితో, కల్యాణకర మైన
సంతానంతో, దృష్టిని, పశువులను పొందుదుము గాక! ॥35॥

ఇది ఆరవ సూక్తం.

ఇది మూడవ అనువాకం.

# అనువాకం: 4

## సూక్తం - 7

ఋషి: అథర్వుడు॥ దేవతలు: స్కంభుడు: అధ్యాత్మమ్॥ ఛందస్సు: 1 విరాడ్ జగతీ, 2,8 భురిక్ త్రిష్టుప్: 3-6,9,38,42,43 త్రిష్టుప్: 7,13 పరోష్ణిక్: 10,14,16,18,19 ఉపరిష్టాద్ బృహతీ: 11,12 15,20,22,39 ఉపరిష్టాజ్జ్యోతిర్జగతీ: 17 షట్పదా జగతీ: 21 బృహతీ గర్భాఽనుష్టుప్ 23-30,37,40 అనుష్టుప్: 31 మధ్యే జ్యోతిర్జగతీ: 32,34,36 ఉపరిషాద్ విరాడ్ బృహతీ: 33 పరా విరాడనుష్టుప్ 35 చతుష్పదా జగతీ: 41 ఆర్షీ త్రిపదా గాయత్రీ: 44 ద్విపదాఽఽర్చ్యనుష్టుప్ లేక పంచపదా నిచృద్ పదపంక్తి (ఏకావసానా)॥ మంత్రములు: ॥ 44 ॥

వినియోగం - ఇది స్కంభ సూక్తము. స్కంభుడు బ్రహ్మకంటె కూడ ముందు వాడైన సనాతనతమ దేవుడు. ఇందువలననే అతనికి 'జ్యేష్ఠ బ్రహ్మ' అని పేరు గలదు. అతని యందే జగత్తంతా ఇమిడి ఉన్నది. ఈ విశ్వమంతా అతనిచే ఆవేష్టితమై యున్నది. విరాట్టు కూడా అతని యందే సమాహితుడై ఉన్నాడు. అతని యందే దేవాదు లందరూ సమాహితులై ఉన్నారు-ఇత్యాది విషయములు ఇందు వర్ణితము లైనవి.

మంత్రము:

కస్మి న్నఙ్గే తపో అస్యాధి తిష్ఠతి

కస్మి న్నఙ్గ ఋత మస్యాధ్యాహితమ్।

క్వ౨ వ్రతం క్వ౨ శ్రద్ధాఽస్య తిష్ఠతి

కస్మి న్నఙ్గే సత్య మస్య ప్రతిష్ఠితమ్ ॥ 1 ॥

పదము :

కస్మిన్ । అఙ్గే । తపః । అస్య । అధి । తిష్ఠతి ।

కస్మిన్ । అఙ్గే । ఋతమ్ । అస్య । అధి । ఆऽహితమ్ ।

క్వ । వ్రతమ్ । క్వ । శ్రద్ధా । అస్య । తిష్ఠతి ।

కస్మిన్ । అఙ్గే । సత్యమ్ । అస్య । ప్రతిऽస్థితమ్ ॥ 1 ॥

అనువాదం :

ఈ పురుషుని ఏ అంగంలో తపశ్శక్తి నిహితమై ఉన్నది?
ఇతని ఏ అంగంలో ఋతం ఉన్నది?
ఇతని శ్రద్ధ, వ్రతం ఎక్కడ ఉన్నవి?
ఇతని ఏ అంగంలో సత్యం ప్రతిష్ఠితమై ఉన్నది? ॥ 1 ॥

మంత్రము :

కస్మాదఙ్గాద్ దీప్యతే అగ్నిరస్య
కస్మాదఙ్గాత్ పవతే మాతరిశ్వా ।
కస్మాదఙ్గాద్ వి మిమీతేऽధి చన్ద్రమా
మహ స్కమ్భస్య మిమానో అఙ్గమ్ ॥ 2 ॥

పదము

కస్మాత్ । అఙ్గాత్ । దీప్యతే । అగ్నిః । అస్య ।

కస్మాత్ । అఙ్గాత్ । పవతే । మాతరిశ్వా ।

కస్మాత్ । అఙ్గాత్ । వి । మిమీతే । అధి । చన్ద్రమాః ।

మహః । స్కమ్భస్య మిమానః । అఙ్గమ్ ॥ 2 ॥

అనువాదం ।

ఇతని ఏ అంగము నుంచి అగ్ని ప్రకాశిస్తున్నది?
ఏ అంగము నుంచి వాయువు వీస్తున్నది?
ఏ అంగము నుంచి చంద్రుడు ప్రకాశిస్తూ వెళ్తున్నాడు?
ఈ మహా *స్కంభునకు చెందిన ఏ అంగం ప్రమాపణ చేస్తోంది।
॥ 2 ॥

మంత్రము ।

కస్మి న్నఙ్గే తిష్ఠతి భూమి రస్య

కస్మి న్నఙ్గే తిష్ఠ త్యన్తరిక్షమ్ ।

కస్మి న్నఙ్గే తిష్ఠ త్యాహితా ద్యౌః

కస్మి న్నఙ్గే తిష్ఠ త్యుత్తరం దివః ॥ 3 ॥

పదము

కస్మిన్ । అఙ్గే । తిష్ఠతి । భూమిః । అస్య ।

కస్మిన్ । అఙ్గే । తిష్ఠతి । అన్తరిక్షమ్ ।

కస్మిన్ । అఙ్గే । తిష్ఠతి । ఆఽహితా । ద్యౌః ।

కస్మిన్ । అఙ్గే । తిష్ఠతి । ఉత్ఽతరమ్ । దివః ॥ 3 ॥

*స్కంభుడు - విశ్వాధారభూత మైన సనాతన దేవుడు.

అనువాదం:

స్కంభుని ఏ అంగంలో భూమి ప్రతిష్ఠితమై ఉన్నది?
ఏ అంగంలో అంతరిక్షం ఉన్నది?
ఏ అంగంలో ఆహిత మైన ద్యులోకం ఉన్నది?
ఏ అంగంలో ఉత్కృష్ట ద్యులోకభాగ మున్నది? ॥ 3 ॥

మంత్రము:

క్వా ప్రేప్సన్ దీప్యత ఊర్ధ్వో అగ్నిః
క్వా ప్రేప్సన్ పవతే మాతరిశ్వా ।
యత్ర ప్రేప్సన్తీ రభియ న్త్యావృతః
స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ 4 ॥

పదము:

క్వ । ప్రఽఈప్సన్ । దీప్యతే । ఊర్ధ్వః । అగ్నిః ।
క్వ । ప్రఽఈప్సన్ । పవతే । మాతరిశ్వా ।
యత్ర । ప్రఽఈప్సన్తీః । అభిఽయన్తి । ఆఽవృతః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి । కతమః । స్విత్ । ఏవ । సః ॥4॥

అనువాదం:

ఊర్ధ్వాగ్ని దేనిని చూస్తూ ప్రకాశిస్తున్నాడు?
వాయువు ఎటు చూస్తూ వీచుతున్నాడు?
ఎక్కడ దృష్టి నుంచి ఈ జలప్రవాహం ప్రవహిస్తున్నది?
ఈ సర్వాధారక స్కంభుని గూర్చి నాకు తెలియజెప్పు?
ఎన్నవ వా డీయన? ॥ 4 ॥

మంత్రము

క్వార్ధమాసాః క్వ౨ యన్తి మాసాః

సంవత్సరేణ సహ సంవిదానాః ।

యత్ర యన్త్యృతవో యత్రార్తవాః

స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ 5 ॥

పదము

క్వ౨ । అర్ధ౨మాసాః । క్వ౨ । యన్తి । మాసాః ।

సమ్౨వత్సరేణ । సహ । సమ్౨విదానాః ।

యత్ర । యన్తి । ఋతవః । యత్ర । ఆర్తవాః ।

స్కమ్భమ్ । తమ్ । బ్రూహి । కతమః । స్విత్ । ఏవ । సః ॥5॥

అనువాదం।

పక్షములు, మాసములు, సంవత్సరములతో పాటు కలిసి
ఎక్కడెక్కడ ప్రసరిత మౌతున్నవి?
ఎక్కడ ఋతువులు, ఎక్కడ ఋతునముత్పన్న పదార్థం
సంచరిస్తున్నవి?
ఆ స్కంభుని గూర్చి నాకు తెలియజెప్పు.
ఎన్నవ వాడీయన? ॥ 5 ॥

మంత్రము।

క్వే ప్రేప్సన్తీ యువతీ విరూపే

అహోరాత్రే ద్రవతః సంవిదానే ।

యత్ర ప్రేప్సన్తీ రభియ న్త్యాపః
స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ 6 ॥

పదము :

ద్వే । ప్రేప్సన్తీ ఇతి ప్రఽఈప్సన్తీ ।
యువతీ ఇతి । విరూపే ఇతి ।
విఽరూపే । అహోరాత్రే ఇతి ।
ద్రవతః । సంవిదానే ఇతి । సమ్ఽవిదానే ।
యత్ర । ప్రఽఈప్సన్తీః । అభిఽయన్తి । ఆపః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి । కతమః । స్విత్ । ఏవ । సః ॥ 6 ॥

అనువాదం :

ఏ లక్ష్యాన్ని పెట్టుకొని విరుద్ధ రూపవతులు
(అహోరాత్రములు) కలసి వెడుతున్నవి?
దేనిని లక్ష్యంగా చేసుకొని జలం ప్రవహిస్తున్నది?
ఆ స్కంభుని గూర్చి నాకు తెలిసేగా చెప్పు? ॥ 6 ॥

మంత్రము :

యస్మి న్త్సబ్ధ్వా ప్రజాపతి-
ర్లోకా న్త్సర్వాం అధారయత్ ।
స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ 7 ॥

పదము।

యస్మిన్। స్తబ్ధ్వా। ప్రజా౽

లోకాన్। సర్వాన్। అధారయత్।

స్కమ్భమ్। తమ్। బ్రూహి। కతమః। స్విత్। ఏవ। సః ॥ 7 ॥

అనువాదం।

ఎవరి నాధారంగా చేసుకొని ప్రజాపతి
సర్వలోకాలను భరిస్తున్నాడు?
ఆ స్కంభుని గూర్చి నాకు తెలియజెప్పు.
ఎన్నవ వా డాయన? ॥ 7 ॥

మంత్రము:

యత్ పరమ మవమం యచ్చ మధ్యమం

ప్రజాపతిః ససృజే విశ్వరూపమ్।

కియతా స్కమ్భః ప్ర వివేశ తత్ర

య న్న ప్రావిశత్ కియత్ తద్ బభూవ ॥ 8 ॥

పదము।

యత్। పరమమ్। అవమమ్। యత్। చ। మధ్యమమ్।

ప్రజా౽పతిః। ససృజే। విశ్వ౽రూపమ్।

కియతా। స్కమ్భః। ప్ర। వివేశ। తత్ర।

యత్। న। ప్ర౽అవిశత్। కియత్। తత్। బభూవ ॥ 8 ॥

అథర్వ. iv 41

అనువాదం:

ఏది సర్వశ్రేష్ఠ మైనది? ... ... ష్ట మైనది?
ఏది మధ్యమ మైనది? ఈ ఐశ్వర్యాపాన్ని
ప్రజాపతి ఉత్పత్తి చేసినాడు.
వానిలో ఈ స్కంభుడు దేనిలో ప్రవేశించినాడు?
దేనిలో ప్రవేశించ లేదు? ఎన్నవ వా ... ... యన? ॥ 8 ॥

మంత్రము:

కియతా స్కమ్భః ప్ర వివేశ భూతం
కియద్ భవిష్య దన్వాశయేఽస్య ।
ఏకం యదఙ్గ మకృణోత్ సహస్రధా
కియతా స్కమ్భః ప్ర వివేశ తత్ర ॥ 9 ॥

పదము:

కియతా । స్కమ్భః । ప్ర । వివేశ । భూతమ్ ।
కియత్ । భవిష్యత్ । అనుఽఆశయే । అస్య ।
ఏకమ్ । యత్ । అఙ్గమ్ । అకృణోత్ । సహస్రఽధా ।
కియతా । స్కమ్భః । ప్ర । వివేశ । తత్ర ॥ 9 ॥

అనువాదం:

ఈ స్కంభుడు భూతకాలిక విశ్వంలో
ఏ అంశంతో ప్రవేశించినాడు?
ఎన్నవ అంశం భవిష్యత్తులో

ఉత్పన్నమయ్యే విశ్వంలో ప్రవేశిస్తుంది?
ఒక అంగం వేయి విధాల
వర్తమాన కాలంలో ప్రకటిత మైనది.
వానిలో దేనిలో స్కంభుడు ప్రవేశించినాడు? ॥ 9 ॥

మంత్రము:

యత్ర లోకాంశ్చ కోశాం
శ్చాపో బ్రహ్మ జనా విదుః ।
అసచ్చ యత్ర సచ్చాన్తః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 10 ॥

పదము:

యత్ర । లోకాన్ । చ । కోశాన్ । చ ।
ఆపః । బ్రహ్మ । జనాః । విదుః ।
అసత్ । చ । యత్ర । సత్ । చ । అన్తః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 10 ॥

అనువాదం:

ఎందులో సర్వలోకములు, కోశములు ఉన్నవి?
ఎక్కడ జలము, బ్రహ్మ ఉన్నవి?

వానిని లోకు లెలా తెల సుకుంటున్నారు?
సత్తు, అసత్తు ఎక్కడ మిళితము లౌతున్నవి?
ఆ స్కంభుని గురించి నాకు విశదీకరించు.
ఎన్నవ వా డాయన? ॥ 10

మంత్రము :

యత్ర తపః పరాక్రమ్య
వ్రతం ధారయ త్యుత్తరమ్ ।
ఋతం చ యత్ర శ్రద్ధా
చాపో బ్రహ్మ సమాహితాః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 11

పదము :

యత్ర । తపః । పరాఽక్రమ్య ।
వ్రతమ్ । ధారయతి । ఉత్ఽతరమ్ ।
ఋతమ్ । చ । యత్ర । శ్రద్ధా । చ ।
ఆపః । బ్రహ్మ । సమ్ఽఆహితాః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 11

అనువాదం:

ఏ ఆధారంతో పరాక్రమించి తపస్సు
ఉచ్చతర వ్రతమును పాలిస్తున్నది?
ఎక్కడ వ్రతము, శ్రద్ధ, జలములు, బ్రహ్మ
సమాహితములై ఉన్నవి?
ఆ సర్వాధార స్కంభుని గూర్చి నాకు వివరించు.
ఎన్నవ వా డాయన? ॥ 11 ॥

మంత్రము:

యస్మిన్ భూమి రన్తరిక్షం
ద్యౌ ర్యస్మి న్నధ్యాహితా ।
యత్రాగ్ని శ్చన్ద్రమాః సూర్యో
వాత స్తిష్ఠ న్త్యార్పితాః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 12 ॥

పదము:

యస్మిన్ । భూమిః । అన్తరిక్షమ్ ।
ద్యౌః । యస్మిన్ । అధి । ఆऽహితా ।
యత్ర । అగ్నిః । చన్ద్రమాః । సూర్యః ।
వాతః । తిష్ఠన్తి । అర్పితాః ।

స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।

కతమః । స్విత్ । ఏవ । సః ॥

అనువాదం ।

ఎందులో భూమి, అంతరిక్షం, ద్యులోకం
అధ్యాహితములై ఉన్నవి?
ఎక్కడ అగ్ని, చంద్రుడు, సూర్యుడు, వాయువు
ఆశ్రయించి ఉన్నారు?
ఆ స్కంభుని గురించి నాకు తెలియచెప్పు.
ఎవ్వవ వా డాయన? ॥

మంత్రము ।

యస్య త్రయస్త్రింశద్ దేవా
అఙ్గే సర్వే సమాహితాః ।
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥

పదము ।

యస్య । త్రయఃఽత్రింశత్ । దేవాః ।
అఙ్గే । సర్వే । సమ్ఽఆహితాః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥

అనువాదం।

ఎవని అంగంలో ముప్పై ముగ్గురు దేవతలు
సమాహితులై ఉన్నారో,
ఆ స్కంభుని గురించి నాకు తెలియచెప్పు.
ఎన్నవ వాం డాయన? ॥ 13 ॥

మంత్రము।

యత్ర ఋషయః ప్రథమజా
ఋచః సామ యజుర్మహీ ।
ఏకర్షి ర్యస్మి న్నార్పితః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 14 ॥

పదము।

యత్ర । ఋషయః । ప్రథమఽజాః ।
ఋచః । సామ । యజుః । మహీ ।
ఏకఽఋషిః । యస్మిన్ । అర్పితః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 14 ॥

అనువాదం।

ఎక్కడ ప్రథమజు లైన ఋషులు,
ఋక్సామ యజుర్వేదములు, అథర్వవేదము ఉన్నవి?
ఎవరిపై ఒక ముఖ్య-ఋషి ఆధారపడి ఉన్నాడు?
ఆ స్కంభుని గూర్చి నాకు తెలియ జెప్పు.
ఎన్నవ వా డాయన? ॥ 14

మంత్రము।

యత్రామృతం చ మృత్యుశ్చ
పురుషేఽధి సమాహితే।
సముద్రో యస్య నాడ్యః
పురుషేఽధి సమాహితాః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 15

పదము।

యత్ర। అమృతమ్। చ। మృత్యుః। చ।
పురుషే। అధి। సమాహితే ఇతి సమ్ఽఆహితే।
సముద్రః। యస్య। నాడ్యఽః।
పురుషే। అధి। సమ్ఽఆహితాః।
స్కమ్భమ్। తమ్। బ్రూహి।
కతమః। స్విత్। ఏవ। సః ॥ 15

అనువాదం।

ఏ పురుషునిలో అమృతత్వము, మృత్యువు
సమాహితములైనవి?
దేని నాడులు సముద్రములు?
ఏ పురుషుని శరీరంలో అవి ఉన్నవి?
ఆ స్కంభుని గూర్చి నాకు వివరించు.
ఎన్నవ వాడాయన? ॥ 15 ॥

మంత్రము।

యస్య చతస్రః ప్రదిశో
నాడ్య1 స్తిష్ఠన్తి ప్రథమాః।
యజ్ఞో యత్ర పరాక్రాన్తః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 16 ॥

పదము।

యస్య। చతస్రః। ప్రఽదిశః।
నాడ్యఃః। తిష్ఠన్తి। ప్రథమాః।
యజ్ఞః। యత్ర। పరాఽక్రాన్తః।
స్కమ్భమ్। తమ్। బ్రూహి।
కతమః। స్విత్। ఏవ। సః ॥ 16 ॥

అనువాదం :

నాలుగు ప్రధాన దిక్కులు ఎవని నాడీ రూపంలో ఉన్నవి?
ఎక్కడ యజ్ఞం పరాక్రమిస్తున్నది?
ఆ స్కంభుని గూర్చి నాకు వివరించు.
ఎన్నవ వా డాయన? ॥ 16

మంత్రము :

యే పురుషే బ్రహ్మ విదు
స్తే విదుః పరమేష్ఠినమ్ ।
యో వేద పరమేష్ఠినం
యశ్చ వేద ప్రజాపతిమ్ ।
జ్యేష్ఠం యే బ్రాహ్మణం విదు
స్తే స్కమ్భ మనుసంవిదుః ॥ 17 ॥

పదము :

యే । పురుషే । బ్రహ్మ । విదుః ।
తే । విదుః । పరమేఽస్థినమ్ ।
యః । వేద । పరమేఽస్థినమ్ ।
యః । చ । వేద । ప్రజాఽపతిమ్ ।
జ్యేష్ఠమ్ । యే । బ్రాహ్మణమ్ । విదుః ।
తే । స్కమ్భమ్ । అనుఽసంవిదుః ॥ 17 ॥

అనువాదం।

ఏ పురుషులు బ్రహ్మను తెలుసుకొన్న వారో
వారికి పరమేష్ఠిని గూర్చి కూడా తెలుసు.
ఎవనికి పరమేష్ఠిని గూర్చి తెలుసునో,
ఎవనికి ప్రజాపతిని గూర్చి తెలుసునో,
ఎవనికి జ్యేష్ఠ బ్రాహ్మణుని గూర్చి తెలుసునో
వారికి ఆ స్కంభుని గూర్చి బాగా తెలుసును. ॥ 17 ॥

మంత్రము।

యస్య శిరో వైశ్వానర-
శ్చక్షు రఙ్గిరసో౽భవన్ ।
అఙ్గాని యస్య యాతవః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 18 ॥

పదము.

యస్య । శిరః । వైశ్వానరః ।
చక్షుః । అఙ్గిరసః । అభవన్ ।
అఙ్గాని । యస్య । యాతవః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 18 ॥

అనువాదం:

ఎవరి శిరము వైశ్వానరాగ్నియో,
ఎవని కన్నులు అంగిరసములో,
ఎవని అంగములు రాక్షసులో ఆ స్కంభుని గూర్చి చెప్పు.
ఎన్నవ వా డాయన? ॥ 18 ॥

మంత్రము:

యస్య బ్రహ్మ ముఖ మాహు
ర్జిహ్వాం మధుకశా ముత ।
విరాజ మూధో యస్యాహుః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 19 ॥

పదము:

యస్య । బ్రహ్మ । ముఖమ్ । అహుః ।
జిహ్వామ్ । మధుఽకశామ్ । ఉత ।
విఽరాజమ్ । ఊధః । యస్య । అహుః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 19 ॥

అనువాదం।

ఎవరి ముఖాన్ని బ్రహ్మగా చెప్తారో,
ఎవరి జిహ్వను మధుకశ అంటారో,
దేని దుగ్ధాశయం ( పొదుగు ) విరాట్స్వరూపమో,
ఆ స్కంభుని గూర్చి చెప్పు.
ఎన్నవ వా డాయన? ॥ 19 ॥

మంత్రము।

యస్మా దృచో అపాతక్షన్
యజు ర్యస్మా దపాకషన్ ।
సామాని యస్య లోమా
న్యథర్వాఙ్గిరసో ముఖం
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 20 ॥

పదము।

యస్మాత్ । ఋచః । అప౽అతక్షన్ ।
యజుః । యస్మాత్ । అప౽అకషన్ ।
సామాని । యస్య । లోమాని ।
అథర్వ౽అఙ్గిరసః । ముఖమ్ ।

స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 20 ॥

అనువాదం:

యేని నుంచి ఋక్కులు ఏర్పడినవో,
యేని నుంచి యజుస్సు ఏర్పడినదో,
యేని లోమములు సామములో,
యేని ముఖం అథర్వ, అంగిరసులో,
ఆ స్కంభుని గూర్చి చెప్పు. ఎన్నవ వా డాయన ? ॥ 20 ॥

మంత్రము:

అసచ్ఛాఖాం ప్రతిష్ఠన్తీం
పరమ మివ జనా విదుః ।
ఉతో స న్మన్య న్తేఽవరే
యే తే శాఖా ముపాసతే ॥ 21 ॥

పదము:

అసత్ఽశాఖామ్ । ప్రఽతిష్ఠన్తీమ్ ।
పరమమ్ఽఇవ । జనాః । విదుః ।
ఉతో ఇతి । సత్ । మన్యన్తే । అవరే ।
యే । తే । శాఖామ్ । ఉపఽఆసతే ॥ 21 ॥

అనువాదం।

అసత్తు నుంచి ఉత్పన్నమైన ఒక స్థిర శాఖ ఉన్నది.
దానిని మనుష్యులు పరమ శ్రేష్ఠ తత్త్వంగా భావిస్తారు.
ఇతరులు దానిని సత్తుగా భావిస్తారు.
ఆ శాఖను వారు ఉపాసిస్తారు. ॥ 21 ॥

మంత్రము।

యత్రాదిత్యాశ్చ రుద్రాశ్చ
వసవశ్చ సమాహితాః ।
భూతం చ యత్ర భవ్యం చ
సర్వే లోకాః ప్రతిష్ఠితాః
స్కమ్భం తం బ్రూహి
కతమః స్విదేవ సః ॥ 22 ॥

పదము।

యత్ర । ఆదిత్యాః । చ । రుద్రాః । చ ।
వసవః । చ । సమ్ఽఆహితాః ।
భూతమ్ । చ । యత్ర । భవ్యమ్ । చ ।
సర్వే । లోకాః । ప్రతిఽస్థితాః ।
స్కమ్భమ్ । తమ్ । బ్రూహి ।
కతమః । స్విత్ । ఏవ । సః ॥ 22 ॥

అనువాదం :

ఎక్కడ ఆదిత్యుడు, రుద్రుడు, వసువులు
సమాహితులై ఉన్నారో,
ఎక్కడ భూత భవిష్య ద్వర్తమానములు ఉన్నవో,
ఎక్కడ సర్వలోకములు ప్రతిష్ఠితములై ఉన్నవో,
ఆ సర్వాధారభూత స్కంభుని గూర్చి చెప్పు.
ఎన్నవ వా డాయన? ॥ 22

మంత్రము :

యస్య త్రయస్త్రింశద్ దేవా
నిధిం రక్షన్తి సర్వదా ।
నిధిం త మద్య కో వేద
యం దేవా అభిరక్షథ ॥ 23

పదము :

యస్య । త్రయః౽త్రింశత్ । దేవాః ।
ని౽ధిమ్ । రక్షన్తి । సర్వదా ।
ని౽ధిమ్ । తమ్ । అద్య । కః । వేద ।
యమ్ । దేవాః । అభి౽రక్షథ ॥ 23

అనువాదం :

ముప్పై ముగ్గురు దేవతలు ఎవరి నిధిని
సర్వదా రక్షిస్తుంటారో,
ఓ దేవా! నీవు దేనిని రక్షిస్తుంటావో,
ఆ నిధిని ఇప్పుడు ఎవ రెరుగుదురు? ॥ 23

మంత్రము

యత్ర దివా బ్రహ్మవిదో

బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే ।

యో వై తాన్ విద్యాత్ ప్రత్యక్షం

స బ్రహ్మ వేదితా స్యాత్ ॥ 24 ॥

పదము।

యత్ర । దివాః । బ్రహ్మఽవిదః ।

బ్రహ్మ । జ్యేష్ఠమ్ । ఉపఽఆసతే ।

యః । వై । తాన్ । విద్యాత్ । ప్రతిఽఅక్షమ్ ।

సః । బ్రహ్మ । వేదితా । స్యాత్ ॥ 24 ॥

అనువాదం।

ఎక్కడ బ్రహ్మవేత్తలు జ్యేష్ఠ బ్రహ్మను
ఉపాసిస్తుంటారో, వారు నిశ్చయముగా
వానిని ప్రత్యక్షంగా తెలుసుకోగలరు.
అల్లా తెలుసుకున్నవాడు బ్రహ్మ అవుతాడు. ॥ 24 ॥

మంత్రము।

బృహన్తో నామ తే దేవా

యేఽసతః పరి జజ్ఞిరే ।

అథర్వ. iv 42

ఏకం తదఙ్గం స్కమ్భస్యా-
సదాహుః పరో జనాః ॥ 2

పదము :

బృహన్తః । నామ । తే । దేవాః ।
యే । అసతః । పరి । జజ్ఞిరే ।
ఏకమ్ । తత్ । అఙ్గమ్ । స్కమ్భస్య ।
అసత్ । అహుః । పరః । జనాః ॥ 2

అనువాదం :

ఆ దేవతలు ప్రసిద్ధులు,
ఎవరు అసత్తు నుంచి ఉత్పన్నమైనారో,
వారు స్కంభుని ఒక అంగమై ఉన్నారు.
జ్ఞానులు వానిని అసత్తుగా శ్రేష్ఠమైన వానిగా పేర్కొంటా
॥ 2

మంత్రము :

యత్ర స్కమ్భః ప్రజనయన్
పురాణం వ్యవర్తయత్ ।
ఏకం తదఙ్గం స్కమ్భస్య
పురాణ మనుసంవిదుః ॥ 26

పదము:

యత్ర । స్కమ్భః । ప్రఽజనయన్ ।

పురాణమ్ । విఽఅవర్తయత్ ।

ఏకమ్ । తత్ । అఙ్గమ్ । స్కమ్భస్య ।

పురాణమ్ । అనుఽసంవిదుః ॥ 26 ॥

అనువాదం:

ఎక్కడ స్కంభోత్పత్తి జరిగినదో,
పురాణములు ఎక్కడి నుంచి వివర్తితము లైనవో,
అలాంటి స్కంభునకు చెందిన ఏకాంగమును
పురాణ మైన దానినిగా ఎరుగుదురు. ॥ 26 ॥

మంత్రము:

యస్య త్రయస్త్రింశద్ దేవా
అఙ్గే గాత్రా విభేజిరే ।
తాన్ వై త్రయస్త్రింశ ద్దేవా-
నేకే బ్రహ్మవిదో విదుః ॥ 27 ॥

పదము:

యస్య । త్రయఃఽత్రింశత్ । దేవాః ।

అఙ్గే । గాత్రా । విఽభేజిరే ।

కాన్ । వై । త్రయః౽త్రింశత్ । దేవాన్ ।
ఏకే । బ్రహ్మ౽విదః । విదుః ॥

అనువాదం,

ఎవని శరీరంలో, అవయవాలలో
ముప్పై ముగ్గురు దేవతలు విభక్తులై ఉన్నారో,
ఆ ముప్పై ముగ్గురు దేవతలను,
ఏక బ్రహ్మవిదులు ఎరుగుదురు. ॥

మంత్రము।

హిరణ్యగర్భం పరమ
మనత్యుద్యం జనా విదుః ।
స్కమ్భ స్తదగ్రే ప్రాసిఞ్చ
ద్ధిరణ్యం లోకే అన్తరా ॥

పదము।

హిరణ్య౽గర్భమ్ । పరమమ్ ।
అనతి౽ఉద్యమ్ । జనాః । విదుః ।
స్కమ్భః । తత్ । అగ్రే । ప్ర । అసిఞ్చత్ ।
హిరణ్యమ్ । లోకే । అన్తరా ॥

అనువాదం।

జనులు హిరణ్యగర్భుని పరమశ్రేష్ఠునిగా ఎరుగుదురు.
లోకాంతరంలో మొదట సర్వాధార మైన శక్తి ఉన్నది.
అది హిరణ్యగర్భంగా నిర్మిత మైనది. ॥

మంత్రము :

స్కమ్భే లోకాః స్కమ్భే తపః

స్కమ్భేఽధ్యృత మాహితమ్ ।

స్కమ్భ త్వా వేద ప్రత్యక్ష-

మిన్ద్రే సర్వం సమాహితమ్ ॥ 29 ॥

పదము.

స్కమ్భే । లోకాః । స్కమ్భే । తపః ।

స్కమ్భే । అధి । ఋతమ్ । ఆఽహితమ్ ।

స్కమ్భ । త్వా । వేద । ప్రతిఽఅక్షమ్ ।

ఇన్ద్రే । సర్వమ్ । సమ్ఽఆహితమ్ ॥ 29 ॥

అనువాదం :

స్కంభం సర్వలోకములకు ఆధారభూత మైనది.
దాని మీద ఆధారపడే లోకము లన్నీ ఉన్నవి.
అందులోనే తపస్సు ఉన్నది.
దాని మీదనే ఋతం ఆధారపడి ఉన్నది.
ఓస్కంభా ! నేను నిన్ను ప్రత్యక్షంగా ఎరుగుదును.
నీలోనే సర్వమూ సమాహితమై ఉన్నది. ॥ 29 ॥

మంత్రము :

ఇన్ద్రే లోకా ఇన్ద్రే తప

ఇన్ద్రేఽధ్యృత మాహితమ్ ।

ఇన్ద్రం త్వా వేద ప్రత్యక్షం

స్కమ్భే సర్వం ప్రతిష్ఠితమ్ ॥

పదము।

ఇన్ద్రే। లోకాః। ఇన్ద్రే। తపః।

ఇన్ద్రే। అధి। ఋతమ్। ఆఽహితమ్।

ఇన్ద్రమ్। త్వా। వేద। ప్రతిఽఅక్షమ్।

స్కమ్భే। సర్వమ్। ప్రతిఽస్థితమ్ ॥ 3

అనువాదం।

ఇంద్రునిలో తపస్సు, ఋతము నిహితములై ఉన్నవి.
ఓ ఇంద్రా! నిన్ను నేను ప్రత్యక్షంగా ఎరుగుదును.
స్కంభుని యందే సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది. ॥ 3

మంత్రము।

నామ నామ్నా జోహవీతి

పురా సూర్యాత్ పురోషసః।

యదజః ప్రథమం సంబభూవ

స హ తత్ స్వరాజ్య మియాయ

యస్మా న్నాన్యత్ పర మస్తి భూతమ్ ॥ 31

పదము :

నామ । నామ్నా । జోహవీతి ।

పురా । సూర్యాత్ । పురా । ఉషసః ।

యత్ । అజః । ప్రథమమ్ । సమ్ఽబభూవ ।

సః । హ । తత్ । స్వఽరాజ్యమ్ । ఇయాయ ।

యస్మాత్ । న । అన్యత్ । పరమ్ । అస్తి । భూతమ్ ॥ 31 ॥

అనువాదం :

సూర్యుని కంటె ముందు, ఉషస్సు కంటె ముందు
ఈశ్వర యశోగానం జరుగుతున్నది.
ఎప్పుడు యజ్ఞం ప్రథమంలో సముద్భూత మైనదో,
అప్పుడే అది స్వారాజ్యమును పొందినది.
దాని కంటె అన్య మైన గొప్పది మరొకటి లేదు. ॥ 31 ॥

మంత్రము :

యస్య భూమిః ప్రమాఽ

న్తరిక్ష ముతోదరమ్ ।

దివం యశ్చక్రే మూర్ధానం

తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥ 32 ॥

పదము :

యస్య । భూమిః । ప్రఽమా ।

అన్తరిక్షమ్ । ఉత । ఉదరమ్ ।

దివమ్ । యః । చక్రే । మూర్ధానమ్ ।

తస్మై । జ్యేష్ఠాయ । బ్రహ్మణే । నమః ॥ 32 ॥

అనువాదం ।

దాని భూమి ప్రమ (సత్యజ్ఞానము), దాని ఉదరం అంతరిక్షం.
ద్యులోకం దాని శీర్షం.
అలాంటి జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం. ॥ 32 ॥

మంత్రము ।

యస్య సూర్య శ్చక్షు

శ్చన్ద్రమాశ్చ పునర్ణవః ।

అగ్నిం య శ్చక్ర ఆస్యం।

తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥ 33 ॥

పదము ।

యస్య । సూర్యః । చక్షుః ।

చన్ద్రమాః । చ । పునఃఽనవః ।

అగ్నిమ్ । యః । చక్రే । ఆస్యఽమ్ ।

తస్మై । జ్యేష్ఠాయ । బ్రహ్మణే । నమః ॥ 33 ॥

అనువాదం ।

ఎవరికి సూర్యుడు నేత్రమో, పునః పునః చంద్రుడు
నవనవో న్మేషితుడై ఉ టాడో, ఎవరు అగ్నిని వదనముగా
చేసుకున్నాడో ఆ జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం. ॥ 33 ॥

మంత్రము :

యస్య వాతః ప్రాణాపానౌ

చక్షు రఙ్గిరసోఽభవన్ ।

దిశో యశ్చక్రే ప్రజ్ఞానీ-

స్తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥ 34 ॥

పదము :

యస్య । వాతః । ప్రాణాపానౌ ।

చక్షుః । అఙ్గిరసః । అభవన్ ।

దిశః । యః । చక్రే । ప్రఽజ్ఞానీః ।

తస్మై । జ్యేష్ఠాయ । బ్రహ్మణే । నమః ॥ 34 ॥

అనువాదం :

వేనికి ప్రాణాపానములు వాయువులో,
నేత్రము అంగిరసులో,
దిక్కులు ప్రజ్ఞాసాధనములో,
ఆ జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం. ॥ 34 ॥

మంత్రము :

స్కమ్భో దాధార ద్యావాపృథివీ ఉభే

ఇమే స్కమ్భో దాధా రోర్వ1న్తరిక్షమ్ ।

స్కమ్భో దాధార ప్రదిశః షడుర్వీః

స్కమ్భ ఇదం విశ్వం భువనమా వివేశ ॥ 35 ॥

పదము :

స్కమ్భః । దాధార । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి ।

ఇమే ఇతి । స్కమ్భః । దాధార । ఉరు । అన్తరిక్షమ్ ।

స్కమ్భః । దాధార । ప్రఽదిశః । షట్ । ఉర్వీః ।

స్కమ్భే । ఇదమ్ । విశ్వమ్ । భువనమ్ । ఆ । వివేశ ॥ 35 ॥

అనువాదం :

స్కంభం ద్యావాపృథ్వ్యులను భరిస్తున్నది.
స్కంభం విస్తృత మైన అంతరిక్షాన్ని మోస్తున్నది.
ఈ స్కంభమే ఆరు ప్రధాన దిక్కులను ధరించినది.
ఇదే సర్వ భువనములలోనూ ప్రవేశించి ఉన్నది. ॥ 35 ॥

మంత్రము :

యః శ్రమాత్ తపసో జాతో

లోకాన్ త్సర్వాన్ త్సమానశే ।

సోమం యశ్చక్రే కేవలం

తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥ 36 ॥

పదము.

యః । శ్రమాత్ । తపసః । జాతః ।

లోకాన్ । సర్వాన్ । సమ్‌ఽఆనశే ।

సోమమ్ । యః । చక్రే । కేవలమ్ ।

తస్మై । జ్యేష్ఠాయ । బ్రహ్మణే । నమః ॥ 36 ॥

అనువాదం।

తపశ్శ్రమ చేత ఆవిష్కృతమై
సర్వలోకములను వ్యాపించి, కేవలం
సోముని పవిత్ర ఉత్తమ ఔషధ రూపంగా
చేసిన ఆ జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం. ॥ 36 ॥

మంత్రము.

కథం వాతో నేలయతి

కథం న రమతే మనః ।

కి మాపః సత్యం ప్రేప్సన్తీ

ర్నేలయన్తి కదా చన ॥ 37 ॥

పదము।

కథమ్ । వాతః । న । ఇలయతి ।

కథమ్ । న । రమతే । మనః ।

కిమ్ । ఆపః । సత్యమ్ । ప్రఽఈప్సన్తీః ।

న । ఇలయన్తి । కదా । చన ॥ 37 ॥

అనువాదం ।

వాయువు స్థిరంగా ఉండ దెందువల్ల ?
మనస్సు ఎందుకు సంతుష్టమై ఉండదు ?
సత్య ప్రాప్తిని ఇచ్ఛగించే ఉదకములు
స్థిరంగా ఉండ వెందుకు ? ॥ 37 ॥

మంత్రము ।

మహద్ యక్షం భువనస్య మధ్యే
తపసి క్రాన్తం సలిలస్య పృష్ఠే ।
తస్మిన్ ఛ్రయన్తే య ఉ కే చ దేవా
వృక్షస్య స్కన్ధః పరిత ఇవ శాఖాః ॥ 38 ॥

పదము ।

మహత్ । యక్షమ్ । భువనస్య । మధ్యే ।
తపసి । క్రాన్తమ్ । సలిలస్య । పృష్ఠే ।
తస్మిన్ । శ్రయన్తే । యే । ఉం ఇతి । కే । చ । దేవాః ।
వృక్షస్య । స్కన్ధః । పరితఃఽఇవ । శాఖాః ॥ 38 ॥

అనువాదం।

భువన మధ్యంలో ఒక గొప్ప యక్షుడున్నాడు.
అతడు తాపాన్ని తిప్పించి గ్రాంతిడానుడు
జలం పృష్ఠభాగంలో ఉన్నాడు.
ఆయన నాశ్రయించి కొందరు దేవత లున్నారు.
ఒక వృక్ష స్కంధాన్ని ఆశ్రయించి
చుట్టూ శాఖ లున్నట్టుగా వారున్నారు. ॥ 38 ॥

మంత్రము।

యస్మై హస్తాభ్యాం పాదాభ్యాం
వాచా శ్రోత్రేణ చక్షుషా।
యస్మై దేవాః సదా బలిం
ప్రయచ్ఛన్తి విమితేఽమితం స్కమ్భం
తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ 39 ॥

పదము।

యస్మై। హస్తాభ్యామ్। పాదాభ్యామ్।
వాచా। శ్రోత్రేణ। చక్షుషా।
యస్మై। దేవాః। సదా। బలిమ్।
ప్రఽయచ్ఛన్తి। విఽమితే। అమితమ్। స్కమ్భమ్।
తమ్। బ్రూహి। కతమః। స్విత్। ఏవ। సః ॥ 39 ॥

అనువాదం :

చేతులు, కాళ్ళు, వాక్కు, శ్రోత్రము, చక్షువులు
దేవతలు అపరిమిత మైన ఉపహారంతో
ఎందుకు వానికి ప్రోద్బలం చేస్తున్నారు?
దీనికి సర్వాధార మైనది స్కంభమని చెప్పి,
అది ఎవ్వరదో కూడా చెప్పండి. ॥ 39 ॥

మంత్రము :

అప తస్య హతం తమో
వ్యావృత్తః స పాప్మనా ।
సర్వాణి తస్మిన్ జ్యోతీంషి
యాని త్రీణి ప్రజాపతౌ ॥ 40 ॥

పదము :

అప । తస్య । హతమ్ । తమః ।
వి౨అవృత్తః । సః । పాప్మనా ।
సర్వాణి । తస్మిన్ । జ్యోతీంషి ।
యాని । త్రీణి । ప్రజా౨పతౌ ॥ 40 ॥

అనువాదం :

దాని అజ్ఞానం అపకృత మైనది,
పాపంతో వ్యావృత మైనది.
ఏ మూడు జ్యోతు లైతే ఉన్నవో,
అవన్నీ ఆ ప్రజాపతిలోనే ఉన్నవి. ॥ 40 ॥

మంత్రము :

యో వేతసం హిరణ్యయం

తిష్ఠన్తం సలిలే వేద ।

స వై గుహ్యః ప్రజాపతిః ॥ 41 ॥

పదము :

యః । వేతసమ్ । హిరణ్యయమ్ ।

తిష్ఠన్తమ్ । సలిలే । వేద ।

సః । వై । గుహ్యః । ప్రజాఽపతిః ॥ 41 ॥

అనువాదం :

సలిలంలో హిరణ్మయ మైన నాచుగా ఉన్న దానిని
ఎరిగిన వాడే గుహ్యప్రజాపతి అవుతున్నాడు. ॥ 41 ॥

మంత్రము :

తన్త్రమేకే యువతీ విరూపే

అభ్యాక్రామం వయతః షణ్మయూఖమ్ ।

ప్రాన్యా తన్తూం స్తిరతే ధత్తే అన్యా

నాప వృఞ్జాతే న గమాతో అన్తమ్ ॥ 42 ॥

పదము :

తన్త్రమ్ । ఏకే ఇతి । యువతీ ఇతి । విరూపే ఇతి విఽరూపే ।

అభిఽఆక్రామమ్ । వయతః । షట్ఽమయూఖమ్ ।

ప్ర। అన్యా। కన్తూన్। తిరతే। ధత్తే। అన్యా।

న। అప। వృఞ్జాతే ఇతి। న। గమాతః। అన్తమ్ ॥ 42

అనువాదం:

ఇద్దరు విరుద్ధ రూపవతులు, ఆరు మయూఖములు గల
గూడును అల్లుతున్నారు.
అందులో ఒకటి దారాలను తీస్తూ ఉంటుంది.
ఇంకొకటి అల్లుతుంటుంది.
వాటికి విశ్రాంతి లేదు
ఈ అల్లిక ఎన్నటికీ ముగియదు. ॥ 42 ॥

మంత్రము:

తయో రహం పరినృత్యన్త్యోరివ

న వి జానామి యతరా పరస్తాత్

పుమా నేనద్ వయ త్యుద్గృణత్తి

పుమా నేనద్ వి జభా రాధి నాకే ॥ 43 ॥

పదము:

తయోః। అహమ్। పరినృత్యన్త్యోఃఇవ।

న। వి। జానామి। యతరా। పరస్తాత్।

పుమాన్। ఏనత్। వయతి। ఉత్। గృణత్తి।

పుమాన్। ఏనత్। వి। జభార అధి। నాకే ॥ 43 ॥

అనువాదం:

నర్తకీమణుల వలె వారిద్దరిలో ఎవరు
అపరి వారో నాకు తెలియదు
దీనిని ఒక పురుషుడే అల్లుతున్నాడా?
ఇంకొకడు దీనిని నిలుపుతున్నాడా?
స్వర్గంలో దీనిని నిలబెట్టుతున్నాడా? ॥ 43 ॥

మంత్రము.

ఇమే మయూఖా ఉప తస్తభు ర్దివం
సామాని చక్రు స్తసరాణి వాతవే ॥ 44 ॥

పదము

ఇమే। మయూఖాః। ఉప। తస్తభుః। దివమ్।
సామాని। చక్రుః। తసరాణి। వాతవే ॥ 44 ॥

అనువాదం।

ఈ మయూఖములు ద్యులోకాన్ని ఆశ్రయించి ఉన్నవి.
సామమును అల్లుటకై తంతుజాలము ఎలా
సిద్ధ మౌతున్నది? ॥ 44 ॥

ఇది ఏడవ సూక్తం.

అథర్వ. iv 43

# సూక్తం - 8

ఋషిః కుత్సుడు॥ దేవత ః ఆధ్యాత్మమ్॥ ఛందస్సు ః 1 ఉపరిష్టాద్ విరాడ్ బృహతి ః 2 బృహతీగర్భాఽనుష్టుప్ ః 3,4,8,9,13,16-18 24,28,35,36, 40,44 త్రిష్టుప్ ః 5 భురిగనుష్టుప్ ః 6,14,19-21,23,26,29,31-34,37, 38,41,43 అనుష్టుప్, 7 పరాబృహతి ః 10 అనుష్టుబ్గర్భా త్రిష్టుప్ ః 11 జగతి ః 12 పురోబృహతి ః త్రిష్టుబ్గర్భాఽఽర్షీ పంక్తి , 15,27 భురిగ్బృహతి ః 22 పురఉష్ణిక్ ః 25 ద్వ్యుష్ణిగ్గర్భాఽనుష్టుప్ ః 30 భురిక్ త్రిష్టుప్, 39 బృహతీగర్భా త్రిష్టుప్ ః 42 (త్రిపదా) విరాడ్ గాయత్రీ॥ మంత్రములు ॥ 44 ॥

వినియోగం :- ఇది కూడా స్కంభదేవతాక మైన సూక్తమే. దీనిలో కూడా స్కంభుని శ్రేష్ఠత్వము, శ్రేష్ఠత్వము, సర్వాశ్రయ భూతత్వము వర్ణిత మైనవి.

మంత్రము ః

యో భూతం చ భవ్యం చ
సర్వం యశ్చాధితిష్ఠతి ।
స్వ1ర్యస్య చ కేవలం తస్మై
జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥ 1 ॥

పదము ః

యః । భూతమ్ । చ । భవ్యమ్ । చ ।
సర్వమ్ । యః । చ । అధిఽతిష్ఠతి ।
స్వ1రితి స్వః । యస్య । చ । కేవలమ్ । తస్మై ।
జ్యేష్ఠాయ । బ్రహ్మణే । నమః ॥ 1 ॥

అనువాదం :

భూత భవిష్య ద్వర్తమానాలకు
అధిష్ఠాతయై ఎవ డున్నాడు?
ఎవని స్వరూపం కేవలం ప్రకాశమయ స్వరూప మైనది?
అలాంటి జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం. ॥ 1 ॥

మంత్రము :

స్కమ్భే నేమే విష్టభితే
ద్యౌశ్చ భూమిశ్చ తిష్ఠతః ।
స్కమ్భ ఇదం సర్వ మాత్మన్వద్
యత్ ప్రాణ న్నిమిషచ్చ యత్ ॥ 2 ॥

పదము :

స్కమ్భేన । ఇమే ఇతి । విస్తభితే ఇతి వి౨స్తభితే ।
ద్యౌః । చ । భూమిః । చ । తిష్ఠతః ।
స్కమ్భే । ఇదమ్ । సర్వమ్ । ఆత్మన్౨వత్ ।
యత్ । ప్రాణత్ । ని౨మిషత్ । చ । యత్ ॥ 2 ॥

అనువాదం :

ఈ స్కంభము నాశ్రయించే ద్యులోకం పృథ్వీలోకం ఉన్నవి.
ప్రాణధారణ చేయునవి, రెప్ప లల్లార్చునవి
అయిన చైతన్యవంత మైన సర్వమూ స్కంభ నిష్ఠములే!
॥ 2 ॥

మంత్రము:

తిస్రో హ ప్రజా అత్యాయ మాయన్
న్య1న్యా అర్కం మభితో౽విశన్త ।
బృహన్ హ తస్థౌ రజసో విమానో
హరితో హరిణీ రా వివేశ ॥ 3 ॥

పదము:

తిస్రః । హ । ప్ర౽జాః । అతి౽అయమ్ । ఆయన్ ।
ని । అన్యాః । అర్కమ్ । అభితః । అవిశన్త ।
బృహన్ । హ । తస్థౌ । రజసః । వి౽మానః ।
హరితః । హరిణీః । ఆ । వివేశ ॥ 3 ॥

అనువాదం:

మూడు రకాల ప్రజలు అతిక్రమణం చేసి ఉన్నారు.
ఒక రకం సత్యగుణ ప్రజ సూర్యుని పొందినది.
రెండవ రకం రజఃపూరిత మైన ప్రజ రజోలోకంలో ఉన్నది.
మూడవ రకం హరిద్వర్ణంలో ప్రవేశించి ఉన్నది. ॥ 3 ॥

మంత్రము:

ద్వాదశ ప్రధయ శ్చక్ర మేకం
త్రీణి నభ్యాని క ఉ త చ్చికేత ।

త్రాహతా స్త్రీణి శతాని శఙ్కవః

షష్టిశ్చ ఖీలా అవిచాచలా యే ॥ 4 ॥

పదము :

ద్వాదశ । ప్రఽధయః । చక్రమ్ । ఏకమ్ ।

త్రీణి । నభ్యాని । కః । ఓం ఇతి । తత్ । చికేత ।

తత్ర । ఆఽహతాః । త్రీణి । శతాని । శఙ్కవః ।

షష్టిః । చ । ఖీలాః । అవిఽచాచలాః । యే ॥ 4 ॥

అనువాదం.

పంద్రెండు ఆకులు, ఒక చక్రము,
మూడు నాభులు - వీని అంతర్యం తెలిసిన వా రెవరు?
ఆ చక్రంలో మూడు వందల ఆరు చీలలు కొట్టి ఉన్నవి.
అవి కదల్చగలవి కాదు. ॥ 4 ॥

మంత్రము :

ఇదం సవిత ర్వి జానీహి

షడ్ యమా ఏక ఏకజః ।

తస్మిన్ హాపిత్వ మిచ్ఛన్తే

య ఏషా మేక ఏకజః ॥ 5 ॥

పదము :

ఇదమ్ । సవితః । వి । జానీహి ।

షట్ । యమాః । ఏకః । ఏకఽజః ।

తస్మిన్ । హ । అపిఽత్వమ్ । ఇచ్ఛన్తే ।

యః । ఏషామ్ । ఏకః । ఏకఽజః ॥ 5

అనువాదం :

ఓ సవితా! దీనిని నీవు తెలుసుకో.
ఆరు జతలలో ఒకటి ఒంటరిగా ఉన్నది
అలా ఒంటరిగా ఉన్న దానిలో నిశ్చయంగా
జతపరచుటకు ఇచ్ఛగిస్తున్నారు. ॥ 5

మంత్రము :

ఆవిః స న్నిహితం గుహా
జర న్నామ మహత్ పదమ్ ।
తత్రేదం సర్వ మార్పిత
మేజత్ ప్రాణత్ ప్రతిష్ఠితమ్ ॥ 6

పదము :

ఆవిః । సత్ । నిఽహితమ్ । గుహా ।

జరత్ । నామ । మహత్ । పదమ్ ।

తత్ర । ఇదమ్ । సర్వమ్ । ఆర్పితమ్ ।

ఏజత్ । ప్రాణత్ । ప్రతిఽస్థితమ్ ॥ 6 ॥

అనువాదం :

గుహలో ప్రసిద్ధ స్థాన మొకటి కలదు.
అది ప్రకటించుటకు సన్నిహితమై ఉన్నది.
ఏది చైతన్యవంతము ప్రాణవంతము
అయి ఉన్నదో, దానిలో సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది. ॥6॥

మంత్రము :

ఏకచక్రం వర్తత ఏకనేమి
సహస్రాక్షరం ప్ర పురో ని పశ్చా ।
అర్ధేన విశ్వం భువనం జజాన
యదస్యార్ధం క్వ1 తద్ బభూవ ॥ 7 ॥

పదము :

ఏకఽచక్రమ్ । వర్తతే । ఏకఽనేమి ।
సహస్రఽఅక్షరమ్ । ప్ర । పురః । ని । పశ్చా ।
అర్ధేన । విశ్వమ్ । భువనమ్ । జజాన ।
యత్ । అస్య । అర్ధమ్ । క్వఽ । తత్ । బభూవ ॥ 7 ॥

అనువాదం :

ఒక చక్రం, ఒక నేమి ( చక్రానికి చుట్టూ వేసే కమ్మి ) ఉన్నవి.
వేయి అంచులవి ముందు, వెనుక ఉన్నవి.
దాని అర్ధభాగంతో సర్వభువనము జనించినది.
ఆ అర్ధభాగం ఇక్కడ ఉన్నది. ॥ 7 ॥

మంత్రము :

పఞ్చవాహీ వహ త్యగ్ర మేషాం

ప్రష్టయో యుక్తా అనుసంవహన్తి ।

అయాత మస్య దదృశే న యాతం

వరం నేదీయో౽వరం దవీయః ॥ 8 ॥

పదము :

పఞ్చ౽వాహీ । వహతి । అగ్రమ్ । ఏషామ్ ।

ప్రష్టయః । యుక్తాః । అను౽సంవహన్తి ।

అయాతమ్ । అస్య । దదృశే । న । యాతమ్ ।

పరమ్ । నేదీయః । అవరమ్ । దవీయః ॥ 8 ॥

అనువాదం :

వీనిలో పంచవాహి ముందున్నది.
మిగత గుఱ్ఱములు దానిని చక్కగా ఎత్తుకొని పోతున్నవి.
ఇది చలించక పోవడము చూస్తున్నాము.
అవి చలించడము లేదు,
ఒకటి బహు దూరములో నున్నది.
ఒకటి బహు సమీపములో నున్నది. ॥ 8 ॥

మంత్రము :

తిర్యగ్బిల శ్చమస ఊర్ధ్వబుధ్న –

స్తస్మిన్ యశో నిహితం విశ్వరూపమ్ ।

తదాసత ఋషయః సప్త సాకం
యే అస్య గోపా మహతో బభూవుః ॥ 9 ॥

పదము:

తిర్యక్ఽబిలః । చమసః । ఊర్ధ్వఽబుధ్నః ।
తస్మిన్ । యశః । నిఽహితమ్ । విశ్వఽరూపమ్ ।
తత్ । ఆసతే । ఋషయః । సప్త । సాకమ్ ।
యే । అస్య । గోపాః । మహతః । బభూవుః ॥ 9 ॥

అనువాదం :

తిర్యఙ్ముఖ మైన బిలం ఊర్ధ్వంగాను, పృష్ఠభాగంలోను ఉన్నది.
అందులో విశ్వరూప మైన యశస్సు నిహితమై ఉన్నది.
దానితో పాటూ సప్తర్షులు ఉపస్థితులై ఉన్నారు.
వారే ఈ గొప్పతనానికి సంరక్షకులై ఉన్నారు. ॥ 9 ॥

మంత్రము:

యా పురస్తాద్ యుజ్యతే యా చ పశ్చాద్
యా విశ్వతో యుజ్యతే యా చ సర్వతః ।
యయా యజ్ఞః ప్రాఙ్ తాయతే తాం
త్వా పృచ్ఛామి కతమా సర్చామ్ ॥ 10 ॥

పదము :

యా । పురస్తాత్ । యుజ్యతే । యా । చ । పశ్చాత్ ।

యా । విశ్వతః । యుజ్యతే । యా । చ । సర్వతః ।

యయా । యజ్ఞః । ప్రాఙ్ । తాయతే । తామ్ ।

త్వా । పృచ్ఛామి । కతమా । సా । ఋచామ్ ॥ 10 ॥

అనువాదం।

ఏది ముందు సంయోజితమై ఉన్నదో,
ఏది వెనుక సంయుక్తమై ఉన్నదో,
ఏది నలుదిక్కులా సంయోజితమై ఉన్నదో,
ఏది సర్వతః సంయోజితమై ఉన్నదో,
దేనిలో యజ్ఞం పూర్వం ఉత్పన్నమైనదో,
ఆ విషయమై నేను నిన్ను ప్రశ్నిస్తున్నాను.
ఋక్కులలో అది ఎన్నవది? ॥ 10 ॥

మంత్రము।

య దేజతి పతతి యచ్చ తిష్ఠతి

ప్రాణ దప్రాణ న్నిమిష చ్చ యద్ భువత్ ।

తద్ దాధార పృథివీం విశ్వరూపం

తత్ సంభూయ భవ త్యేక మేవ ॥ 11 ॥

పదము :

యత్ । ఏజతి । పతతి । యత్ । చ । తిష్ఠతి ।

ప్రాణత్ । అప్రాణత్ । నిఽమిషత్ । చ । యత్ । భువత్ ।

తత్ । దాధార । పృథివీమ్ । విశ్వ౽రూపమ్ ।

తత్ । సమ్౽భూయ । భవతి । ఏకమ్ । ఏవ ॥ 11 ॥

అనువాదం :

ఏది చలిస్తున్నదో, ఏది పడుతున్నదో,
ఏది నిలబడి ఉన్నదో, ఏది ప్రాణసహితమై ఉన్నదో,
ఏది ప్రాణరహితమై ఉన్నదో, ఏది కనురెప్ప లల్లార్చుతున్నదో,
ఏది లేదో, ఏ విశ్వరూపి అయిన సత్యం
పృథివిని ధారణ చేస్తున్నదో - ఇవన్నీ కలిసి
ఒకటే అవుతున్నది. ॥ 11 ॥

మంత్రము

అనన్తం వితతం పురుత్రా౽-

నన్త మన్తవ చ్చా సమన్తే ।

తే నాకపాల శ్చరతి విచిన్వన్

విద్వాన్ భూత ముత భవ్యమస్య ॥ 12 ॥

పదము :

అనన్తమ్ । వి౽తతమ్ । పురు౽త్రా ।

అనన్తమ్ । అన్త౽వత్ । చ । సమన్తే ఇతి సమ్౽అన్తే ।

తే ఇతి । నాక౽పాలః । చరతి । వి౽చిన్వన్ ।

విద్వాన్ । భూతమ్ । ఉత । భవ్యమ్ । అస్య ॥ 12 ॥

అనువాదం।

ఏది అనంతమో, ఏది పలుదిక్కులా విస్తృతమో,
ఏవి అనంతము, సాంతము కలిసి
ఒక దానితో ఒకటి మిళిత మౌతున్నవో
ఈ భూతభవిష్యద్వర్తమాన కాలీనము లైన
వానిని గూర్చి విచికిత్స చేస్తూ
విద్వాంసులు నాకపాలురై చరిస్తున్నారు. ॥ 12 ॥

మంత్రము।

ప్రజాపతి శ్చరతి గర్భే అన్త-
రదృశ్యమానో బహుధా వి జాయతే।
అర్ధేన విశ్వం భువనం జజాన
యు దస్యార్ధం కతమః స కేతుః ॥ 13 ॥

పదము।

ప్రజాఽపతిః। చరతి। గర్భే। అన్తః।
అదృశ్యమానః। బహుఽధా। వి। జాయతే।
అర్ధేన। విశ్వమ్। భువనమ్। జజాన।
యత్। అస్య। అర్ధమ్। కతమః। సః। కేతుః ॥ 13 ॥

అనువాదం।

ప్రజాపతి అదృశ్యమానుడై గర్భంలో సంచరిస్తున్నాడు.
బహుధా ఉత్పన్న మౌతున్నాడు.

అర్ధభాగంతో సర్వభువనములను సృష్టించినాడు.
మిగత అర్ధ మేదో దానికి లక్షణ మేమిటి? ॥ 13 ॥

మంత్రము।

ఊర్ధ్వం భరన్త ముదకం
కుమ్భేనే వోదహార్యమ్ ।
పశ్యన్తి సర్వే చక్షుషా
న సర్వే మనసా విదుః ॥ 14 ॥

పదము.

ఊర్ధ్వమ్ । భరన్తమ్ । ఉదకమ్ ।
కుమ్భేనఽఇవ । ఉదఽహార్యమ్ ।
పశ్యన్తి । సర్వే । చక్షుషా ।
న । సర్వే । మనసా । విదుః ॥ 14 ॥

అనువాదం।

కుంభాన్ని నీళ్ళతో నింపి పైకి చేదుకొనునట్లు,
సర్వులు తమ కళ్ళతో చూస్తున్నారు.
కానీ వారి మనస్సున కేమో తెలియదు. ॥ 14 ॥

మంత్రము।

దూరే పూర్ణేన వసతి
దూర ఊనేన హీయతే ।

మహద్ యక్షం భువనస్య మధ్యే

తస్మై బలిం రాష్ట్రభృతో భరన్తి ॥ 15 ॥

పదము :

దూరే । పూర్ణేన । వసతి ।

దూరే । ఊనేన । హీయతే ।

మహత్ । యక్షమ్ । భువనస్య । మధ్యే ।

తస్మై । బలిమ్ । రాష్ట్రఽభృతః । భరన్తి ॥ 15 ॥

అనువాదం :

పూర్ణ మైనప్పటికీ దూరంలో ఉంటున్నది.
న్యూన మైనప్పటికీ దూరంలో ఉంటున్నది.
భువనమధ్యంలో ఒక మహాయక్షు డున్నాడు.
అతనికై రాష్ట్రపాలకులు బలిని ఇస్తున్నారు. ॥ 15 ॥

మంత్రము :

యతః సూర్య ఉదే

త్యస్తం యత్ర చ గచ్ఛతి ।

తదేవ మన్యేఽహం జ్యేష్ఠం

తదు నాత్యేతి కిం చన ॥ 16 ॥

పదము

యతః । సూర్యః । ఉత్ఽఏతి ।

అస్తమ్ । యత్ర । చ । గచ్ఛతి ।

తత్ । ఏవ । మన్యే । అహమ్ । జ్యేష్ఠమ్ ।

తత్ । ఓం ఇతి । న । అతి । ఏతి । కిమ్ । చన ॥ 16 ।

అనువాదం ।

ఎక్కడ నుంచి సూర్యుడు ఉదయిస్తున్నాడు ?
ఎక్కడ అస్తమిస్తున్నాడు ?
ఆయనే శ్రేష్ఠుడని నేను తలపోస్తున్నాను.
అతనిని మించిన వారెవరూ లేరు. ॥ 16 ॥

మంత్రము ।

యే అర్వాఙ్ మధ్య ఉత వా పురాణం

వేదం విద్వాంస మభితో వదన్తి ।

ఆదిత్య మేవ తే పరి వదన్తి సర్వే

అగ్నిం ద్వితీయం త్రివృతం చ హంసమ్ ॥ 17 ॥

పదము .

యే । అర్వాక్ । మధ్యే । ఉత । వా । పురాణమ్ ।

వేదమ్ । విద్వాం సమ్ । అభితః । వదన్తి ।

ఆదిత్యమ్ । ఏవ । తే । పరి । వదన్తి । సర్వే ।
అగ్నిమ్ । ద్వితీయమ్ । త్రిఽవృతమ్ । చ । హంసమ్ ॥ 17 ॥

అనువాదం :

వెనుకగాను, మధ్యలోను ఉన్నవానినిగా, పురాతనునిగా,
వేదవేత్తలు ఆయనను ప్రశంసిస్తున్నారు.
వాళ్ళందరూ ఆదిత్యునే ప్రశంసిస్తున్నారు.
రెండవ వానినిగా అగ్నిని,
మూడవ దానినిగా హంసను కీర్తిస్తున్నారు. ॥ 17 ॥

మంత్రము :

సహస్రాహ్ణ్యం వియతా వస్య పక్షౌ
హరే ర్హంసస్య పతతః స్వర్గమ్ ।
స దేవా న్త్సర్వా నుర స్యుపదద్య
సంపశ్యన్ యాతి భువనాని విశ్వా ॥ 18 ॥

పదము :

సహస్రఽఅహ్న్యమ్ । విఽయతౌ । అస్య । పక్షౌ ।
హరేః । హంసస్య । పతతః । స్వఃఽగమ్ ।
సః । దేవాన్ । సర్వాన్ । ఉరసి । ఉపఽదద్య ।
సమ్ఽపశ్యన్ । యాతి । భువనాని । విశ్వా ॥ 18 ॥

అనువాదం :

ఈ హంస స్వర్గం నుంచి వస్తున్నది.
దాని రెండు రెక్కలూ వేయి రోజులు
విస్తృతమై ఉంటాయి.
ఆయన సర్వదేవతలను తన వక్షఃస్థలంలో ఉంచుకొని,
సమస్త భువనములను వీక్షిస్తూ వెడుతున్నాడు. ॥ 18 ॥

మంత్రము .

సత్యే నోర్ధ్వ స్తపతి
బ్రహ్మణాఽర్వాఙ్ వి పశ్యతి ।
ప్రాణేన తిర్యఙ్ ప్రాణతి
యస్మిన్ జ్యేష్ఠ మధి శ్రితమ్ ॥ 19 ॥

పదము :

సత్యేన । ఊర్ధ్వః । తపతి ।
బ్రహ్మణా । అర్వాఙ్ । వి । పశ్యతి ।
ప్రాణేన । తిర్యఙ్ । ప్ర । అనతి ।
యస్మిన్ । జ్యేష్ఠమ్ । అధి । శ్రితమ్ ॥ 19 ॥

అనువాదం :

సత్యంతో పాటు ఊర్ధ్వంగా వెలిగిపోయే
బ్రహ్మ క్రిందికి చూస్తున్నాడు.
ప్రాణంతో ప్రక్కకు, అడ్డుగా చూస్తున్నాడు.
ఆయన లోనే శ్రేష్ఠ బ్రహ్మ అధిష్ఠితమై ఉన్నది. ॥ 19 ॥

●అథర్వ. iv 44

మంత్రము।

యో వై తే విద్యా దరణీ

యాభ్యాం నిర్మథ్యతే వసు।

స విద్వాన్ జ్యేష్ఠం మన్యేత

స విద్యాద్ బ్రాహ్మణం మహత్ ॥ 21

పదము।

యః। వై। తే ఇతి। విద్యాత్। అరణీ ఇతి।

యాభ్యామ్। నిః౽మథ్యతే। వసు।

సః। విద్వాన్। జ్యేష్ఠమ్। మన్యేత।

సః। విద్యాత్। బ్రాహ్మణమ్। మహత్ ॥ 20

అనువాదం।

ఈ రెండు అరణములను తెలిసినవాడు
దేనితో వసునిర్మాణం చేస్తాడో, ఆ విద్వాంసుడు
జ్యేష్ఠ బ్రహ్మను ఎఱిగినవాడు.
అంతేకాక మహద్బ్రహ్మను కూడా ఎఱిగినవాడు. ॥ 20

మంత్రము।

అపాదగ్రే సమభవత్

సో అగ్రే స్వ1 రాభరత్।

చతుష్పాద్ భూత్వా భోగ్యః
సర్వ మాదత్త భోజనమ్ ॥ 21 ॥

పదము.

అపాత్ । అగ్రే । సమ్ । అభవత్ ।
సః । అగ్రే । స్వః । ఆ । అభరత్ ।
చతుఃఽపాత్ । భూత్వా । భోగ్యః ।
సర్వమ్ । ఆ । అదత్త । భోజనమ్ ॥ 21 ॥

అనువాదం:

ప్రారంభంలో పాదరహిత మైన ఆత్మ ఒక్కటే ఉండినది.
అది ప్రారంభంలో స్వాత్మానందం అనుభవిస్తూ ఉండినది.
అదే చతుష్పాత్తుగా భోగ్యముగా మారి
సర్వ ఆహారమును పొందసాగింది. ॥ 21 ॥

మంత్రము:

భోగ్యో భవ దథో
అన్నమదద్ బహు ।
యో దేవ ముత్తరావన్త
ముపాసాత్తై సనాతనమ్ ॥ 22 ॥

పదము।

భోగ్యః। భవత్। అథో ఇతి।

అన్నమ్। అదత్। బహు।

యః। దేవమ్। ఉత్తర౽వన్తమ్।

ఉప౽ఆసాతై। సనాతనమ్ ॥ ౭

అనువాదం।

అది భోగ్యమైనది.
అధికంగా ఆహారాన్ని తీసుకొని తెచ్చినది.
సనాతనుడు, శ్రేష్ఠుడు అయిన దేవుని ఉపాసిస్తున్నది. ॥౭

మంత్రము।

సనాతన మేన మాహు
రుతాద్య స్యాత్ పునర్ణవః।
అహోరాత్రే ప్ర జాయేతే
అన్యో అన్యస్య రూపయోః ॥ 2౩

పదము:

సనాతనమ్। ఏనమ్। అహుః।

ఉత। అద్య। స్యాత్। పునః౽నవః।

అహోరాత్రే ఇతి। ప్ర। జాయేతే ఇతి।

అన్యః। అన్యస్య। రూపయోః ॥ 23

అనువాదం

ఇతనినే సనాతను డంటారు,
అతను పునః పునః నవనవోన్మేషు డౌతాడు,
పరస్పరం రూపములు "అహోరాత్రము"లుగా జనించినవి. ॥ 23 ॥

మంత్రము।

శతం సహస్ర మయుతం న్యర్బుద-
మసంఖ్యేయం స్వ మస్మిన్ నివిష్టమ్ ।
తదస్య ఘ్నన్త్యభిపశ్యత ఏవ
తస్మాద్ దేవో రోచత ఏష ఏతత్ ॥ 24 ॥

పదము।

శతమ్ । సహస్రమ్ । అయుతమ్ । నిఽఅర్బుదమ్ ।
అసమ్ఽఖ్యేయమ్ । స్వమ్ । అస్మిన్ । నిఽవిష్టమ్ ।
తత్ । అస్య । ఘ్నన్తి । అభిఽపశ్యతః । ఏవ ।
తస్మాత్ । దేవః । రోచతే । ఏషః । ఏతత్ ॥ 24 ॥

అనువాదం।

నూరు, వెయ్యి, పదివేలు, లక్ష - ఇలా అసంఖ్యాక
తత్త్వములు అందులో ఉన్నవి.
దానిని చూస్తూనే ఆ సత్త్వానికి విఘాతం కల్పిస్తుంది.
అందువల్ల ఈ దేవుడు దీనిని ప్రకాశింప జేస్తున్నాడు. ॥ 24 ॥

మంత్రము।

బాలా దేక మణీయస్క

ముతైకం నేవ దృశ్యతే।

తతః పరిష్వజీయసీ

దేవతా సా మమ ప్రియా ॥ 25 ॥

పదము।

బాలాత్ । ఏకమ్ । అణీయఃఽకమ్ ।

ఉత । ఏకమ్ । నఽఇవ । దృశ్యతే ।

తతః । పరిఽస్వజీయసీ ।

దేవతా । సా । మమ । ప్రియా ॥ 25 ॥

అనువాదం:

అది కేశముల కంటె సూక్ష్మ మైనది.
దూరానికి కనిపించనిది.
అందులో నుంచి రెండింటిని ఆలింగనం చేసుకునే
దేవత ఉత్పన్న మైనది.
అది నాకు ప్రియ మైనది. ॥ 25 ॥

మంత్రము:

ఇయం కల్యా ణ్యజరా

మర్త్యస్యామృతా గృహే।

యస్మై కృతా శయే స
యశ్చకార జజార సః ॥ 26 ॥

పదము।

ఇయమ్। కల్యాణీ। అజరా।
మర్త్యస్య। అమృతా। గృహే।
యస్మై। కృతా। శయే। సః।
యః। చకార। జజార। సః ॥ 26 ॥

అనువాదం।

ఇది కల్యాణప్రదము, జరారహితము అయినది.
మర్త్యుల ఇంటిలో అమర మైనదిగా ఉన్నది.
దేనికై ఇది ఏర్పడినదో అది గ్రాహ్య మౌతున్నది.
ఏది చేసెనో అది వృద్ధత్వం పొందుతున్నది. ॥ 26 ॥

మంత్రము।

త్వం స్త్రీ త్వం పుమా నసి
త్వం కుమార ఉత వా కుమారీ।
త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి
త్వం జాతో భవసి విశ్వతోముఖః ॥ 27 ॥

పదము ।

త్వమ్ । స్త్రీ । త్వమ్ । పుమాన్ । అసి ।

త్వమ్ । కుమారః । ఉత । వా । కుమారీ ।

త్వమ్ । జీర్ణః । దణ్డేన । వఞ్చసి ।

త్వమ్ । జాతః । భవసి । విశ్వతఃఽముఖః ॥ 27 ॥

అనువాదం :

నీవు స్త్రీవి, నీవు పురుషుడవు.
నీవు కుమారుడవు, నీవే కుమారివి.
నీవు వృద్ధుడవు. కర్ర పట్టుకొని నడుస్తున్నావు
నీవు పుట్టినవాడవు, విశ్వతోముఖుడవు అగుచున్నావు. ॥27॥

మంత్రము ।

ఉతైషాం పితోత వా పుత్ర ఏషా-
ముతైషాం జ్యేష్ఠ ఉత వా కనిష్ఠః ।
ఏకో హ దేవో మనసి ప్రవిష్టః
ప్రథమో జాతః స ఉ గర్భే అన్తః ॥ 28 ॥

పదము :

ఉత । ఏషామ్ । పితా । ఉత । వా । పుత్రః । ఏషామ్ ।

ఉత । ఏషామ్ । జ్యేష్ఠః । ఉత । వా । కనిష్ఠః ।

ఏకః । హ । దేవః । మనసి । ప్రఽవిష్టః ।

ప్రథమః । జాతః । సః । ఓం ఇతి । గర్భే । అన్తః ॥ 28 ॥

అనువాదం:

దీని జనకుడు లేదా దీని పుత్రుడు,
దనిలో జ్యేష్ఠుడు లేక కనిష్ఠుడు -
ఇన్నీ అయిన దేవుడు మనసులో ప్రవేశించినాడు
మొదట పుట్టినవాడు గర్భంలోనే ఉన్నాడు. ॥ 28 ॥

మంత్రము

పూర్ణాత్ పూర్ణ ముదచతి

పూర్ణం పూర్ణేన సిచ్యతే ।

ఉతో త దద్య విద్యామ

యత స్తత్ పరిషిచ్యతే ॥ 29 ॥

పదము

పూర్ణాత్ । పూర్ణమ్ । ఉత్ । అచతి ।

పూర్ణమ్ । పూర్ణేన । సిచ్యతే ।

ఉతో ఇతి । తత్ । అద్య । విద్యామ ।

యతః । తత్ । పరిఽసిచ్యతే ॥ 29 ॥

అనువాదం:

పూర్ణం నుంచి పూర్ణం ఉద్భవించినది.
పూర్ణం పూర్ణం ద్వారా జాలువారుతున్నది.
ఇప్పుడు మనకు తెలుసు అది ఎక్కడ నుంచి
జాలువారుతున్నదో. ॥ 29 ॥

మంత్రము:

ఏషా సనత్నీ సన మేవ జా
తైషా పురాణీ పరి సర్వం బభూవ ।
మహీ దేవ్యు౹షసో విభాతీ
సైకేనైకేన మిషతా వి చష్టే ॥ 30 ॥

పదము:

ఏషా । సనత్నీ । సనమ్ । ఏవ । జాతా ।
ఏషా । పురాణీ । పరి । సర్వమ్ । బభూవ ।
మహీ । దేవీ । ఉషసః । విఽభాతీ ।
సా । ఏకేనఽఏకేన । మిషతా । వి । చష్టే ॥ 30 ॥

అనువాదం:

ఇది సనాతన శక్తి. సనాతనకాలం నుంచి ఉన్నది.
ఈ పురాతన శక్తి అన్నిటినీ వ్యాపిస్తున్నది.
ఈ మహాదేవి ఉషస్సును ప్రకాశింప జేస్తున్నది.
అది ఏకంగా ఏకంగా ఉండి ప్రాణులతో పాటు
చైతన్యవంత మౌతున్నది. ॥ 30 ॥

మంత్రము:

అవి ర్వై నామ దేవతర్తే నాస్తే పరీవృతా ।

తస్యా రూపే ణేమే వృక్షా హరితా హరితస్రజః ॥ 31 ॥

పదము :

అవిః । వై । నామ । దేవతా । ఋతేన । ఆస్తే । పరిఽవృతా ।

తస్యాః । రూపేణ । ఇమే । వృక్షాః । హరితాః । హరితఽస్రజః

॥ 31 ॥

అనువాదం :

'రక్షణ శక్తి' అనె దేవత ఒకటి ఉన్నది.
అది ఋతంతో పరివృతయై ఉన్నది.
దాని రూపంతో ఈ వృక్షములన్ని
హరితములై, హరిత హారములై ఉన్నవి. ॥ 31 ॥

మంత్రము:

అన్తి సన్తం న జహా-

త్యన్తి సన్తం న పశ్యతి ।

దేవస్య పశ్య కావ్యం

న మమార న జీర్యతి ॥ 32 ॥

పదము.

అన్తి । సన్తమ్ । న । జహాతి ।

అన్తి । సన్తమ్ । న । పశ్యతి ।

దేవస్య । పశ్య । కావ్యమ్ ।

న । మమార । న । జీర్యతి ॥ 32 ॥

అనువాదం :

దానిని సమీపించినా అది వదలదు.
సమీపించినా అది చూడదు.
ఈ దేవుని కావ్యాన్ని పరికించు.
అది మరణించదు. జీర్ణం కాదు ॥ 32 ॥

మంత్రము

అపూర్వే ణేషితా వాచ-
స్తా వదన్తి యథాయథమ్ ।
వదన్తీ ర్యత్ర గచ్ఛన్తి
త దాహు ర్బ్రాహ్మణం మహత్ ॥ 33 ॥

పదము :

అపూర్వేణ । ఇషితాః । వాచః ।

తాః । వదన్తి । యథాఽయథమ్ ।

పదన్తిః । యత్ర । గచ్ఛన్తి ।

తత్ । ఆహుః । బ్రాహ్మణమ్ । మహత్ ॥ 33 ॥

అనువాదం।

పూర్వం ఏమీ లేవు.
ఆ దేవత ప్రేరేపించిన మాత్రాలే ఉన్నవి.
అవి యథాతథంగా పలుకుతున్నవి.
అలా పలుకుతూ ఎక్కడికి వెడుతున్నవో
దానినే మహాబ్రహ్మగా వాకొంటారు. ॥ 33 ॥

మంత్రము।

యత్ర దేవాశ్చ మనుష్యాఽ-

శ్చారా నాభావివ శ్రితాః ।

అపాం త్వా పుష్పం పృచ్ఛామి

యత్ర త న్మాయయా హితమ్ ॥ 34 ॥

పదము।

యత్ర । దేవాః । చ । మనుష్యాః ।

చ । అరాః । నాభౌఽఇవ । శ్రితాః ।

అపామ్ । త్వా । పుష్పమ్ । పృచ్ఛామి ।

యత్ర । తత్ । మాయయా । హితమ్ ॥ 34 ॥

అనువాదం :

దేవతలు, మనుష్యులు
నాభి (చక్రమునకు మధ్యలో నుండు కుండ) ని
ఆశ్రయించుకొని ఉండే ఆకుల వలె
ఆశ్రయించుకొని ఉన్నారు.
జల తత్త్వాన్ని గూర్చి నిన్ను ప్రశ్నిస్తున్నాను.
నేను దాని మాయతో ఆచ్ఛాదితుడనై ఉన్నాను. ॥ 34 ॥

మంత్రము :

యేభి ర్వాత ఇషితః ప్రవాతి
యే దదన్తే పఞ్చ దిశః స్ధ్రీచీః ।
య ఆహుతి మత్యమన్యన్త దేవా
అపాం నేతారః కతమే త ఆసన్ ॥ 35 ॥

పదము :

యేభిః । వాతః । ఇషితః । ప్రఽవాతి ।
యే । దదన్తే । పఞ్చ । దిశః । స్ధ్రీచీః ।
యే । ఆఽహుతిమ్ । అతిఽఅమన్యన్త । దేవాః ।
అపామ్ । నేతారః । కతమే । తే । ఆసన్ ॥ 35 ॥

అనువాదం :

దేని ప్రేరణతో వాయువు వీస్తున్నదో,
ఏ మిలమిలలు ఐదు దిక్కులను ధరిస్తున్నవో,
ఏ దేవతలు ఆహుతిని అధికంగా భావిస్తారో,
ఆ జలాధిష్ఠాతలు ఎవ్వరు వారు? ॥ 35 ॥

మంత్రము.

ఇమా మేషాం పృథివీం వస్త

ఏకో౽న్తరిక్షం పర్యేకో బభూవ।

దివ మేషాం దదతే యో విధర్తా

విశ్వా ఆశాః ప్రతి రక్ష న్త్యేకే ॥ 36 ॥

పదము।

ఇమామ్। ఏషామ్। పృథివీమ్। వస్తే।

ఏకః। అన్తరిక్షమ్। పరి। ఏకః। బభూవ।

దివమ్। ఏషామ్। దదతే। యః। వి౽ధర్తా।

విశ్వాః। ఆశాః। ప్రతి। రక్షన్తి। ఏకే ॥ 36 ॥

అనువాదం।

వీనిలో ఒకటి ఈ పృథివిపై ఉన్నది.
ఒకటి అంతరిక్షాన్ని వ్యాపించినది.
వీనిలో ఏది ధారకమో,
అది ద్యులోకాన్ని వహిస్తున్నది.
కొన్ని సర్వదిక్కులకు రక్షకములుగా ఉన్నవి. ॥ 36 ॥

మంత్రము।

యో విద్యాత్ సూత్రం వితతం

యస్మి న్నోతాః ప్రజా ఇమాః।

సూత్రం సూత్రస్య యో విద్యాత్

స విద్యాద్ బ్రాహ్మణం మహత్ ॥ 37 ॥

పదము ।

యః । విద్యాత్ । సూత్రమ్ । వి౽తతమ్ ।

యస్మిన్ । ఆ౽ఉతాః । ప్ర౽జాః । ఇమాః ।

సూత్రమ్ । సూత్రస్య । యః । విద్యాత్ ।

సః । విద్యాత్ । బ్రాహ్మణమ్ । మహత్ ॥ 37 ॥

అనువాదం ।

ఎందులో ఈ సర్వప్రజలు సూత్రముల వలె ఉన్నారో,
ఈ విస్తృత సూత్రాన్ని ఎవ్వ రెరుగుదురో,
ఆ సూత్రానికి సూత్ర మైన దానిని ఎవ డెరుగునో,
అతడు బ్రహ్మను కూడా ఎరిగినవా డవుతాడు. ॥ 37 ॥

మంత్రము ।

వేదాహం సూత్రం వితతం

యస్మి న్నోతాః ప్రజా ఇమాః ।

సూత్రం సూత్ర స్యాహం వే

దాథో యద్ బ్రాహ్మణం మహద్ ॥ 38 ॥

పదము।

వేద। అహమ్। సూత్రమ్। వితతమ్।

యస్మిన్। ఆఉతాః। ప్రజాః। ఇమాః।

సూత్రమ్। సూత్రస్య। అహమ్। వేద।

అథో ఇతి। యత్। బ్రాహ్మణమ్। మహత్ ॥ 38 ॥

అనువాదం।

ఎందులో ఈ ప్రజలు సూత్రప్రాయులై ఉన్నారో,
నేనా విస్తృత సూత్రాన్ని ఎరుగుదును.
సూత్రానికి సూత్ర మేదో నే నెరుగుదును.
అన్నిటి కంటె మహద్బ్రహ్మ ఏదో
దానిని కూడా ఎరుగుదును. ॥ 38 ॥

మంత్రము.

య దన్తరా ద్యావాపృథివీ
అగ్ని రైత్ ప్రదహన్ విశ్వదావ్యః।
యత్రాతిష్ఠ న్నేకపత్నీః పరస్తాత్
క్వేవాసీ న్మాతరిశ్వా తదానీమ్ ॥ 39 ॥

పదము।

యత్। అన్తరా। ద్యావాపృథివీ ఇతి।

అగ్నిః। ఐత్। ప్రదహన్। విశ్వదావ్యః।

యత్ర । అతిష్ఠన్ । ఏకఽపత్నీః । పరస్తాత్ ।

క్వఽఇవ । ఆసీత్ । మాతరిశ్వా । తదానీమ్ ॥ 39 ॥

అనువాదం :

ద్యావాపృథ్వుల మధ్యలో
విశ్వ సంచాలక మైన అగ్ని ఉన్నది.
దానికి దూరంగా ఒక పత్ని కూడా ఉన్నది.
అప్పుడు వాయువు ఎక్కడ ఉండినది? ॥ 39 ॥

మంత్రము :

అప్స్వాఽసీ న్మాతరిశ్వా ప్రవిష్టః
ప్రవిష్టా దేవాః సలిలా న్యాసన్ ।
బృహన్ హ తస్థౌ రజసో విమానః
పవమానో హరిత ఆ వివేశ ॥ 40 ॥

పదము :

అప్ఽసు । ఆసీత్ । మాతరిశ్వా । ప్రఽవిష్టః ।
ప్రఽవిష్టాః । దేవాః । సలిలాని । ఆసన్ ।
బృహన్ । హ । తస్థౌ । రజసః । విఽమానః ।
పవమానః । హరితః । ఆ । వివేశ ॥ 40 ॥

అనువాదం :

వాయువు జలంలో ప్రవేశించి ఉండినది.
దేవత లందరూ జలంలోనే
ప్రవేశించి ఉండిరు.
ఆ సమయంలో రజోవిమానం ఒకటి ఉండినది.
వాయువు సూర్యకిరణములతో పాటు ఉండెను. ॥ 40 ॥

మంత్రము :

ఉత్తరేణేవ గాయత్రీ-
మమృతేఽధి వి చక్రమే ।
సామ్నా యే సామ సంవిదు-
రజ స్తద్ దదృశే క్వఽ ॥ 41 ॥

పదము :

ఉత్తరేణఽఇవ । గాయత్రీమ్ ।
అమృతే । అధి । వి । చక్రమే ।
సామ్నా । యే । సామ । సమ్ఽవిదుః ।
అజః । తత్ । దదృశే । క్వఽ ॥ 41 ॥

అనువాదం :

ఉత్కృష్ట రూపంలో అమృతంలో గాయత్రిని
విశేషించి పొందవచ్చును.
సామంతో సామములను తెలుసుకుంటున్నారు.
ఆ అజము ఎక్కడ కనిపించినది? ॥ 41 ॥

మంత్రము :

నివేశనః సంగమనో వసూనాం

దేవ ఇవ సవితా సత్యధర్మా ।

ఇన్ద్రో న తస్థౌ సమరే ధనానామ్ ॥ 42

పదము :

ని౭వేశనః । సమ్౭గమనః । వసూనామ్ ।

దేవః౭ఇవ । సవితా । సత్య౭ధర్మా ।

ఇన్ద్రః । న । తస్థౌ । సమ్౭అరే । ధనానామ్ ॥ 42

అనువాదం :

సత్యధర్ముడైన సూర్యదేవుని వలె
వసువుల నివాసహేతువు ఒక టున్నది.
ఆ ధనముల మధ్య వివాదంలో
ఇంద్రుడు స్థిరుడై ఉండినాడు. ॥ 42

మంత్రము :

పుణ్డరీకం నవద్వారం

త్రిభి ర్గుణేభి రావృతమ్ ।

తస్మిన్ యద్ యక్ష మాత్మన్వత్

తద్ వై బ్రహ్మవిదో విదుః ॥ 43

పదము:

పుణ్డరీకమ్ । నవ౽ద్వారమ్ ।

త్రి౽భిః । గుణేభిః । ఆ౽వృతమ్ ।

తస్మిన్ । యత్ । యక్షమ్ । ఆత్మన్౽వత్ ।

తత్ । వై । బ్రహ్మ౽విదః । విదుః ॥ 43 ॥

అనువాదం:

నవ ద్వారములు గల పుండరీకం (కమలం)
సత్త్వరజస్తమోగుణాలతో ఆవృతమై ఉన్నది.
అందులో ఆత్మవంతు డైన యక్షు దెవ డున్నాడో,
వానినే బ్రహ్మవిదులు బ్రహ్మగా భావిస్తారు. ॥ 43 ॥

మంత్రము:

అకామో ధీరో అమృతః స్వయంభూ
రసేన తృప్తో న కుత శ్చనోనః ।
తమేవ విద్వాన్ న బిభాయ మృత్యో-
రాత్మానం ధీర మజరం యువానమ్ ॥ 44 ॥

పదము:

అకామః । ధీరః । అమృతః । స్వయమ్౽భూః ।

రసేన । తృప్తః । న । కుతః । చన । ఊనః ।

తమ్ । ఏవ । విద్వాన్ । న । బిభాయ । మృత్యోః ।

ఆత్మానమ్ । ధీరమ్ । అజరమ్ । యువానమ్ ॥ 44

అనువాదం :

నిష్కాముడు, ధీరుడు, అమరుడు,
స్వయంభువు, రససంతృప్తుడు –
ఆ దేవుడు ఎవరి కంటెను తక్కువవాడు కాదు,
దాని నెరిగిన విద్వాంసుడు మృత్యువునకు భయపడడు.
ఆత్మ ధీరు డని, జరారహితు డని,
యువకు డని అత నెఱుగును. ॥ 44 ॥

ఇది ఎనిమిదవ సూక్తం.

ఇది నాల్గవ అనువాకం.

# అనువాకం – 5

## సూక్తం–9

ఋషి: అథర్వుడు॥ దేవత: శతౌదన॥ ఛందస్సు: 1 త్రిష్టుప్, 2-11, 13-24 అనుష్టుప్: 12 పథ్యాపంక్తి: 25 ద్వ్యుష్ణిగ్గర్భాఽనుష్టుప్: 26 పఞ్చపదా బృహత్యనుష్టు ఉష్ణిగ్గర్భా జగతీ: 27 పంచపదాఽతిజాగతాఽనుష్టుగ్గర్భా శక్వరీ॥ మంత్రములు: ॥ 27 ॥

వినియోగం:- అహుర్కర్త గోవధలో దీనికి వినియోగం. అట్టి వంధ్యాగోవును 'శతౌదన' అంటారు. దాని వధతో, దాని మాంసాహుతితో చేసే యజనం అగ్నిష్టోమం కంటె, అతిరాత్రం కంటె కూడా శ్రేష్ఠమని ప్రశంస. ఏ గోవు ఈ విధంగా వధించబడుతుందో దానితో "ఓ గోవా! నీవు హంతకుల వలన భయపడకు. నీవు దేవివి కాగలవు. నిన్ను స్వర్గంలో దేవతలు రక్షిస్తారు" అని ప్రోత్సాహనం.

ఎవడు నిన్ను వధిస్తాడో, ఎవడు వండుతాడో, ఎవడు హోమం చేస్తాడో అతడు ఉత్తమ స్వర్గానికి వెళతాడు-ఇత్యాదిగా గోమేధ ప్రశంస చేయబడినది.

సాంప్రదాయికులైతే ఈ అర్థసూక్తంతో శతౌదన సవంలో నిరుప్తహవిరభిమర్శనం, సంపాత దాతృవాచన దానములను చేస్తారు.

మంత్రము:

అఘాయతా మపి నహ్యా ముఖాని
సపత్నేషు వజ్ర మర్పయైతమ్।
ఇంద్రేణ దత్తా ప్రథమా శతౌదనా
భ్రాతృవ్యఘ్నీ యజమానస్య గాతుః ॥ 1 ॥

పదము :

అఘఽయతామ్ । అపి । నహ్య । ముఖాని ।

సఽపత్నేషు । వజ్రమ్ । అర్పయ । ఏతమ్ ।

ఇన్ద్రేణ । దత్తా । ప్రథమా । శతఽఓదనా ।

భ్రాతృవ్యఽఘ్నీ । యజమానస్య । గాతుః ॥ 1 ॥

అనువాదం :

పాపాత్ముల ముఖాలను మూసివేయి.
శత్రువులపై ఈ వజ్రాయుధాన్ని ప్రయోగించు.
ఇంద్రుడు ఇచ్చిన మొదటి శతౌదన
శత్రునాశాన్ని చేస్తూ యజమానికి
మార్గం చూపించే గోవుగా ఉన్నది. ॥ 1 ॥

మంత్రము :

వేది ష్టే చర్మ భవతు

బర్హి ర్లోమాని యాని తే ।

ఏషా త్వా రశనాగ్రభీద్

గ్రావా త్వైషోఽధి నృత్యతు ॥ 2 ॥

పదము :

వేదిః । తే । చర్మ । భవతు ।

బర్హిః । లోమాని । యాని । తే ।

ఏషా । త్వా । రశనా । అగ్రభీత్ ।
గ్రావా । త్వా । ఏషః । అధి । నృత్యతు ॥ 2 ॥

అనువాదం :

నీ చర్మం వేది యగు గాక!
నీ రోమములు దర్భ లగు గాక!
ఈ రశన నిన్ను బంధించి ఉన్నది.
ఓ సోమలతా! ఈ శిల నీ పై
ఆనందంతో నృత్యం చేయు గాక! ॥ 2 ॥

మంత్రము.

బాలా స్తే ప్రోక్షణీః సన్తు
జిహ్వా సం మా ర్ష్ట్వఘ్న్యే ।
శుద్ధా త్వం యజ్ఞియా భూత్వా
దివం ప్రేహి శతౌదనే ॥ 3 ॥

పదము।

బాలాః । తే । ప్రఽఉక్షణీః । సన్తు ।
జిహ్వా । సమ్ । మార్ష్టు । అఘ్న్యే ।
శుద్ధా । త్వమ్ । యజ్ఞియా । భూత్వా ।
దివమ్ । ప్ర । ఇహి । శతఽఓదనే ॥ 3 ॥

అనువాదం :

ఓ హింసింపరాని గోవా! నీ తోక కున్న వెంట్రుకలు
ప్రోక్షించేవి అగు గాక!
నీ నాలుక శోధని అగు గాక!
నీవు యజ్ఞసంబంధివై, పరిశుద్ధవై ఓ శతౌదన ధేనువా!
ద్యులోకానికి వెళ్ళు. ॥ 8 ॥

మంత్రము :

యః శతౌదనాం పచతి
కామప్రేణ స కల్పతే ।
ప్రీతా హ్యస్యర్త్విజః
సర్వే యన్తి యథాయథమ్ ॥ 9 ॥

పదము :

యః । శతఽఓదనామ్ । పచతి ।
కామఽప్రేణ । సః । కల్పతే ।
ప్రీతాః । హి । అస్య । ఋత్విజః ।
సర్వే । యన్తి । యథాఽయథమ్ ॥ 9 ॥

అనువాదం :

శతౌదనాలను పచనం చేసి సంకల్పం పరిపూర్తి చేస్తున్నాను.
దీనితో ఋత్విక్కు లందరూ సంతుష్టు లవుతున్నారు.
తమ తమ మార్గాలలో తిరిగి వెడుతున్నారు. ॥ 9 ॥

మంత్రము .

స స్వర్గ మా రోహతి

యత్రాద స్త్రిదివం దివః ।

అపూపనాభిం కృత్వా

యో దదాతి శతౌదనామ్ ॥ 5 ॥

పదము.

సః । స్వః౽గమ్ । అ । రోహతి ।

యత్ర । అదః । త్రి౽దివమ్ । దివః ।

అపూప౽నాభిమ్ । కృత్వా ।

యః । దదాతి । శత౽ఓదనామ్ ॥ 5 ॥

అనువాదం :

అతడు స్వర్గాన్ని అధిరోహిస్తున్నాడు.
స్వర్గధామ మేదో అక్కడ శతౌదన ధేనువును
అపూపనాభి రూపంలో దానం చేస్తున్నాడు. ॥ 5 ॥

మంత్రము :

స తాం ల్లోకా న్త్సమాప్నోతి

యే దివ్యా యే చ పార్థివాః ।

హిరణ్యజ్యోతిషం కృత్వా

యో దదాతి శతౌదనామ్ ॥ 6 ॥

పదము :

సః । తాన్ । లోకాన్ । సమ్ । ఆప్నోతి ।

యే । దివ్యాః । యే । చ । పార్థివాః ।

హిరణ్యఽజ్యోతిషమ్ । కృత్వా ।

యః । దదాతి । శతఽఓదనామ్ ॥ 6 ॥

అనువాదం :

దివ్యములు పార్థివములు అయిన భోగములు
సర్వ ప్రజలకు సంప్రాప్తిస్తున్నవి.
వారు శతౌదన ధేనువును సువర్ణంతో,
తేజస్సుతో సమ్మిళితం చేసి దానం చేస్తున్నారు. ॥ 6 ॥

మంత్రము :

యే తే దివి శమితారః
పక్తారో యే చ తే జనాః
తే త్వా సర్వే గోప్స్యన్తి
మైభ్యో భైషీః శతౌదనే ॥ 7 ॥

పదము :

యే । తే । దివి । శమితారః ।

పక్తారః । యే । చ । తే । జనాః ।

తే। త్వా। సర్వే। గోప్స్యన్తి।

మా। ఏభ్యః। భైషీః। శతఒఓదనే ॥ 7 ॥

అనువాదం:

ఎవరు ఊరకున్న వారు,
ఎవరు పర్వం చేస్తున్నవారు అయితే ఉన్నారో,
వా రంతా నిన్ను రక్షిస్తారు.
ఓ శతౌదనా! వీరిని చూచి నీవు భయపడ వద్దు ॥ 7 ॥

మంత్రము।

వసవ స్త్వా దక్షిణత
ఉత్తరా న్మరుత స్త్వా।
ఆదిత్యాః పశ్చాద్ గోప్స్యన్తి
సాగ్నిష్టోమ మతి ద్రవ ॥ 8 ॥

పదము।

వసవః। త్వా। దక్షిణతః।
ఉత్తరాత్। మరుతః। త్వా।
ఆదిత్యాః। పశ్చాత్। గోప్స్యన్తి।
సా। అగ్నిఒస్తోమమ్। అతి। ద్రవ ॥ 8 ॥

అనువాదం।

దక్షిణం నుంచి నిన్ను వసువులు,
ఉత్తరం నుంచి నిన్ను మరుత్తులు,
వెనుక నుంచి నిన్ను ఆదిత్యులు రక్షిస్తారు.
నీవు అగ్నిష్టోమ యజ్ఞాన్ని పరిపూర్తి చెయ్యి. ॥ 8 ॥

మంత్రము।

దేవాః పితరో మనుష్యా ఽ
గన్ధర్వాప్సరసశ్చ యే ।
తే త్వా సర్వే గోప్స్యన్తి
సాతిరాత్ర మతి ద్రవ ॥ 9 ॥

పదము।

దేవాః । పితరః । మనుష్యాః ।
గన్ధర్వఽఅప్సరసః । చ । యే ।
తే । త్వా । సర్వే । గోప్స్యన్తి ।
సా । అతిఽరాత్రమ్ । అతి । ద్రవ ॥ 9 ॥

అనువాదం।

పితరులు, మనుష్యులు, గంధర్వులు, అప్సరసలు
మొదలైన దేవతలు నిన్ను రక్షిస్తారు.
నీవు అతిరాత్ర యజ్ఞాన్ని పరిపూర్తి చెయ్యి. ॥ 9 ॥

మంత్రము।

అన్తరిక్షం దివం భూమి-

మాదిత్యాన్ మరుతో దిశః ।

లోకా న్త్స సర్వా నాప్నోతి

యో దదాతి శతౌదనామ్ ॥ 10 ॥

పదము।

అన్తరిక్షమ్ । దివమ్ । భూమిమ్ ।

ఆదిత్యాన్ । మరుతః । దిశః ।

లోకాన్ । సః । సర్వాన్ । ఆప్నోతి ।

యః । దదాతి । శతఽఓదనామ్ ॥ 10 ॥

అనువాదం।

ఎవరు శతౌదన ధేనువులను దానం చేస్తారో,
అతనికి సర్వలోకములు -
అంతరిక్షం, ద్యులోకం, భూమి, ఆదిత్య,
మరుల్లోకాలుగా ప్రసిద్ధము లైన వన్నీ
సంప్రాప్తిస్తాయి. ॥ 10 ॥

మంత్రము।

ఘృతం ప్రోక్షన్తీ సుభగా

దేవీ దేవాన్ గమిష్యతి ।

పక్తార మఘ్న్యే మా హింసీ-
ర్దివం ప్రేహి శతౌదనే ॥ 11 ॥

పదము ।

ఘృతమ్ । ప్రఽఉక్షన్తీ । సుఽభగా ।
దేవీ । దేవాన్ । గమిష్యతి ।
పక్తారమ్ । అఘ్న్యే । మా । హింసీః ।
దివమ్ । ప్ర । ఇహి । శతఽఓదనే ॥ 11 ॥

అనువాదం ।

ఆజ్య సేచనం చేసే సుభగురాలైన దేవి
దేవతలను చేరుకుంటుంది.
ఓ శతౌదనా ! హింసింపరాని ఓ ధేనువా !
పక్వం చేసే వానిని హింసించ వద్దు.
అతనిని స్వర్గానికి పంపించు. ॥ 11 ॥

మంత్రము ।

యే దేవా దివిషదో
అన్తరిక్షసదశ్చ యే
యే చేమే భూమ్యా మధి ।
తేభ్య స్త్వం ధుక్ష్వ సర్వదా
క్షీరం సర్పి రథో మధు ॥ 12 ॥

పదము :

యే । దేవాః । దివి౽సదః ।

అన్తరిక్ష౽సదః । చ । యే ।

యే । చ । ఇమే । భూమ్యామ్ । అధి ।

తేభ్యః । త్వమ్ । ధుక్ష్వ । సర్వదా ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 12 ॥

అనువాదం :

ద్యులోక మందున్న దేవులు, అంతరిక్ష మందున్న దేవతలు
ఈ భువిపై నున్న దేవతలు -
వీ రందరి కోసమై నువు సర్వదా క్షీరమును,
పెరుగును, ఘృతమును, మధువును దోహనం చెయ్యి. ॥12॥

మంత్రము :

యత్ తే శిరో యత్ తే ముఖం

యౌ కర్ణౌ యే చ తే హనూ ।

ఆమిక్షాం దుహ్రతాం దాత్రే

క్షీరం సర్పి రథో మధు ॥ 13 ॥

పదము :

యత్ । తే । శిరః । యత్ । తే । ముఖమ్ ।

యౌ । కర్ణౌ । యే ఇతి । చ । తే । హనూ ఇతి ।

అథర్వ iv 46

అమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 13 ॥

అనువాదం :

నీ శిరస్సు, నీ ముఖము,
నీ చెవులు, నీ దవడలు,
నిన్ను దానం చేసిన వాని కోసమై,
క్షీరమును, ఘృతమును, పెరుగును, మధువును
దోహనం చేయు గాక ! ॥ 13 ॥

మంత్రము :

యా త ఓష్ఠౌ యే నాసికే
యే శృఙ్గే యే చ తేఽక్షిణీ ।
అమిక్షాం దుహ్రతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 14 ॥

పదము :-

యౌ । తే । ఓష్ఠౌ । యే ఇతి । నాసికే ఇతి ।
యే ఇతి । శృఙ్గే ఇతి । యే ఇతి । చ । తే । అక్షిణీ ఇతి ।
అమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 14 ॥

అనువాదం :

ఏవి నీ పెదవులలో, ఏవి నీ నాసికలో,
ఏవి నీ శృంగములలో, ఏవి నీ నేత్రములలో,
అవి నిన్ను దానం చేసిన వానికై పెరుగును, క్షీరమును,
ఘృతమును, మధువును దోహనం చేయు గాక! ॥ 14 ॥

మంత్రము :

యత్ తే క్లోమా య ద్ధృదయం
పురీతత్ సహకణ్ఠికా ।
ఆమిక్షాం దుహ్రతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 15 ॥

పదము :

యత్ । తే । క్లోమా । యత్ । హృదయమ్ ।
పురిఽతత్ । సహఽకణ్ఠికా ।
ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 15 ॥

అనువాదం :

ఏది నీ క్లోమమో, ఏది నీ హృదయమో,
ఏది నీ మలాశయమో, ఏది ని కంఠ భాగమో-
ఇవన్నీ నిన్ను దానం చేసిన వానికై పెరుగును, క్షీరమును,
ఘృతమును మధువును దోహనం చేయు గాక! ॥ 15 ॥

మంత్రము :

యత్ తే యకృద్ యే మతస్నే

య దాన్త్రం యా శ్చ తే గుదాః ।

అమిక్షాం దుహ్రతాం దాత్రే

క్షీరం సర్పి రథో మధు ॥ 16

పదము :

యత్ । తే । యకృత్ । యే ఇతి । మతస్నే ఇతి ।

యత్ । ఆన్త్రమ్ । యాః । చ । తే । గుదాః ।

అమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి మధు ॥ 16

అనువాదం :

ఏది నీ కాలేయమో, ఏవి నీ హృదయపార్శ్వస్థులో,
ఏవి ప్రేవులో, ఏది నీ పాయువో-
ఇవన్నీ నిన్ను దానం చేసిన వానికై
పెరుగును, ఘృతమును,
మధువును దోహనం చేయు గాక ! ॥ 16

మంత్రము :

యస్తే ప్లాశి ర్యో వనిష్ఠు

ర్యౌ కుక్షీ యచ్చ చర్మ తే ।

ఆమిక్షాం దుగ్రహతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 17 ॥

పదము:

యః । తే । ప్లాశిః । యః । వనిష్ఠుః ।
యౌ । కుక్షీ ఇతి । యత్ । చ । చర్మ । తే ।
ఆమిక్షామ్ । దుగ్రహతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 17 ॥

అనువాదం:

ఏది నీ గుహ్యాంగమో, ఏవి నీ పెద్దప్రేవులో,
ఏది నీ ఉదరమో, ఏది నీ చర్మమో-
ఇవన్నీ నిన్ను దానం చేసిన వాని కోసమై
పెరుగును, క్షీరమును, ఘృతమును
మధువును దోహనం చేయు గాక! ॥ 17 ॥

మంత్రము:

యత్ తే మజ్జా యదస్థి
యన్మాంసం యచ్చ లోహితమ్ ।
ఆమిక్షాం దుగ్రహతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 18 ॥

పదము ।

యత్ । తే । మజ్జా । యత్ । అస్థి ।

యత్ । మాంసమ్ । యత్ । చ । లోహితమ్ ।

ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 18

అనువాదం ।

నీలో ఉండే మజ్జ, ఎముకలు, మాంసం
రుధిరము నిన్ను దానం చేసిన వానికై
క్షీరమును, ఘృతమును, మధువును, పెరుగును
దోహనం చేయు గాక । ॥ 18 ।

మంత్రము ।

యౌ తే బాహూ యే దోషణీ
యావంసౌ యా చ తే కకుత్ ।
ఆమిక్షాం దుహ్రతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 18 ॥

పదము ।

యౌ । తే । బాహూ ఇతి । యే ఇతి । దోషణీ ఇతి ।

యౌ । అంసౌ । యా । చ । తే । కకుత్ ।

ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 19 ॥

అనువాదం ।

నీ బాహువులు, నీ బాహుభాగములు,
నీ భుజశిరస్సులు, నీ మూపురము - ఇవన్నీ
నిన్ను దానం చేసిన వానికై
పాలను, పెరుగును, నేతిని,
మధువును దోహనం చేయు గాక! ॥ 19 ॥

మంత్రము ।

యా స్తే గ్రీవా యే స్కన్ధా
యాః పృష్టీ ర్యా శ్చ పర్శవః ।
ఆమిక్షాం దుహ్రతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 20 ॥

పదము :

యాః । తే । గ్రీవాః । యే । స్కన్ధాః ।
యాః । పృష్టీః । యాః । చ । పర్శవః ।
ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 20 ॥

అనువాదం :

నీ కంఠము, నీస్కంధము, నీ పిరుదులు, నీ ప్రక్కటెముకలు-
ఇవన్నీ నిన్ను దానం చేసిన వానికై పాలను,
పెరుగును, నేతిని మధువును దోహనం చేయు గాక! ॥20॥

మంత్రము :

యౌ తే ఊరూ అష్ఠీవన్తౌ
యే శ్రోణీ యా చ తే భసత్ ।
అమిక్షాం దుహ్రతాం దాత్రే
క్షీరం సర్పి రథో మధు ॥ 21 ॥

పదము :

యౌ । తే । ఊరూ ఇతి । అష్ఠీవన్తౌ ।
యే ఇతి । శ్రోణీ ఇతి । యా । చ । తే । భసత్ ।
అమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।
క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 21 ॥

అనువాదం :

నీ ఊరువులు, నీ పిక్కలు, నీ పిరుదులు
నీ ఉపస్థ (మర్మాంగము) - ఇవన్నీ
నిన్ను దానం చేసిన వాని కొఱకై
క్షీరమును, ఘృతమును, పెరుగును
మధువును దోహనం చేయు గాక! ॥ 21 ॥

మంత్రము :

యత్ తే పుచ్ఛం యే తే బాలా

య దూధో యే చ తే స్తనాః ।

ఆమిక్షాం దుహ్రతాం దాత్రే

క్షీరం సర్పి రథో మధు ॥ 22 ॥

పదము :

యత్ । తే । పుచ్ఛమ్ । యే । తే । బాలాః ।

యత్ । ఊధః । యే । చ । తే । స్తనాః ।

ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 22 ॥

అనువాదం :

నీ తోక, నీ వెంట్రుకలు, నీ పొదుగు, నీ స్తనములు-
ఇవన్నీ నిన్ను దానం చేసిన వానికై క్షీరమును, ఘృతమును
పెరుగును, మధువును, దోహనం చేయు గాక! ॥ 22 ॥

మంత్రము :

యాస్తే జఙ్ఘాః యాః కుష్ఠికా

ఋచ్ఛరా యే చ తే శఫాః ।

ఆమిక్షాం దుహ్రతాం దాత్రే

క్షీరం సర్పి రథో మధు ॥ 23 ॥

పదము :

యాః । తే । జఙ్ఘాః । యాః । కుష్ఠికాః ।

ఋచ్ఛరాః । యే । చ । తే । శఫాః ।

ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 28 ॥

అనువాదం :

నీ జంఘలు, నీ ప్రేగుల లోపలి భాగములు,
నీ పాద భాగములు, నీ గిట్టలు - ఇవన్నీ నిన్ను దానం
చేసిన వానికై క్షీరమును, ఘృతమును, పెరుగును,
మధువును దోహనం చేయు గాక! ॥ 28 ॥

మంత్రము :

యత్ తే చర్మ శతౌదనే

యాని లోమా న్యఘ్న్యే ।

ఆమిక్షాం దుహ్రతాం దాత్రే

క్షీరం సర్పి రథో మధు ॥ 24 ॥

పదము :

యత్ । తే । చర్మ । శతఽఓదనే ।

యాని । లోమాని । అఘ్న్యే ।

ఆమిక్షామ్ । దుహ్రతామ్ । దాత్రే ।

క్షీరమ్ । సర్పిః । అథో ఇతి । మధు ॥ 24 ॥

అనువాదం :

ఓ శతౌదనా! ఓ చంపబడిన గోవా!
నీ చర్మము, నీ లోమములు
నిన్ను దానం చేసిన వానికై
క్షీరమును, ఘృతమును, దధిని,
మధువును దోహనం చేయును గాక! ॥ 24 ॥

మంత్రము :

క్రోడా తే స్తాం పురోడాశా-
వాజ్యే నాభిఘారితౌ ।
తౌ పక్షౌ దేవి కృత్వా
సా పక్తారం దివం వహ ॥ 25 ॥

పదము :

క్రోడా । తే । స్తామ్ । పురోడాశౌ ।
ఆజ్యేన । అభిఽఘారితౌ ।
తౌ । పక్షౌ । దేవి । కృత్వా ।
సా । పక్తారమ్ । దివమ్ । వహ ॥ 25 ॥

అనువాదం :

ఓ శతౌదన గోవా!
నీ క్రోడములు (పార్శ్వ భాగములు)
ఆజ్యం అభిఘరించిన పురోడాశములు అగు గాక!

ఓ దేవీ! వాటిని పక్షములుగా చేసుకొని నీవు,
ఈ ఓదనం పక్వం చేసిన వానిని
స్వర్గమునకు మోసుకొని పో. ॥ 25 ॥

మంత్రము:

ఉలూఖలే ముసలే యశ్చ చర్మణి
యో వా శూర్పే తణ్డులః కణః ।
యం వా వాతో మాతరిశ్వా పవమానో
మమాథాగ్నిష్టద్ధోతా సుహుతం కృణోతు ॥ 26 ॥

పదము:

ఉలూఖలే । ముసలే । యః । చ । చర్మణి ।
యః । వా । శూర్పే । తణ్డులః । కణః ।
యమ్ । వా । వాతః । మాతరిశ్వా । పవమానః ।
మమాథ । అగ్నిః । తత్ । హోతా । సుఽహుతమ్ । కృణోతు ।
॥ 26 ॥

అనువాదం:

రోలు, రోకలి, చర్మంపై, చేటపై,
ఏ తండుల కణము లైతే ఉన్నవో,
వానిని పవిత్రం చేసే వాయువు మథనం చేసినది.
హోత, అగ్ని వానిని ఉత్తమ ఆహుతి రూపంలో
పక్వం చేయుదురు గాక! ॥ 26 ॥

మంత్రము :

అపో దేవీ ర్మధుమతీ ర్ఘృతశ్చుతో

బ్రహ్మణాం హస్తేషు ప్రపృథక్ సాదయామి ।

యత్కామ ఇద మభిషిఞ్చామి వో౽హం

త న్మే సర్వం సం పద్యతాం

వయం స్యామ పతయో రయీణామ్ ॥ 27 ॥

పదము :

అపః । దేవీః । మధు౽మతీః । ఘృత౽శ్చుతః ।

బ్రహ్మణామ్ । హస్తేషు । ప్ర౽పృథక్ । సాదయామి ।

యత్౽కామః । ఇదమ్ । అభి౽సిఞ్చామి । వః । అహమ్ ।

తత్ । మే । సర్వమ్ । సమ్ । పద్యతామ్ ।

వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 27 ॥

అనువాదం :

మధుయుక్తములు, ఘృతచ్యుతములు అయిన
దివ్యజలధారలు బ్రాహ్మణుల హస్తములలో
వేరు వేరుగా వేస్తున్నాను.
వీటితో అభిషేకం చేయవలెనని వాంఛిస్తున్నాను.
ఇవన్నీ నాకు సంప్రాప్తించు గాక !
మేము ధనపతుల మగుదుము గాక ! ॥ 27 ॥

ఇది తొమ్మిదవ సూక్తం.

# సూక్తం-10

ఋషిః కశ్యపుడు ॥ దేవత : వశా ॥ ఛందస్సు : 1 కకుమ్మత్యనుష్టుప్ ; 2-4,7,9,11-22,25,28,30,33,34 అనుష్టుప్ ; 5 పఞ్చపదాఽతిజాగతానుష్టుభం (?) స్కన్ధోగ్రీవో బృహతీ : 6,8,10 విరాడనుష్టుప్ ; 23 బృహతీ ; 24 ఉపరిష్టాద్బృహతీ : 26 ఆస్తారపంక్తిః ; 27 శంకుమత్యనుష్టుప్ ; 29 త్రిపదా విరాడ్ గాయత్రీ ; 31 ఉష్ణిగ్గర్భానుష్టుప్ ; 32 విరాట్ పథ్యా బృహతీ ॥ మంత్రములు : ॥ 34 ॥

వినియోగం :- పూర్వ సూక్తంలో చెప్పబడిన వశాగోవు కేవలం మేధ్య మాంసాత్మిక కాదని, ఆ గోవు విశసనానంతరం ఒక గొప్ప దేవి అయి దేవతల మధ్యలో సర్వాత్మిక అవుతుందని, యజ్ఞియములలో యజ్ఞియ అవుతుందని- ఆ గోవు మాహాత్మ్యము, ప్రశంస కూడా ఈ సూక్తంలో చెప్పబడినవి.

సాంప్రదాయికులైతే ఈ అర్థసూక్తంతో వశావపంలో విప్రుక్త హవిరభిమర్శనం, సంపాత దాతృవాచన దానములను చేస్తారు.

మంత్రము :

నమస్తే జాయమానాయై

జాతాయా ఉత తే నమః ।

బాలేభ్యః శఫేభ్యో రూపాయా2-

ఘ్న్యే తే నమః ॥ 1 ॥

పదము :

నమః । తే । జాయమానాయై ।

జాతాయై । ఉత । తే । నమః ।

బాలేభ్యః । శఫేభ్యః । రూపాయ ।
అఘ్న్యే । తే । నమః ॥ 1 ॥

అనువాదం :

చంపకూడని ఓ గోవా!
జన్మిస్తున్న నీకు నమస్కారం.
జన్మించిన నీకు నమస్కారం.
నీ కేశములకు, ఖురములకు
నీ రూపమునకు నమస్కారం. ॥ 1 ॥

మంత్రము :

యో విద్యాత్ సప్త ప్రవతః
సప్త విద్యాత్ పరావతః ।
శిరో యజ్ఞస్య యో విద్యాత్
స వశాం ప్రతి గృహ్ణీయాత్ ॥ 2 ॥

పదము :

యః । విద్యాత్ । సప్త । ప్రఽవతః ।
సప్త । విద్యాత్ । పరాఽవతః ।
శిరః । యజ్ఞస్య । యః । విద్యాత్ ।
సః । వశామ్ । ప్రతి । గృహ్ణీయాత్ ॥ 2 ॥

అనువాదం।

సప్త ప్రవాహాలను ఎవ రెరుగుదురో,
సప్త అంతర స్థానములను ఎవ రెరుగుదురో,
అలాంటి వారే ఈ వశాగోవును
స్వీకరించుటకు అర్హులు. ॥ 2 ॥

మంత్రము।

వేదాహం సప్త ప్రవతః
సప్త వేద పరావతః।
శిరో యజ్ఞస్యాహం వేద
సోమం చాస్యాం విచక్షణమ్ ॥ 3 ॥

పదము:

వేద। అహమ్। సప్త। ప్రఽవతః।
సప్త। వేద। పరాఽవతః।
శిరః। యజ్ఞస్య। అహమ్। వేద।
సోమమ్। చ। అస్యామ్। విఽచక్షణమ్ ॥ 3 ॥

అనువాదం।

నేను సప్త జీవన ప్రవాహములను ఎరుగుదును.
సప్త అంతర స్థానములను ఎరుగుదును.
యజ్ఞ శిరస్సును ఎరుగుదును.
వీనిలో విశేషంగా ప్రకాశించే
సోమ రసమును నే నెరుగుదును. ॥ 3 ॥

మంత్రము ·

యయా ద్యౌ ర్యయా పృథివీ

యయాపో గుపితా ఇమాః ।

వశాం సహస్రధారాం

బ్రహ్మణా చ్ఛావదామసి ॥ 4 ॥

పదము

యయా । ద్యౌః । యయా । పృథివీ ।

యయా । అపః । గుపితాః । ఇమాః ।

వశామ్ । సహస్రఽధారామ్ ।

బ్రహ్మణా । అచ్ఛఽఆవదామసి ॥ 4 ॥

అనువాదం ।

ఎందుచేత ద్యులోకము, పృథివీలోకము,
సర్వ జలములు సురక్షితములై ఉన్నవో,
అలాంటి సహస్ర అమృతధారల నిచ్చే
వశాగోవు బ్రహ్మచే చక్కగా ప్రదర్శిత మౌతుంది.
ప్రశంసకు పాత్ర మౌతుంది. ॥ 4 ॥

మంత్రము ।

శతం కంసాః శతం దోగ్ధారః

శతం గోప్తారో అధి పృష్ఠే అస్యాః ।

అథర్వ. iv 47

యే దేవా స్తస్యాం ప్రాణన్తి
తే వశాం విదు రేకధా ॥ 5 ॥

పదము.

శతమ్ । కంసాః । శతమ్ । దోగ్ధారః ।
శతమ్ । గోప్తారః । అధి । పృష్ఠే । అస్యాః ।
యే । దేవాః । తస్యామ్ । ప్రాణన్తి ।
తే । వశామ్ । విదుః । ఏకఽధా ॥ 5 ॥

అనువాదం।

దీని వీపుపై వందమంది దోగ్ధలు ( పాలు పిదుకు వారు )
వంద పాత్రలను తీసుకొని వస్తున్నారు.
దీని రక్షణకై వందమంది రక్షకులు నడుస్తున్నారు.
ఏ దేవతలు దానిలో జీవిస్తున్నారో
వారు ఒకే విధంగా ఈ గోవు నెరుగుదురు. ॥ 5 ॥

మంత్రము।

యజ్ఞప దీరాక్షీరా
స్వధాప్రాణా మహీలుకా ।
వశా పర్జన్యపత్నీ
దేవాం అప్యేతి బ్రహ్మణా ॥ 6 ॥

పదము

యజ్ఞ ౽పదీ । ఇరా౽క్షీరా ।

స్వధా౽ప్రాణా । మహిలుకా ।

వశా । పర్జన్య౽పత్నీ ।

దేవాన్ । అపి । ఏతి । బ్రహ్మణా ॥ 6 ॥

అనువాదం.

యజ్ఞంలో స్థానం గల గోవు పాల నిస్తుంది.
అన్నరూప మైన ప్రాణాన్ని ధరిస్తున్నందువల్ల
ఇది పృథివిపై ప్రసిద్ధ మైనది.
ఈ వశాగోవు పర్జన్యపత్ని.
బ్రహ్మరూపంలో దేవతలకు లభిస్తుంది. ॥ 6 ॥

మంత్రము.

అను త్వాగ్నిః ప్రావిశ-

దను సోమో వశే త్వా ।

ఊధ స్తే భద్రే పర్జన్యో

విద్యుత స్తే స్తనా వశే ॥ 7 ॥

పదము.

అను । త్వా । అగ్నిః । ప్ర । అవిశత్ ।

అను । సోమః । వశే । త్వా ।

ఊధః । తే । భద్రే । పర్జన్యః ।

విఽద్యుతః । తే । స్తనాః । వశే ॥ 7 ॥

అనువాదం ।

ఓ గోవా! నీలో అగ్ని ప్రవేశించినాడు.

సోముడు ప్రవేశించినాడు.

ఓ సౌభాగ్యవతీ! నీ పొదుగు పర్జన్య స్వరూపం.

నీ స్తనములు విద్యుత్తులు. ॥ 7 ॥

మంత్రము

అప స్త్వం ధుక్షే ప్రథమా

ఉర్వరా అపరా వశే ।

తృతీయం రాష్ట్రం ధుక్షే

న్నం క్షీరం వశే త్వమ్ ॥ 8 ॥

పదము ।

అపః । త్వమ్ । ధుక్షే । ప్రథమాః ।

ఉర్వరాః । అపరాః । వశే ।

తృతీయమ్ । రాష్ట్రమ్ । ధుక్షే ।

అన్నమ్ । క్షీరమ్ । వశే । త్వమ్ ॥ 8 ॥

అనువాదం.

ఓ ధేనువా! నీవు తొలుత బలాన్ని పిండేదానవు
తర్వాత ధాన్యమిచ్చే భాగాన్ని ఇచ్చినావు.
ఆ తరువాత మూడవ మారు రాష్ట్రమునకు శక్తిని ఇచ్చినావు.
నీవు అన్నము, క్షీరము ఇచ్చేదానవు. ॥ 8 ॥

మంత్రము

యదాదిత్యైర్హూయమా
నోపాతిష్ఠ ఋతావరి ।
ఇన్ద్రః సహస్రం పాత్రా-
న్త్సోమం త్వాపాయయద్ వశే ॥ 9 ॥

పదము

యత్ । ఆదిత్యైః । హూయమానా ।
ఉప౽అతిష్ఠః । ఋత౽వరి ।
ఇన్ద్రః । సహస్రమ్ । పాత్రాన్ ।
సోమమ్ । త్వా । అపాయయత్ । వశే ॥ 9 ॥

అనువాదం.

ఓ ఋతావరీ! ఆదిత్యులు నిన్ను పిలువగా
వారిని సమీపించినావు.
అప్పుడు ఇంద్రుడు వేయి పాత్రలతో
సోమరసమును నీచే త్రాగించినాడు. ॥ 9 ॥

మంత్రము :

య దనూచీన్ద్రమై రాత్

త్వ ఋషభో౽హ్వయత్ ।

తస్మాత్ తే వృత్రహా పయః

క్షీరం క్రుద్ధో౽హరద్ వశే ॥ 10 ॥

పదము :

యత్ । అనూచీ । ఇన్ద్రమ్ । ఐః । ఆత్ ।

త్వా । ఋషభః । అహ్వయత్ ।

తస్మాత్ । తే । వృత్ర౽హా । పయః ।

క్షీరమ్ । క్రుద్ధః । అహరత్ । వశే ॥ 10 ॥

అనువాదం :

ఓ గోవా ! నీవు ఇంద్రునకు
అనుకూలంగా ఉండుదానవు.
నిన్ను వృషభ తన వద్దకు రమ్మని పిలిచినది.
అందుతో కోపించిన వృత్రారి (ఇంద్రుడు)
నీ జలమును, క్షీరమును అపహరిస్తూ వచ్చినాడు. ॥ 10 ॥

మంత్రము :

యత్ తే క్రుద్ధో ధనపతిః

రా క్షీర మహరద్ వశే ।

ఇదం త దద్య నార
త్రిషు పాత్రేషు రక్షతి ॥ 11 ॥

పదము

యత్ । తే । క్రుద్ధః । ధనఽపతిః ।
ఆ । క్షీరమ్ । అహరత్ । వశే ।
ఇదమ్ । తత్ । అద్య । నాకః ।
త్రిషు । పాత్రేషు । రక్షతి ॥ 11 ॥

అనువాదం :

ఓ ఆవా ! నీ పై క్రుద్ధుడైన కుబేరుడు
నీ క్షీరమును అపహరించినాడు.
ఇదంతా స్వర్గధామంలో సోమరస రూపంలో
మూడు పాత్రలలో ఉన్నది. ॥ 11 ॥

మంత్రము :

త్రిషు పాత్రేషు తం సోమ-
మా దేవ్యఽహరద్ వశా ।
అథర్వా యత్ర దీక్షితో
బర్హిష్యాస్త హిరణ్యయే ॥ 12 ॥

పదము:

త్రిషు । పాత్రేషు । తమ్ । సోమమ్ ।

అ । దేవీ । అహరత్ । వశా ।

అథర్వా । యత్ర । దీక్షితః ।

బర్హిషి । అస్తే । హిరణ్యయే ॥ 12 ॥

అనువాదం।

ఎక్కడ దీక్షితు డైన అథర్వవేది
సువర్ణమయ మైన ఆసనం పై కూర్చుంటాడో,
అతని వద్ద మూడు పాత్రలలో ఉంచిన సోమరసాన్ని,
వశాదేవి అపహరించుకొని పోయినది. ॥ 12 ॥

మంత్రము।

సం హి సోమేనాగత

సము సర్వేణ పద్వతా ।

వశా సముద్ర మధ్యష్ఠాద్

గన్ధర్వైః కలిభిః సహ ॥ 13 ॥

పదము:

సమ్ । హి । సోమేన । అగత ।

సమ్ । ఓం ఇతి । సర్వేణ । పత్౽వతా ।

వశా । సముద్రమ్ । అధి । అస్థాత్ ।
గన్ధర్వైః । కలిఽభిః । సహ ॥ 13 ॥

అనువాదం।

ఈ గోవుకు సోమరసం స్వాధీన మైనది.
అందరు మనుష్యులకు అది లభించినది.
ఈ గోవు గంధర్వులతో కలిసి
సముద్రాన్ని అధిష్ఠించినది. ॥ 13 ॥

మంత్రము

సం హి వాతేనాగత
సము సర్వైః పతత్రిభిః ।
వశా సముద్రే ప్రానృత్య-
దృచః సామాని బిభ్రతీ ॥ 14 ॥

పదము।

సమ్ । హి । వాతేన । అగత ।
సమ్ । ఓం ఇతి । సర్వైః । పతత్రిఽభిః ।
వశా । సముద్రే । ప్ర । అనృత్యత్ ।
ఋచః । సామాని । బిభ్రతీ ॥ 14 ॥

అనువాదం :

ఈ గోవు యజ్ఞంలో ఋక్కులను,
సామములను ధారణ చేస్తున్నది.
వాయువుతో ఇది సంగత మైనది. సర్వ పక్షులతోను కలసి
సముద్రంపై నాట్యం చేయసాగినది. ॥ 14 ॥

మంత్రము :

సం హి సూర్యేణాగత
సము సర్వేణ చక్షుషా ।
వశా సముద్ర మత్యఖ్యద్
భద్రా జ్యోతీంషి బిభ్రతీ ॥ 15 ॥

పదము :

సమ్ । హి । సూర్యేణ । అగత ।
సమ్ । ఉం ఇతి । సర్వేణ । చక్షుషా ।
వశా । సముద్రమ్ । అతి । అఖ్యత్ ।
భద్రా । జ్యోతీంషి । బిభ్రతీ ॥ 15 ॥

అనువాదం :

ఈ గోవు సూర్యునితో సంగత మైనది.
సర్వ నేత్రవంతులతోను సంగత మైనది.
ఈ కల్యాణకారిణి అయిన గోవు అనేక తేజస్సులను భరిస్తున్నది.
సముద్రం మీదుగా చూస్తున్నది. ॥ 15 ॥

మంత్రము:

అధీవృతా హిరణ్యేన

య దతిష్ఠ ఋతావరి ।

అశ్వః సముద్రో భూత్వాఽ-

ధ్యస్కన్దద్ వశే త్వా ॥ 16 ॥

పదము:

అధిఽవృతా । హిరణ్యేన ।

యత్ । అతిష్ఠః । ఋతఽవరి ।

అశ్వః । సముద్రః । భూత్వా ।

అధి । అస్కన్దత్ । వశే । త్వా ॥ 16 ॥

అనువాదం:

ఓ ఋతావరీ! సువర్ణ భూషణములతో యుక్తమైన ఓ గోవా! నీవు సముద్రంపై అశ్వరూపిణివై వచ్చినావు. ॥ 16 ॥

మంత్రము:

తద్ భద్రాః స మగచ్ఛన్త

వశా దేష్ట్ర్యథో స్వధా ।

అథర్వా యత్ర దీక్షితో

బర్హి ష్యాస్త హిరణ్యయే ॥ 17 ॥

పదము :

తత్ । భద్రాః । సమ్ । అగచ్ఛన్త ।

వశా । దీష్ట్రి । అథో ఇతి । స్వధా ।

అథర్వా । యత్ర । దీక్షితః ।

బర్హిషి । అస్తే । హిరణ్యయే ॥ 17 ॥

అనువాదం :

ఎక్కడ దీక్షితు డైన అథర్వవేది
సువర్ణమయ మైన ఆసనంపై కూర్చుంటాడో
అక్కడికి భద్రపురుషులు వస్తారు.
దానదాత్రి అయిన గోవు
స్వయంగా అన్నరూపంతో ఉపస్థిత మైనది. ॥ 17 ॥

మంత్రము :

వశా మాతా రాజన్యస్య

వశా మాతా స్వధే తవ ।

వశాయా యజ్ఞ ఆయుధం

తత శ్చిత్త మజాయత ॥ 18 ॥

పదము :

వశా । మాతా । రాజన్యస్య ।

వశా । మాతా । స్వధే । తవ ।

వశాయాః । యుద్ధి । ఆయుధమ్ ।

తతః । చిత్తమ్ । అజాయత ॥ 18 ॥

అనువాదం ।

రాజన్యుని మాత వశ.
అలాగే ఓ వృషభా ! నీ తల్లి వశ.
రం గోష్ఠ నుంచి శస్త్రోత్పత్తి అయినది.
అంగం లో నుంచి చిత్తం జనించినది. ॥ 18 ॥

మంత్రము ।

ఊర్ధ్వో బిన్దు రుదచరద్
బ్రహ్మణః కకుదా దధి ।
తత స్త్వం జజ్ఞిషే వశే
తతో హోతాఽజాయత ॥ 19 ॥

పదము ।

ఊర్ధ్వః । బిన్దుః । ఉత్ । అచరత్ ।
బ్రహ్మణః । కకుదాత్ । అధి ।
తతః । త్వమ్ । జజ్ఞిషే । వశే ।
తతః । హోతా । అజాయత ॥ 19 ॥

అనువాదం :

బ్రహ్మ ఉచ్చభాగం నుంచి బిందువు
ఊర్ధ్వంగా బ గులుదేరినది.
ఓ గోవా! అందులో నుంచే నీవు జనించినావు.
అందులో నుంచే తరువాత హోత జనించినాడు. ॥ 19 ॥

మంత్రము :

ఆస్న స్తే గాథా అథవ-
న్నుష్ణిహాభ్యో బలం వశే ।
పాజస్యా౨ జజ్ఞే యజ్ఞ
స్తనేభ్యో రశ్మయ స్తవ ॥ 20 ॥

పదము :

ఆస్నః । తే । గాథాః । అథవన్ ।
ఉష్ణిహాభ్యః । బలమ్ । వశే ।
పాజస్యాఽత్ । జజ్ఞే । యజ్ఞః ।
స్తనేభ్యః । రశ్మయః । తవ ॥ 20 ॥

అనువాదం :

ఓ గోవా! నీ ముఖం నుంచి గాథలు పుట్టినవి.
నీ కంఠాగ్రభాగం నుంచి బలం ఉత్పన్న మైనది.
నీ పొదుగు నుంచి యజ్ఞ మావిర్భవించినది.
నీ స్తనముల నుంచి కిరణములు కలిగినవి. ॥ 20 ॥

మంత్రము.

ఊర్వాభ్యా మయనం జాతం

సక్థిభ్యాం చ వశే తవ।

ఆన్త్రేభ్యో జజ్ఞిరే అత్రా

ఉదరా దధి వీరుధః ॥ 21 ॥

పదము.

ఊర్వాభ్యామ్। అయనమ్। జాతమ్।

సక్థిఽభ్యామ్। చ। వశే। తవ।

ఆన్త్రేభ్యః। జజ్ఞిరే। అత్రాః।

ఉదరాత్। అధి। వీరుధః ॥ 21 ॥

అనువాదం।

నీ బాహువుల నుంచి, తొడల నుంచి
అయనం (గమనం) జనించినది.
ఓ గోవా! నీ ప్రేవులలోని పదార్థం నుంచి,
నీ ఉదరం నుంచి వనస్పతులు ఉత్పన్నము లైనవి. ॥ 21 ॥

మంత్రము.

య ఉదరం వరుణ

స్యానుప్రావిశథా వశే।

తత స్త్వా బ్రహ్మో దహ్వాయత్
స హి నే్త్ర మవేత్ తవ ॥ 22

పదము ;

యత్ । ఉదరమ్ । వరుణస్య ।
అనుఽప్రావిశథాః । వశే ।
తతః । త్వా । బ్రహ్మ । ఉత్ । అహ్వయత్ ।
సః । హి । నేత్రమ్ । అవేత్ । తవ ॥ 22

అనువాదం :

ఓ గోవా ! వరుణుని ఉదరం లోనికి ప్రవేశించినావు.
అప్పుడు బ్రహ్మ నిన్ను ఆహ్వానించినాడు.
ఆయనకు నీ కళ్ళు తెలుసు. ॥ 22

మంత్రము :

సర్వే గర్భా దవేపన్త
జాయమానా దసూస్వఽః ।
ససూవ హి తా మాహు ర్వశేతి
బ్రహ్మభిః క్లృప్తః స హ్యఽస్యా బన్ధుః ॥ 23

పదము:

సర్వే । గర్భాత్ । అవేపన్త ।

జాయమానాత్ । అసూస్వః ।

ససూవ । హి । తామ్ । అహుః । వశా । ఇతి ।

బ్రహ్మభిః । క్లృప్తః । సః । హి । అస్యాః । బన్ధుః ॥ 23 ॥

అనువాదం:

ప్రసవానికి అసమర్థ మైన గర్భంవల్ల
సర్వతః కంపించ సాగినావు.
ఈ గోవు ప్రసవానికి అసమర్థ మని వా రన్నారు.
బ్రాహ్మణులు దానిని బంధువుగా భావిస్తున్నారు. ॥ 23 ॥

మంత్రము:

యుధ ఏకః సం సృజతి
యో అస్యా ఏక ఇద్ వశీ ।
తరాంసి యజ్ఞా అభవన్
తరసాం చక్షు రభవద్ వశా ॥ 24 ॥

పదము.

యుధః । ఏకః । సమ్ । సృజతి ।

యః । అస్యాః । ఏకః । ఇత్ । వశీ ।

అథర్వ. iv 48

తరాంసి । యద్ధాః । అభవన్ ।

తరసామ్ । చక్షుః । అభవత్ । వశా । ॥ 24 ॥

అనువాదం ।

ఒక యోధుడు వ్యవస్థను ఉత్పన్నం చేస్తున్నాడు.
అతడు ఆ గోవును వశం చేసుకొన్నవాడు.
యజ్ఞమును పూర్తి చేయువాడు.
ఆయన కనులుగా వశాగోవు మారినది. ॥ 24 ॥

మంత్రము ।

వశా యజ్ఞం ప్రత్యగృహ్ణాద్
వశా సూర్య మధారయత్ ।
వశాయా మన్త రవిశ-
దోదనో బ్రహ్మణా సహ ॥ 25 ॥

పదము ।

వశా । యజ్ఞమ్ । ప్రతి । అగృహ్ణాత్ ।
వశా । సూర్యమ్ । అధారయత్ ।
వశాయామ్ । అన్తః । అవిశత్ ।
ఓదనః । బ్రహ్మణా । సహ ॥ 25 ॥

అనువాదం :

దేవతలు ఈ గోవును అమృత మని భావిస్తారు.
ఈ గోవును మృత్యువుగా కూడా ఉపాసిస్తారు
వశాగోవు ఈ సర్వ రూపములతోను ఉన్నది.
దేవతలుగా, మనుష్యులుగా, అసురులుగా,
పితరులుగా, ఋషులుగా. ॥ 26 ॥

మంత్రము :

య ఏవం విద్యాత్ స
వశాం ప్రతి గృహ్ణీయాత్ ।
తథా హి యజ్ఞః సర్వపాద్
దుహే దాత్రేఽనపస్ఫురన్ ॥ 27 ॥

పదము :

యః । ఏవమ్ । విద్యాత్ । సః ।
వశామ్ । ప్రతి । గృహ్ణీయాత్ ।
తథా । హి । యజ్ఞః । సర్వఽపాత్ ।
దుహే । దాత్రే । అనపఽస్ఫురన్ ॥ 27 ॥

అనువాదం :

ఈ తత్త్వాన్ని తెలిసిన వాడు
వశాగోదానాన్ని ప్రతిగ్రహించవచ్చును.
దీనిని దానం చేసిన దాతకు యజ్ఞం

సర్వ ప్రకారములుగా సఫలమై
విదగితం కార ఫలప్రదాయి అవుతుంది. ॥ 27 ॥

త్రమ:

స్రో జిహ్వా వరుణ
స్యాన్త ర్దీద్య త్యాసని ।
సాం యా మధ్యే రాజతి
సా వశా దుష్ప్రతిగ్రహా ॥ 28 ॥

పదము

స్రః । జిహ్వాః । వరుణస్య ।
న్తః । దీద్యతి । ఆసని ।
తాసామ్ । యా । మధ్యే । రాజతి ।
సా । వశా । దుఃఽప్రతిగ్రహా ॥ 28 ॥

అనువాదం:

వరుణుని వదనంలో మూడు నాలుక లున్నవి.
అవి ప్రకాశిస్తున్నవి,
వాటిలో ఏది విశేషంగా ప్రకాశిస్తుం దో,
అది వశాగోవి అవుతుంది.
అందుకనే దానిని ప్రతిగ్రహించడం
అతి కష్ట మౌతుంది. ॥ 28 ॥

*అథర్వ. iv 49

మంత్రము :

చతుర్ధా రేతో అభవద్ వశాయాః ।

ఆప స్తురీయ మమృతం తురీయం

యజ్ఞ స్తురీయం పశవ స్తురీయమ్ ॥ 29

పదము ।

చతుఃఽధా । రేతః । అభవత్ । వశాయాః ।

ఆపః । తురీయమ్ । అమృతమ్ । తురీయమ్ ।

యజ్ఞః । తురీయమ్ । పశవః । తురీయమ్ ॥ 29

అనువాదం .

ఈ గోవుకు చెందిన రేతస్సు నాలుగుగా విభక్తమైనది,
జలం కూడా నాలుగుగా విభక్తమైనది,
అమృతం నాలుగుగా విభక్తమైనది,
యజ్ఞం నాలుగుగా విభక్తమైనది,
యజ్ఞపశువులు నాలుగుగా విభక్తములైనవి. ॥ 29

మంత్రము ।

వశా ద్యౌ ర్వశా పృథివీ

వశా విష్ణుః ప్రజాపతిః ।

వశాయా దుగ్ధ మపిబ..

న్సాధ్యా వసవశ్చ యే ॥ 30

పదము.

వశా । ద్యౌః । వశా । పృథివీ ।

వశా । విష్ణుః । ప్రజాఽపతిః ।

వశాయాః । దుగ్ధమ్ । అపిబన్ ।

సాధ్యాః । వసవః । చ । యే ॥ 30 ॥

అనువాదం.

[illegible]

[illegible]

[illegible]

[illegible]

[illegible] ॥ 30 ॥

మంత్రము

వశాయా దుగ్ధం పీత్వా

సాధ్యా వసవశ్చ యే ।

తే వై బ్రధ్నస్య విష్టపి

పయో అస్యా ఉపాసతే ॥ 31 ॥

పదము.

వశాయాః । దుగ్ధమ్ । పీత్వా ।

సాధ్యాః । వసవః । చ । యే ।

తే। వై। బ్రధ్నస్య। విష్టపి।
పయః। అస్యాః। ఉప। అసతే ॥ 31

అనువాదం।

సాధ్యులు, వసువులు ఈ వశాదుగ్ధాన్ని
పానం చేసిన తర్వాత
వారికి స్వర్గంలో ఈ గోక్షీరం లభ్య మౌతుంది. 31

మంత్రము:

సోమ మేనా మేకే దుహ్రే
ఘృత మేక ఉపాసతే।
య ఏవం విదుషే వశాం దదు-
స్తే గతా స్త్రిదివం దివః ॥ 32

పదము।

సోమమ్। ఏనామ్। ఏకే। దుహ్రే।
ఘృతమ్। ఏకే। ఉప। అసతే।
యే। ఏవమ్। విదుషే। వశామ్। దదుః।
తే। గతాః। త్రిఽదివమ్। దివః ॥ 32 ।

అనువాదం:

ఈ గోవు నుంచి సోమరసాన్ని కొందరు దోహనం చేస్తారు.
కొందరు ఘృతాన్ని దోహనం చేస్తారు.

ఈ విధంగా విద్వాంసులకు గోవులను
దానం చేసినవారు
స్వర్గమును, బ్రహ్మలోకమును పొందెదరు ॥ 27 ॥

మంత్రము :

బ్రాహ్మణేభ్యో వశాం దత్త్వా
సర్వాం ల్లోకాన్ సమశ్నుతే ।
ఋతం హ్యస్యామార్పిత
మపి బ్రహ్మాథో తపః ॥ 28 ॥

పదము :

బ్రాహ్మణేభ్యః । వశామ్ । దత్త్వా ।
సర్వాన్ । లోకాన్ । సమ్ । అశ్నుతే ।
ఋతమ్ । హి । అస్యామ్ । ఆర్పితమ్ ।
అపి । బ్రహ్మ । అథో ఇతి । తపః ॥ 28 ॥

అనువాదం :

బ్రాహ్మణులకు వశాగోదానము చేసి
సర్వలోక ప్రాప్తిని పొందుతాడు.
దీనిలో ఋతమును, బ్రహ్మను,
తపస్సును అర్పిస్తాము. ॥ 28 ॥

మంత్రము।

వశాం దివా ఉప జీవన్తి

వశాం మనుష్యా౨ ఉత।

వశేదం సర్వ మభవద్

యావత్ సూర్యో విపశ్యతి ॥ 34 ॥

పదము।

వశామ్ । దేవాః । ఉప । జీవన్తి ।

వశామ్ । మనుష్యా౨ః । ఉత ।

వశా । ఇదమ్ । సర్వమ్ । అభవత్ ।

యావత్ । సూర్యః । వి౨పశ్యతి ॥ 34 ॥

అనువాదం।

దేవతలు ఈ గోవుపై ఉపజీవనం చేస్తున్నారు
మనుష్యులు కూడా దీనిని
తమ జీవితానికి ఆధారం చేసుకున్నారు.
ఈ గోవు ఈ సర్వరూపాలను ధరిస్తున్నది
సూర్యు డెంతవరకు ప్రకాశిస్తుంటాడో
అంతవరకూ ఇదిలా కొనసాగుతూనే ఉంటుంది. ॥ 34 ॥

ఇది పదవ సూక్తం.

ఇది ఐదవ అనువాకం.

ఇది పదవ కాండ.

తెలుగు

# అథర్వవేద సంహిత - 4

మంత్రపదపాఠసహితం

అనువాదం

కళాప్రపూర్ణ డాక్టర్ విద్వాన్ విశ్వం ఓ.ఎల్




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి